అన్నమాచార్యులవారి

# అధ్యాత్మ శృంగార సంకీర్తనలు

(స్వరసహితము)

తృతీయ సంపుటము



స్వరరచన: 'కళాప్రవీణ' మంచాళ జగన్నాథరావు

సంపాదకులు: వాడ్రేవు పురుషోత్తం

తిరుమల తిరుపతి దేవస్థానములవారి ప్రచురణ

# తొలి పలుకు

శ్రీ వేంకటేశ్వరుని పరమ భక్తుడు, పదకవితా పితామహుడు తాళ్ళపాక అన్నమాచార్యుల వారి కీర్తనలను ధాతు మాతువులతో అందించే కృషిలో ఇదొక సరికొత్త ప్రయత్నం. సంకీర్తనాచార్యులుగా ముప్పది రెండువేలకు పైగా రచనలను రూపొందించి పాడిన వాగ్గేయ కారుడు అన్నమయ్య. వారి సంగీతం 'యీ విధంగా వుండి వుంటుంది' అని ఊహించి సాధ్యమైనంతవరకూ వారు ఉదహరించిన రాగములలోనే సంగీతపు వరుసలను కూర్చి, ప్రతికీర్తనకు అవతారికతో బాటుగా రాగలక్షణములను కూడా చేర్చడం ఒక విశిష్టమైన పద్ధతి. ఈ పద్ధతి కష్టసాధ్యమైనది. విద్వాంసులకు, ప్రారంభకులకు, అందుబాటులో ఉండేలాగున, స్వర లిపిని రూపొందించి, ఒక సమగ్రతను ఈ గ్రంథానికి సంతరించారు మంచాళ సోదరులు.

తాళ్ళపాక వారి వంశం సంగీత సాహిత్యాలకు నిలయం. అదొక అమూల్యమైన నిధి. ఒక రత్నభాండారం. ఆ భాండారంలో అమూల్యాలైన రత్నరాసులెన్నో అసంఖ్యాకంగా ఉన్నాయి. వాని నుండి శ్రీ మంచాళవారు ఈ సంపుటిలోనికి కొన్నింటిని మాత్రమే ఎన్నుకొన్నారు. ఈ కీర్తనలకు సంగీతాన్ని సమకూర్చి మన కందించిన 'కళాప్రవీణ' మంచాళ వారు సరస సంగీత సాహిత్యప్రియుల అభినందనలను అందుకొన్నారు.

ముప్పదిరెండువేల కీర్తనలలో 'తన స్వామి' శ్రీ వేంకటేశ్వరుని 'మన స్వామి'గా భావించి, భజించి, అనిర్వచనీయమైన రసానుభూతిని అనుభవించిన అన్నమయ్య ప్రతిపలుకు, మధుర భక్తిభావ భరిత మనడంలో సందేహం లేదు.

తాళ్ళపాక వారి చరిత్ర సమగ్రంగా వ్రాసిన డాక్టర్ వేటూరి ఆనందమూర్తిగారికి, సంగీత ప్రశస్తిని వ్రాసిన సంగీత విద్యాసాగర, గానసాహిత్య శిరోమణి శ్రీ ఆర్. ఆర్. కేశవ మూర్తిగారికి, 'వాగ్గేయకారులలో అన్నమయ్య స్థానం' అన్న అంశాన్ని గురించి విపులంగా వివరించిన 'కళాప్రపూర్ణ' శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారికి మా ధన్యవాదాలు.

పరంపరగా వెలువడే ఈ సంగీత కావ్యకుసుమాలను ఎవరెంతగా ఆదరించగలిగితే మా ప్రయత్నాలు అంతగా సఫలీకృత మవుతాయని మనవి. సెలవు.

పి. వి. ఆర్. కె. ప్రసాద్, ఐ. ఏ. ఎస్.
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు.

# తొలి పలుకు

## (తృతీయ సంపుటము)

అన్నమాచార్యుల వారి కీర్తనలను ధాతు మాతువులతో అందించే కృషిలో తిరుమల తిరుపతి దేవస్థానముల వారి ప్రయత్నములలోని తృతీయ కుసుమ మిది.

ఈ సంపుటమున సంగీత ప్రశస్తిని వ్రాసి యిచ్చిన మహామహోపాధ్యాయ, ఆంధ్ర ప్రదేశ్ ఆస్థాన వైణిక విద్వాంసులు శ్రీ ఈమని శంకరశాస్త్రి గారికి (Chief Producer, All India Radio), 'ఒకమాట' వ్రాసిన 'కళా ప్రపూర్ణ' రావూరి భరద్వాజ గారికి మా ధన్య వాదములు.

సంగీత విద్వాంసులు, విద్యార్థులు, సంగీత రసికులు యీ సంగీత కావ్య కుసుమాలను ఎంత ఆదరించ గలిగితే మా ప్రయత్నాలు అంత సఫలీకృత మవుతాయని మనవి. సెలవు !

పి. వి. ఆర్. కె. ప్రసాద్, ఐ. ఏ. ఎస్.
కార్య నిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి

# తాళ్ళపాకకవుల చరిత్ర - సంప్రదాయము

## అన్నమయ్య

పరమ పురుషుని ఆకృతికి ప్రకృతిగా తాళ్ళపాక కవులు ఎత్తి నిలిపిన సంకీర్తన కళా మందిరమునకు అచ్చమైన మతము పునాది సంస్కృతాంధ్రములు కట్టడపు శిలలు శతక వచన సంకీర్తనాది సాహితీ ప్రక్రియలు సోపానములు. అందలి యారాధ్య దైవము శ్రీ వేంకటేశ్వర స్వామియే. ధర్మార్థ కామ మోక్షములు చతుర్విధ ప్రాకారములు మధుర కవితలు ద్వార వాకిళ్లు సార్వజనీనము సార్వకాలికమునయిన ఉత్తమ భావసంపద తన్మందిర శ్రీ భండారము ఆ కవులు తామే అర్చకులు. భక్తియే భగవత్ప్రసాదము. నృత్యగానములే స్వామికంగ రంగ భోగములు రసిక వర్యులే యాత్రికులు ఇదియే వారి కవితాస్వరూపము.

గత పది వందలేండ్లలో వర్తిల్లిన ఆంధ్ర సాహిత్య చరిత్ర యొక్క గౌరవ భారము నత్యధికముగా తమ భుజస్కంధముల మీదనే మోసిన వారిలో పదునైదవ శతాబ్దిలో ప్రసిద్ధి కెక్కిన తాళ్ళపాక కవి పుంగవులే ప్రముఖులు. ఆనాడు వాఙ్మయ రంగమున వారు సాధించక వదలిన ప్రక్రియలేదు. సాధించని నవ్యత కానరాదు. చేయని ప్రయోగమును లేదు, చెందని ప్రయోజనమును లేదు. మార్గకవితను మన్నించుచునే దేశి కవితను తీర్చిదిద్దినారు. పద రచనా ప్రక్రియకు పరికల్పకులై భక్తికి పట్టాభిషేకము గావించి స్వామివారి కూడిగము చేసినారు. సాహిత్యమును ప్రజల కందుబాటు లోనికి దెచ్చి పరువును బరువును గల ప్రజాకవులై వాసి కెక్కినారు. సాహిత్య నృత్య సంగీత విద్యల కాశ్రయ స్థానముగా సంకీర్తన రచనా ప్రక్రియ నొక సమాహార కళా స్వరూపముగా ఆవిష్కరించినారు. తాము ఆడి, పాడి తరించినారు. కన్నవారిని, విన్నవారిని తరతరాలు తరింప జేసినారు 'నానాటి బతుకు నాటకమును' అన్ని కోణములందును తమ సంకీర్తన దర్పణమున బట్టి చూపి కానక కన్న కైవల్య శ్రీని ప్రతిఫలింప జేసినారు. తాళ్ళపాక వారు పెక్కురొక కుటుంబముగా మని ఒక్క భావసూత్రము మీదుగాచని, లోకము నకు మార్గదర్శకులైనారు. ఆ తాళ్ళపాక కవిపుంగవులలో ఆద్యుడు అన్నమాచార్యుడు. ప్రముఖులు తక్కిన పరివారము వారు.

'చిన్నన్న ద్విపద కెఱుగును
పన్నుగ పెద తిరుమలయ్య పదమున కెఱుగున్
మిన్నంది మొఱసె నరసిం
గన్న కవిత్వంబు పద్యగద్య శ్రేణిన్'

అని యీ పరివారమువారి ప్రతిభను తెనాలి రామకృష్ణ కవి ప్రస్తుతించినాడు. కాని పైయన్నిటి యందును అన్నమాచార్యునిదే అందె వేసిన చేయి. 'ప్రవిమల ద్విపద ప్రబంధ రూపమున నవముగా' ఆయన సంతరించిన రామాయణము, 'సురలకు నరులకు సొరిది విన విన నరుదు తాళ్ళపాకన్నమయ పదములు' అని మన్నన కెక్కిన రీతిగా 'సరసత్వమున దాళస ముఖముల్ గాగ పరమ తంత్రములు ముప్పది రెండువేలు' లెక్కకుదేలగా-పలికిన-పదములు; వినుతికెక్కు విధమున సకల భాషల యందును ఆయన చేసిన 'ప్రతిభలేనినానా ప్రబంధములు' తన పరివారము వారికి ఉద్బోధకములై విఖ్యాతిని చేకూర్చి పెట్టినవి అందుకే.

"శ్రుతులై శాస్త్రములై పురాణ కథలై సుజ్ఞాన సారంబులై
యతిలోకాగమ వీథులై విపుల మంత్రార్థంబులై నీతులై
కృతులై వేంకట శైల వల్లభ రతి క్రీడా రహస్యంబులై
నుతులై తాళ్ళపాక అన్నమయవచోనూత్న క్రియల్ చెన్నగున్"

అనిన యలనాటి చిన తిరుమల భావముతో శ్రుతి గలిపి నేటికిని మనసుల్లో వాని నారాధించుట !

**ఇప్పుడు తాళ్ళపాక కవులను గూర్చిన చారిత్రక విషయ మించుక స్మరింతము.**

సంగమ రాజుల పాలనమునే ప్రాభవము నందిన సాళువ నరసింహరాయని కాలము మొదలుకొని, యారవీటి రాజుల పలుకుబడితో నేలుబడి సాగించుకొనిన తుళువ సదాశివరాయల యంతము వరకును గలనడిమి కాలమున తిరుపతి క్షేత్రము మహోచ్ఛ్రదశ ననుభవించినది. సరిగా ఆ దినములలోనే స్వామియను గ్రహమున తిరుపతిలో తాళ్ళపాక కుటుంబము వారు నెలకొని ఆ క్షేత్ర సౌభాగ్యమును పదివేల జిహ్వాలతో పాడియాడి లోకమునకు జాటినారు. తిరుపతి వేంకటేశ్వరస్వామివారి యనుగ్రహమున తాళ్ళపాకవారి పేరు ప్రఖ్యాతు లతిశయించినట్లె తాళ్ళపాకవారి మూలముననును తిరుమలస్వామికి ప్రశస్తి యెక్కువైనది. అవినాభావ సంబంధమున వీరికి పరస్పరము కీర్తి హెచ్చినదనియే చెప్పవచ్చును. ఇంతవఱకు నెవ్వరు ఏ క్షేత్రమునకును చేయని సేవను తాళ్ళపాకవారు తిరుపతికి చేసినారు. ఇంతవరకు నెచ్చటను నే కవి సంఘమును గాంచని ఖ్యాతిని వారు గాంచినారు. విజయనగరరాజులు వేంకటాచల క్షేత్రమునకు చేసిన సేవయంతయు నొకయెత్తు; తాళ్ళపాకవారు చేసిన దొక యెత్తు. సాళువ నరసింగరాయని సమకాలికుడుగా వర్తిల్లిన తాళ్ళపాక అన్నమాచార్యుడు మొదలుకొని సదాశివరాయల తరువాతి కాలమువఱకును విఖ్యాతితో వర్థిల్లిన యీ వంశమువారు ఆంధ్ర భాషా సాహిత్యములకు, సంగీతమునకును మాత్రమే కాదు మతమునకును, తిరుమల క్షేత్రమునకును గూడ విశేషమగు సేవగావించిరి. వారి సేవ నేటికిని అక్షర రూపమున తిరుపతి క్షేత్రమునకు దర్శనీయమగుచున్నది.

తాళ్ళపాకవారు నందవర వంశీకులు. వైదిక బ్రహ్మణులు. ఋగ్వేదులు ఆశ్వలాయన సూత్రులు. భారద్వాజసగోత్రులు. పొత్తపినాటి సీమలోని తాళ్ళపాక గ్రామమున (తాళ్ళపాక నేటి కడపజిల్లా రాజంపేట తాలూకాలోనున్నది) వర్తిల్లినవారు. వీరి జన్మస్థానము తాళ్ళపాక గ్రామమే యైనప్పటికిని, ఈ వంశాంబుధికి చంద్రముడైన అన్నమాచార్యుని మొదలుకొని వీరందరును (క్రీ. శ 15, 16 శతాబ్దులలో) తిరుమల తిరుపతులందే స్వామి సన్నిధిని స్థిరనివాస మేర్పరచుకొని అక్కడే కాలము గడపిరి. దేశమంతయు దిరిగి వైష్ణవమత ప్రచారము గావించిరి. స్మార్త బ్రాహ్మణులయినప్పటికిని అదివణ్శఠగోపయతుల శిష్యులై మతము పుచ్చుకొని వీరు వైష్ణవులైనారు. వైష్ణవ మతమునకును వేంకటాచలం క్షేత్రమునకును ఎనలేని రీతిని కైంకర్య మొనర్చి ధన్యజీవనులయినారు. తాత్త్వికులై, వేంకటాద్రీశునకు పరమభక్తులై, సార్వజనీనమును, తాత్త్విక మతమును నగు విశిష్టాద్వైతమును లోకమును జాటుటకై దీక్షా కంకణులైనారు. తామనుభవించిన తన్మతాను భూతి వైశిష్ట్యమును పదిమందికి పంచిపెట్టుటకై తహతహ లాడినారు. సంగీత సాహిత్యములను సాధనములుగా గొని తత్త్వదృష్టితో మత సాహిత్య సంగీతములకు మేలు కలయికను చేకూర్చి కళాలక్ష్మి కందాలు దిద్దినారు. ప్రాత నెఱిగి క్రొత్తను క్రొంగ్రొత్తగా నావిష్కరించినారు. అనుభవించి భూతమునందలి మాలిమిని తొలగించి లక్ష్యాలోకమున భావియందలి మేలిమిని వర్తమానమున మహనీయముగా సాధింప జాలినారు.

వీరశైవమత ప్రచారమునకై శక్తి సామర్థ్యముల నంకితము గావించుకొని సాహిత్యమునే సాధనముగా గొని క్రొంగ్రొత్త రీతులను వెలయించిన అలనాటి శైవకవుల నవ్యతయు, మతమన్నది నేత్రపట్టమై సాహితీ చంద్రాలోకనము గోల్పోయి అంధకారమున తడవులాడుకొనుచుండిన అక్షరాస్యులకు మహాకవిత్వ దీక్షావిధిబూని రసాలోకనము గల్పించిన తిక్కనగారి మనీషయు, తాళ్ళపాకవారిలో అతిరమ్యముగ మేళవించిన వనవచ్చును. ఆంధ్ర సాహిత్య గౌరవ భారమును వారు కలసి మోసినంత ఈ కుటుంబము వారొక్కరొక్కరే మోసినారు. అందుకే ఆంధ్ర వాఙ్మయ ప్రపంచమున తాళ్ళపాక వారికి విశిష్టమగు స్థానమున్న దనుట. తాళ్ళపాక వారొక్కరుకారు పలువురు. వారును భిన్నులుకారు. ఒక్క కుటుంబము వారు ఆ యొక్క కుటుంబమువారే పుత్రులు, పౌత్రులు, దౌహిత్రులు, పురుషులు, స్త్రీలు అందరు కలసి ఒక్క సంస్థగా చేరి కళారాధనము గావించుచు స్వామిసేవలో తరించినారు. క్రీ. శ. 15—16 శతాబ్దులలో వర్తిల్లి ప్రసిద్ధి జెందిన తాళ్ళపాకవారి వంశమున తాళ్ళపాక అన్నమాచార్యుడు (అన్నమయ్య. అన్నయాచార్యులు, అన్నయార్య మొ॥ నామాంతరములు) ఆయన భార్య తిమ్మక్క, ఇంకను, తాళ్ళపాక నరసింహకవి, తాళ్ళపాక పెదతిరుమలాచార్యులు, తాళ్ళపాక చిన తిరుమలయ్య, తాళ్ళపాక అన్నయ్య, తాళ్ళపాక పెదతిరువేంగళనాథుడు, తాళ్ళపాక చిన్నన్న, తాళ్ళపాక కోనేటి తిరువేంగళ నాథయ్య, తాళ్ళపాక తిరువేంగళప్ప ముఖ్యులు,

సుప్రసిద్ధులగు నీ తాళ్ళపాక వారిలో వంశఖ్యాతికి మూలపురుషుడగు అన్నమాచార్యుడు క్రీ. శ. 1424లో జన్మించినట్లు తెలియుచున్నది. అటుపై నీ తాళ్ళపాక వారిలో సుప్రసిద్ధ రచయితలగు వారి కాలమితిని స్పష్టముగా నెఱుగుటకు దగిన శాసనాధారములు కొన్ని క్రీ. శ. 1553, 1559, 1564 సంవత్సరముల వఱకును కాననగుచున్నవి. ఆ మీద కూడ నీ వంశమువారు వర్ధిల్లి నేటికిని ఆంధ్రదేశమున విద్యా వివేకములతో వర్ధిల్లుచున్నారు. కాని రచయితలుగా విద్వాంసులుగా పేరుపొందిన తాళ్ళపాక వారిలో చినతిరుమలాచార్యుని తనయుడగు తిరువేంగళప్పయు, పెదతిరుమలాచ్యాని కుమారుడగు కోనేటి తిరువేంగళనాథుడును గడపటివారుగా గ్రహింపవచ్చును. క్రీ. శ. 1564 సంవత్సరము వఱకును వీరి శాసనములు కాననగు చుండుటచేత అప్పటికిని మఱి కొంతకాలము తరువాత వఱకును (ఆశతాబ్ది యంతమువఱకు) గూడ స్వామిసేవయు సారస్వతారాధనము గావించుచు సంపదభివృద్ధులతో వారు వర్ధిల్లియుందు రనదగును.

అనగా దాదాపు ఒకటిన్నర శతాబ్ది కాలము విజయనగరరాజుల పరిపాలనా కాలమున వీరు విఖ్యాతితో వెలసి వైష్ణవ మతమునకు ఆంధ్రభాషకును సంగీతకళకును నిరుపమానమగు సేవ గావించినారన్నమాట! మన దేశ చరిత్రలో రాజకీయ మత సాంఘిక, భాషా సారస్వత రంగములలో స్వర్ణయుగమని ఖ్యాతిగాంచిన ఆ కాల ఖండముననే తాళ్ళపాకవారు వర్ధిల్లి ఆ గౌరవ భారము నెంతగానో తమ భుజస్కంధములపై మోసి యుందురనుట అతిశయోక్తి కాదు.

తాళ్ళపాకవారి సంకీర్తనపు రాగిరేకులలో ప్రారంభమున నీ శాసనాధారములు లిఖింపబడియున్నవి.

"స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శక వరుషంబులు ౧౩౪౬ అగునేటి క్రోధి సంవత్సరమందు తాళ్ళపాక అన్నమాచార్యులు అవతరించిన పదారుయేండ్లకు తిరువేంగళనాథుండు ప్రత్యక్షమైతేను అది మొదలుగాను శాలివాహన శక వరుషంబులు ౧౪౨౪ అగునేటి దుందుభి సంవత్సర ఫాల్గుణ బహుళ ౧౨ నిరుధానకు తిరువేంగళనాథుని మీదను అంకితముగాను తాళ్ళపాక అన్నమాచార్యులు విన్నపము చేసిన శృంగార సంకీర్తనములు"

క్రీ. శ. 1424లో జన్మించిన అన్నమాచార్యులకు పదునారవయేట, అనగా క్రీ.శ. 1440లో, స్వామి ప్రత్యక్షమాయెను. అది మొదలుగా సంకీర్తన రచన గావించుకొనుచు ప్రఖ్యాతిగాంచిన అన్నమయ్యగారి మహిమ విని టంగుటూరి పరిపాలకుడుగా, దండనాథుడుగా నుండిన సాళువ నరసింహరాయడు బహుశః క్రీ.శ. 1450-60ల నడుమ వారి స్నేహమపేక్షించి యుండును. అన్నమాచార్యుని యాశీర్వాద బలమున నాతడు క్రమముగా విజయ పరంపర

అన్నమయ్య క్రీ. శ. 1503తో నిర్యాణమందెను. అంతకు బూర్వమే అతడు, మనుమడగు చిన తిరుమలాచార్యునకు బ్రహ్మోపదేశము కావించెను. ఈ బ్రహ్మోపదేశానంతరము తాతగారు కొంతకాలము జీవించియుండినట్లు మనుమని సంకీర్తనలను బట్టి తెలియవచ్చుచున్నది. 1496-98 ప్రాంతముల చిన తిరుమలయ్య యుపనయనము జరిగినదనుకొన్నచో నాతని జన్మము 1488-90 ప్రాంతమగును. అప్పటికి చిన తిరుమలయ్య తండ్రి పెద తిరుమలయ్యకు 30 పండ్లనుకొన్నను అతని జన్మము 1458-60 ప్రాంతమగును. అనగా అన్నమయ్యకు 30 పండ్ల వయస్సు దాటిన పిదప ద్వితీయ సంతానమగు పెద తిరుమలయ్య కలిగినాడన్నమాట.

అన్నమయ్య నిర్యాణ సంవత్సర మాస దినములు స్పష్టముగా నెరిగిన మనకు ఆతని జనన మాస నక్షత్రాదికమును గూర్చిన వివరములా రాగిరేకులందు లేకుండుట కొంత గొఱంతయే గొల్పుచున్నది. అయినను ఆ లోపము ఇతర సాధనముల మూలమున తీరుచునేయున్నది. చిన్నన్న వ్రాసిన అన్నమాచార్య చరిత్ర మూలమున "చక్కని గ్రహము లుచ్చమున మూడలర. అనుపమ లగ్నంబునందు వైశాఖమున విశాఖను జగంబున నుల్లసిల్ల, జనియించె నన్నమాచార్యుండు—' అని యున్నది. వైశాఖమాసమున విశాఖా నక్షత్రమున అన్నమయ్యగారి జన్మ నక్షత్రోత్సవ కైంకర్యము జరుపబడుచుండినట్లు తిరుపతి శాసనము లందున్నది. వీనిని పరిశీలించి క్రీ శ. 1424 క్రోధి వైశాఖమాసమున విశాఖా నక్షత్రమున అన్నమయ్య జన్మించినాడనవచ్చును. నిర్యాణము క్రీ శ. 1503 దుందుభినామ వత్సర ఫాల్గున బహుళ ద్వాదశినాడు. కావున నితడు 79 పండ్లు జీవించినాడు. సాళ్వ నరసింహరాయనియు, తత్పుత్రుడు ఇమ్మడి నరసింహరాయునియు కాలమున వర్తిల్లినవాడు.

ఆలయ సంకీర్తనాచార్యులై పరమపదనివాసుని భక్తి శ్రద్ధలతో నర్చించినయట్టి తాళ్ళపాక వారిలో కొందరి శాసనములు మాత్రమే నేడు మనకు లభ్యములగుచున్నవి. ఈ వంశ విఖ్యాతికి మూలపురుషుడగు అన్నమాచార్యుని కుమారుడు పెద తిరుమలచార్యుని యొక్కయు, తద్వంశీకులు చిన తిరుమలాచార్య తిరువేంగళ నాథులయు శాసనములు దాదాపు పాతిక వరకు తిరుపతిలో నున్నవి. ఇక తాళ్ళపాక వారి ప్రస్తావన గల శాసనములు విజయనగర రాజుల కాలమునకు చెందినవి మఱికొన్ని యున్నవి. వీనిని బట్టి విజయనగర రాజుల కాలమున తాళ్ళపాక వారెట్టి ప్రాభవమున వర్తిల్లిరో, స్వామివారి కెన్ని విధముల కైంకర్య మొనర్చిరో తెలియనగును

వీరు కొన్ని కొన్ని గ్రామములను, కొంత సొమ్మును శ్రీభండారమున కనేక సందర్భములలో సమర్పించి, తన్మూలమున వివిధ కైంకర్యముల కేర్పాటులు గావించిరి కొన్ని నూతన నిర్మాణములను గావించిరి కొన్నిటిని పునరుద్ధరించిరి. కొన్ని నూతనోత్సవముల నారంభించిరి. సంకీర్తన పాకృపాలతో స్వామి నర్చించి "సంకీర్తన భండారము" నొకదానిని నెలకొల్పిరి. ఆ వ్యవస్థ నిర్విఘ్నముగా సాగుటకై తగిన జాగ్రత్త వహించిరి. ఆత్మశుద్ధితో, భక్తిశ్రద్ధలతో వర్తిల్లి ఆచార్యపురుషులై శిష్యులను, అనుయాయులను గూర్చుకొని సుప్రసిద్ధులగు వారి సమకాలికుల కెందరికో మార్గదర్శకులై మనిరి.

తాళ్ళపాకవారు తిరుపతి క్షేత్రమునకు చెందిన సంకీర్తనాచార్యులు. ఆంధ్రదేశమున శాస్త్రీయమగు సంకీర్తన సంప్రదాయ పద్ధతులకు మూలపురుషులు. విజయనగర ప్రభువుల మన్ననలంది సంకీర్తన వాఙ్మయపూజలతో స్వామినే అర్పించిన ఆచార్య పురుషులు. వారిలో క్రీ. శ. 1440 నుండి సంకీర్తన రచనకు బూనిన తాళ్ళపాక అన్నమాచార్యుడే ఆదిపురుషుడు. ఆతడు జన్మించిన పదునారవ యేట స్వామి ప్రత్యక్షమయితేను అది మొదలుగా క్రీ శ 1503 నకు సరియగు దుందుభిఫాల్గుణ బహుళ ద్వాదశి వరకును దినమున కొక్క కీర్తనకేని తక్కువ కాకుండ తిరువేంగళనాధుని మీదను అంకితముగా శృంగార వైరాగ్య కీర్తనలను విన్నవము గావించెను. ముప్పది రెండు వేలకు పైగా నాతడు సంకీర్తనలను రచించెనట! తదుపరి తత్పుత్రులునట్లే బహుళ సంఖ్యలో సంకీర్త రచన గావించిరి. తొలుత వీరు తమ రచనలన్నియు తాళపత్రములందే లిఖించుకొని యుండి నప్పటికిని చెక్కుచెదరకుండ వానిని శాశ్వతముగా నుంచి కాపాడుటకై తరువాతి కాలమున వాని నెల్ల రాగి రేకులపై చెక్కించిరి. తిరుమల మీద స్వామివారి బంగారువాకిలికి సమీపమున నొక సంకీర్తన భండారమును నెలకొల్పి యందు వానిని సురక్షితముగా నుంచిరి. ఇట్లు అసంఖ్యాకములుగా నున్న వారి రచనల నెల్ల రాగి రేకులపై చెక్కించి, సంకీర్తన భాండాగార కార్య నిర్వహణమునకు వారొక చక్కని వ్యవస్థను కల్పించిన వివరములు మనకు తాళ్ళపాకవారి శాసనములలో క్రీ. శ. 1530 సం॥ననే తెలియనగుచున్నవి.

దాదాపు ఒకటిన్నర శతాబ్దికి పైగా తిరుపతిలో నెలకొని దీక్షా బద్ధకంకణులై యాంధ్రుల మత సాంస్కృతిక రంగములో నూతనోత్తేజమును గల్పించిన తాళ్ళపాక వంశీకు లందరును విద్యావిశారదులే ప్రాయికముగా నందరును కవి పండిత గాయకులే. వారిలో నొక్కొక్క రొకరిని మించి యొకరుగా బహు కృతులను రచించిరి. బహుళములగు సాహితీ ప్రక్రియలను సాధించిరి. తమకు బూర్వమున్న సాహితీ ప్రక్రియలన్నిటి నాకళించుకొని యనుసరించి కవితారంగమున నూతన ప్రయోగములను గావించిరి. పూర్వ సాహితీ మార్గముల యధేచ్ఛావిహారము గావించి నవ్యమార్గముల నావిష్కరించిరి. అలనాటి సాహిత్యాకాశమున నీ తాళ్ళపాక కవి చంద్రులకు గల స్థానమెట్టిదో తెలిసికొనుటకు బహుసాహితీప్రక్రియలలో రచితములైన వారి కృతి బాహుళ్యమును గూర్చి తెలియుటవసరమే. తెలియవచ్చినంతవరకు చూడగా 15, 16 శతాబ్దులలో వర్తిల్లిన తాళ్ళపాక వారివియు, వారి బంధువులవియు రచనలు, సంకీర్తనములను వదలి, దాదాపు నలువది రెండు వరకు లెక్కకు తేలినవి. వానిలో నేటికి 20 కృతులకు పైగా ప్రకటితములు. మరికొన్ని కృతుల లభ్యములు. ఇక తాళ్లపాక వారి రచనలలో ప్రధానములైనవి, వారి సంకీర్తనములు. ఇవి అధ్యాత్మ శృంగార సంకీర్తనములని రెండు తెఱగులు. అన్నమాచార్యుడును, తత్పుత్రుడు పెద తిరుమలాచార్యుడును, తత్పుత్రుడు చిన తిరుమలాచార్యుడును మన మెరిగినంతలో సంకీర్తన రచయితలుగా గుర్తింపనగుచున్నారు. వీరిలో అన్నమాచార్యుడొక్కడే "పరమతంత్రములు ముప్పది రెండువేలు" యోగ వైరాగ్య శృంగార మార్గములననుసరించి వ్రాసినట్లు చిన్నన వ్రాసిన అన్నమాచార్య చరిత్రను బట్టి తెలియుచున్నది. అటుపై పెద చిన తిరుమలాచార్యులిక నెన్ని విరచించి యుండిరో ఆ వివరములు

తెలియరావు. కాని నేడు వానిలో కొన్ని మాత్రమే రాగి రేకులపై చెక్కబడి తిరుపతి దేవస్థానమున పదిల పరుపబడి కాననగుచున్నవి. మరి కొన్ని అహోబలము శ్రీ రంగాదులలో కూడ నున్నట్లు తెలియుచున్నది. వానిని కూడ తిరుపతి దేవస్థానమువారు సేకరించి క్రమముగ ప్రకటించుచున్నారు. ఏమైనను పై ముప్వురు రచయితలవి సంకీర్తనలు చెక్కబడిన రాగిరేకులే తిరుపతిలో నేడు మనకు 2600 వరకున్నవి. అనగా రేకున కారువంతున సంకీర్తనముల మొత్తము సంఖ్య దాదాపు పదునైదు పదునారు వేల నడుమనుండును. వానిలో దాదాపు మూడు వేలు ఆధ్యాత్మ కీర్తనలు మిగిలినవి శృంగార కీర్తనలు. వీనిని బట్టి చూడ తాళ్ళపాకవారు సాహితీ ప్రక్రియలలో వైవిధ్యము సాధించుట మాత్రమే కాదు, కృతి బాహుళ్యమునందును అవధులు దాటిపోయినారనవలసి యున్నది.

తాళ్ళపాక వంశ విఖ్యాతికి మూలపురుషుడు అన్నమాచార్యుడు సంగీత సాహిత్యములందసాధారణ పాండిత్యమును, సంస్కృతాంధ్రములందనితర సాధ్యమగు కవితా శక్తియు గలవాడు. 'హరికీర్తనాచార్యుడు'. 'పదకవితాపితామహుడు' పంచమాంగ సార్వభౌముడు ద్రావిడ వేదమును తెనుగు చేసినవాడు. వైష్ణవకావ్యములను, శతకములను, క్షేత్రమహాత్మ్యములను మాత్రమేకాక తన్మత ప్రచారమునకై నూతనముగా తెనుగున బదకవితకు దొడగిన వాడును. ముప్పది రెండువేలకు పైగా నీతడు తిరువేంగళనాథ దేవుని పేర శృంగారాధ్యాత్మ కీర్తనలను రచించినాడు. అవి యెల్ల వైష్ణవ తత్త్వము ముల్లె గట్టిన ముత్యాలమూటలు.

## తాళ్ళపాకవారి చరిత్ర — సంప్రదాయము — సమన్వయము

తాళ్ళపాక కవులను గూర్చిన మన యెఱుకకు తిరుపతి శాసనములును రాగిరేకుల లోని వారి సంకీర్తనలును, వారి ఇతర కృతులును, ఇటీవల (1949లో) లభ్యమై ప్రకటింపబడిన అన్నమాచార్య చరిత్ర ద్విపదయు ప్రధాన సాధనములు. ఇక గ్రందస్థములైన విషయములు కొన్ని అనుస్యూతముగా వినవచ్చుచున్న ఇతిహాసములు మరికొన్ని ఇతర సాధనములు.

సమీక్షించి సత్యమరయు నుద్దేశ్యముతో గొన్నింటినిట నుదాహరించుచున్నాను.

### 1. సంప్రదాయ కథనము

పుదుకోట్టలో నుండిన పుణ్యపురుషులు శ్రీ గోపాలకృష్ణ భాగవతారుగారి శిష్య కోటిలో నొకరగు శ్రీ పి ఎల్. కృష్ణమూర్తి (హైదరాబాద్) గారు గురుముఖమున తాము విన్న వార్తలు వివరించుచు చెప్పిన విషయములలోని ముఖ్యాంశము లివి కొన్ని.

1.1. తాము అనుసరించుచున్న భజనసంప్రదాయ పద్ధతి తొలుత రూపు దిద్దుకొన్నది తాళ్ళపాకలోనే-తాళ్ళపాకవారి మూలముననే.

1.2. తాళ్ళపాకవారిలో అన్నమయ్య చిన్నమయ్య అని ఇరువురు ప్రసిద్ధులు వీరిలో చిన్నమయ్య అనువారే భజన పద్ధతికి మూలపురుషులు.

1.3. చిన్నమయ్యకు కడుపులో శూలబాధ యుండెడిది. అది యాతనికి తిరుమల మీద యాలయమున గరుడగంభమువద్ద పొర్లు దండము పెట్టుటతో తొలగిపోయినది. అతడు గొప్ప భక్తుడై సంకీర్తన రచన గావించెను.

శ్రీ గోపాలకృష్ణ భాగవతారుగారి కుమారులును, తండ్రిగారి వలెనే భక్తిమయ జీవతమును గడుపుచు సంప్రదాయము ననువర్తించి పోషించుచున్నవారును, పుదుక్కోట నివాసియునగు శ్రీ సంజీవి భాగవతారుగారి మూలమున విశదములైన విశేషములివి.

1.4. అన్నమయ్యగారు తన కీర్తనలలో శృంగారము నతిశయించి వర్ణించిన కారణమున అమ్మవారికి ఆగ్రహము కల్గినది. ఆ కారణమున శృంగారపద కవియగు అన్నమయ్యను

అనుగ్రహించుచున్న స్వామివారియెడ నమ్మవారు పరాఙ్ముఖి యాయెను. అప్పుడు స్వామివారు అమ్మవారికి ఆ భక్తుని తన్మయభావము నెరుక పఱచుటకై ఒక ఉపాయము పన్నిరి. అన్నమయ్య తిరుమల నధిరోహించు తరి మార్గమధ్యమున పండ్రెడడుగుల నిడివిగల పులి యొకటి అడ్డువచ్చి నిలిచినది. ఈ పులి యెవరోకాదు శ్రీనివాసుడే. శ్రీనివాసుని భక్తుడగు అన్నమయ్య తన్మయుడై యున్న కారణమున నాతనికా మూర్తిలో నొక క్రూరజంతువు కాక అనుగ్రహార్థము గైకొన్న దశావతార మూర్తులే దర్శనమొసవి పరవశమున అన్నమయ్య.

"పీడె నెలకొన్నాడు శ్రీ వేంకటగిరిమీద
అడుగో కొలువై యున్నాడు......" అను కీర్తనమును పాడిరి.

ఆ భక్తుని అలౌకిక భావనకు, తన్మయ జీవమునకు నచ్చెరువందిన అమ్మవారు అలుకతీరి చేరవచ్చి భక్తుని దీవించినది

1.5. వంశపారంపర్యముగా తామనుసరించుచున్న భజన సంప్రదాయమున డోలోత్సవమున, పవళింపు సేవ సందర్భమున పాడునట్టి పాటలలో నధిక భాగము తాళ్ళపాకవారివే.

'శరణాగత వత్సల'
'గద్దెమీద వేంచేసి'
'ఎంత లేదు వైభవం బిప్పుడు నీకు
చింతదీర పవ్వళించు శ్రీ వేంకటాద్రిరాయ'
'దాచుకొనా డదిగో కాంతు డేకాంతముగ'

'నా మొఱాలకింపవే వేంకటరమణా' (రాగం—యదుకుల కాంభోజి)

'వీడె నెలకొన్నాడు శ్రీ వేంకటగిరి మీద'
మొదలైనవి ప్రచారములోనున్న వీరి కీర్తనలలో కొన్ని.

'దీని భావము నీకే తెలుసురా — ఓ వేంకటేశ' అని నిగూఢార్థముగల కీర్తన మొకటి కలదని కొన్ని పంక్తులుదాహరించిరి. అది వారి పేరి పదమగునని అందలి గతిని బట్టి గుర్తించితిని.

1.6. మే నెల 28—29 తేదులలో పుదుకోట్టలో జరుగు కల్యాణోత్సవ సందర్భమున తాళ్ళపాక వారి పవళింపు పాటలు 30 సంపూర్ణముగ గానము చేయుట జరుగును.

1.7. శ్రీ గోపాలకృష్ణ భాగవతారుగారు సంప్రదాయము ననుసరించి పాడు నీ పాటలన్నింటిని మధురలోని ఆచార్య యస్, రామనాథన్ అను వారు స్వరసహితముగ లిఖించి యున్నారు. (వానిని సేకరించి ప్రకటించు యత్నము చేయదగును )

1.8. శ్రీ గోపాలకృష్ణ భాగవతారుగారు ఉద్దవవారు. ములకనాటి తెలుగు బ్రాహ్మణులు. తల్లి వైపు వారు త్యాగరాజస్వామి వారి వంశము తోడి బాంధవ్యము గలవారు. వీరి మేనమామ వంశమువారు గొప్ప భాగవతులు శ్రీ వేంకటకృష్ణయ్య భాగవతారుగారు శ్రీ గోపాలకృష్ణ భాగవతారుగారి మేనబావ (మేనత్త కుమారుడు, అక్కగారి భర్తయు) గొప్ప భజనపరులు. వీరి పూర్వులు దాదాపు 150 సంవత్సరములకు పూర్వము గుంటూరు సీమ నుండి మేలట్టూరు చేరినట్లు వారి వంశ కథనము.

## 2. గ్రంథస్థ—చారిత్రక విషయము

2.1. శ్రీ సుబ్బరామ దీక్షితులవారు తమ సంగీత సంప్రదాయ ప్రదర్శినిలో తాళపాకము చిన్నయ్య గూర్చి యిట్లు వ్రాసిరి "ఇతడు తెలుగు బ్రాహ్మణుడు. వేంకటాచలపతి భక్తుడు, తిరుపతిలో నుండినవాడు. వెంకటరమణ విషయమై భాగవత సంప్రదాయముగా వాడుకలో గల ఉత్సవ పద్ధతి నేర్పరచిన పుణ్యపురుషుడు. దానిలో తోడయము, మంగళము, శరణు, హెచ్చరిక, కీర్తనములు ధూపదీపాలంకారనైవేద్యాద్యుపచారముల కీర్తనములు, పవ్వళింపు దివ్యనామ సంకీర్తనములు, వసంతోత్సవ కీర్తనములు, స్వామిని మేలుకొలుపుట్టై కీర్తనములు, ఇవి మొదలైనవి యణగి యున్నవి ఇవి గాక విడి కీర్తనములు గలవు. ఇతని భక్త్యతిశయము వలన మాటి మాటికి వెంకటరమణుడు ఇతనికి సాక్షాద్దర్శన మిచ్చి మాట్లాడినట్లు పెద్దలు జెప్పుచున్నారు. భజన పద్ధతికి యితడే మూల

2.2. ప్రథమాభ్యాస పుస్తకమున పుట 101లో శంకరాభరణము— అటతాళకీర్తన "శ్రీహరి పాద తీర్థమై చెడని మందు" అను దానిని, సంగీత సంప్రదాయ ప్రదర్శిని అనుబంధము B పుట 57లో కాంభోజిరాగం ఝంప తాళమున 'నా మొరాలింపవే అయ్యా వేంకటరమణ' అను మరియొక కీర్తనమును తాళ్ళపాకం చిన్నయ్యా రచనలుగా సుబ్బరామ దీక్షితులవారు వివరించిరి,

2.3. తాళ్ళపాకవారి కీర్తనము లందలి శృంగార మతిమనోజ్ఞమని మురిసి సాళ్వనరసింహరాయడు "కవులు విద్వాంసులు గాయకుల్ భూమిధవులు సామంతులు, దను జుట్టి కొలువనంగ గురు మీద నభినవంబైన శృంగారయుత పదశ్రేణి బాడించి" దనిసినాడట.

(చూ. అన్నమా. చ. ద్విపద. 36)

2.4. అన్నమాచార్యుని శృంగార భావనకు అమ్మవారు నొచ్చుకొన్నట్లును పిదప నాతని భక్తి తాత్పర్యములు నచ్చి మెచ్చుకొన్నట్లును, సంప్రదాయ కథనము కదా! ఇది యదార్థమే అనదగినట్లును, అమ్మవారి మాట ఎట్లున్నను సమకాలము వారలు కొందరు వీరి శృంగారము నీసడించినట్లు చారిత్రక గ్రంథస్థాధారములున్నవి.

గురురాజు చరిత్ర యందలి కథనమును మా సహోధ్యాయులు శ్రీ మహంతయ్యగారి తోడ్పాటుతో నిగ్గెరిగితిని.

"లక్ష్మా భక్తుడు కంసాలి. ఆ వీరశైవుడు ఒక పర్యాయము శ్రీశైలమున కేగుచు గారలదిన్నెలో కమ్మరులతో వివాదమునకు దిగి, కాల్చిన యినుమును మూటగట్టి భుజాన వేసుకొని మహిమను ప్రదర్శించెను. రాచవట్టిగలోని వణిక్ శ్రేష్ఠులతో చర్చకు దిగి తన శక్తి నెరిగించెను. విల్లూరునందు గవిలింగమునకు నైవేద్యమొసగి శివభక్తులకు తన మహిమను చూపెను. శైవుడగు గంగాధరుడను రాజును వీరశైవునిగామార్చి, వాని శరీరము నుండి ప్రణవనాదమును వినిపింపజేసెను. పిదప నొక తావున తాళ్ళపాక అన్నమయ్యను, మఱి కొందరు వైష్ణవులను చూచుట తటస్థించెను. తన గురువగు యాగంటీశ్వరుడే అత్యధికుడనియు నితరదైవము లనిత్యులనియు లక్ష్మప్ప సుందర గీతములను చెప్పుచుండగా పన్నగారిధ్వజాచార్యుడగు తాళ్ళ పాకన్నమయ్య శివుడె దైవతములందు కడు వృద్ధుడని పొగడు లక్ష్మప్ప గీతములలో సన్నుతమైన శృంగారరసము కానరాదని పలుకగా మాతాపితరుల విట శృంగారమును రచ్చకెక్కించునాతడు సత్పుత్రుడు కాడని వెల్లడించి, తిరుపతి తిమ్మప్పని చేతనే సత్యము పలికింతునని చెప్పి, అచ్యుతిని గుడి యందట్లు శివుడధికుడని పలికించి, అచట కూడిన వైష్ణవుల కచ్చేరువు గొలిపి వారి మన్నన లందుకొనెను"

శ్రీ సం. శి. భూసనూర మఠ ఎం. ఏ. గారు గురురాజు చరిత్ర (1950) పీఠికలో "ఆ షేపి శివవైష్ణవాచార్య కన్నమయ్యనిగె" అని అన్నమయను కన్నమయ్యగా పేర్కొనుట

ఈ లక్ష్మాభక్తుడు శైవ సంకీర్తనములు చెప్పినట్లు తెలియుచున్నది. ఏగంటి పదాల కర్తగా ప్రస్తుతుడితడే యగుచో వీరికి గల స్పర్థను సూచించు నీ వృత్తాంతమును బట్టి తాళ్ళపాక వారు ఛాయా పహారుల నీసడించి చెప్పిన పదము వీరికే అన్వయించునేమో !

2.5. అన్నమయ్యయు, వయసున చిన్నవారైన పురందరదాసులును కలిసికొని పరస్పరము సంభావించుకొనిన చారిత్రక విషయమును చిన్నన్న అన్నమాచార్య చరిత్ర ద్విపదలో పేర్కొనెను. భక్తిమత ప్రచారమునకును, కర్ణాటక సంగీత పద్ధతి రూపుదిద్దుకొనుటకును తదుపరి దాసదాసరి కూటములవారు గావించిన సమన్వయ కృషినిగూర్చి విజ్ఞులెరిగినదే !

పురందరదాసుల రచనగా ప్రసిద్ధివడసిన "కెరయనీరను కెరగెజల్లి" అను (మలహారి— త్రిపుట) ప్రారంభ గీతమును చదివి తాళ్ళపాకవారి "నీవే నేరపుకాని" అను కీర్తన చదువుడు.

దేశాక్షి : నీవే నేరవుగాని నిన్ను, బండించేము నేము
దైవమా నీ కంటె నీ దాసులే నేర్పరులు ॥
వట్టి భక్తి నీ మీద వళుకు వేసి నిన్ను
బట్టి తెచ్చి మదిలోన, బెట్టుకొంటిని
పుట్టెడు తులసి నీ పాదములపై బెట్టి
జట్టికొనిరి మోక్షము జాణలు నీ దాసులు ॥
నీవు నిర్మించినవి నీకె సమర్పణ సేసి
సోవల నీ కృపయెల్ల జూరగొంటిమి
భావించొక మ్రొక్కు మ్రొక్కి భారము నీపై వేసిరి
పావనపు నీ దాసులే పంతపు చతురులు ॥
చెరువుల నీళ్లుదెచ్చి చేరెడు నీపై జల్లి
వరము వడసితిమి వలసినట్టు
యిరవై శ్రీ వేంకటేశ యిటువంటి విద్యలనే
దరిచేరి మించిరి నీ దాసులే పో ఘనులు ॥
(అన్నమా. సం. 8-49)

మలహారి — త్రిపుట.

కెరయ (సరస్సు యొక్క). నీరను (నీటిని). కెరెగె (సరస్సులోనే), జల్లి (చల్లి), వరవ పడెదవ రంతె (వరములందిన వారివలె), కాణిరో (కానిపించండి), హరియు (శ్రీహరి యొక్క), కరుణదొళ (కరుణవల్ల) ఆదభాగ్యవ (కల్గిన భాగ్యమును), హరి సమర్పణె (ఆ హరికే సమర్పణ) మాడి (చేసి), బదుకిరొ (బ్రతుకండి), నోడి బదుకిరొ (చూచి బ్రతుకండి)

[illegible]

సమన్వయ దృక్పథము భజన పద్ధతిలోని జీవనుగా దోచుచున్నది. నేటికిని భజన గోష్ఠులలో పలుభాషలలోని కీర్తనలు పలువురి రచనలను కూర్చుకొని ఒక క్రమమున పాడు చుండుట పద్ధతిగా కానవచ్చుచున్నది. ఆనాటి సమన్వయ బీజమే నేటికిట్లంకురించి విస్తరిల్లినదని తలవ వచ్చును.

2.6. సంకీర్తన లక్షణమును ఆంధ్రీకరించిన వాడు చిన తిరుమలాచార్యుడు.

## 3. సంప్రదాయ ప్రదర్శనము

3.1. తిరుమల తిరుపతులందు కల్యాణోత్సవములను, జయంతి ఉత్సవము (నరసింహజయంతి ఉట్ల పండుగలు ప్రఖ్యాతములు) లను ఆరంభించి యిసుమడింపజేసిన వారు తాళ్ళపాకవారే.

3.2. దక్షిణభారతమున ఇటు తెలుగునాడు మొదలుకొని అటు తిరువనంత పురము కొనదాకను ప్రచారమున నున్న భజన కూటముల వారి గోష్ఠి కలాపములలో నృసింహ కృష్ణ జయంతులు ఆంజనేయోత్సవములు రాధా కళ్యాణాదులు పలువురు భక్తుల నాకర్షించి నవిగను, మన సంస్కృతిని సంగీత సాహిత్య నృత్య విశేషములను అవిష్కరించినవిగను తోచుచున్నవి. ఇచ్చట (హైదరాబాదులో) రాధాకళ్యాణ కథాగాన ప్రదర్శనమును శ్రీ ఏ. ఎల్. కృష్ణమూర్తిగారు నిర్వహింపగను, తిరువనంతపురమున ఆంజనేయోత్స వమును శ్రీ రామస్వామి అయ్యంగారు శ్రీ కళ్యాణకృష్ణన్ గారలు నిర్వహింపగను దర్శించి యానందించితిని (పురందరపు గోపాలకృష్ణ భాగవతారుగారి శిష్యులే). అందు వారు జయదేవుని అష్టపదులతో పాటు తాళ్ళపాకవారి కీర్తలములను కూడ నాలపించినారు. భజన గోష్ఠులలో నిట్టి కల్యాణ కథా ప్రదర్శనమునకును తాళ్ళపాక వారే ఆద్యులనియు స్ఫూర్తినిచ్చిన వారనియు నాకు తోచినది. తిరుమల తిరుపతులందు తాళ్ళపాకవారే కల్యాణోత్సవము లారంభించి నిర్వహించిన వారనుట శాసనోక్తి, కల్యాణ కథా సంబంధము గల కీర్తనములను, మంజరులను వారెన్నో రచించిరి. అన్నమయ్యగారికి తిరుమల శ్రీనివాసుడు అల్లుని వరుస— నేటి భజన గోష్ఠులందలి సీతాకల్యాణ రాధాకల్యాణ శ్రీనివాస కల్యాణాది కథా ప్రదర్శనమునకును తాళ్ళపాక వారి కాలముననే బీజావాపము జరిగినట్లు తలతును.

## 4. సమన్వయము

4.1. తాళ్ళపాక పద కవిత్రయమున అన్నమయ్య ఆద్యుడు. సుప్రసిద్ధుడు. అటు పిదప పెద తిరుమలయ్యదే ఆస్థానము. అతడు రెండవవాడగుటయు. సంకీర్తన భండారము నెలకొల్పి రేకులను చెక్కించియు, తండ్రిగారి తరువాత బహుళ సంకీర్తన రచన గావించిన వాడీతడే అగుటయు నందుకు హేతువులు. క్రీ. శ. 1525–45 సం॥ల నడుమ రేకులను జెక్కించునాటికిని వీరిరువురే ప్రసిద్ధులు అందుకే 'అ. చా' — 'తి చా' సంకేతములు వారి

రేకులలో కానవచ్చినవి. చిన తిరుమలయ్య ర.నలు క్రీ. శ. 1537 ప్రాంతములందు రేకుల కెక్కిన నాటికి ఈ తిరుమలాచార్యు లిరువురి రచనలను నేర్పరచి చూపుటకు "పె. తి. చా.," "చి తి. చా." సంకేతము లేర్పడినవి చిన తిరుమలాచార్యునిది రచనా బాహుళ్యమును బట్టియు, కాలమును బట్టియు తృతీయ స్థానమగును. ఇది యొక దృష్టి.

4.2. మఱియొక దృష్టి-అన్నమయ్య తర్వాత అతని కుమారుడగు పెద తిరుమలయ్యయు. మనుమడగు చిన తిరుమలయ్యయు బహుకాలము జీడించి సంకీర్తన ప్రచారము, మత ప్రచారము గావించినవారే. పెద తిరుమలయ్య (క్రీ. శ. 1454–1554) నిండుగా నూరేళ్లు జీవించి నట్లున్నాడు. చిన తిరుమలయ్యయు (క్రీ.శ. 1488–1562) దాదాపు 75 ఏండ్లు జీవించెను. క్రీ శ. 1553–54 ప్రాంతములందు పెద చిన తిరుమలయ్య లిరువురును చిన కంజీవరమున కొన్ని కైంకర్యములు జరపినట్లు తెలియుచున్నది.

4.3 కనుక తాళ్ళపాక వారిలో నానాట తండ్రి—కుమారులిరువురు (ఏదృష్టిలోనైనను) ప్రసిద్ధి గాంచిన వారని తెలియనగును. ఒక దృష్టిలో అన్నమయ్య 'పెద్దయ్య' కుమారుడగు పెద తిరుమలయ్య 'చిన్నయ' కానోపును మఱియొక దృష్టిలో తిరుమలయ్య లిరువురిలో తండ్రి 'పెద్దయ్య' కాగా కుమారుడు 'చిన్నయ్య' కానోపు.

4.4 అందుకేనేమో సంప్రదాయమున అన్నమయ్య, చిన్నమయ్య అని వాడుక కలిగి యుండుట లభించిన రాగిరేకుల మీది ముద్రలందును ఇరువురే కానవచ్చుచున్నారు.

వీరిలో 'చిన్నయ్య' యే, 'చిన్నమయ్య' యే దీక్షితులవారు పేర్కొన్న 'చిన్నయ్య' కాదగును. అనగా తిరుమలాచార్యు లిరువురిలో ఒకరు కాందగునన్నమాట. ఇప్పటి నా తలపు చిన్న తిరుమలయ్యయే 'చిన్నయ్య' అని :

### 5. చిన్నన్న—చిన్నయ్యలొక రగుదురా ?

పెద తిరుమలాచార్యుని కుమారు లైదుగురిలో ద్విపదకవిగా ప్రసిద్ధివడసిన చిన తిరువేంగళనాథుడు చిన్నన్న నామముదొకడు కలడుగాని పదకర్తగా నుదహరింపబడిన 'చిన్నయ్య' అతడు కాదేమో అనిపించుచున్నది. శ్రీప్రభాకరశాస్త్రిగారిట్లు వ్రాసిరి "చిన్నన్న గాయకుడనుట కిక్కడ రాగిరేకుల దుగాని గ్రంథములలోగాని యాధారములు గానరావు. చిన్నన్నకు అన్న, తండ్రి, తాత గొప్ప గాయకులుగాన యిటీవలివారు గ్రంథములనుబట్టి చిన్నన్ననే యెఱిగినవారు గాన వారి యోగ్యత నీతనికి చేర్చి చెప్పియుండవచ్చును. కాక యితడును గాయకుడేమో" (చూ. అ చ పీఠిక — పుట 95)

పోతే — శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారిట్లు వ్రాసిరి "చిన్నన్న సంకీర్తన రచన చేసినాడని నేను భావించుటకు అతనివని గాయక సంప్రదాయమున నిలచి నేటికి లభించు

రెండు కృతులాధారములని వెనుక సూచించితిని. (తాళ్ళపాక పాటలు : సం. పీఠిక, పు 2) అవి 19వ శతాబ్దిలో సుబ్బరామ దీక్షితులు రచించిన సంగీత సంప్రదాయ ప్రదర్శినియందున్నితములైనవి శ్రీ హరిపాద తీర్థమే చెడని మందు 2 నా మొఱాలింపవే అయ్యా వెంకట రమణా. ఈ సందర్భమున తాళ్ళపాక వారి పదములు మరి రెండు నా దృష్టికందినవి. కర్త నిర్దేశములేదు చెన్నపురి వీణ రామానుజయ్యా అను పండితుడు 1912వ సంవత్సరమున రచించిన మద్రాసులో ప్రకటించిన సంగీత సర్వార్థసార సంగ్రహమునందు ఇవి కలవు. ఆ పుస్తక మిపుడు దుర్లభము గనుక ఆ పాటలు నశించి పోకుండుటకై యుద్ధరించుచున్నాను యథామూలముగ.

1. గౌళిపంతురాగం అటచాపుతాళం తాళ్ళపాకవారి పదము, "ఏ రీతి బొంకేవురా నాసామి......వేణంగిరాయా ! తారా ఏటికి సిగ్గులు నా సామి......"

2. కేదారగౌళ రాగము, ఝంపె తాళము
"భామ శృంగారించు భావమే యందము
కాముని రతిపాట కాంత కీలాగు ॥
పూవొకటి వికసించె పున్నమ చంద్రునివలె
పూమీద మరిరెండు పూలు బూసె
రెండు పూవుల నడుమ పూసె నొక పువ్వు
పూవుకింద ముప్పదిరెండు పూ మొగ్గలెత్తె"

3. 'ఎటువంటి రాజీక మే చెలియ నేడు
కటకటా యెందైన కంటిరా మీరు......

(ఈకృతులలో మొదటిది తాళ్ళపాక వారిది కాదేమో ! వేంకటేశ ముద్ర దానికి లేదు. వేణంగిని లయుని పేరున్నది. మరి తాళ్లపాక వారి పాటలలో గౌళిపంతురాగము కానరాదు. తక్కినవి రెండు తాళ్లపాక వారివి కావచ్చును)

## 6. సమాధానము

తాళ్లపాక వారందరును గాయకులనుటకు గ్రంథస్థాధారములును శిలా కుడ్య చిత్రములును సాక్ష్యమిచ్చుచున్నవి. కాని ద్విపదకవిగా ప్రసిద్ధుడగు 'చిన్నన్న' పదములు చెప్పెననుటకు తిరుపతిలో ఆధారములు లేవు. ఇక దీక్షితులవారు పేర్కొనిన 'చిన్నయ్య' విషయమందుమా— అది 'చిన్నన్న'కు గాక చిన తిరుమలాచార్యునికే అన్వయించునని నేనిపుడు తలంచుచున్నాను

6.1. చిన తిరుమలయ్యాయే 'చిన్నయ్య' అనుటకు హేతువులు 1. 2 4. 4., లలో

6.2. చిన తిరుమలయ్య మంగళగిరిలో సంకీర్తన 'అరుళప్పాడు'న కేర్పాటు చేసినాడు. గుంటూరు మండలములో నాతనికి సంబంధముండినది. ద్రవిడ దేశమునకు వలన వెళ్ళిన నేటి భాగవతులు పూర్వము గుంటూరు సీమకు చెందినవారే. (1.6.,)

కనుక గాయక సంప్రదాయమున చిన్నయ్య పేర నిలిచిన రెండు కీర్తనములును చిన తిరుమలయ్యవే కాదగునని నా తలంపు. అయితే నేడు లభించిన చిన తిరుమలాచార్యుని కీర్తనల (16వ సంపుటము)లో ఈ రెండు పాటలును కానరావు పోతే 'శ్రీహరి పాదతీర్థమే' అను కీర్తనము అన్నమయ్య రచనగా అ.చ. పీఠిక (పు. 34) యందుదాహృతము, పద కవిత్రయము వారి రచనలు పరస్పరము తారుమారుగా రేకులందే కానవచ్చుట మన మెరిగిన విషయమే. కనుక ఆ రెండు కీర్తనలును 16 సంపుటము 'చి.తి' కీర్తనలందు కానరానంత మాత్రమున అవి అతనివి కావని తలవనవసరములేదు.

6.3. 'శ్రీహరి పాద తీర్థమే చెడనిమందు' అను కీర్తనను బోలినదే మాళవి రాగమున "నూరవద్దు తాగవద్దు నోరు చేదుగావద్దు చేరువ నొకచోట సంజీవి వున్నదిదివో" (16-1-54) చిన తిరుమలాచార్యుని కీర్తనము గలదు.

6.4. ఇక గాయక సంప్రదాయమున నిలిచినవియు శ్రీ శర్మగారుదహరించినవియునగు కీర్తనలు రెండు కర్త నిర్దేశములేకున్నను చిన తిరుమలయ్య రచనలే అనిపించును. వలన రామాయణ భారత భాగవత కథా విషయముల నుపమించి సంకీర్తనలు రచించుటయు, సమస్యా పదములను. పొడుపు కథలను పొడుచుటయు చిన తిరుమలాచార్యుని రచనలలో గానవచ్చు నంశములే (చూ. 16-1-1 ,29, 43)

'కానీలేరా పొడుపుగతలు పొడవమని
ఆనవెట్టి నన్నేల అడ్డగించేవు
పూని నాకతలు నీకు బొందుగా దెలియకుంటే
పాని పట్టి నీవె నా బంట వయ్యేవా' (16–2–88)
చూ, మఱియు (16–2–11)

'భామ శృంగారించు' కీర్తనము కూడ నిట్టిదే. క్షేత్రజ్ఞులిట్టివి కొన్ని తర్వాతి కాలమున రచించినారు.

'ఎటువంటి రాజీక మే' అను కీర్తనము నేను 1958లో కాపీ చేయించి తెచ్చుకొన్న తంజావూరు తాళపత్రప్రతిలో నానా విధ పదములు (వేంకటేశ్వర పదములు) అను గ్రంథమున తాళ్ళపాకవారి రచనగా కలదు. కాని అది శ్రీరంగము జంపె తాళమున గలదు.

6.5. అన్నమయ్యగారి శృంగార కీర్తనమునందలి శృంగారమునను గూర్చిన చర్చ సమకాలమున జరిగినదనుటకు సాంప్రదాయిక చారిత్రకాధారములు సంవాదించుచున్నవి.

## 7, చర్చా సారము

7.1. తాళ్ళపాకం చిన్నయ్య-చిన తిరుమలాచార్యుడే.

7.2. అతడే ఉత్సవ పద్ధతికి జీవము పోసి భజన పద్ధతికి మూలపురుషుడైనాడు.

7 3. మంగళగిరిలో సంకీర్తన అరుళప్పాడునకు ఏర్పాటుచేసి కీర్తనల ప్రచారమునకు పాటుపడిన వాడీతడే.

7.4. మంగాపురమున కల్యాణ వేంకటేశ్వరాలయమున జీర్ణోద్ధారణము గావించియు తాతగారి (అన్నమయ్య) విగ్రహామునచట ప్రతిష్ఠించియు జయంతుత్సవములను కల్యాణోత్సవము లను పర్యవేక్షించి వానికి ప్రచారము గల్పించియు స్వరసహితమైన సంకీర్తన శిలా ఫలకములను చెక్కించియు, సంకీర్తన లక్షణము నాంధ్రీకరించియు ఘనత వహించిన చిన తిరుమలాచార్యుడే గాయక సంప్రదాయమున చిరకీర్తి నార్జించుకొన్న 'తాళ్ళపాక చిన్నయ్య'

7.5. తండ్రి తాతలు పోషించిన సమన్వయ మార్గమునే చిన తిరుమలాచార్యుడును పోషించెను. తాళ్ళపాక వారి దృక్పథము సమన్వయ సామరస్య మార్గముల ననుగమించినది.

* * *

బ్రదుకును పసిడి వీణగా పలికించిన విమల గాంధర్వము నాటి ఆ తాళ్ళపాక కవి శేఖరులది. దానిని భద్రపరచిన యోగ్మి తిరుమల తిరుపతి దేవస్థానము వారిది. శిలా కుడ్యము లందును తామ్ర ఫలకమందును దాగి మూగవోయి యుండిన దాని యాకృతిని విస్పష్టముగా కనుల గట్టించి లయకు దెచ్చిన నేర్మి వేటూరి వారిది ఎడద కరగించి శ్రుతికింపు గూర్చిన పేర్మి రాళ్ళపల్లి వారిది. అంతటను భాసించుచున్న కూర్మి ఆ శ్రీనివాసునిది. నేటి కీరితి శ్రీ వేంకటేశ్వర వరప్రసాద లబ్ధమైన ప్రతిభా విశేషముతో నిట్లు స్వరపూజ కుద్యమించిన కీరితి మంచాళ వారిది. స్వీకరింతము గాక !

'శ్రీనివాస్'
6/2 RT (New Vijayanagar Colony)
Hyderabad–500457

విధేయుడు
వేటూరి ఆనందమూర్తి
ఎం. ఎ. పి. హెచ్. డి.
రీడర్, తెలుగుశాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయము.
హైదరాబాద్.

# వాగ్గేయకారులలో అన్నమాచార్యుని స్థానము

తెలుగులో పద్యకవిత్వమునకు నన్నయభట్టారకుడు ఆద్యుడుగా ప్రశస్తిపొందినట్లే పదకవితకును, దానిగానమునకును ఆద్యుడుగా ప్రవర్తిల్లిన అన్నమాచార్యులకు పదకవితా పితామహుడనే ప్రశస్తి లభించినది.

నన్నయభట్టారకునికి ముందు తెలుగులో పద్యకవిత లేదా అని గాని, అన్నమాచార్యులకు ముందు తెలుగులో పద కవిత లేదా అనిగాని అడిగితే ప్రత్యుత్తరము (కవిసామ్రాట్టు విశ్వనాథవారిశైలిలో) ఉండినదియును లేదునుకూడ అని చెప్పవలెను. లేదంటే వారిద్దరు ఆరీతులను స్వకపోలమునుండి కల్పించి పుట్టించినారా అనీ, ఉన్నదంటే, ముందే ఉండినప్పుడు వీరి కాద్యులనే పొగడ్త ఏ విధముగా సమంజసమూ అనీ ప్రశ్నలు పుట్టుట సహజము. ఈ రెండు పద్ధతుల కవితలయందును ఈ యిద్దరి ఆచార్యత్వసిద్ధికి తోడ్పడిన చారిత్రక సామాజిక సాంస్కృతిక పరిస్థితులలో చాల సామ్యమున్నది. ఈ రెండు పద్ధతులకును నడుమ తమలో తమకు చాల ప్రసిద్ధమైన వైరభావమూ, పద్యకవులకును పద్యకవితాభిమానులకును పద కవితపై కొంత ఈసడింపును కూడ సామాజిక పరిణామముతో సంభవించినవేను. ఈ పరిణామములో భాషాసాహిత్య పరిణామ పరిశీలకుల పౌర్వాపర్యవిచక్షణలో ఏ భాషలోనైనా పదకవితయే ముందు పుట్టుననియు, పద్యకవిత దానికి తరువాతి తోబుట్టువనియు సిద్ధాంతీకరించిన వాస్తవము.

పదకవిత రాగముతో కూడినపాట. ఇందులో మొదటి దశలో చాలభాషలలో రాగాన్వితమైన గద్యమే తొలిపాట. తల్లి బిడ్డని ముద్దాడేటప్పుడు.

నా బంగారు కొండేడీ
నా వరాల పేరేడీ
నా మొహిరీల దండేడీ
నా పచ్చపూసల కుచ్చేడీ
నా అప్పుడు గాచిన వెన్నేదీ—ఇత్యాదిగా ముద్దులొలికే

గద్యఖండాలలో తల్లి రాగంతో కూడిన పాట (పదం) పుట్టుతోంది. ఇందులో లయ పాము మెలికలలాగ సాగును. అస్పష్టంగా ఆత్మీయుల కోసం శోకించేవారు, వారిగుణగణాలను వర్ణిస్తూ రాగాలుతీస్తూ, పద్యగణాలకు దొరకని గద్యఖండాలలో వాపోవడం గ్రామాలలో విని ఉంటాము. ఆ వాపోతలలోకూడా పాట (పదం) పుట్టుతోంది. ఇట్టి పదాలలోకూడా లయ అస్పష్టము రాగం ఉత్కటంగా ఉంటుంది.

పదకవితలో తొలిదశ అంతర్లీనమయిన లయతోగాని, లయ లేకుండాగాని పాడుకొనే గద్యప్రబంధం. ఇక్కడ ప్రబంధం అనే పదము తెలుగు సాహిత్య చరిత్రలోని వర్ణనలతోకూడిన పద్యకావ్యమని కాక, సంగీత శాస్త్రజ్ఞులు సంగీత చారిత్రకులు నిర్వచించు పాడుకొనుట కనువయిన సాహిత్యబంధముగా తెలిసికోవలెను. సంగీత ప్రబంధములను గూర్చి చెప్పిన లక్షణ గ్రంథములన్నీ దాదాపు సంస్కృతములోనే ఉండినవి. వాటి అన్నిటిలోను భరతుని నాట్య శాస్త్రము మొట్టమొదటిది. నాట్యశాస్త్రము ప్రధానముగా నాటకములను, (రూపకములను) రంగస్థలమును, నృత్యమును అభినయమును గురించి విపులముగా వివరించి ఒకటి రెండధ్యాయ ములు సంగీతమునుగూర్చి చెప్పినది. ప్రబంధాధ్యాయములో గద్యప్రబంధ ప్రశంస కలదు. చూర్ణము లేక గద్యము :—

"వృత్తబద్ధము కానిదియు అక్షరసంఖ్యా నియమముకాని, గురులఘు నివేశనియమము కాని లేనిదియు అర్థాపేక్షగల (రసములను అభివ్యక్తముచేసెడి) అక్షరములకూర్పు కలిగినదియును చూర్ణపద" మనబడును. అన్నమాచార్యులకు రెండువందలేండ్లకుముందు సింహాచలమున వెలసిన భక్తయోగి కృష్ణమాచార్యుడు ఈ చూర్ణపద లక్షణము ననుసరించే సింహగిరి నరహరి వచనములను సింహాచలస్వామి కంకితముగా రచించినాడు. ఈయన పాల్కురికి సోమనాథునికి సమకాలికుడు.

పదకవితలో మలిదశ లయాత్మకమై రాగబంధముతో కూడిన గేయము. ఇదికూడ పద్యకవితకంటె ముందరిదశయే! ఎందుకంటే పదకవితలోని భాషాబంధమునకు పాండిత్యమూ వ్యుత్పన్నతా అవశ్యకముకాదు. సామాన్య మానవుని సహజావేశమున పుట్టినది పదకవిత. సాహిత్య పరిణామములో ఛందః పరిపక్వము, అక్షరములలెక్క గణనకువచ్చిన దశలో పద్య కవిత బయలుదేరుతుంది. ద్విపదభారతమునకు తాము వ్రాసిన పీఠికలో శ్రీ పింగళి గురుపాదు లేమన్నారో చదవండి :

"ఏ వాఙ్మయములోనైనను ఈ పదకవిత్వమే పద్యకవిత్వము కంటె ముందుపుట్టి పెరుగును. కాని ఛందోవ్యాకరణాదినియమనిష్కర్షతయు, శైలీప్రౌఢియు, ఇతివృత్తో దారతయు, విజ్ఞానాధాయకతయులోనగు నితర కవితా మహాంగముల సంతరించుకొని, నాగరకమై పద్యకవిత్వము ప్రౌఢసాహిత్యమను పేర విద్వల్లోకమున స్థిరప్రతిష్ఠ సంపాదించు కొనును. పదకవిత్వము ఎంత నిసర్గమధురమయినను నిరాడంబరమయినను, ప్రౌఢవాఙ్మయమున స్థానమాసింపక, గాలిలోనేపుట్టి, గాలిలోనే సంచరించుచు పుట్టుకదార్ఢ్యమువలన కొంతకాలము సజీవమైయుండును. ఇదియే మనలో శుద్ధదేశికవిత్వ మనిపించుకొన్నశాఖ. దీనికిని సారస్వత ప్రతిష్ఠ సంపాదించి స్థిరత్వము నెలకొల్పుటకై పలు విధముల పాటుపడిన సంస్కర్తలే ద్విపద కావ్యకర్తలు.

... ... ... ఈ వాఙ్మయమునకు మూలపురుషుడు పాల్కురికి సోమనాథుడు. పద్యకావ్య పథము దిద్ది తీర్చుటలో నన్నయ యెట్టి ప్రథమాచార్యుడో ద్విపదకావ్యపథమును దిద్ది తీర్చుటలో సోమనాథు డట్టి యాచార్యుడు"

భాషాసారస్వతములు - దేశియను వ్యాసమున శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు "(సోమనాథాది) శివకవులు......అవలంబించిన పద్ధతులు, వ్రాసిన వ్రాతలు పూర్వము నుండియు వచ్చుచుండిన ప్రాచీనాంధ్ర కవితారీతులను సంప్రదాయములనే కొంతవరకైన సూచించుచున్న వనక తప్పదు, ...... సోమనాథుని రచనలనుబట్టి...... పురాణ కవితా మార్గమునుగాక సర్వసామాన్యమగు జానుదెనుగున దేశీయమగు ద్విపద కవితారచన ననుసరించిన వాడగుట చేతను నాతనిచే పేర్కొనబడిన కవితారీతులు కావ్యభేదములు మున్నగునవి నన్నయ్య కవితా పద్ధతికంటె ప్రాచీనములును భిన్నములునగు పురాతనాంధ్రదేశ కవితారీతులే యని మనము తలవవచ్చును."

పాల్కురికి సోమన తన పండితారాధ్య చరిత్రమున పండితారాధ్యుడు — పంచగద్దెలు' బసవగీతలు, శంకరగీతభాస్వత్ప్రదావళి, ఆనందగీతములు మున్నగు గీత రచనలతో శివుని స్తుతించెనని వ్రాసెను పాల్కురికి సోముడే బసవేశ్వరునిమీద నాలుగైదు రకములు గద్యలను రచించెను. ఇవి యన్నీ తాళగంధులు. అంటే కృష్ణమాచార్యుని గద్యలవలె చూర్ణములు కావన్నమాట.

పండితారాధ్యుడు వెలనాటి చోడ దనురాజు పిలుపున ఒక బౌద్ధగురువుతో వివాదమునకై రాజసభకు పోవునప్పుడతనివెంట శిష్యులూ భక్తులూ

"పదములు తుమ్మెద పదములు ప్రభాత
పదములు, శంకరపదముల్, నివాళి
పదయులు, వెన్నెలపదములు, సంజ
వర్ణన, మరిగణవర్ణన పదములు
పాడుచు, నాడుచు" పోయిరట.

అంతేకాక, శ్రీశైలమున శివరాత్రికి మల్లికార్జున భక్తులు అరువత్తుమూవురు నాయన్మారుల (శివభక్తుల) చరితములను 'ఏలలు' వెట్టుచు పాడిరట. ఇంకను యక్షవిద్యాధరాదుల వేషములు ధరించి బహురూపవముల నాడేవారు. అట్టి పాటలతో కూడిన ఆటలే యక్షగానములైనవి. "ఇందలి (యక్షగానములందలి) దేశీయచ్ఛందో రచనా భేదము లనేకము లిప్పటికిని పామర జనులు, ముసలమ్మలు పాడుకొను పాటలలో నిలిచియుండుటచే నివి ప్రాఙ్నన్నపార్య యుగము నుండియు మనకు సంక్రమించిన దేశీయాంధ్ర కవితావైభవమే యని గ్రహింపవలసియున్నది. ఈ పదములు, పాటలు, గీతములు, మొదలగునవే ఆంధ్రభాషాసారస్వత మహావృక్షమునకు తల్లి వేళ్ళు!"

[కోరాడ]

అంతేకాక సోమనాథుడు కోలాటపు పాటలు, చాగుభళాలు, చప్పట్లుపెట్టి గునిసియాడు గొబ్బిపాటలు, 'జోసరచు' నప్పుడు పాడు జోలపాటలు ఇటువంటి పాటలను, వీధినాటకములు, బహురూపములు మున్నగు ఆటపాటలను వర్ణించడమే కాక సోమన తన కాలమునాటి ఆంధ్రదేశమున ప్రవర్తిల్లిన సంగీత శాస్త్రమునకు సంబంధించిన రాగములు శ్రుతులు, ఠాయములు, సాళగతాళగతులు, అళతులు మున్నగు దేశిసంగీత రీతులను వివరించినాడు.

సోమనాథున కించుక పూర్వుడైన నన్నిచోడుడు పేర్కొన్న దేశిగేయాలలో అంకమాలికలు, గౌడుగీతములు, దంపుడుపాటలు, ఊయలపాటలు, అళతులు ముఖ్యమైనవి.

దేశి కవితా మార్గదర్శులైన సోమనాథ నన్నెచోడుల నాటి దేశీయ గేయసంపదను స్మరించిన వెనుక ఆదికవియై చాళుక్య చక్రవర్తి యానతి చొప్పున ఆంధ్రావళి మోదముం బొరయ భారతామ్నాయమును మన కందించిన నన్నయ భట్టారకునకు ఈ దేశీయగేయ భాండారముపై ఎట్టి యాదరముండెనో తెలిసికొనుట అప్రస్తుతముకాదు. నన్నయకు ముందు చాళుక్యరాజుల శాసనములలో లభించిన సాక్ష్యమునుబట్టి 5వ శతాబ్ద శాసనమున ద్విపదయు, తరువోజయు, ఆరవశతాబ్ద శాసనమున ద్విరదగతిరగడ, 9వ శతాబ్దమున సీసపద్యము, ఆ వెంటనే యుద్ధమల్లుని శాసనమున మధ్యాక్కర – ఇవియన్ని జాతీయములైన దేశి తెలుగు గేయచ్ఛందములే అని స్పష్టపడినది. నన్నయ భట్టారకుడు తనకాలమున రాజాస్థానము లందును పండిత పరిషత్తులందును గల సంస్కృత భాషాప్రాభవమును బట్టి తన భారతాంధ్రీ కరణమున గల సంస్కృత వృత్తములను శార్దూల మత్తేభ చంపకోత్పల మాలాదికములను తెలుగు పద్యములుగా అవతరింపజేసియు, సీసములను, తేటగీతి, అటవెలదులను, తరువోజలను అక్కరలను కందములను సందర్భానుసారముగా సంస్కృతచ్ఛందో రూపాలతోపాటు పడుగు పేకగా ప్రయోగించినాడు. ఈ తెలుగు దేశిచ్ఛందములన్నీ కూడా గేయములుగా పాడదగినవే అవిన్నీ, వాటికి నన్నయ భట్టారకుడు పద్యగౌరమునిచ్చి పండిత పరిషత్తులలో వాటికి స్థానము కల్పించి వాటి గేయత్వములోని సహజ లయను కొంతవరకు పరిమితము చేసినాడు. కర్ణాటక దేశమున నేటికిని సాగుచుండు గమక సంప్రదాయ కావ్యగానములు. మన దేశములోని పౌరాణిక సంప్రదాయకావ్య గానములు ఆనాటినుండి అనూచానముగా వస్తూండినవే కావడంచేత తెలుగు పద్యమునకు రాగయుక్తముగా పాడే సంప్రదాయం ఏర్పడింది. అయితే చాళుక్య రాజసభలో మంత్రి పురోహిత పండిత పౌరాణికులతోపాటు ప్రథమ పంక్తిలోగాక, వైణికగాయకులకు నర్తకులకు వంది మాగధులతో పాటును నటవిటాదులతోపాటును ఐదారుశ్రేణుల కవతలనే గౌరవస్థానము. పద్యకవితతో పోల్చినపుడు గేయకవిత గౌరవం కూడా ఆనాడు అంతమాత్రమే. ఈ విషయము నేనొక సభలో చెప్పినపుడు శ్రోతలలోనుండి ఆరుద్రగారు రాజరాజనరేంద్రుడు చెల్లవ్వ అనే గాయక నర్తకీ మణిని గౌరవించి యిచ్చిన దానశాసన మున్నట్లు చెప్పినారు. అయినా ఆమెకు నన్నయాదులతో ముందరి ఏక పంక్తి లేదనీ, నన్నయాదులను దర్శించినప్పటి మడి వేషముతో కాక రాజామెను వేరు శృంగారవేషముతో కలిసికొనియుండుననీ చెప్పినాను.

కాకతీయుల పాలనాకాలంలోను, రెడ్డిరాజుల పాలనాకాలంలోను ద్విపదకావ్యముల రూపమున దేశికవితోద్యమముతోపాటు దేశి సంగీత నృత్యరీతుల పునరుజ్జీవమునకు దోహదము జరిగినది. జాయపసేనాని గణపతిదేవుని కొలువులో గజసైన్యాధ్యక్షుడయ్యి నృత్తరత్నావళి, గీత రత్నావళి గ్రంథాలను సంస్కృతములో వ్రాసినను వానిలో దేశినృత్య సంగీతములకే విపులముగ లక్షణము చెప్పినాడు. ఆ తరువాత రెడ్డిరాజులలో కుమారగిరి, పెదకోమటి వేముడు, వెలమరాజులలో సర్వజ్ఞ సింగమనీడు ఆ దోహదమును తమలక్షణ గ్రంథములద్వారాను, భరత, శార్ఙ్గదేవుల ప్రాచీన లక్షణ గ్రంథాలకు వ్యాఖ్యానములద్వారాను ఇతోధికము చేసినారు.

క్రీ.శ॥ 5, 6 శతాబ్దులవరకు రాజాదరము, ప్రజాదరమునుపొందిన జైనబౌద్ధములు, కొన్ని నైతిక దౌర్బల్యములకు లోనయి అచార్యత్రయము (శంకర రామానుజ మధ్వాచార్యులు) వల్లభాచార్యులు మున్నగువారివల్ల శైవవైష్ణవ (ద్వైతాద్వైత) ప్రాదుర్భావరూపేణ వైదికోప నిషద్రూపమైన సనాతనధర్మము తిరిగి పాదుకొన నారంభించినది. ప్రాచీన దేవాలయముల పునరుద్ధరణము, నూతన దేవాలయ నిర్మాణములు కొనసాగినవి. రాజపోషణము, ప్రజల భక్తి శ్రద్ధలను చూరకొన్న ప్రసిద్ధక్షేత్రములలో శ్రీశైలము, దక్షారామము మున్నగు పంచారామ శైవక్షేత్రములు, తిరుపతి, మంగళగిరి, అహోబిలము, సింహాచలము, శ్రీకూర్మము మున్నగు వైష్ణవక్షేత్రములు శివ విష్ణు భక్తితత్వసిద్ధాంతముల ప్రచారమునకు పట్టుగొమ్మలయినవి.

ఈ యుగములో భారతదేశమును ముంచెత్తిన భక్తిప్రవాహాపు మొదటితళ్లు ద్రావిడ దేశమందలి ఆళ్వారులను వైష్ణవభక్తులయు, నాయన్మారులను శివభక్తులయు భక్తిగీతములద్వారా ప్రసరించినది. మద్రాసులోని మైలాపురమునందు కపాలీశ్వరుని కోవెలలో ఏటేటా జరుగు అరవత్తుమూవరతిరునాళ్లు పాల్కురికి సోమన బసవపురాణమున చెప్పిన అరువదిమూవురు శివ భక్తులను గూర్చినదే. నమ్మాళ్వార్, పెరియాళ్వార్, తొండరడిప్పొడియాళ్వారు గోదాదేవి లేక ఆండాళ్ అను పన్నిద్దరాళ్వారుల వైష్ణవభక్తి ప్రవాహము రామానుజాచార్యుల చక్రాంకిత దిగ్విజయ యాత్రతోసహా మన ఆంధ్రదేశమునుకూడ ముంచెత్తినది. సింహగిరి నరహరి వచనములను పాడిన కృష్ణమాచార్యులు యతిరాజ రామానుజులకు ఇంచుమించు సమకాలికుడైన లేదా ఆప్రభావమునకు ఒకటి ఇన్నూరేండ్ల లోపున లోనయిన వాడిని సూచించు ఐతిహ్యాము లుండినవి. ఆచార్యత్రయము తమ భక్తితత్త్వ ప్రచారమును ప్రధానముగా తమ సంస్కృత రచనల ద్వారాను, పైగా ద్రావిడప్రబంధముల (నాలాయిరం) ద్వారాను సాగించిరి.

పశ్చిమ చాళుక్యరాజులలో సోమేశ్వరుడు మున్నగువారు రాజకుమారుల విద్యా పరిణతికొరకు వ్రాసిన సంస్కృతగ్రంథాలలో, ఏలలు, ధవళములు, చర్చరులు (జాజరులు) చిందులు, ఏకతాళములు, శరభలీలలు మొదలగు దేశిరచనలను గూర్చి చెప్పినారు. అయితే వీర మాహేశ్వరులయిన బసవేశ్వరుడు, అక్కమహాదేవి, లోకసంగ్రహమునకు చెప్పినవి, భక్తి పారవశ్యముతో భగవంతునియెడల సతిపతిభావముతో చెప్పినవి అయిన వ[illegible] ప్రచారముతోపాటు ఆంధ్రదేశభక్తకవులనుగూడ ప్రభావితము చేసినవి కన్నడ [illegible]యకారులలో



శివగేయ తత్పరుడైన నిజగుణ శివయోగి, మధ్వయోగియైన శ్రీపాదరాయలు మన అన్నమా చార్యులకు కించిత్పూర్వులు.

రాధాకృష్ణ ప్రేమతత్త్వమును సంగీత నృత్యముల కవలంబనీయమైన సంపూర్ణ గేయకావ్యముగా రచించి, పూరీజగన్నాథ దేవాలయము, శ్రీకూర్మవిష్ణ్వాలయములు కేంద్రములుగా ఉత్కల వంగ మిధిలదేశములనేకాక. దక్షిణమున ఆంధ్రమునుండి కేరళరాజ్యము వరకు ప్రభావితము చేసిన భక్తయోగి, నాయికానాయక భావవిభావానుభవముల అతిరమ్యచిత్రణకు అత్యంత ప్రామాణికుడుగా అలంకారికులచే మెప్పుగొన్న సంస్కృతకవి జయదేవుడు నన్నయ భట్టారకునకు ఇంచుమించు సమకాలికుడు. భాగవతపురాణమందలి కృష్ణగోపీ ప్రణయతత్త్వ ప్రచారము రామానుజాచార్యులతోగాని, కొంచమటో ఇటో గాని, తొలుత ఆంధ్రదేశీయుడే అయిన వల్లభాచార్యునిద్వారా ఉత్తరభారత దేశమును ప్రభావితముచేసి, మధుర, బృందావన, ద్వారకలకు పుణ్యక్షేత్రములుగా ప్రాముఖ్యమిచ్చినది. వ్రజభాషలో (హిందీ) కృష్ణభక్తి యాలంబనముగా కొన్నివందల కీర్తనములు రచించి, తన గేయములను గానము చేయునపుడు బాలకృష్ణుని దివ్యసుందర విగ్రహము నర్తించుచుండినట్లు ప్రసిద్ధిని పొందిన మహాభక్తుడు సూర్‌దాసునకు దీక్షనిచ్చిన గురువు వల్లభాచార్యులే! ఈయన ప్రాయశః అన్నమాచార్యులకు అర్ధమము ఏబది ఏండ్లు అద్యతనుడే! జన్మతః ఆంధ్రదేశీయుడైన వల్లభాచార్యుడు ఉత్తరాదిని అందును గుజరాతులో ఆచార్యపీఠము స్థాపించినాడు. ఈనాటికి ఈ పీఠమునకు చెందిన గురువులు తెలుగుదేశము నుండియే వధువుల నేరికొందురు. వారికి వివాహము వర్జితము కాదు. లీలాశుకుడుగాను బిల్వమంగళుడుగాను (ఆంధ్రదేశమున చింతామణి వేశ్యనుగూర్చిన నాటకములో) ప్రఖ్యాతుడైన భక్తయోగి కూడ ఉత్కల మహారాష్ట్రములను ఆంధ్ర కర్ణాటకములను దక్షిణమున కేరళవరకును ఈ భక్తుడు మా దేశీయుడే అనిపించునంతటి మహిమాన్వితుడైనవాడు, ఆయన శ్లోకమొకటి :

యం శైవాస్సముపాసతే శివ ఇతి బ్రహ్మేతి వేదాంతినో
బౌద్ధాబుద్ధ ఇతి ప్రమాణపటవః కర్తేతి నైయాయికాః!
అర్హన్నిత్యథ జైనశాసనరతాః కర్మేతి మీమాంసకాః
సోఽయం నో విదధాతు వాంఛితఫలం శ్రీదేవకీనందనః॥

క్రీస్తుశకాదిలోనో కించిత్పూర్వమో ప్రతిష్ఠాపన పొంది. ద్రావిడ దేశపు తొల్కాప్పియం, సంగమకాలకవుల స్తుతులనుపొంది పొయిగైయాళ్వారుచేతను, పేయాళ్వారు చేతను హరిహరమూర్తిగను, కొందరితర భక్తులచేత ఇళంగుమరగన్‌గాను కీర్తితుడై, విశిష్టా ద్వైతాచార్యుడైన రామానుజాచార్యులచేత శ్రీమహావిష్ణు ప్రతిమూర్తిగా ప్రకటితుడైన తిరుమల శ్రీనివాసు వేంకటేశ్వరుడుపై బిల్వమంగళసంస్తుతికి నాటినుండి నేటివరకును అక్షరాలా సాక్షీభూతుడు.

నారాయణసూరి అక్కమాంబలకు ఆ దేవుని వరప్రసాదమున జన్మించిన మన అన్నమయ్య కూడా తన పదునారవయేట తిరుమలను చేరుకొని స్వామికి సంకీర్తనల ద్వారా కైంకర్యముచేయ నారంభించిన తొలిదశలో చెప్పిన ఒక సంకీర్తనయందు ఇట్టి సంభావనమే కన్పించును.

ఎంతమాత్రమున నెవ్వరుదలిచిన నంతమాత్రమే నీవు
అంతరాంతరములెంచే చూడ పిండంతె నిప్పటియన్నట్లు ॥
కొలుతురు మిమువైష్ణవులు కూరిమితో విష్ణుండని
పలుకుదురు మిము వేదాంతులు పరబ్రహ్మమనుచు ॥
తలతురు మిము శైవులు తగిన భక్తులను శివుడనుచు
అలరి పొగడుదురు కాపాలికులాది భైరవుడనుచు ॥
సరినెన్నుదురు శాక్తేయులు శక్తిరూపు నీవనుచు
దరిసెనముల మిము నానా విధులను తలపులకొలదుల భరింతురు
శ్రీ వేంకటాపతి నీవైతే చేకొనిఉన్న దైవమని
ఈవలనే నీ శరణనియెద నిదియే పరతత్వముకు ॥

అన్నమాచార్యులకు సంస్కృతాంధ్రములలో పండితుడైన తండ్రి నారాయణసూరి నుండి ఉభయభాషలలోను తగినంత వాల్లభ్యము లభించెనని ఆయన రచించిన తొలి సంకీర్తనములే చాటగలవు. సంస్కృతములోనను, ఆంధ్రములోనను కావ్యములు ధారాళముగా చెప్పగల శక్తి కూడ ఆ వరప్రసాదికి కలిగినట్లు ఆయన కర్తృత్వమున వెలువడిన శతకములు-ఇత్యాది గ్రంథములనుబట్టి స్పష్టము. ఆయన సంకీర్తన రచనములే తన జీవితక్రియాకలాపముగా స్వీకరించుటకు పనిచేసిన కారణములను ఉద్బోధకములను తెలియవలెనంటే అతడు షోడశవర్ష వర్ధమానుడగుచుండునాటి సాహిత్యసంగీత వ్యాసంగములెట్టివో పరిశీలింపదగును.

ఆ నాటికి సంగమరాజులలో ఇమ్మడి దేవరాయల ఆస్థానము సంస్కృతాంధ్ర కర్నాటక ద్రావిడ కవిపండితులతోడను రాయబయకారులతోడను పాండిత్యస్పర్ధలతోను ప్రఖ్యాతమైయుండెను. రెడ్డిరాజుల విద్యాధికారియైన శ్రీనాథకవిరాజు కవితాపాండిత్య ప్రదర్శనముచేసి, అరుణగిరినాథడిండిముడను దాక్షిణాత్యసంస్కృత పండితునోడించి, కవిసార్వభౌమబిరుదమును, దీనారటంకాల కనకాభిషేకమును పొందినది అన్నమయ్యా పదునారేండ్ల వయసుననుండగా! అంతకు ఒక దశాబ్దము ముందు జరిగిన గాథగా చెప్పుకొనదగినది. రాయబకారుడును, శార్ఙ్గదేవుని సంగీతరత్నాకరమునకు కళానిధియను వ్యాఖ్యానము రచించిన చతురకల్లినాథపండితుడు ఇమ్మడి దేవరాయని ఆస్థానవిద్వాంసుడే రాజసభలలో సంగీతవిద్యా ప్రదర్శనములలో రసహీనములు, రాజస్తుతులు అర్థహీనములైన తేనకపాటకములతో (తరానా తిల్లానాలవలె) కూడిన ధ్రువపదగానసులలో (నేటి రాగం తానం పల్లవి వ్పటివి)

స్పర్ధలు జరుగుచుండెడివి. లక్షణగ్రంథములు సంస్కృతములోనే రచించిరి. వాటి లక్ష్యములు సంస్కృతభాషలో ఉండినవే గౌరవబహుమానపాత్రములు. తత్సమకాలికుడైన రాచకొండ వెలమరాజు స్వరజ్ఞసింగమనీడు రసార్ణవసుధాకరమను అలంకారగ్రంథమును శార్ఙ్గదేవుని సంగీత రత్నాకరమునకు సుధానిధియను వ్యాఖ్యానమును రత్నపాంచాలికయను నాటకమును సంస్కృతముననే రచించెను. శ్రీనాథుడారాజు సన్మానమునుకూడ పొందినవాడు. చాటువులలో ద్విపదకవితను ఒకచోట దూషించిన శ్రీనాథుడే రాజపోషణ కోల్పోయిన వెనుక పల్నాటి వీరచరిత ద్విపదలో వ్రాసి దేశీనాయకులకు గురువైనాడు. రెడ్డిరాజులుగాని, వెలమరాజులు గాని, విజయనగరరాజులుగాని వసంతోత్సవములు జరుపుచుండినట్లు వారి కంకితములైన ప్రబంధములలో మనకు కనబడును. వాటిలో పేరణి. గొండ్లి, కోలాటము, గొబ్బి, చిందువంటి దేశినృత్యగానములు ప్రదర్శితములయ్యేవి.

దైవక్షేత్రములలో బ్రహ్మోత్సవములు, వసంతోత్సవముల వంటిని, నిత్యోత్సవములు జరుగుట ఆనాడు నిత్యకృత్యముగానుండెను.

రాజాస్థానము లాధారముగా రాజనర్తకులు, దేవాలయములనంటిపెట్టుకొని దేవదాసీ నర్తకులు అక్కడా ఇక్కడా ఆయా ఉత్సవాలలో రాజులకు, పండితులకు ఆదరపాత్రము లయిన సంస్కృత రచనలతో రాజాస్థానములందును, ఊరును పేరునులేని దేశికవుల గేయ రచనలను దేవోత్సవాలందును, జాతరలందును ప్రదర్శించేవారు. రాజాస్థానములందలి రచనలలో అందరకు అర్థముకాని సంస్కృతమో లేదా, ఏ ఇతివృత్తమును లేక రాజస్తుతి బిరుదముతోకూడిన సలాము, పరాకుశబ్దములవంటి ఢేంకీ, ఝోంబడ, ప్రబంధములు ప్రదర్శించెడివారు. రాజనర్తకులను దేవదాసీలను వదలివేసి, తమ నటబృందము నిస్త్రీకముగా నుండవలెననియు, స్త్రీపాత్రములనుకూడ పురుషులే ధరింపవలెననియు నిర్దేశించి, యక్షగానముల ద్వారా శృంగార, భక్తిరసముల పోషించు ప్రదర్శనములద్వారా కృష్ణభక్తి ప్రచారము చేసిన వారిలో కూచిపూడివారి గురువైన సిద్ధేంద్రయోగియు, ఆయనకు గురువుకాని, శిష్యుడుగాని లేదా ఆయనతో అనన్యుడుగాని అయి ఉండునని నేను ఊహించిన కృష్ణలీలాతరంగిణీ సంస్కృత యక్షగానకర్త శ్రీ శివనారాయణతీర్థులూ, ఆయన దక్షిణమున తంజావూరుకు వలసపోయిన వెనుక ఆయన మార్గమునే అనుసరించి తెలుగు యక్షగానములు రచించి ప్రదర్శించుచు నేటికిని వారసులనుగన్న మేలటూరి భాగవతులును అతి ముఖ్యులని చెప్పవలెను.

అమేయమూ అపూర్వమూ అయిన సర్జనశక్తి, కళాశిల్పదృష్టి, రసభావస్పందన కలిగిన మన అన్నమయ్య తల్లి ఉగ్గుపెట్టిననాడు బాలకునిగా తన్నలరించిన దేశిపాటలలోను తాళ్ళపాక, ఊరుటూరు, మండెముపల్లి మున్నగు గ్రామములలోని జాతరలలో పల్లెటూరి జనము ప్రదర్శించు బయలాటలలోను యక్షగానములలోను తాను విన్న దేశిగేయరీతులలోను ఎంతయో కొలలేని తీపి తోచినది. ఆ తీపి అక్షరబద్ధము చేయుటకే తాను వరప్రసాదియై జన్మించినట్లు చిన్ననాడే తనకే తెలియని ఒక ఆవేశము పూనియుండెను. ఆ విధముగా తాను తన చుట్టూ

వినబడుచుండెడి రాగములలో తాళగతులలో ఆ దేశిగేయ రీతులలో పాటలను కూనిరాగములలో పాడుకొనమొదలిడినాడు. తల్లిదండ్రులును, అన్నవదినెలును తనకు బెత్తాయించిన ఇంటిపనులు పొలముపనులు ఆ కూనిరాగములకు ప్రతిబంధకములుగా ఉండేవి ఎందుకని? అవి వట్టి కూనిరాగములు కావు తమ ఇలవేలుపైన వేంకటేశ్వరునిపై (త్యాగయ్యకు వలెనే) తల్లిపూజా మందిర సన్నివేశములలోనే తనలో అంకురారోపణ జరిగిన భక్తి బీజములు నానాటికి దోహదము చెందినవి. ఒకనాడు ఇంటివారి పశువులను వదలిపెట్టి తిరుపతి కొండకు ఆయనను అశరీర శక్తివలె లాగుకొనిపోయినది. సెలయేరుగా ప్రారంభించిన సంకీర్తన రచన నదియై, మహా నదియై, వెల్లువయై విస్తృత జలపాతముగా వర్ధిల్లినది ఆయనను సంకీర్తన పితామహునిగా చేసినది.

ఇట్టి సంకీర్తనములు కోవెల తోటలోను, రాజు కొలువులోను ఇదివరకు ఎవ్వరూ పాడలేదు. ఇవి దేశీయులైన ప్రజల మాతృభాషలోనివి. పరసలలోను, తిరునాళ్ళలోను, వినబడే పాటలలో కనబడే శిల్పలోపముగాని, భాషా దౌర్బల్యముగాని చౌకబారుతనముగాని వీనిలో లేదు. ఇవి పల్లీజనమునకును, పట్టణవాసులకునుకూడా, కోవెలతైర్థికులకూ, రాజసభాసదులకు కూడ పండితపామరుల కిరువురకును తమ సొంత కానాచియనే భావమును కలిగించి మెప్పు పొందవలెనంటే వీటికొక లక్షణము తయారుచేయవలెను. పండితులౌనని తలల నూపుటకును, తదితరులు ఆ విధమైన కళాసృష్టి ననుసరించుటకును లక్షణమును చేయవలెను. అది భరతుడు మొదలుకొని, మతంగుడు మున్నగు ఆయా యుగముల సంగీతలక్షణ కర్తలు పాట లేక పదము లేక గీతి ఏల అనుచానికి ఏ విధముగా లక్షణము చెప్పిరో అదే విధమున చెప్పవలెను. సంస్కృతమునైన, ప్రాకృతమునైన, దేశభాషనైన పదము రచింపవచ్చునని దానికి రాజాస్థానములలో సాహిత్య గౌరవమూ సంగీత సభామర్యాదా, ఆలయములలో, తిరునాళ్ళలో దైవపూజార్హతా సంకీర్తన ప్రశస్తి అప్పుడుగాని లభింపదు - అనితోచి అన్నమాచార్యుడు సంస్కృతమున సంకీర్తన లక్షణము రచించెను. ఇప్పుడు మనకు ఈ గ్రంథము లభింపకపోయినను ఆయన మనుమడు చినతిరుమలయ్య చేసిన ఆంధ్రీకరణముద్వారా ఆయన చెప్పినదంతయు మనకు దొరుకుచున్నది.

సాహిత్యపరులయిన ఛందో గ్రంథకర్తలు లక్షణము చెప్పిన రగడలు, ద్విపదలు, షట్పదులువంటి దేశి చ్ఛందోరీతులలోని మాత్రాగణముల లెక్కలతో కూర్పుతో అన్నమయ్య గేయముల ఛందో విశిష్టతను కొలవ యత్నించి లాభములేదు. తన నాటికి ప్రచారములో నుండిన (పామరజన వ్యవహారములోని) గేయ రీతులను, సాహిత్యపరుల ఛందోరీతులను మించి పోయిసాగినది – ఆయన గేయ ఫణితుల సృష్టి. పంక్తియంతయు అక్షరములతో నిండిన రగడల కంటె - అన్నమయ్య గేయములలోని గానానుకూలతయు శబ్దగుచ్ఛముల నడుమ రాగానుకూల

నాట్యశాలలో దేశిపద్ధతిని గానముచేసే 'సొుగవరి' అను ఏకధాతు ప్రబంధమును గురించి అన్నమయ్య సంకీర్తన లక్షణమున చెప్పినాడు. పాటలో రెండు పంక్తులో నాలుగో ఎనిమిదో పంక్తుల సాహిత్యముండి, ఆ ఒక్కొక్క పంక్తినీ ఒకే రాగవరుసలో పాడే గేయం ఏకధాతు ప్రబంధం. అటులే ద్విధాతు ప్రబంధం రెండు పంక్తుల సాహిత్యంలో ఒక పంక్తిలో రాగం ఆరోహిగా సాగితే రెండో పంక్తిలో అవరోహిగా పూర్తి అవుతుంది. త్రిధాతు ప్రబంధములోని పల్లవిలోని ఒక విన్యాసముతోసాగి అనుపల్లవికి తద్భిన్నముగాను, చరణము అను మరి రెండు పంక్తుల సాహిత్యమునకు రాగవరుస ఆ రెండు విన్యాసముల కలగలుపుగాసాగి పల్లవితో తిరిగి తిరిగి ముగింప వీలుగానుండును. ధాతువులు-రాగవిన్యాస విభాగములు మూడే అయినను మాతు నిర్మాణములో చరణములుగా సాగునవి రెండు పంక్తుల విభాగములుగా గాని, నాలుగు పంక్తుల విభాగములుగాగాని సాగుట సామాన్యము.

సంకీర్తన లక్షణములో అన్నమయ్య తెలుగు దేశిగేయముల వివిధ రీతులను గూర్చి చెప్పుచు (చినతిరుమలయ్య అనువాదమున)

> "సరగున్ వృత్తము జాతియంతయు చతుష్పాదద్విపాదాకృతిన్
> వరసంకీర్తనముల్ తదాకృతులనే వర్తించు మానంబుతో
> దరువుల్, జక్కులరేకు, ఏలలును, నిద్దంబైన గొబ్బిళ్ళు, భా
> సుర వాక్యంబులు, చందమామ పదముల్ శోభిల్లునందంబులై"

అని వ్రాసినాడు.

అంటే ఉత్సాహ, సుగంధి. మత్తకోకిల, పంచచామరము, కవిరాజ విరాజితము, క్రౌంచపదమువంటి గేయశుద్ధిగల లయాత్మక సంస్కృత వృత్తములును, కందములవంటి జాతిచ్ఛందస్సులూ సంకీర్తనముల కుపయోగ్యములనియు, అవికాక దేశితెలుగు గేయరీతులలో దరువులు, జక్కులరేకులు, ఏలలూ, గొబ్బిళ్ళూ, చందమామ పదములు మున్నగువానిని యక్షగానములలో ప్రయోగింపదగుననియు చెప్పినాడు. వీటికి రెండేసి పాదములుండవలెనని తరువాతి పద్యము చెప్పెను ;

> దరువు వ్యాఖ్యంబు, అర్ధచంద్రిక పదంబు
> ఏలపాటయు గొబ్బిళ్ళు నింపులైన
> చందమామ పదంబులు జగతి పాద
> యుగళముగ బహుజన సంప్రయుక్తి బరగు !

ఆ తరువాత ఈ గేయములలో ప్రయోగింపదగిన భాషను గురించి

పురుషోక్తి సంస్కృతంబును
తరుణీవాక్యమున ప్రాకృతము నీచవధూ
పరిభాష నితరభాషలు
పరగినక్రియ నుచితభాష పదముల చెల్లున్.

సంస్కృత నాటకాలలో పురుషులకు సంస్కృతము, స్త్రీలకు ప్రాకృతము నీచస్త్రీ పాత్రాదులకు అపభ్రంశము మొదలైన ఇతర ప్రాకృతములను వాడియుండునట్లు, యక్షగానముల లోని దరువులలోను శృంగారములతోను పురుషపాత్రలకు గ్రాంథికమును, స్త్రీపాత్రలకు మృదువైన గ్రామ్యభాషను, చెంచులు, ఎరుకులు, మొదలయిన ఆటవిక పాత్రలకు వారికి సహజ మైన మిశ్రితములయిన యాసభాషను వాడవలెనని శాసించెను. ఆయన పదాలలో పురుషు డెప్పుడూ శ్రీవేంకటేశ్వరుడే కనుక ఆయనకు గ్రాంథికమే వెంకన్నయినా తిమ్మన్నయినా కృష్ణుడైనా ఆయనయే. ఆయనతో సంవాదముచేసే గోపికలకు, చెంచెతలకు మిశ్రితమండలికాలు అలమేలుమంగా, లక్ష్మిమున్నగు స్వీయా, సామాన్య, పరకీయా నాయికలకు వారి వారి పాత్రలకుచితమైన యాసతోకూడిన జానుతెనుగు !

ఏలపదము లక్షణమిట్లు నిర్వచించెను :—

"నాయకాహ్వానపూర్వమై నయముగలిగి
మ్లేచ్ఛపరిభాషదగి రాగమిళితమైన
'యేలపాట' పదంబునా నిలజెలంగు
మహిత నాయకసంబుద్ధి మహితమగుచు"

ఇటీవల (మార్చి 78లో) శ్రీశ్రీనివాసులుశెట్టిగారి కూర్పుద్వారా ప్రకటితమయిన అన్నమయ్య సంకీర్తనల సంపుటిలోని ఒక ఏల :

మేడలెక్కి నిన్నుజూచి, కూడేననే యాసతోడ
వాడుదేరి ఉస్సురంటిరా (ఓ) వేంకటేశ
యాడనుంటివింటాకానురా !
పిక్కటిల్లు చన్నులపై, చొక్కపు నీ వుంగరము
గక్కననేనద్దుకొందురా, (ఓ) వేంకటేశ
లక్కవలె ముద్రలంటెరా !

నే నెరిగిన యేలపాటలందచ్చుముగా నిదే చందము నాయక సంబోధనమునకు 'ఓ' చేర్చినా పాటకు అందమే.

అన్నమయ్యకాని, ఆయన కుమారుడు పెదతిరుమలయ్యకాని, మనుమడు చిన తిరుమలయ్యకాని శృంగార సంకీర్తనములు, అధ్యాత్మ సంకీర్తనములతోపాటు ఇతర గ్రంథములు కూడా—పద్యకావ్యములను ద్విపదకావ్యములను రచించిరి. వీరి అధ్యాత్మపదములకు వైరాగ్య పదములను వ్యవహారముండినను వీరు జీవితమునుండి 'పోయిదొలగిపొయ్యే' వైరాగ్యమునూ సన్న్యాసమును స్వీకరింపలేదు. బోధింపనూలేదు. వీరి శృంగార సంకీర్తనములు కేవలూహాజనిత ములుగాగాని, అలంకారసూత్రలక్ష్యప్రాయములు మాత్రముగాగాని తీసికొనరాదు. అన్నమా చార్యునే తీసుకొని పరిశీలింతము. ఆయనకు పదునారేండ్లు దాటిన వెంటనే భక్తిలోను సంకీర్తన పరతలోను నితడే తోవపట్టిపోవునో అను భయముచేతనో ఏమో అక్కలమ్మ, తిరుమలమ్మ అను ఇద్దరక్కచెల్లెండ్రనొకేసారి పెండ్లిచేసి అయనను తోడ్తోనే దక్షిణనాయకుని చేసి వైచినారు తన తలిదండ్రులు, ఆయన సంకీర్తనపరత మొక్కవోలేదు. ఇతోధిక దోహదమే జరిగినది. అధ్యాత్మ సంకీర్తనములకంటె శృంగార సంకీర్తనములే యిసుమిక్కిలిగా ఆయన రచించుట కిది కారణము కాదనడానికి వీలుకనిపించదు. నరపతిస్తుతి తాను చేయుటయందు పరాఙ్ముఖుడేకాని అయన తన సంకీర్తనములయెడలను, శ్రీ వేంకటేశ్వరభక్తి ప్రచారము నెడలను భక్తిగౌరవములతో తన్ను గురువుగా కొలచిన సందర్భమున నరపతులస్తుతి తాను కైకొనుటయందు పరాఙ్ముఖుడు కాలేదనుటకు మొదట టంగుటూరు పాలకుడయిన సాళ్వ నరసింగరాయని గౌరవమునకు పాత్రుడయి, ఆయన భక్తిగౌరవములు పొందుటయే తారుకాణ! ఆ తరువాత పెనుగొండ పాలకుడయిన శ్రీ నరసింగరాయలన్నమాచార్యులకు రాజగురుపీఠమే ఇచ్చుటయు, తన్ను నాయకునిగా చేసి కీర్తనల రచింపుమనగా నాయన తిరస్కరించుటయు, శృంఖలాబద్ధుడగుటయు, కారాగారమున అన్నమయ్యగారి సంకీర్తన మహిమచేతనే (సంకెలబెట్టినవేళ) ఆయన శృంఖలా విముక్తుడగుటయు ఈ గాథ అంతయు ఆయన చరిత్రమున ప్రసిద్ధమయినదే కదా! సరే! రాజుకొలు వాయనకు స్వాధీనము. తానున్నచోటను, తిరిగిన క్షేత్రములందును దేవళముల కొలువులన్నియును ఆయన సంకీర్తనములకు పరవశములే కదా! ఆనాడు రాజనర్తకులకేమి, దేవదాసినులకేమి కొదువలేదే! ఆయన శృంగారసంకీర్తనలకు, సంవాదగీతులకు, ఉత్సవ సంప్రదాయకీర్తనలకు, నిత్యసంకీర్తన సేవలకు, ప్రభాతసేవనుంచి ఏకాంతసేవ వరకు వారి పదములకు సాభినయముగా నర్తనముసేయని శిష్యురాండ్రెవరైనా మిగిలియుందురా అని తోచును. తామరాకుపై నీటిబిందువులై జీవితము నంటిపెట్టుకొని యుండుటలోని ఆయన వైరాగ్యతత్త్వము కాని అధ్యాత్మతత్త్వము కాని ఇదియే! తలిదండ్రుల శృంగారమును వర్ణింతురాయని ఏ లక్ష్మీభక్తుడో విమర్శించిన విమర్శించు గాక! కాళిదాసమహాకవి నాటినుండి ఏ కవిగాని, ఏ శిల్పిగాని, ఏ కళాజీవిగాని, భారతీయుడైనగాని సనాతన శిల్పసంప్రదాయమిదే కదా. దేవాలయ శిల్పముల మాట ఏమి! భారతీయ సనాతన శిల్ప కళాసాహిత్యప్రమాణిక సంప్రదాయముల ననుసరించి అశ్లీలదుశ్శీలముల నంటని హద్దు ఇదీ అని మా సిద్ధాంతము. (This is what I call the limit of ancient Indian Permissiveness in art and literature).

గార్లపాటి లక్ష్మన్నగారి యాగంటివారి ఏలలనే యాగంటీశ్వరపదములు అన్నమయ్య పదములకు పూర్వపువని శ్రీ పాదగోపాలకృష్ణమూర్తిగారును, శ్రీ యల్లంపల్లి శరభయ్యగారును అభిప్రాయపడినారు గాని, భాషాబంధమునుబట్టి అవి సమకాలికములో ఇటీవలివో కావలెనని మా ఆంధ్రవాగ్గేయకార చరిత్రమున మేము చెప్పిన దానినే సమర్థించి, శ్రీ వేటూరి ఆనంద మూర్తిగారు ఒక కన్నడ గ్రంథమున నీ యిరువురు సమకాలికులయినట్లును, శివవైష్ణవ పారమ్యమునుగూర్చి వివాదమునకు ఢీకొనినట్లును, అందు లక్ష్మీభక్తుడే (స్వర్ణకారుడైన లక్ష్మయగారే) శివపారమ్యమును స్థాపించినట్లును ఒక శైవగ్రంథమున వ్రాసియున్నట్లు తమ పరిశీలన గ్రంథము ద్వితీయ సంపుటిలో చెప్పినారు. ఈ విధముగ ఏకపక్షనిర్ణయ మెప్పుడును పక్షపాతరహితము కాదు. చివరికి ఆ పాటలను ఈ పాటలను పరిశీలించి చేసిన మా నిర్ణయమునే మా సోదరులు ఆనందులు సమర్థించినారు.

ఈ సంకీర్తనాచార్యుడు, పదకవితామార్గదర్శి, తమ తరువాతి సంగీతసాహిత్యపరులకు నాలుగుత్రోవలు ఏర్పడినట్లు మేము మా వ్యాసములలో పలుసార్లు చెప్పినాము. ఈయన శృంగార కీర్తనఫక్కి క్షేత్రయాది పదకర్తలకు మార్గమును చదునుచేసినాడు. ఈయన అధ్యాత్మ సంకీర్తన ధోరణి అధ్యాత్మరామాయణ కీర్తనలకు, భద్రాచల రామదాస సంకీర్తనలకు, దేశములోని అసంఖ్యాకములైన దేవాలయ మూలవిరాట్టులకు నిత్యకైంకర్యమునకు గాను సంకీర్తన రచయితలగు వాగ్గేయకారులకు దారితీసినవి. ఈయన దారిచూపిన వెనుకనే. కందుకూరి రుద్రయ్య తరువాతి కవులు, తంజావూరి కవులు వీథినాటకమాత్రముగా ప్రదర్శితమగుచుండిన యక్షగానములకు సాహిత్యగౌరవము కలుగునట్లు స్వీకరించి రచింపనారంభించిరి. నాలుగవదారి లక్షణగ్రంథరచనము స్వరమేళకళానిధికర్త రామామాత్యులూ. సంగీతసుధ రచించిన గోవింద దీక్షితులూ చతుర్దండిప్రకాశికా నిర్మాత వేంకటమఖి వీరెవ్వరూ ఆ దారిని స్మరింపలేదు. ఆయన వేంకటేశ్వరుడే నాయకుడుగా స్వామికే అంకితముగా కూర్చిన రచనలలో ఎన్నివిధముల ఇతివృత్తములు ? అలంకారశాస్త్రములో చెప్పిన నాయికానాయక భేదములన్నియు కలిపినా ఈయన చూపినన్ని నాయికానాయక భేదములను, అవస్థాభేదములను పూర్తిగా కప్పినట్లేనా ?

స్త్రీపాత్రములు పాడుకొనేవి, పురుష పాత్రములు పాడుకొనేవి, సంవాదగీతలు, శిశులీలాపదాలు (బాలకృష్ణలీలలు) స్వామివారి వేరు వేరు దైనందిన సేవకులకు బ్రహ్మోత్సవ గరుడోత్సవాదులకు, ఉత్సవానంతరం, విచ్చేసినవేల్పులకు వీడ్కోలుపులు, ఎన్నో శాత్త్వికకీర్తనలు. లౌకిక వ్యవహార చర్చలు, రాజకీయ సాంఘిక విమర్శలు నీతి నియమాలు, ఏలలు. జాజరలు. వెన్నెలపదాలు, లాలిపాటలు, శోభనాలు, మేలుకొలుపులు, దంపుళ్ళు, నలుగులు, కూగూగులు, చాంగుభళాలు, తందానలు, అల్లోనేరేళ్లు అత్యాదులుగా అన్నమయ్యనోట తెలుగుపాట విశ్వరూపము తాల్చినపుడు ఆయనను మహాకవి అనుటకు వితర్కమెందుకు ?

బహమనీ రాజ్యపుసుల్తానులు విజయనగర రాజులతో కయ్యములు వియ్యములు కూడ చేసిన ఘట్టములు చరిత్రలో నడచుచుండిన రోజులవి. అందొక యుద్ధమిమ్మడిదేవరాయలపై ఒక

సుల్తాను నడిపించిన కారణము కవ్వాలీ పాడే భక్తగాయక బృందమును విజయనగర చక్రవర్తి సరిగా గౌరవించక పోవడమే. అంతకు ముందు గజనీ ఘోరీల దండయాత్రలో ఉత్తరభారత సంగీతములో కలిగిన మార్పులు దక్షిణభారతము నేమాత్రము కదపలేదని కొందరు సంగీత చరిత్ర కారులు ఊహించుకొనుటకద్దు. అల్లావుద్దీన్ ఖిల్జీసేనాని మాలిక్కాఫర్, మహమ్మద్ బిన్ (పిచ్చి) తుగ్లక్కూ, ఆ లోపమును తీర్చి, దేవగిరి మొదలయిన దక్కను రాజ్యములను, హోయిసలులను నాశము చేసాసినారు. విజయనగర సామ్రాజ్యోద్భవమే ఆ తళ్లునుండి తేరుకొనుట. ప్రతిష్ఠాపన యశస్సుపొందిన విద్యానాథుడు తన కాలమునాటి సంగీతమును జాతిమతవివక్షలేకుండా పరిశీలించి అప్పటికి ప్రయోగ సంగీతపద్ధతులనుబట్టియే తన సంగీతసారమను లక్షణ గ్రంథమును రచించెను. హెజ్జజ్జి యను పారశీక రాగము విద్యారణ్యులనాటినుండియు దక్షిణభారతమున ప్రచారముపొంది నట్టిది; అన్నమయ్యగారు వాడిన నూరు నూటయేబది రాగములలోను చేరినది.

పదకవితాపితామహుడైన అన్నమాచార్యులకు కర్నాటక సంగీత పితామహుడైన పురందరదాసులు సమకాలికుడును వయసులో కొంచెము పిన్నయును. వారిరువుర సమావేశమును గూర్చి మనుమడు తిరుమలాచార్యుడు తాను వ్రాసిన (తాతగారి) అన్నమాచార్య చరిత్రమున వర్ణించెను. ఈ తిరుమలాచార్యుడును, పురందరదాసును తోడ్పడగా అచ్యుత దేవరాయలు నేటి కర్నాటక సంగీత ప్రాథమికపాఠ సరళికి అంకురారోపణ చేసినట్లు సంగీత పరిణామ వేత్తలు ఊహింపవచ్చునని సోదరుడు ఆనందమూర్తి వ్రాసినారు.

మన సాహిత్య విమర్శకులు సామాన్యముగా గేయకవిని కవియనుటకే సంకోచింతురు. మహాకవియను టెక్కడిది. రవీంద్రనాథఠాకూరు మౌలికముగా వంగభాషలో గేయకవియే. గాయకుడు కూడను. ఆయన రచనలు కొన్ని మాత్రము ఎంచి ఆంగ్లీకరించి పంపగా వాటినిబట్టి ఆయనకు నోబెల్ బహుమతియిచ్చి విశ్వకవి పదమిచ్చినారు, ఆయన నేమాత్రము తగ్గించుటకు కాదుగాని, ఆయనకంటె ఎక్కుడుగా తెలుగుదేశపు జీవితమును, తెలుగు జీవితపు ఆట పాటలను సుఖదుఃఖాదికములను తెలుగు పడుచుల ఆశలను స్వప్నములను. వలపు ఒద్దికలను తెలుగు ప్రేమికుని శృంగార వీరత్వమును కూలంకషముగా ప్రదర్శించిన వాగ్గేయకారుడైన మహాకవి మహాగేయకవి అన్నమాచార్యుడు. అన్నమాచార్యుడు నారుపోయని తెలుగు గేయక్షేత్రమున క్షేత్రయ్య పదోద్యానముగాని, త్యాగరాజ కీర్తనాబృందావనముగాని ప్రభవించెడివికావు అంటే ఎంతమాత్రము అతిశయోక్తికాదు.

మా సోదరుడు విఖ్యాత సంగీత విద్వాంసుడు కళాప్రవీణ మంచాళ జగన్నాధరావు గత ఇరవైఐదు సంవత్సరాలుగా ఆకాశవాణి ప్రసారాలలో భక్తిరంజని, సంగీత రూపకాల్కు,

సంచికాకార్యక్రమాలు మొదలుకొని అనేక రకాలుగా అన్నమాచార్యులవారి ఆధ్యాత్మ, శృంగార సంకీర్తనలకు వరుస కట్టి ప్రచారంలోనికి తెచ్చిన కీర్తనలతోపాటు అప్పుడప్పుడు వెలువడుతున్న క్రొత్త సంపుటాలనుండి కొన్ని క్రొత్త కీర్తనలను ఏరి స్వరపరచి యివన్నీ యీ సంపుటిలో చేర్చి సర్వాంగ సుందరంగా అచ్చొత్తించగలగడం చేత అతడు అశేష సంగీతాభిమానుల, సంగీత విద్వాంసుల అమేయమైన కృతజ్ఞతకు పాత్రుడు కాగలుగుతున్నాడు అతనిని హృదయపూర్వకంగా ఆశీర్వదిస్తున్నాను.

బాలాంత్రపు రజనీకాంతరావు,

Special Officer,
SRI VENKATESWARA KALAPEETHAM
TIRUMALA TIRUPATHI DEVASTHANAM
TIRUPATHI

9, J. O. QUARTERS
TIRUPATI

# ప్రస్తావన

శ్రీ వేంకటేశ్వరునికి ప్రియభక్తులైన తాళ్ళపాక వారిని గురించి సుమారు 30 ఏండ్ల క్రిందట తొలిసారిగా విని, వారి రచనలలో గల విశేషములను తెలుసుకొన ప్రయత్నించితిని. తిరుమల తిరుపతి దేవస్థానముల వారు, తాళ్ళపాక వారి రచనలను రాగిరేకుల నుండి ఉద్ధరించి గ్రంథములుగా వెలువరించుటకు పూనుకొని రనియు, ఒకటి రెండు భాగములు అచ్చైనవనియు తెలిసినది. అప్పటి నుండి దేవస్థానములవారు ప్రకటించుచున్న గ్రంథముల యందలి గీతములు అనువగు రీతిని స్వరపరచి ఆయా సందర్భములలో ఆకాశవాణి నుండి ప్రసారము చేయుచు అన్నమయ్యవారి ప్రతిభావైభవముల నర్థము చేసుకొనుటకు ప్రయత్నములు చేయుచునే యుంటిని.

తొలిసారిగా అన్నమయ్య వారిని గురించి బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, శ్రీ విస్సా అప్పారావు పంతులుగారు చెప్పకొనుచున్న విశేషములను విన్న తరువాత నాలో ఒక విచిత్రమైన భావము కలిగినది నేను మహానుభావులైన క్షేత్రజ్ఞుల వారి పదములు సుమారు 150 వరకు అధ్యయనము చేసి యుండుటచే అన్నమయ్యవారికి కొంచెము తరువాతి వారగు క్షేత్రజ్ఞులపై అన్నమయ్య సంగీత ప్రభావము తప్పక ప్రసరించి యుండునేమో నను భావము నాకు కలిగినది.

లోకపు వ్యవహారమును గమనించినచో విదితమగుచున్న ఒక విషయము యీ భావనకు పునాది యైనది. సంగీతము శ్రవ్య విద్య. ఇప్పటికిని పాతకాలపువారు సంగీతమును చెప్పకొంటిమనియె యనుచుందురు. గురుముఖత వేదములను వల్లెవేయు విధముగనే సంగీతమును కూడ గురుశిష్య పరంపరలోనే అధ్యయనము చేయుట పరిపాటి. మహానుభావులైన వాగ్గేయ కారులు అప్పుడప్పుడు ఉద్భవించుచుండుటయు, కొత్త కొత్త రచనలు రూపొందించుటయు, వాటిని వారి శిష్యులకు చెప్పుచుండుటయు సంప్రదాయముగా మనకు తెలియుచునే యున్నది.

అట్లే క్షేత్రజ్ఞులకు ముందు దేశము నందెంతో ప్రచారములోనున్న తాళ్ళపాక వారి రచనలు క్షేత్రజ్ఞులును అభ్యసించి యుండువచ్చుననియు, వారి సంగీత సాహిత్యముల ప్రభావము వీరిపైనను ప్రసరించి యుండుననియు, భావించుటలో, ఆక్షేపణము కనబడుటలేదు. రాగ స్వరూపములు రచనల యందు సుస్పష్టముగా నుండును. వాటిని విని గమక వరికాదులను, స్వర సందర్భములను తెలుసుకొని తరువాతి వారు ఆ రాగములయందు రచనలు చెప్పుట జరుగ వలెను గదా ! దీనికి ఉదాహరణలు కోకొల్లలు. తెలుసుకొన కుతూహలము గల్గిన వారికవి యన్నియు తెలియుచునే యున్నవి.

సుమారు 300 ఏండ్లకు ముందు విద్వాంసులు సంగీతమును శాస్త్రముగా రూపొందించి, గుణములను స్థిరపరచి, రాగముల వ్యవస్థను తీర్చిదిద్దుటకు కొంత గట్టి ప్రయత్నమును చేసియున్నారు దాని ఫలితమే 72 మేళకర్తల వ్యవస్థ. ఒక స్థాయి యందు గల 12 స్థానముల స్వరములను పూర్వాంగ ఉత్తరాంగములుగా విడదీసి వీనికి శుద్ధ వికృతి నామములను ఏర్పరచి, మేళకర్తలను సృష్టించినారు. ఇందు ఒక పవిత్రమైన, పోకడ వాశేల పోవలసివచ్చినది, అను విషయమును గమనించవలసియున్నది. అనాటికి శృతుల వ్యవస్థ కొంత ప్రచారములో నుండి, స్థానాల స్వరూపములలోనికి ఒదగని గాంధార, ధైవతములు; రిషభ, నిషాదములు వాడుకయందుండుట వలన, చతుశ్శృతి రిషభమునకు శుద్ధ గాంధార స్థానము: సాధారణ గాంధారమునకు షట్శృతి రిషభస్థానము, అట్లే చతుశ్శృతి ధైవతమునకు శుద్ధ నిషాద స్థానము, కైశికి నిషాదమునకు షట్శృతి ధైవతస్థానము కల్పించి, 12 స్వరములకు పదునారు నామములు ఏర్పరచి, మేళకర్తలను రూపొందించి యుండవచ్చునని తోచుచున్నది.

లెక్కలను కట్టి చూచుకొనుటకిది యెంతో సులభముగా కనబడుచున్న పద్ధతియే యైనను, సూక్ష్మగ్రాహ్యములగు కొన్ని స్వరముల రూపములు మాసిపోయి అట్టి స్వరములు గల రాగములు అంతరించక తప్పలేదు. పన్నెండు స్వరముల యందు నిబంధించబడిన శృతి ప్రమాణములు గల కొన్ని స్వరములు వాటి రూపములను నిలుపుకొనజాలక మేళకర్త పద్ధతిలో పాడునపుడు వినుటకు ఇంపుసొంపులు లేక, అట్టి స్వరములు గల రాగములు లుప్తములైనవి. ప్రచార బాహుళ్యమున నిలిచిన కొన్ని రాగములు యింకను మనకు వినబడుచునే యున్నవి. ఆహిరి, అసావేరి, తోడి, వరాళి, సైంధవి, హుసేని మొదలగు రాగములిట్టివే! వానిని గ్రంథముల యందు పొందుపరచిన విజ్ఞులు "ఈ రాగములను గురుముఖతః అభ్యసించి తెలుసుకొనవలెనే గాని, వ్రాసిన దానిని చూచి పాడుకొన గూడదు." అని వ్రాయుచునే యున్నారు. ఇంకను 72 మేళకర్తల పరిధిలోనికి రాని రాగములను భాషాంగములని ఒక తరగతి యేర్పరచి శాస్త్రజ్ఞులు వీటికొక స్థానము కల్పించక తప్పలేదు. ఇట్టివే భైరవి, ముఖారి, ఆనందభైరవి, ద్విజావంతి, మంగళకైశిక, దేవగాంధారి, కాంభోజి, బిలహరి, నీలాంబరి, అఠాణా మొదలైనవి. వీనిని కూడ గురుముఖతః తెలుసుకొనక తప్పుటలేదు.

మరి కొన్ని రాగములు అతి చిన్న సంచార భేదములు గలిగి యుండుట వలన వానియందు బలమైనవి నిలిచి సూక్ష్మముగా గ్రహించి పాడుకొనవలసిన రాగములు కాలగర్భమున కలిసిపోవుచున్నవి. ఇట్టివే నీలాంబరి, సామంతం. నీలాంబరి యందు కైశికి నిషాదము భాషాంగ స్వరముగా వచ్చును, సామంతము నందదియే షట్శృతి ధైవతముగా వచ్చును గనుక సామంతము మరుగునపడి నీలాంబరి మనకు మిగిలినది. అట్లే దేశాక్షి బిలహరి రాగములు కూడ. దేశాక్షి యందు కాకలి నిషాదము మాత్రమే అవరోహణమున నున్నది. బిలహరి యందు దానికి తోడు 'ద ని ద పా' అన్న కైశికి నిషాదప్రయోగము భాషాంగ రూపమును కనబరచు

మధురాతి మధురములైన రాగములెన్నియో! వాటిని 15వ మేళకర్తయగు మాయామాళవ గౌళకు సంధానించుట వలన స్వస్వరూపములను నిలుపుకొనలేక ఏప్యమగుచున్నవి. నిజమునకు తోడి మనము పాడుచున్నాము, వినుచున్నాము. బలమైన సాంప్రదాయపు పినికి యుండుట వలననే ఈ రాగమును మనము నిలుపుకొన గలిగితిమి. ఆచార్యులిచ్చిన స్వరస్థానములలో తోడి పాడినచో ఎట్లుండును? పాపము, ఇట్లే అనేక రాగముల స్వరూపములు దిష్టిబొమ్మలవలె ఆరోహణావరోహణ మాత్రములుగానే నిలిచిపోయినవి దీనికి ఇంకొక బలవత్తరమగు కారణము గూడ కలదేమో! ఈ రాగముల యందు స్వరములు, స్వరసందర్భములు తెలుసుకొనదగు రచనాస్వరూపములు గూడ లుప్తములై పోయినవి. అది కూడ వీటి అంతర్ధానమునకు కారణము కావచ్చును.

క్షేత్రజ్ఞుల కాలము నాటికి ఎంతో చక్కటి స్వరూపములను దిద్దుకొన్న రాగములు భైరవి, శంకరాభరణము, శ్రీ, మధ్యమావతి, ఆనందభైరవి, వరాళి అఠాణా, నీలాంబరి, బిలహరి, సైంధవి, తోడి, ఆహిరి, సౌరాష్ట్రి, దేవగాంధారి, శహాన, వసంతభైరవి, హిందోళ, కాపి, అసావేరి,సావేరి, మోహన, కల్యాణి, పున్నాగవరాళి ఘంట, ధన్యాసి. కాంభోజి, నాదనామక్రియ, సురటి, కేదారగౌళ, కన్నడ, కానడ, కురంజి, నవరోజు, పంతువరాళి, సారంగ, బేగడ, యదుకుల కాంభోజి, ద్విజావంతి. బౌళి, ముఖారి మంగళకైశిక, ఫరజు, వంటివి నేటికిని అదే విధముగా పాడబడుచున్నవి. వాటి వాటి స్వరూపములను పోగొట్టుకొనకుండ దినదినము నూతన రచనాలంకారములను సంతరించుకొనుచు నిలిచియున్నవి. క్షేత్రజ్ఞులు పాడిన సింధూర తిలక, ఖండె, గౌరిపంతు, సామంతం, మారువ మొదలైన కొన్ని రాగములు అచ్చటచ్చట ఉండియు లేనట్లున్నవి. ఇవిగాక మహానుభావులైన త్యాగరాజస్వామివారు పాడి, సృష్టించిన అనేక రాగములు నేడు మనకు వాడుకలోనున్నవి. వీరందరికి పూర్వులైన అన్నమయ్యవారు వాడిన రాగములలో కొన్ని నేటికిని, సుబ్బరామ దీక్షితులవారు లక్షణములను పొందుపరచి, వారి సంగీత సంప్రదాయ ప్రదర్శినియందు భద్రపరచుటచే, వీని స్వరూపము లిట్లుండునని మనము తెలుసుకొనుటకు కొంత అవకాశము లభించుచున్నది. త్యాగరాజస్వామి, దీక్షితులవారు ఇట్టి వాటిలో కొన్ని రాగములయందు రచనలు వెలయించి అవి వాడుకనుండి తొలగకుండ కాపాడినారు. నిజమునకు శుద్ధవసంతము, పూర్వగౌళ మొదలగు శంకరాభరణ జన్యరాగములలో యిప్పటి లక్షణకారులు చెప్పిన విధమును పరిశీలించినచో అతి చిన్నిదాటు స్వరసంచార భేదములుతప్ప, ఇవన్నియు శంకరాభరణమువలెనే స్ఫురించుచున్నవి. ఇట్లె మాళవగౌళ జన్యములగు గుండక్రియ, సాళంగనాట, మొదలగువవి ప్రత్యేకములగు స్వరూపములు అంతగా విడమరచుకొనుటకు వలనుగాని స్థితియందున్నవి.

అన్నమయ్యవారు వాడిన తెలుగు కాంభోజి, కొండమలహరి, ద్రావిడభైరవి. దేశాళం, ఆబాలి, అమరసింధు, ముఖారిపంతు, రాయగౌళ, నారణి, శుద్ధరామక్రియ, సౌరాష్ట్రి గుజ్జరివంటి రాగముల స్వరూపములు, ఆరోహణావరోహణ మాత్రములుగానైనను గానవచ్చుట

లేదు. మోహన, కళ్యాణి, ఆనందభైరవి, హరికాంభోజి. ఖరహరప్రియ వంటి రాగములు అన్నమయ్య కాలమునందు వాడుకలో లేవా? ఉండియుండినచో వాటికి యింకేవైన పేర్లుండెడివేమో? ఇది యొక సమస్యగ నిలచియున్నది. కన్నడగౌళ, గౌళ, రీతిగౌళ, నాట, ఆరభి, లలిత, వసంత, ఫలమంజరి (పళవంజరం) హిందోళ వసంతం మొదలగు కొన్ని రాగములు ఇప్పటికినీ మనకు వాడుకయందు కనబడుచున్నవి. కాని యీ రాగములలో ప్రసిద్ధులగు వాగ్గేయకారుల రచనలు ఒకటి రెండు మాత్రమే అచ్చటచ్చట వినబడుచున్నవి. ఈ స్వరూపములు ఆనాడును ఇట్లే యున్నవా? ఇది నిర్ధారించుట సులభసాధ్యము కాదు.

ఈనాడు మనము వినుచున్న హిందోళ కొందరు చతుశ్శృతి ధైవతముతో చెప్పియున్నారు. మరికొందరు శుద్ధధైవముతో చెప్పియున్నారు. సుబ్బరామ దీక్షితులవారు సంప్రదాయ ప్రదర్శిని యందు, పొందుపరచిన లక్షణములను ప్రచారములోనున్న కొన్ని రాగములు వాడుకలో మార్పులను సంతరించుకొనుచున్నవి. ఇవి యెప్పుడు, ఎట్లు, యెవరివలన జరిగినవో చెప్పుటకు ఆధారములు కానరావు. రీతిగౌళ నేడు 22వ మేళమగు ఖరహరప్రియ జన్యము. దీక్షితులవారి సంప్రదాయమున ఇది 20వ మేళమగు నారీ రీతిగౌళ. ఇట్లే ఖరహరప్రియ, హరికాంభోజి అను రాగముల ప్రసక్తి వారి సంప్రదాయమున లేనేలేదు. వీటికి పూర్వస్వరూపముల నెవ్వరును, ఎచ్చటను చెప్పకుండుటయు, త్యాగరాజస్వామివారే యీ రాగములలో అనేకము లగు రచనలు చెప్పి, వీని జన్యములుగా ఎన్నో రాగములను పాడి యుండుటచే ఈ రెండు మేళకర్తలను వారే సృష్టించినారనియు, తరువాత తరములవారు భావించవలసి వచ్చుచున్నది.

పన్నెండు స్వరముల యందు అసంఖ్యాకములగు రాగములుద్భవించుటకవకాశము లెట్లున్నవో తెలియని, తెలుసుకొనలేనివారు కాదు గదా మన పూర్వులు! మనము నేడు పాడుకొనుచున్న అనేక రాగములు వారికిని తెలిసియే యుండవలెను. పేర్లు కాలక్రమమున మారిపోయి మనము గుర్తించుటకు వలనుగాకున్నదేమో! ప్రపంచము నందలి సంగీత పద్ధతులలో అతి ప్రాచీనముగా కనబడుచున్న మోహన, తాళ్లపాక వారి రచనలయందు కానవచ్చుటలేదు. ఇది బహుశః ఆహాలి, అమరసింధులలో ఏదైన కావచ్చునేమో! అట్లే శంకరాభరణము ఎంతో విస్తృతముగా కనబడుచున్న తాళ్లపాకవారి రచనలలో కళ్యాణి కనబడుటలేదు దీనికిని వేరొక పేరేదైన నుండెడిదేమో! దేశాళమను పేరు గల రాగము దొరకుటలేదు. దీనిని సైంధవిగా ఊహించి అందమైన రచన లెన్నిటినో ఎంచుకొని స్వరపరచుట జరిగినది.

ఇట్లే బౌళిరామక్రియ యనునది ఆరోహణమునందు బౌళియు, అవరోహణమునందు రామక్రియయు జతచేసి ఊహించుకొంటిని ఆహిరినాట అను రాగమునకు తచ్చూరు సింగరాచార్యులవారు ఆరోహణావరోహణములు, జనక రాగము చెప్పియున్నారు. దానిని అట్లే గ్రహించవడమైనది. తెలుగు కాంభోజి మేచుదుగల కాంభోజియనియు, ద్రావిడ భైరవియే

అనునవి భేదములేని ఒకే స్వరూపములాయని యోచింప వలసియున్నది సోమరాగమునకు తచ్చూరువారు లక్షణములు చెప్పియున్నారు. కాని కొన్ని కీర్తనలను మాత్రము నేడు వాడుకయందున్న సామరాగమునందు స్వరపరచడమైనది.

దేశి యను రాగము నేటికిని ఉత్తరదేశమునందు ప్రచారమునందున్నది. ఈ రాగమున గల రచనలను అట్లే స్వరపరచితిని. దేశాక్షి, సామంతము అను రాగములలోని రచనలు అట్లే పొందుపరచితిని. ఆహిరి, సౌరాష్ట్రి, కాంభోజి, ముఖారి, నీలాంబరి మొదలగునవి నాటికీ, నేటికీ ఇంచుమించు ఒకే స్వరూపముతో నున్నట్లు నమ్ముటకు క్షేత్రజ్ఞుల వారి పదములే ఆధారములు. రచనల ఆధారములు అంతగా కనబడక పోయినను పాడి. గుండక్రియ, మలహరి, హిజ్జిజ్జి, వేళావళి, సామనరాళి, గుజ్జరి, మంగళకైశిక మొదలగు రాగముల స్వరూపమును చేతనైనంతవరకు ఊహించి అయ్యవారి రచనలను స్వరపరచితిని

అన్నమయ్య వారి అసంఖ్యాకములైన రచనల యందు కొట్టవచ్చినట్లు కనబడుచున్న ఒక విషయమును చెప్పకొనక తప్పదు. కొన్ని రచనలు జానపద సంగీతపు పోకడలలోను, కొన్ని నేడు మనము వినుచున్న క్షేత్రజ్ఞుల పదములవలె విలంబకాలమునకు అనువైనవిగాను, కొన్ని కేవలము సుగమ, భక్తిసంగీత ఛాయలలో పాడుకొనుటకనువైనవి గాను, యింకను ఎన్నియో రచనా వైవిధ్యములతో కనబడుచున్నవి. వీని యందు ఆయా వర్గములకు సరియైన విధముగా సాహిత్యభావమునెరిగి స్వరపరచుట న్యాయమని నమ్ముచున్నాను, గనుక అట్లే చేయుటకు ప్రయత్నించితిని. రాగిరేకులపై గల యీ రచనలకు రాగములు వారే నిర్ణయించుకొన్నారు. తాళములను మాత్రము సూచించలేదు. కనుక సాహిత్యము నందలి మాటలను లాగుడు, పీకుడు లేకుండునట్లు తాళములనూహించి అమర్చుకున్నాను. రాగములను మాత్రము యథాతథముగ ఉంచుటకే ప్రయత్నములు జరిగినవి. ఏలననగా వాగ్గేయకారులు సూచించిన రాగములయందలి స్వరసందర్భములను కొన్నిటినైనను మనము పొందగలుగుదుమేమో యనునది నా యత్యాశయే కావచ్చును.

శుద్ధదేశి, నారాయణి, బలహంస, దేవక్రియ, ఫలమంజరి, మాళవి, ఛాయానాట, మాళవ (శ్రీ). నాగవరాళి, హిందోళ వసంతం, భూపాల, బంగాళ, కురంజి మొదలగు రాగముల లోని రచనలు ఇప్పుడు వాడుకయందున్న రాగలక్షణములను గమనించియు, పూర్వుల గ్రంథముల యందు వారు చెప్పిన లక్షణములు పరిశీలించియు, స్వరసందర్భములనేర్పరచి, వరుసలు కట్టుటకు ప్రయత్నించితిని ఇందు భూపాలము, నారాయణి, బలహంస అనునవి సకృత్తుగానైనను మనము వినుచున్నాము. దేవక్రియ అను పేరుతో దీక్షితుల వారి సంప్రదాయమున వాడుకయందున్నదియు, శుద్ధసావేరి యని త్యాగరాజ స్వామివారి సంప్రదాయమునందున్నదియు ఒకే స్వరములు కలిగియుండుట వలన దేవక్రియను యట్లె గ్రహించితిని. ఇదే దేవక్రియకు ఇతర ఆచార్యులు వేరుగా లక్షణములు చెప్పియున్నారు. కాని, మనకు సుమారు రెండు మూడు వందల ఏండ్ల క్రిందటి సంప్రదాయమును నిర్ధారితముగా తెలియజేసిన దీక్షితులవారి

పద్ధతిని అనుసరించి దేవక్రియను తీసుకొనుట న్యాయమేమో యని తోచినది. భూపాళమనునది బౌళి స్వరములనే పాడి కొందరు చెప్పుచున్నారు. భూపాళము తోడి జన్యము. బౌళి మాయామాళవగౌళ జన్యము. ఇట్లు పాడుటయు సంప్రదాయజ్ఞులు చేయుచున్న పనియే గనుక ఇందలి రచనలను యిదే పద్ధతిన స్వరపరచితిని.

సుమారు 32 వేలకు పైగా రచనలు దొరికిన వని మనము వినుచున్న పాళ్ళపాక వారి రచనలు యిప్పటికే కొన్ని వేలకు పైగా గ్రంథ రూపమున కనబడుచున్నవి. ఈ మహా సముద్రమునందు నాకు దొరికినవి అతి స్వల్పములే కావచ్చును. భావనా బలముగలవారు ఇంకను తమకు దోచినన్ని గేయములను వరుసలు కట్టుకొని పాడుకొనవచ్చును గదా ! ఇచ్చట ఒక విషయము చెప్పుట భావ్యమని తోచుచున్నది. సంప్రదాయములను పరిరక్షించుకొనుచు మహానుభావుల రచనలను వాని యందే యిముడ్చుకొనుచు, మనవి యనుకొని గర్వింపదగు విషయములను, మన తరువాత తరముల వారికి అందించవలసిన గురుతర బాధ్యత మన యందే గలదు. అన్నమయ్యవారి రచనల యందు శృంగారము కొంచె మధికముగా నున్నట్లు ఈనాడు మనకు తోచవచ్చును. కనుక నేటి కాలమాన పరిస్థితులకు అనువుగా ఎవరైనను పాడుకొనుటకు, ఎట్టి సంకోచమును పడవలసిన అవుసరము కలుగని విధముగా పదములను ఎంచుకొనుట జరిగినది. నేడు మూడు, నాలుగు చరణములు గల పాటలను సాధారణముగా పాడుట లేదు. అట్టి పాటలలో ఒక్క చరణమును మాత్రమే పాడుకొని ముగించుచున్నాము. కనుక యీ స్వరపరచిన రచనల యందును ఒక చరణమును పాడుకొనుటకు ఎట్టి ఇబ్బందియు ఉండదని భావించుచున్నాను.

ధ్యాత్మ సంకీర్తనలలోని అన్ని చరణములును పాడుకొనవచ్చును గదా ! క్షేత్రజ్ఞుల వారి పదములయందలి సాహిత్యములు గమనించినచో అన్నమయ్యవారి భావ చిత్రములనేకములు యథాతథముగాను, చిన్న చిన్న మార్పులతోను మనకు కనబడుచుండుట గమనార్హము. అట్టి యెడ సంగీతపు పోకడలు మాత్రమేల యుండకూడదు ?

నేడు సంగీతమునకు పరమావధిసభ నాడు సంగీతమునకు పరమావధి ఆలయము. నేడు సంగీతమునందు సాహిత్యమునకు గల స్థానము అతితక్కువ యనియే చెప్పకొనవలెను. నాడు సంగీతమునకు స్థానము తక్కువ సాహిత్యమునకు విలువలు హెచ్చు. అట్లుండనిచో అన్ని వేల రచనలు వచ్చియుండెడివి కావేమో ! నేటి సంగీతమునందు రచనకు ప్రాధాన్యత తక్కువై, అందు సంగతులు, నెరవు, స్వరకల్పన, ఆలాపనలు చేనుకొనుట ఎక్కువగానున్నది. ఇది తప్పు కాదు ఈనాటి యభిరుచి యిది. ఆనాడు భగవంతుని యెడగల తను మనోభావములను గాని, ఆ స్వామియందు తమకుగల భక్తిని గాని వ్యక్తముచేయుచు గానము చేయుటయే ప్రధానము. నేడు శ్రోతలకు కావలసినవిధముగా ఆటపాటలను చూపి మెప్పించవలసిన బాధ్యత కళాకారులకు

కొనుగోలు చేయుచున్నారు. నాడు భగవంతుని మెప్పించుటకు శాయశక్తుల భక్తుడైన కళాకారుడు ప్రయత్నించుట అతని బాధ్యత. అందుకుగాను అతడే రుసుమునూ ఆశించి యెరుగడు. కనుక నాటి సంగీతమును నేటి సంగీతముతో పోల్చుట భావ్యముగాదు. కాని యీనాటివారి యభిరుచులకు తగిన విధముగా కొంతయైనను మార్పులు, చేర్పులు చేసుకొని ప్రాచీనుల రచనలను ప్రచారము నందుంచుకొనుట న్యాయము. అన్నమయ్యవారి రచనలయందును అక్కడక్కడ నెరవులు, స్వరములు వేసుకొనుటకు చోట్లు దొరకకపోవు త్యాగరాజస్వామివారి రచనలు నేడు మనకు దొరికినవి సుమారు 650 వరకు నున్నవి. వీటిలో మనకు యీనాటి కళాకారులు వినిపించుచున్నవి. సుమారు ఒకటి రెండు వందలు మాత్రమే. అయ్యవారి రచనలలో గల దివ్యనామ సంకీర్తనలు, ఉత్సవ సంప్రదాయ కీర్తనలు, నౌకాచరిత్ర, ప్రహ్లాద భక్తివిజయము వంటి సంగీత రూపకముల యందలి కీర్తనలు మనకు అతి తక్కువగానే వినబడుచున్నవి. ఇందుకు కారణము యీ రచనలయందు నెరవులు, స్వరములు మొదలగు సాము, గరిడీలకు అంతగా తావులేక పోవుటయే.

అట్లే భద్రగిరి రామదాసులవారి రచనలు బొత్తిగా నేటి విద్వాంసులకు పనికివచ్చుట లేదు. ఇక నారాయణతీర్థులవారి తరంగములు సంగతియు, మునిపల్లె సుబ్రహ్మణ్యకవి అధ్యాత్మ రామాయణ కీర్తనల సంగతియు వేరుగ చెప్పవలెనా !

ఒకప్పుడు అభినయము, సంగీతము, సాహిత్యము త్రివేణివలె ప్రవహించుచుండెడివి. కనుకనే క్షేత్రజ్ఞుల వంటి పదకర్తలు పదములను వ్రాసి మధుర భక్తిభావముతో ఆడించి పాడించి ఆనందించెడివారు. ఆనాడు శ్రోతలలో కూడ కొంత పరిజ్ఞానము, రసజ్ఞత యుండియుండవలెను. లేనిచో అట్టిరచనలుద్భవించుటకును, ప్రచారమునందుండుటకును కొంచెము మాత్రముగానైనను యీనాడు మనకు దొరకుటకును, అవకాశమేలేదు అట్లే అన్నమయ్యరచనలను పాడి, ఆడి ఆనందించెడివారు నాడు లేకున్నచో వారి యీరచనా భండారమును రాగిరేకులపై వ్రాసి నిలబెట్టుకొనుటకు ప్రయత్నము జరిగియుండెడిదేకాదేమో ! భక్తిభావము మాత్రము శ్రోతల యందు చోటుచేసుకున్న రోజులలో నుద్భవించిన రామదాసు, నారాయణతీర్థులు, త్యాగరాజస్వామి మున్నగువారి రచనలు నేటికిని మనకు కొన్నియైన మిగిలియుండుట మన యదృష్టము ! ఇందుకు కారణము సంగీత తపస్వులగువారు శ్రోతల అభిరుచులతో పనిలేక తమకు తాము ఆనందించుచు పూర్వులైన మహానుభావుల రచనలు పాడుకొనుచుండుటయే కావచ్చును.

ఏ మతము నందైనను, ఏదేశము నందైనను ఏ భాషయందైనను తమ పూర్వులు సృష్టించి యిచ్చిన కళాసంపదల సంప్రదాయములను పోగొట్టుకొనుట జరుగదు. కనుక ఒకప్పుడు కొన్నివందల సంవత్సరములు తెలుగువారి భాష, సంస్కృతి, సంప్రదాయములు నిలిపి తీర్చిదిద్దిన ప్రాచీన వాగ్గేయకారుల రచనలు పోయినవి పోను మిగిలిన వాటినైనను కాపాడుకొని భావితరములవారి కందించుట మన కర్తవ్యము.

అన్నమయ్య, సంకీర్తన లక్షణములను 5, 6 వందల ఏండ్లకు పూర్వము చెప్పి యున్నారు. ఆ లక్షణములలో ఏకధాతుకము, ద్విధాతుకము, త్రిధాతుకము, చతుర్ధాతుకము, పంచధాతుకము అనునవి కనబడుచున్నవి. యతిప్రాసలు భావవిస్తరణలు ఏ నియమములకు లోబడియుండవలెనను విషయములు నేటికిని దక్షిణాదిని గల అన్ని భాషలవారును పాటించుచున్నారు ఇంకను ఇతర ప్రాంతీయ భాషలలో వెదకి చూచిన అన్నమాచార్యులవారి ప్రభావము మనకు కనబడవచ్చునేమో అన్నమయ్యవారి సమకాలీనులైన పురందరదాసులవారి రచనలు కొన్నియైనను మనకు వినపడుచున్నవి. అట్లే తమిళ, మళయాళ భాషలయందు అయ్యవారి సమకాలీనులైన వాగ్గేయకారుల రచనలు ఎవరైన పరిశోధించినచో తాళ్ళపాకవారి రాగ రాగిణులు, సంగీతపు పోకడలు మొదలైనవి దొరుకునేమో !

తాళ్ళపాక పెద్ద తిరుమలాచార్యులు, చిన తిరుమలాచార్యులు (పెద్దన్న, చిన్నన్న గారలు) వారి కీర్తనలు కొన్ని అక్కడక్కడ అందమైనవి దొరకినప్పుడు స్వరపరచి యుంచుట జరిగినది. వానిని కూడ ఈ సంపుటములలో చేర్చి ప్రచురించడమైనది.

ఇందు పాడుకొనుటకు సులభముగా నుండునని తాళపు గుర్తులు ఏడు మాత్రలు గల త్రిపుట, మిశ్రచాపు వచ్చినప్పుడు విళంబముగా పాడుకొనుటకు వీలగు రచనలకు మూడు, నాలుగు (3 । 4 ॥) గాను, మధ్యమకాలము అంతకు కొంచెము దురితముగాను పాడుకొనదగిన రచనలకు ఏడుమాత్రలకు ( 7 ॥ ) ఒక ఆవర్తముగాను చూపడమైనది. ఇట్లే ఐదు క్రియల కురు ఝంపె లేక ఝంపె తాళమునకు కూడ 2 । 3 ॥ లేదా 5 ॥ గాను చూపడమైనది. చతురశ్ర జాతిరూపకమును, తిశ్రజాతి లఘువును చూపించవలసినచోట కాలప్రమాణము ననుసరించి ( 2 । 4 ॥ ) గాను ( 6 ॥ )గాను చూపుట జరిగినది. ఆయా కాల ప్రమాణములనను సరించి లెక్కించుకొని ఆవుసరమైనచోట సర్దుబాటుచేసికొన ప్రార్థన.

తాళ్ళపాకవారి రచనలయందు పల్లవి వంటి దొకటియు, అనుపల్లవి లేక పల్లవినను సరించిన రెండవ ఖండమును కనబడుచున్నవి, సంగతులు కూర్చుకొనుటకును అవకాశములున్న చోట విద్వాంసులు, రాగభావమును సాహిత్యభావమును గుర్తించి సంగతులు వేసుకొనవచ్చును ఇట్టి యుద్గ్రంధములు ప్రచురించునప్పుడు స్థలాభావమును మనసునందుంచుకొనక తప్పదు. ఐనను కొన్ని రచనలయందు అక్కడక్కడ సంగతులు చూపుటయు, జరిగినది. అట్లే తమ తమ భావనాబలమునకు తగిన రీతిని సంగతులను గాయకులు సృష్టించుకొనుట తప్పుకాదుగదా !

ఈ సంపుటములలో అధ్యాత్మ శృంగార సంకీర్తనములు కలసియేయున్నవి. శృంగార సంకీర్తనముల సంఖ్య అధికముగనే యున్నది. అతి విలంబు కాలమున పాడబడుచున్న క్షేత్రజ్ఞులవారి పదములు నానాటికిని లుప్తములై పోవుచున్నవి. అన్నమయ్యవారి పదములు కొంచెము మధ్యమకాలమునుండి విలంబకాలమువైపు మొగ్గుచూపి యందముగా వుండుట వలన

కృతులు, కీర్తనలవలె పాడుకొనదగినవియై యున్నవి. వీనిని యథాశక్తిగానిందు కొన్నిటిని పొందుపరచితిని.

తాళ్ళపాకవారి సంకీర్తన భండారమును వివరముగా పరిశీలించుటకు వీలుపడని తొలి రోజులలో కొన్ని రచనలు జనరంజకముగా చేయుటకుగాను బిలాస్ ఖనీతోడి, దర్బారీకానడ దేశి మొదలైన రాగములలో పాడించుట జరిగినది. ఇట్టివి యిప్పటికిని ప్రచారమునందు వినబడుచు నా ప్రయత్న సాఫల్యానికి నిదర్శనములుగా నిలచియున్నవి. తరువాత అన్నమయ్య సూచించిన రాగములలోనే వారి రచనలు స్వరపరచుట న్యాయమని తోచినది. అప్పటినుండి యట్లె స్వరపరచుట జరిగినది. అన్నమయ్య కాలమునాటికి కర్నాటక సంగీతము హిందుస్తాని సంగీతము అని మన మీనాడు చెప్పుకొనుచున్న పద్ధతులింత ప్రస్ఫుటముగా నేర్పడియుండక పోవచ్చునని భావించెడి వారిలో నేనొకడను. అందుచే తొలుత ప్రచారమునందు నిలబడిన రచనలకు మాత్రము ఫణతులు, రాగములు అట్లే యుంచితిని.

కీర్తనల క్రింద, అది ఏ సంపుటములోనిదో, ఎన్నవ సంఖ్యగల కీర్తనయో పునః పరిశీలనకు అనువుగా గుర్తించుట జరిగినది. ఇట్టి గుర్తులులేని రచనలు డా॥ వేటూరి ఆనంద మూర్తిగారు తంజావూరు సరస్వతీమహాల్ లైబ్రరి నుండి సంపాదించినవిగా గుర్తించు కొందురుగాక.

ఇట్టి పనిని చేయుటకు తిరుమల తిరుపతి దేవస్థానములవారు, ప్రభుత్వ సంస్థలు పూనుకొనవలెనే కాని జీవనోపాధికై వేరు వేరు మార్గములలో పాటుపడుచుండెడి వ్యక్తులకు వలను కాదు. విషయమునందు గల భక్తి ప్రపత్తులకు లోనై కొంత కొంత, కొందరు చేసినను అది సమగ్రముగా రూపొందుటకు అవకాశములు తక్కువ.

ఇటువంటి ఉద్గ్రంథమును వ్రాయుటకు ఎన్నియో విధములగు సహాయములు చేకూర వలసి యుండును. అదియును నావంటి వానికి, ఇటువంటి సహాయములు అధికముగనే అవుసర మగును. వ్రాయుట, చదువుట చేయలేని వాడనగుటచే నాకు గ్రంథములు చదిని వినిపించుట యందు, అవసరమైన విషయములు వేర్పరచి వేరొక చోట వ్రాసియుంచుట, నేను పాడి చెప్పినవి చెప్పినట్లు వ్రాయుట, ఒకరు వ్రాసినవి వేరొకరు చదివి సరియగు పాఠమును రూపొందించుట మొదలగుపనులెన్నియో చేయవలసి వచ్చినది. ఇందుకొరకు అమూల్యమైన తమ సమయమును ఈ మహాత్కార్యమునకు వినియోగించుటకు సంకోచములేక యీ పనులను సమగ్రమగు దృష్టితో, దీక్షతో తీర్చిదిద్దుటకు పూనుకొనిన చిరంజీవులు అనేకులను పద్మావతీ సహితుడగు శ్రీ వేంకటేశ్వరుడు ఆశీర్వదించి, ఆయురారోగ్య, సౌభాగ్యములను ప్రసాదించుగాక యని దీవించుచున్నాను.

నా గ్రంథములను నిజమునకు వ్రాయుట చదువుట యనునవి నేను స్వయముగా చేయగల సమర్థతను పోగొట్టుకొనిన పిదపనే రూపొందించవలసి వచ్చెను. ఈ పని యందు త్రికరణ శుద్ధిగా చిరంజీవులు సౌభాగ్యవతులగు విద్యార్థినులు ఎందరో ఎన్నియో విధముల సహాయములను చేసియున్నారు. వీరిని పద్మావతీ నాథుడగు శ్రీ వేంకటరమణుడు సుఖసంతోషములతో నుంచును గాక, ముఖ్యముగా నేను సగర్వసంతోషములతో చెప్పుకొనవలసినవారు చి. సౌ. ముప్పవరపు శాంతకుమారి, చి.సౌ. నండూరి జోగులాంబ, భరణి (నా తమ్ముని కుమార్తెలు), చి.సౌ. గాదె సుబ్బలక్ష్మి (నా కుమార్తె) వీరు తాము నిత్యము వినుచున్న సంగీతమును కొంత వరకైన తరువాతి తరముల వారికి అందించుటకు మార్గము గ్రంథరూపమున నాచే స్వర రచన చేయించి మహానుభావులైన వాగ్గేయకారుల రచనారత్నములను వ్రాతయందు నిలుపవలెనని సంకల్పించి, మీరు వ్రాయజాలకున్నచో మాకు చెప్పి వ్రాయించుటకైనను పూనుకొనుడని బల వంతముగా నాచే వ్రాయించుటకు ప్రారంభించిన ఫలితముగా ఆంధ్రప్రదేశ్ సంగీతనాటక అకాడమీవారు ముద్రించిన 'క్షేత్రయ్యపదములు' (స్వరసహితముగా), 'రామదాసు కీర్తనలు' (స్వరసహితముగా) అను గ్రంథములు వెలుగుచూచినవి. తాళ్ళపాక వారి రచనలు సుమారు యిరు ముప్పది ఏండ్లనుండి స్వరపరచుచునే యున్నాను. అడిగిన వారికి పాఠము చెప్పుచునూ యున్నాను గనుక నావద్ద ఎన్నియో రచనలు స్వరసహితములుగా నుండియే యున్నవి. వానికి తోడు క్రొత్తగా వెలువడిన తి. తి దేవస్థానములవారి సాహిత్యసంకలనములు సంపాదించుకొని వానియందు దొరికిన క్రొత్తరచనలను రాగములను చదివించుకొని ఎంచుకొని ఈ గ్రంథముల యందు క్రమబద్ధముగా సంకలనము చేయుట జరిగినది. ఇట్లు సేయుటయందు తమ అమూల్య మగు కాలమును ఇట్టి మంచిపనికై వినియోగించి నాకు తోడ్పడిన చిరంజీవులలో చి. సౌ. కోఠి శశిరేఖ, చి. సౌ. బి. కె. మల్లేశ్వరి, చి. సౌ. వి. హైమవతులను అమ్మవారగు అలమేలుమంగ, స్వామివారగు తిరుమలనాథుడు, అయ్యవారగు అన్నమాచార్యులవారు తమ కృపాదృష్టులతో దీవెనలతో ఎల్లప్పుడు సుఖసంతోషములతో నుంచుదురుగాక యని ప్రార్థించుచున్నాను. నిజము నకు యింతవరకు ముద్రింపబడిన యిరువదియేడు సంపుటముల యందలి అన్నమయ్యవారి రచనలు ఈ చిరంజీవులు నాకు చదివి వినిపించగా అందలి విషయ విమర్శనలను జరిపి ఎంచుకొనినవే ఈ సంపుటముల యందలి స్వరసహితములగు రచనలు. ఇట్లే ఈ బాలికలు యింకను ఎన్నియో యిట్టి సంపుటములుగా వెలువడవలసిన త్యాగరాజుస్వామి వారి కీర్తనలు, నారాయణ తీర్థులవారి తరంగములు, ఇతర వాగ్గేయకారుల భక్తిరచనలు మొదలగునవి ముద్రణకు కావలసినట్లు తీర్చిదిద్దుటలో తోడ్పడినారు. ఇవియు తిరువేంకటనాథుని అనుగ్రహము కలిగినచో అమ్మవారి కృపాకటాక్షమున్నదె గనుక వెలుగు చూడబోవుచున్నవి.

ప్రస్తావన వ్రాయుటకు తోడ్పడినది, కుమారి వల్లూరి వరలక్ష్మి. ఇందలి రచనలు అప్పుడప్పుడు పాడి వినిపించగా వినియు, ప్రచురితములై నాకు అందుబాటులో లేని తాళ్ళపాక వారి గ్రంథములనిచ్చియు, తమ అమూల్యాభిప్రాయములందించియు, కోరినంతనే తాళ్ళపాక

కవుల చరిత్ర సమగ్రముగా వ్రాసియిచ్చియు డాక్టరు వేటూరి ఆనందమూర్తిగారు సహాయపడిన నేను వ్రాసిన యవతారికలను సరిచూచి వానికి వన్నెను దిద్దుటలో తనయనుభవమును సమయమును వెచ్చించి 'ఒకమాట' వ్రాసి యిచ్చిన చిరంజీవి 'కళాప్రపూర్ణ' రావూరి భరద్వాజ (శతాధిక గ్రంథకర్త) సహాయపడినారు. కోరినంతనే నాయందవ్యాజకరుణతో సంగీతప్రశస్తిని వ్రాసి మహామహోపాధ్యాయ శ్రీ ఈమని శంకరశాస్త్రిగారు నన్ను ఉత్సాహపరచినారు, వారికి నా కృతజ్ఞతలు, నా భ్రాతృసమానులు తి. తి. దేవస్థానములవారి కళాపీఠమునకు ప్రత్యేకాధికారి అయిన 'కళాప్రపూర్ణ' శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారు 'వాగ్గేయకారులలో అన్నమాచార్యులవారి స్థానం' అన్నఅంశాన్ని గురించి విపులంగా వ్రాసి నన్ను ప్రోత్సహించినారు. వారికి నా హృదయపూర్వక నమస్కారములు.

బాల్యము నుండియు అన్ని విధముల నాకు సర్వస్వమై నా వ్యాపకముల యందు నీడవలెనుండి, వ్రాయుట, చదువుట నేర్పని నాకు కన్నులు, చేతులు తానేయై, సర్వాంగ సుందరములుగా నా గ్రంథములు, రచనలు తీర్చిదిద్దుట యందు నిష్ణాతుడై యున్న నా సోదరుడు చిరంజీవి వాడ్రేవు పురుషోత్తమునిపై పద్మావతీ నాథుడగు శ్రీ వేంకటేశ్వరుని కరుణా కటాక్షములు ఎల్లప్పుడును ప్రసరింపవలెనని ఆశీర్వదించుచున్నాను.

సర్వాంగ సుందరముగ తాళ్ళపాక వారి రచనలు స్వరసహితముగ ముద్రించుటకు పూనుకొనిన నా సంకల్పమును నిజము చేయుటకు అభయహస్తమిచ్చిన తి. తి. దేవస్థానముల ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు శ్రీ పి.వి ఆర్. కె. ప్రసాద్ I. A. S. గారికి ; తి. తి. దే. సంపాదకులకు, P. R. O. గారికి ఈ గ్రంథమును ఎంతో ఆకర్షణీయముగ ముద్రించి అందించుట యందు శ్రద్ధాభక్తులు చూపియు, వ్యాపార సరళిలో అడ్డువచ్చెడి ఆలస్యములను రాకుండ అతి తక్కువ సమయములో ముద్రణాకార్యమును పూర్తిచేసిన నాట్యకళ ప్రెస్ వారికి ఇటువంటి మహత్కార్యములను శతాధికముగా జరిపించగల శక్తిని, పద్మావతీ సమేతుడగు శ్రీ వేంకటేశ్వరుడు ప్రసాదించుగాక !

నా శక్త్యానుసార మీ గ్రంథమును రూపొందించితిని. అక్కడక్కడ దొసగులు ఉండ వచ్చును. తద్జ్ఞులు వానిని నాకెరింగించినచో, మలిముద్రణమున సవరించుకొన గలనని మనవి చేయుచూ, మీ నుండి సెలవు తీసికొనుచున్నాను.

భవదీయ

**మంచాళ జగన్నాధరావు**

శాస్త్రీయ సంగీత కార్యక్రమ ప్రయోక్త

ఆకాశవాణి – హైదరాబాదు – 4

# సంగీత ప్రశస్తి

15, 16 శతాబ్దులలో తిరుమల తిరుపతులందు స్వామి సన్నిధిని నివాస మేర్పరచుకొని దేశమంతయు తిరిగి వైష్ణవ మత ప్రచారము గావిస్తూ, సంగీత సాహిత్యములను సాధనములుగా గొని 32 వేలకు పైగా యోగ, వైరాగ్య, శృంగార సంకీర్తనలను వ్రాసిన తాళ్ళపాక వంశ ఖ్యాతికి మూలపురుషుడు అన్నమాచార్యులవారు. హరికీర్తనాచార్యుడు, పదకవితాపితామహుడు అయిన అన్నమాచార్యులవారు సంకీర్తనలను మాత్రమే కాక అనేక ఇతర గ్రంథాలను కూడా రచించినారు.

ఇన్ని వేల కీర్తనలను రచించి, పాడి, వాటిని రాగి రేకులపై వ్రాయించి భద్రపరచిన తాళ్ళపాక వారి కాలము నాటి సంగీత ఫణతులు, పాడే పద్ధతి, కనీసం ఆనాడు ప్రచారంలో వుండి వున్న రాగాల స్వరూపాలైనా మనకు ఈనాడు అందుబాటులో లేవంటే నిజంగా అది మన దురదృష్టమనే చెప్పుకోవాలి అట్లని "అన్నమయ్యవారి రచనలు సంగీత బద్ధములుకావు" అనగలమా ! ఈ సంకీర్తనాచార్యుడు, పదకవితా మార్గదర్శి. తమ తరువాతి సంగీత సాహిత్య పరులకు నాలుగు త్రోవలు దిద్దినట్లు విదితమవుతోంది. శృంగార సంకీర్తనల వరవడి క్షేత్రజ్ఞుల వంటి పదకర్తలకు మార్గదర్శకమైనది. ఈయన అధ్యాత్మ సంకీర్తనల సరళి అధ్యాత్మ రామాయణ కీర్తనలకు, భద్రాచల రామదాసు కీర్తనలకు మాత్రమేకాక అనేక సంగీత రచయితలగు వాగ్గేయకారులకు దారితీసినవి. ఈయన చూపిన మార్గముననే కందుకూరి రుద్రయ్య తరువాతి కవులు వీధినాటకము మాత్రముగా చూపబడుచున్న యక్షగానములకు సాహిత్య గౌరవము కలుగునట్లు రూపొందించనారంభించిరి. అట్లే లక్షణగ్రంథములను వ్రాయుటకు రామామాత్యులు, గోవింద దీక్షితులు, వేంకట మఖి వంటి ప్రముఖ లక్షణకారులకు వీరు మార్గదర్శకులైనారు. తాళ్ళపాక వారందరును గాయకులనుటకు గ్రంథస్థాధారములు, శిలాకుడ్య చిత్రములు, సాక్ష్య మిచ్చుచున్నవి.

అన్నమాచార్యుల వారి కీర్తనల సంఖ్య వేలలో నుండగా రాగిరేకులపై సూచించబడిన రాగాలు సుమారు 70 వరకు మాత్రమే కనిపిస్తున్నాయి. వీటిలో యీనాటికీ ప్రచారంలోవున్న భూపాళం, ధన్యాసి, ఆహిరి, మలహరి, వసంత, పాడి, బౌళి, నాదనామక్రియ, గుండక్రియ, సావేరి, గౌళ, సౌరాష్ట్రి, లలిత, భైరవి, వసంతవరాళి, నాగగాంధారి, హిందోళ వసంత, శ్రీ, కన్నడగౌళ, హిందోళ, రీతిగౌళ, మధ్యమావతి, ముఖారి, నారాయణి, కాంభోజి, శంకరాభరణం, కురంజి, అరభి, నీలాంబరి, సామ, బిలహరి, దేవగాంధారి, సామంతం, నాట, వరాళి, రామక్రియ వంటి రాగాలు చాలా వున్నాయి. ఇవికాక కొండమలహరి, తెనుగు కాంబోది, గుజ్జరి. పళవంజరం (బహుశః ఫలమంజరి కావచ్చు) శుద్ధదేశి, శుద్ధవసంతం, సామవరాళి, బౌళి రామక్రియ వంటి అపురూప రాగాలలో కూడా యెన్నో కీర్తనలున్నాయి.

'అంతటి మహానుభావులైన అన్నమాచార్యుల వారిని ప్రతిభావంతులైన వాగ్గేయకారుల కోవకు చెందినవారుగా గుర్తించి వారి కీర్తనలను ప్రచారమునకు తీసుకు రావడానికి ఏ మార్గం అవలంభించాలి,' అన్నది యిప్పటి సమస్య. ఒక గొప్ప సుగుణం యేమిటంటే, అన్నివేల కీర్తనలను వ్రాసిన అన్నమాచార్యుల వారి రచనలలో వైవిధ్యం అపారం. ప్రచురితమైన సుమారు 14 వేల కీర్తనలను పరిశీలిస్తే, సామాన్యమైన సులభ సంగీత బాణీలను కూర్చుకొని, యిప్పుడు మనం వింటూన్న లలిత సంగీతంలాగ పాడుకోవడానికి అనువైనవీ, జానపద బాణీలలో స్వరపరచి పాడుకోడానికి అనువైనవీ, భజనకూటములలో బృందగానాలుగా పాడుకోడానికి అనువైనవీ, చిన్న చిన్న కీర్తనలుగా పాడుకోవడానికి వీలైనవీ, విలంబకాలములో తమ తమ సంగీత ప్రతిభను ప్రదర్శిస్తూ విశృంఖలంగా విన్యాసాలు చేస్తూ పాడుకోదగినవీ, పద సాంప్రదాయంలో విలంబంగా పాడుకోదగినవీ కోకొల్లలుగా ఉన్నాయి. అయితే సంగీత బాణీలు కూర్చేవారి సంగీతజ్ఞాన పరిపక్వతనుబట్టి ఆయా సంగీత రీతులకు అనువైన కీర్తనలను ఎంపిక చేసుకొని వరుసలు కట్టి పాడుకోవడం సమంజసం.

అన్నమాచార్యుల వారిని వాగ్గేయకారుల కోవలో గుర్తించడానికి, వారి కీర్తనలలో అనువైన సాహిత్యాలను ఎన్నుకొని, వాటికి ఉదాత్తమైన బాణీలను కూర్చి సంగీత విద్వాంసులకు, విద్యార్థులకు అందిస్తే ప్రచారంలోనికి తప్పకుండా వస్తాయి. క్షేత్రయ్య పదాలు, రామదాసు కీర్తనలు, ఆధ్యాత్మరామాయణ కీర్తనలు వంటి అమూల్యములైన గ్రంథాలను ఇదివరలో వెలువరించి, ఆనాడు ప్రచారంలోవున్న రాగ స్వరూపాలను, సంగీత పద్ధతులను క్షుణ్ణంగా పరిశోధించిన శ్రీ మంచాళ జగన్నాథరావుగారు యీ మహత్కార్యానికి పూనుకొనడం శ్లాఘనీయమైనది. వారు స్వరపరచిన పద్ధతి సులభగ్రాహ్యము. ప్రతికీర్తనకు అవతారిక ద్వారా ఆ కీర్తనలోని ప్రధానాంశాన్ని, అంతరార్థాన్ని చక్కగా వివరించడం పాడుకొనే వారికి యెంతో సహకరించే విధంగా వున్నది. రాగలక్షణాలను విపులంగా, నిష్కర్షగా చర్చించి సంగీత విద్యార్థులకు యెంతో మేలుకూర్చి, ఈ గ్రంథానికి ఒక విశిష్ట స్థానాన్ని ఆపాదించారు మంచాళవారు.

ఈ కీర్తనలను ప్రచారంచేయడానికి, ఇటువంటి అనేక గ్రంథాలను సంగీత ప్రపంచానికి అందించడానికి, శ్రీ మంచాళ వారికి అవకాశం, ఆయురారోగ్యములు ప్రసాదించమని ఆ వేంకటేశ్వరస్వామిని ప్రార్థిస్తున్నాను.

ఈమని శంకరశాస్త్రి
MAHAMAHOPADHYAYA EMANI SANKARA SASTRY
Chief Producer, Music (Karnatic)
ALL INDIA RADIO

NEW DELHI
30-10-1980

# ఒక మాట

మంచాళ వారితో నా పరిచయం రెండు దశాబ్దాల నాటిది. ఈ పరిచయం ఒకేచోట పనిచేయడం ద్వారా ఏర్పడింది కాదు. అంతకు మించిన అదృశ్య తంతువులేవో మమ్మల్ని ఆత్మీయులనుగా బంధించాయి. మంచాళ జగన్నాధరావుగారూ, వాడ్రేవు పురుషోత్తంగారూ, వరుసకు నాకు 'బావలు'. ఈ లెక్కన నేనూ వారుభయులకూ బావనే! ఆత్మవిశ్వాసమే తప్ప, అహంకారమూ, ఆడంబరమూ లేని వాళ్ళం గనకనే మా మధ్య ఈ బంధుత్వం ఏర్పడి ఇప్పటికీ నిలిచి ఉన్నదని నేననుకుంటూ వుంటాను. కాస్తంత వెసులు బాటు దొరికితే చాలు, ఏ సంగీత శాస్త్ర వేత్తను గురించో, సాహిత్య సమారాధకుణ్ని గురించో కబుర్లు, చర్చలు... వీటికి సమయ నిబంధనమంటూ లేదు. ఒక్కోసారి రాత్రి 2 గంటలు కూడా విని, మరి లేచేవాళ్ళం. చాలా సందర్భాలలో రాత్రి 10, 11 గంటలవడం మామూలైన మామూలు.

ఇదేదో ఒక రోజు, ఒకవారం, ఒకమాసం కాదు. దాదాపుగా 20 సంవత్సరాలపాటు అవిచ్ఛిన్నంగా జరిగింది- ఇప్పటికీ జరుగుతూనే ఉన్నది. ఈ చిన్నసైజు సాహిత్యగోష్ఠికి అప్పుడప్పుడూ, ఇతరులు కూడా హాజరవుతూ ఉండటం కద్దు !

ఓ రోజున—

"పద్యం మామూలుగా చదివి ఆనందించడం వేరు, ఛందస్సు క్షుణ్ణంగా తెలిసి ఆనందించడం వేరు'' అన్నానా సాయంత్రం మాటల సందర్భంగా.

''ఈ సూత్రం సంగీతానిక్కూడా వర్తిస్తుందే" అన్నారు మంచాళవారు. అవడమే కాదు-ఎలా వర్తిస్తుందో చెప్పారు. అంతకుముందు మద్రాసులో, వొకటి రెండు సార్లు అన్నమాచార్యుల కీర్తనలు విన్నా—అవి మనస్సులో ఎలాంటి ముద్రనూ వేయలేదు. ఆ కీర్తన—వారు పాడిన పద్ధతీ నన్ను ముగ్ధుణ్ని చేశాయి. అన్నమాచార్యుల కీర్తనలకు, మంచాళవారు సంగీతం సమకూరుస్తున్న సంగతి కూడా అప్పుడే తెలిసింది. 'అప్పుడే' అంటే 1964 వసంతకాలంలో నన్న మాట ! పదిహేను సంవత్సరాలు గడిచాయి. అన్నమయ్యవారి వేలాది రచనల్లోంచి ఎంపిక చేసిన కొన్నింటిని స్వరపరిచి మంచాళవారు వ్రాత ప్రతులు సిద్ధ పరచారు. వాటిని ముద్రించాలి. పదిమందికీ వాటిని అందజేయాలి.

నాకు తెలిసిన ప్రచురణకర్తలతో సంప్రదించాను. ''నవలలయితే పోతాయి. కవిత్వం అమ్ముడు పోదు. అందులోనూ స్వర సహితంగా అచ్చువేయాలంటున్నారు. లాభం లేదు-'' అన్నారు చాలామంది.

ఈ రకమైన ప్రయత్నాలతో ఒక సంవత్సరం గడచింది. శ్రమ తప్ప ఫలితమేమీ కనపడలేదు. స్వయంగా ముద్రించడం గురించి, ఆలోచించాం. ప్రెస్ నుంచి అంచనాలు అవీ తెప్పించాం. ఒక్కొ సంపుటం వేయడానికి కనీసం, 30 వేల రూపాయలైనా కావాలి.

నాకు సన్నిహితులైన శాసన సభ్యులతోనూ, పార్లమెంటు సభ్యులతోనూ, మంత్రివర్గ సభ్యులతోనూ, ఈ ప్రచురణను గురించి ప్రస్తావించినప్పుడు, అందరూ మాకృషిని అభినందించారు. కొంతమంది, ఆర్థికంగా కూడా సహాయ పడతామన్నారు. అయితే ఇలా చందాల మీద అన్నమాచార్యుల రచనలు స్వర సహితంగా అచ్చువేయడం ఆయనను అగౌరవ పరచినట్లవుతుందని, ఆ ప్రయత్నాన్ని విరమించాం.

కానీ - అన్నమయ్య ఊరుకోలేదు. ఆయన రచనలు నన్ను వెన్నాడుతూనే వున్నాయి. అనేక సందర్భాలలో ఆ మహాకవి చిత్రించిన వర్ణ చిత్రాలు, నన్ను స్థిమితంగా ఉండనీయడం లేదు. నావరకూ నేను వాటిని తనివితీరా చదువుకొన్నాను. కాని - నాచుట్టూ వున్నవారు కూడా ఆ రచనలు చదివి ఆనందించాలి గదా !

ఏమిటి చేయడం ?

1978 వ సంవత్సరంలో, ఖమ్మం జిల్లా వెళ్ళినప్పుడు, ఆ జిల్లా కలెక్టరును కలుసుకొన్నాను. శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్‌గారు, నాకు మరీ క్రొత్తవారు కాదు. శ్రీ పి. వి. నరసింహారావుగారి వద్ద, అంతకు ముందే వారిని చూశాను. వారే ఖమ్మం జిల్లా కలెక్టరుగా ఉంటున్నారని అప్పటిదాకా నాకు తెలీదు. జిల్లాలో అమలు జరుగుతున్న కార్యక్రమాలను గురించి వారు వివరించారు.

ఆ ప్రసాద్‌గారు, తిరుమల తిరుపతి దేవస్థానాల కార్యనిర్వహణాధికారిగా ఉన్నారని తెలిసినప్పుడు - అన్నమాచార్యుల రచనలను, సంస్కరించి పుస్తకాలుగా ప్రచురిస్తున్న దేవస్థానం వారే, స్వర సహితమైన అన్నమయ్య రచనలను కూడా ప్రచురించడం సముచితంగా ఉంటుందని నాకు తోచింది.

అయితే 1979 మార్చి 4 వ తేదీదాకా, శ్రీ ప్రసాద్‌గారిని కలుసుకోవడమే సాధ్యం కాలేదు. ఆ రోజు ఆదివారం స్వామివారి దర్శనం చేసుకొని, కుటుంబ సభ్యులతో కింది తిరుపతికి వచ్చాం. శ్రీ ప్రసాద్‌గారిని ఇంటి వద్ద కలుసుకొన్నాను. పాత జ్ఞాపకాలతో కాసేపు కాలక్షేపం. ఆ తరువాత మంచాళ వారి కృషిని గురించి వివరించాను.

''డబ్బుమీద ఆపేక్ష లేదు. మాకు అవసరంలేదు కూడా. జగన్నాథరావుగారి కృషి అలా మూలపడి వుండటం మంచిది కాదు. అన్నమయ్య రచనలు మీరు ప్రచురిస్తూనే ఉన్నారు.

స్వరసహితంగా వేయడంవల్ల రాబోయే తరాలవారికి గొప్ప ఉపకారం చేసిన వారవుతారు." అన్నాను వారి జవాబు కోసం బిక్కు బిక్కుగా చూస్తూ.

ఒక్క నిముషం ఆలోచించి, ఓ నిశ్చయానికొచ్చిన వారిలాగా తలపంకించా రాయన.

"మంచిది భరద్వాజగారూ ! ఒకో్కసంపుటానికయ్యే ఖర్చులో కొంతభాగం సబ్సిడీగా ఇవ్వడమో, లేదా దేవస్థానం వారే అచ్చువేయడమో... ఏదో ఒకటి తప్పకుండా చేద్దాం," అని నాకు మాట ఇచ్చారు ప్రసాద్ గారు.

ఈ సంగతులన్నీ, జగన్నాధరావు గారికి, పురుషోత్తంగారికి చెప్పినప్పుడు వారు పరమానంద భరితులయ్యారు. సంపుటాలను సిద్ధం చేయడంలో, మిగిలివున్న చిన్న చిన్న పనులు కూడా పూర్తిచేసుకొన్నాం. ఈ సంపుటాలను తీసుకొని 1979 మార్చి 26వ తేదీ సోమవారం నాడు, తిరుపతిలో శ్రీ ప్రసాద్ గారిని మేము ముగ్గురమూ కలిశాం. వ్రాత ప్రతులను ప్రసాద్ గారికి చూపించాం. అరగంటసేపు అన్ని వివరాలు మాట్లాడుకొన్న తరువాత ముద్రణా బాధ్యతను దేవస్థానం వారే వహించడానికీ, అచ్చుపని మాత్రం హైదరాబాదులో జరపడానికి నిర్ణయం జరిగింది. అప్పటికప్పుడే అధికారులకు తగిన ఆదేశాలను, శ్రీ ప్రసాద్ గారు పంపించారు...

అప్పటిగ్గానీ ప్రాణం కుదుట పడ్డది కాదు. అన్నమాచార్యుల రచనలు, స్వర సహితంగా వెలువడాలని, ఎందుకనుకొన్నానో, ఎందుకంత తాపత్రయ పడ్డానో సంగ్రహంగా మనవి చేస్తాను.

సామాజిక జీవితం ఒక ప్రవాహం వంటిది. ఈ ప్రవాహ వేగం అన్ని దశల్లోనూ, ఒక్కలాగానే ఉండదు. ఒక దశలో కనులు మిరుమిట్లు గొలిపే ఉత్తుంగ తరంగాలతో, దరులొరసి పారుతూ ఉండవచ్చు. మరొక దశలో సుడులతో నురుగులతో, పరుగులిడుతూ ఉండవచ్చు. ఇంకొక దశలో కదులుతున్నా, కదలనట్లే కనిపించవచ్చు. వేరొక దశలో బొత్తిగా కదలికే లేకపోవచ్చు. కానీ కదులుతున్న భ్రమ మాత్రం మనకు కలగనూ వచ్చు. ఈ చివరిదశ ప్రమాదకరమైనదని సాంఘిక శాస్త్ర వేత్తల అభిప్రాయం.

"కదలిక" చైతన్యానికి ప్రతీక. చైతన్యం జీవలక్షణం. సామాజిక జీవిత వాహిని కదలిక కను కోల్పోయిందంటే, అది జీవ లక్షణాలను పోగొట్టుకొంటూ ఉన్నదన్నమాట. ఇలా పోగొట్టుకోవడం ఆరోగ్యకరమైన పరిణామం ఎంత మాత్రం కాదు.

అయితే ఈ పరిణామం ఎందుకొస్తుంది ? ఈ ప్రశ్నకు కాస్త వివరంగా సమాధానం చెప్పుకోవలసి ఉన్నది.

చైతన్యం జీవలక్షణ మనుకొన్నాం. ఈ జీవలక్షణం పరిణామశీలమయింది. ఈ పరి ణామం, అన్ని వేళలా మనకు కావలసినట్టుగానే ఉండదు. చాలా సందర్భాలలో మనకు అను కూలంగా మలచుకోవడానికి ప్రయత్నిస్తాం. అది కష్ట సాధ్యమయినప్పుడు, మార్పుకు అను గుణంగా మనల్ని మనం మలచుకోవడానికి ప్రయత్నిస్తాం. ఒక దశలో అదీ, ఇదీ కూడా సాధ్యం కాకపోవచ్చు.

సామాజిక జీవితంలోని మరొక ఉత్తమ లక్షణమేమిటంటే, మార్పుకు అనుకూలంగా తను మారడమే కాకుండా, ఆ మార్పును తనకు అనుకూలంగా మలుపుకొనేందుకు బృహత్తర మైన కృషి జరగడం. ఈ కృషి ఒక కొత్త ఊపును, తూగును, శక్తిని, వేగాన్ని సంఘజీవిత నికి సంక్రమింప చేస్తుంది. 'ఇదంతా ఫలానా సమయంలో జరుగుతుంది' అని ఖచ్చితంగా చెప్ప డం సాధ్యం కాదు. 'ఎప్పుడు అవసరమైతే అప్పుడు జరుగుతుంది' అని మాత్రం ఖచ్చితంగా చెప్పుకోవచ్చు. ప్రపంచ చరిత్రను పరిశీలించి చూస్తే మహామహుల అవతరణ ఎప్పుడెప్పుడ జరిగిందో ఎందువల్ల జరిగిందో సులువుగా తెలుస్తుంది.

ఒక కృష్ణుడు, ఒక బుద్ధుడు, ఒక ఏసుక్రీస్తు, ఒక శంకరాచార్యులు, రామాను మధ్వాచార్యులు తగిన తరుణంలో ఆవిర్భవించారు. ఆవిర్భవించి, తమ బాధ్యతను నిర్వహి చారు.

తాళ్ళపాక కవుల, ఆవిర్భావానికి కూడా ఇటువంటి చారిత్రకమైన కారణాలే క పడతాయి. 16వ శతాబ్దినాటికి దేశమంతటా మహమ్మదీయుల పరిపాలన అలముకొన్నది ఒకటి రెండు చోట్ల 'స్వతంత్రి' ప్రభుత్వాలున్నా, ఆ స్వతంత్రం నామ మాత్రమయిందే! దే ప్రజల మీద–మహమ్మదీయ, సంస్కృతీ సంప్రదాయాల ప్రభావం గాఢంగా ఆవరించి ఉన్నది దీనికి తోడుగా కుటుంబరులైన మత ప్రచారకుల కారణంగా నిరర్థకమైన, శుష్కమైన ఆడంబరాలు, ఆచారాలు మాత్రమే మిగిలి, మతం నిర్దేశించిన ఉన్నతోన్నత సిద్ధాంతా మరుగున పడిపోయాయి. 'మమాత్మా సర్వభూతాత్మా' అన్న ఆర్యోక్తి ఒక 'ఉక్తి' గా ఒ నినాద సదృశంగా మాత్రమే మిగిలిపోయింది 'సర్వే జనాస్సుఖినోభవంతు' అన్న మహదా యం కుంచించుకొని, మరీ కుంచించుకొని, ఇంకా ఇంకా కుంచించుకొని చివరకు 'సర్వజనుల అంటే, 'తనూ తన బంధు వర్గమూ' అన్న అధమస్థాయికి చేరుకొన్నది. అంటే – వే ఋషులు, ఏ ఆశతో, ఏ ఆశయంతో, ఏ దూర దృష్టితో, ఏయే విషయాలను ప్రతిపాదించారో ఏయే నియమ నిబంధనల్ని ఏర్పరచారో, అవన్నీ స్వార్థపరుల, సంఘ ద్రోహుల, కుటుంబరు దురహంకారుల, వికృతి నిర్వచనాలకు లొంగిపోయాయి. ప్రతిపాదకుల చిత్తశుద్ధినే శంకిం వలసిన దుస్థితి కూడా సంభవించింది.

కులాల మధ్యా, మతాల మధ్యా అంతరాలు పెరిగిపోయాయి. మూఢనమ్మకాలు, అం విశ్వాసాలు విస్తరిల్లాయి. 'లో బతుకు' స్వచ్ఛంగా శుద్ధంగా ఉండాలన్న ఆలోచన అడుగు పడిపోయింది. స్వచ్ఛంగా శుద్ధంగా ఉన్నట్లు నటిస్తున్న వారికి గౌరవమూ ఆదరమూ లభి

న్నాయి. ఎన్ని పాపాలు, అన్యాయాలు, అధర్మాలు, అకృత్యాలు చేసినా, ఒక ఆరాధనతోనూ, అన్నదానంతోనూ, యజ్ఞంతోనూ, యాగంతోనూ, సమస్తపాపాల నుండి బయట పడవచ్చునన్న భ్రమను ఈ స్వార్థపరులు కల్పించారు. 'యజ్ఞం'–'యాగం' అన్న పదాలకు గల అర్థాలనే తమకు అనుకూలంగా మార్చివేశారు.

ఒక్కసారి - ఆనాటి సామాజిక వాతావరణాన్ని పరిశీలించుదాం. వేద ఋషులు ప్రతిపాదించిన 'సర్వమానవ సమానత్వ' సిద్ధాంతం, శుష్కించి, నినాద సదృశమయింది. 'దైవ చింతన'లో దైవమూ చింతనా కూడా లోపించి, అర్థరహితమైన ఆడంబరాలు, అట్టహాసాలూ మాత్రం మిగిలాయి. కులాల మధ్యా, మతాల మధ్యా అంతరాలు పెరిగిపోయాయి. మూఢ నమ్మకాల అంధ విశ్వాసాల ఊబిలో సమాజం కూరుకుపోయింది. ఈ ఊబిలోంచి, సమాజం వెలికి రావాలి. అలా వెలికి తీయవలసిన అవసరం ఉన్నది. ఉన్నది గనుకనే ఒక అన్నమయ్యా, ఒక వీరబ్రహ్మేంద్రస్వామి ఆ తరుణంలో ఆవిర్భవించారు.

కొంచెం ఇంచుమించుగా ఈ ఉభయులూ 15–16 శతాబ్ది కాలంవారే. ఉభయుల లక్ష్యాలలో కన్నా, ఆ లక్ష్య సాధనకు వారు అవలంబించిన పద్ధతులలో మనకు పోలికలు, అగ్గలంగా అగపడుతాయి. ఉభయులకూ సామాజిక రుగ్మత ఏమిటో తుణ్ణంగానే తెలుసు.

వీర బ్రహ్మేంద్ర స్వామివారు, బోధించడమే కాదు; తమ బోధనలను, ఆచరించి మరీ చూపించారు. కుల మత, భేదాలను నిరసిస్తూ తమ తత్త్వాల ద్వారా ప్రచారం చేస్తున్న తరుణంలోనే, ఆ సిద్ధాంతాలను అక్షరాలా ఆయన పాటించారు. ఒక కక్కయ్యను, ఒక సిద్ధయ్యను మరెందరో వివిధ వర్గాల వారిని శిష్యులుగా స్వీకరించి, భగవదారాధనకు అందరూ అర్హులేనని రుజువు చేశారు. అంతవరకూ, సమాజం నడచిన తీరును, సమగ్రంగా పరిశీలించి, ఇక ముందు ముందు మానవ సంఘం ఏ రీతిగా ఉండబోతుందో గూడా ఆయన ఖచ్చితంగా అంచనా వేశారు.

విద్యావంతుల శాతం, బహు తక్కువగా వున్న రోజులవి. రాకపోకల సదుపాయాలు కూడా అంతంత మాత్రంగానే ఉండి ఉండాలి. తను చెప్పదలచుకొన్న విషయాలకు విస్తృత ప్రచారం కావాలి. కావాలంటే అవి అందరూ సులువుగా గుర్తుంచుకొనే భాషలోనే ఉండాలి. వీర బ్రహ్మేంద్ర స్వామివారు–సరిగ్గా ఈ పనే చేశారు. అప్పటి ప్రజలు వాడుకొనే భాషలో, సులభంగా పాడుకొనగల రీతిలో స్వామివారు, కాలజ్ఞాన తత్త్వాలను రచించారు. వాటిని ఆయన స్వయంగా గానం చేశారు. తన శిష్యులచే పాడించారు. ఆ శిష్యులను, తెలుగు నేల నాలుగు చెరగులకూ పంపి ప్రచారం చేశారు. 'కావ్యభాష' స్వామి వారికి తెలియక కాదు. తాము చెప్పదలచుకొన్నది సామాన్య ప్రజలకు. ఆ ప్రజలేమో నిరక్షరాస్యులు. కనుక వారికి తెలిసే భాషలోనే చెప్పాలి. తెలిసే భాషలో, వారు అరిగించుకోగల భావాలనే చెప్పాలి. తమకు తెలిసిన దంతా వారికి చెప్పడం ముఖ్యమే. అంతకన్నా ముఖ్యం వారు తెలుసుకోవలసిన

దాన్ని వారు తెలుసుకోగల భాషలో చెప్పడం. ఈ ముఖ్యాంశాన్ని విస్మరించి, ఏమి చెప్పినా, నిరర్థకమేనని, వీర బ్రహ్మేంద్ర స్వామి వారికి స్పష్టంగా తెలుసు. కాబట్టే స్వామి వారు ప్రజల కోసం, ప్రజల భాషలో రచనలు చేశారు. ఇలా చెయ్యడం ఉత్తమ కవుల లక్షణం.

అన్నమాచార్యుల వారిలోనూ మనకీ లక్షణమే కనబడుతుంది. అయితే వీర బ్రహ్మేంద్ర స్వామివారి లక్ష్యం వేరు. అన్నమయ్య లక్ష్యం వేరు. బ్రహ్మం గారి లక్ష్యం 'మానవులందరూ సమానమే' నన్న సర్వ సమతా వాదాన్ని ప్రచారం చేయడం. నిర్జీవమూ, నిరర్థకమూ, నిష్ప్రయోజనమూ అయిన బాహ్యాడంబరాలను పరిత్యజించమని, 'ఆత్మశుద్ధి'ని సాధించమని, స్వామివారు ఉద్బోధించారు. ఈ దృష్ట్యా వీర బ్రహ్మేంద్ర స్వామి వారిది సంస్కరణ మార్గం.

కాగా—

అన్నమయ్యది భక్తి మార్గం. ఆ భక్తిలోనూ శృంగార ఛాయలు ముద్దినును రంగుల్లోనూ మనకలాడడం మనం గమనించవచ్చు. అర్థరహితమైన ఆచారాలను ఆచార్యుల వారు కూడా నిరసించారు. భగవంతుడు, ఏదో ఒకవర్గం వారి స్వంతం కాదని, ఏదో ఒక దేవాలయంలో మాత్రమే ఉండడని, అన్నమయ్యవారు పునసారా విశ్వసించారు. ఈ చరా చర జగత్తంతా భగవంతుని మయమే నని అన్నమయ్య గారి ప్రగాఢ విశ్వాసం.

"హరి నీ మయమే అంతాను" వంటి రచనలు ఇందుకు ఉదాహరణలు. "మానవులందరూ సమానమే" నని వీర బ్రహ్మేంద్ర స్వామి వారు చెప్పగా, అందరిలోనూ భగవంతుడున్నాడని అన్నమయ్యవారు చెప్పారు. ఉభయులూ, బాహ్యాడంబరాలను నిరసించిన వారే. ఉభయులూ ఆత్మశుద్ధికి అత్యధిక ప్రాముఖ్య మిచ్చిన వారే. ఉభయులూ తమ తమ లక్ష్యాలను సాధించడానికి, దాదాపుగా ఒకే తరహా మార్గాన్ని ఎన్నుకొన్నవారే.

ప్రస్తుతానికి అన్నమయ్య వారి రచనలను పరిశీలించుదాం-

సంగీత మథ సాహిత్యం సరస్వత్యాః స్తనద్వయమ్,
ఏక మా పాత మధురమ్, అన్య దాలోచనామృతమ్.

సంగీత సాహిత్యాలు రెండూ సరస్వతికి సహజాలంకారాలే! వినగానే వీనుల విందు చేసేది సంగీతమైతే ఆస్వాదించిన కొద్దీ అమృతాయ మానమయ్యేది సాహిత్యం. అయితే రెంటికి చాలా భేదం వుంది. మొదట సంగీతాన్నే తీసుకొందాం. సంగీత మంటే సమ్యక్ గీతం — 'చక్కగా పాడబడింది' అని అర్థం. చక్కగా పాటడం అనేది ఏ కొందరికో సహజంగానే అబ్బినా సర్వసామాన్యంగా అది గురుశుశ్రూషతో రావలసిందే. అంతేకాదు సంగీతాన్నొక శాస్త్రంగా సాధించినా, సహజమూ, శ్రావ్యమూ ఐన కంఠస్వరం లేకపోతే ఆ సంగీతం రాణించదు. వాద్యాలతో కూడా సంగీతాన్ని సాధించవచ్చు. వాద్య సంగీతానికి కంఠస్వరం (గాత్రం)

ఎలా ఉందన్న ప్రసక్తే ఉండదు. అయినా వాద్య సంగీతం కూడా గాత్ర సంగీతపు అడుగ జాడల్లోనే నడుస్తుంది. కాబట్టి అదీ శాస్త్రోక్తంగా నేర్చుకోవలసిందే.

ఈ సంగీతాన్ని అధ్యయనం చేసి, శ్రావ్యంగా పాడినా వాద్యాలతో వినిపించినా జన తన్మయులౌతూ ఉంటారు. ఈ తన్మయత్వం అందరికీ అనుభవంలో ఉన్నా, అందుల శ్రోతల యోగ్యతలను బట్టి తారతమ్యం ఉండకతప్పదు. శ్రోత నాగరికుడై ఉండి, అతనిల ఏమాత్రం సంస్కారం ఉన్నా సంగీతం అతడిని అలరించి తీరుతుంది. శ్రోతకూడా సంగీ విద్వాంసుడైతే ఇక సందేహమే లేదు.

ఇక సాహిత్యం సంగతి ఆలోచిద్దాం. ఇది రస స్ఫూర్తిని కలిగించే శబ్దార్థా సమ్మిశ్రణం. వివిధ ప్రబంధాల్లో వివిధ రసానుభవం మనకు (సహృదయులకు) కలుగుతు ఉంటుంది.

సంగీతాన్ని విన్నట్లు అందరూ సాహిత్యాన్ని వినలేరు. విని ప్రయోజనం లే కూడా. దానికి ఇంతో అంతో 'యోగ్యత' ఉండి తీరాల్సిందే! ఇంక రసాస్వాదం అన్నా దానికి శ్రోతలో ఎంతో అనుభవం సహృదయత కావాలి. ఇంక సాహిత్య రూపాలైన కా నాటకాలు రచించాలంటే దానికి వీటన్నిటికి తోడు ప్రతిభ కావాలి. ఆ విధంగా సాహి మార్గం కొంత జటిలమనే చెప్పాలి.

ఈ అభిప్రాయాన్నే నీలకంఠ దీక్షితుడు భంగ్యంతరంగా ఇలా చెబుతాడు.

"కర్ణం గతం శుష్యతి కర్ణ ఏవ
సంగీతకం సైకతవారి రీత్యా,
ఆనందయ త్యంత రనుప్రవిశ్య
సూక్తిః కవే రేవ సుధాసగంధా"

సంగీతం చెవిలో పడి పడగానే ఇసకలో నీరులా ఇంకి పోతుంది. అదే కవి సూ అయితే చెవిగుండా అంతఃకరణంలో ప్రవేశించి అమృతాయమానమై ఆనందింపజేస్తుంది.

ఆయనే మళ్ళీ ఇలా అంటాడు. –

"గాయంతి వీణా అపి వేణవోఽపి
జానంతి బాలాః పశవోఽపి చేదమ్
కావ్యాని కర్తుం చ పరీక్షితుం చ
ద్విత్రా భవేయు ర్నను వా భవేయుః"



"అచేతనాలైన వీణ, మురళీ కూడా పాడగలవు. వివేకమే లేని శిశువులూ, పశువులూ కూడా పాటల్ని అర్థం చేసుకోగలవు. కాని కావ్యాలు రచించాలన్నా, అందులోని రసాన్ని ఆస్వాదించాలన్నా యోగ్యులిద్దరో ముగ్గురో ఉండవచ్చు. ఉండక పోవచ్చు'' అంటాడాయన.

అది నిజమే. సంగీతానికి సాహిత్యం అండ ఉండాలి. లేకపోతే ఆ సంగీతానికి జీవం ఉండదు. కాబట్టే ప్రముఖనాద బ్రహ్మలుగా పేరు పొందిన వారంతా తమ సంగీతానికి, భగవంతునిపై తమకు కల భక్తి ప్రపత్తులకూ వాగ్రూపాన్నిచ్చి, సరస్వతీ సమారాధకులైనారు. వారి సంగీతానికి ఆధారంగా నిలిచిన వారి సూక్తులు శ్రోతల హృదయాలపై చెరగని ముద్ర వేశాయి. వారిని తరింప జేశాయి!

ఈ దృష్టితో ఆలోచించినప్పుడు మనకు తాళ్ళపాక కవుల పద సాహిత్యం అటు శ్రోత్రపేయమైన సంగీతానికి, రసభరితమైన సాహిత్యానికి కూడా పెన్నిధి అనిపించకమానదు. అందునా అన్నమయ్య సాహిత్యం సంగతి సరేసరి. ఆయన తన కాలంలో జనులు మాటలాడు కొనే వాడుక భాషలోనే రచనలు చేశారు. అల్లాగని ఆయన సామాన్య జ్ఞానం కలవాడని మనం భ్రమ పడే పని కూడా లేదు. సంస్కృతంలో సైతం చాలా కీర్తనలు రచించాడు, సంస్కృతాంధ్రాల మేలికలయికతోనూ కోకొల్లలుగా కీర్తనలు వ్రాశాడాయన. పరిణతి నందిన అన్నమయ్య ప్రతిభ భక్తి భరితమై, ప్రజల భాషగా రూపొంది అభీష్ట దైవపు ఆరాధనంలో అంకితమైంది.

అన్నమయ్య జన్మస్థలం తాళ్లపాక. ఇది ఇప్పటి కడపజిల్లా రాజంపేట తాలూకాలో ఉంది. లక్కమాంబ ఈయన తల్లి, నారాయణ సూరి ఇతని తండ్రి.

కారణ గుణాలు కార్యానికి సంక్రమిస్తాయంటారు అన్నమయ్య బాల్యం నుంచీ ఏడుకొండలవాని భక్తుడే. కవిత్వ శక్తి కూడా ఇతనికి పూర్వ సుకృతం కొద్దీ బాల్యం లోనే కలిగింది. విద్యార్థిగా ఉన్నప్పుడే అతడు కవిత్వం కట్టి, పాట పాడితే జనం మెచ్చు కొనేవారు. అయితే ఈయన మనసెప్పుడూ భగవన్నిష్టమై ఉండేది. ఆయనకు వెంకటేశ్వరుడు ఆపద మొక్కులవాడు కాదు, ఆరాధ్య దైవం. ఈయన కూడా భగదనుగ్రహంతో తన కబ్బిన కవితను నరాంకితం చేసి వ్యర్థ పుచ్చక శ్రీనివాసుని సేవించి దానికీ, తనకూ కూడా సార్థకతను సంతరించుకొన్నాడు.

అన్నమయ్య వైష్ణవ మతావలంబి. ఈ విషయ మాయన కీర్తనలలో చాలా చోట్ల మనకు కనిపిస్తుంది. చూడండి—

1. సహజ వైష్ణవా చార వర్తనుల
సహ వాసమే మా సంధ్య
మతి రామానుజ మతమే మాకును

చతురత మెరసిన సంధ్య'

అనే కీర్తనా,

2. ఆకాశ మడ్డమా అవ్వలయు నడ్డమా
శ్రీకాంతు భజియించు సేవకులకు
పరమ పద మడ్డమా బ్రహ్మాండధరుడైన
ధర వెంకటేశ్వరుని దాసులకును
ఇరవైన లోకముల నన్నిటా భోగించి
వరుసలను విహరించు వర వైష్ణవులకు.

అనేదీ,

3. ఈతని కరుణనేకా యిల వైష్ణవుల మైత్రి
మీ తని వల్లనే కదా మీ తిరుమణి
ఈతడే కా వుపదేశ మిచ్చె నష్టాక్షర మంత్ర
మితడే రామానుజులు ఇహ పరదైవము

అనేదీ,

4. నిత్యులు ముక్తులు నిర్మల చిత్తులు
నిగమాంత విదులు వైష్ణవులు

ఇత్యాదులు ఈయన వైష్ణవ మతస్థుడనేందుకు పరమ నిదర్శనాలు.

భక్తి అంటే అనురాగం. భగవంతునియం దమిత ప్రేమతో ఆయన స్వరూపాన్ని నిరంతరం ధ్యానం చేయటం భక్తి. వివేక చూడామణిలో—

మోక్ష సాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ
స్వస్వ రూపాను సంధానం భక్తి రిత్యభి ధీయతే

"మోక్షాన్ని సంపాదించటానికి కావలసిన సామగ్రిలో భక్తియే గొప్పది. పరమాత్మ స్వరూపాన్ని అనుసంధించటం (ధ్యానం చేయటం) భక్తి" అని చెప్పబడింది. ప్రతి వ్యక్తీ తానాచరించ వలసిన కర్మల్ని ఏమరక ఆచరించాలి. దానివల్ల మనస్సు నిర్మలమై ఇహ మనిత్యమని, పరమే నిత్యమని నిత్యా నిత్య వివేక రూపమైన జ్ఞానం కలుగుతుంది. అజ్ఞానం వల్ల తపస్సు, భగవద్ధ్యాన్నం, సంకీర్తనం మొదలైన పద్ధతులతో తన్మయీ భావం పొందటం భక్తి. ఈ భక్తిపైన చెప్పినట్లు కర్మజ్ఞానాలు రెండూ పూర్వాంగాలు సనకసనందనాదులు తపోధ్యానాదుల చేతా నంద గోపికాదులు సంతత భగవన్నామ సంకీర్తనం చేతా తన్మయీ భావాన్ని సాధిస్తే అన్నమయ్య

అన్నమయ్య సంకీర్తనలు ఆధ్యాత్మిక—శృంగార సంకీర్తనలని మనకు రెండు విధాలైనవి కనబడతాయి. భగవంతుని తాత్త్విక రూపాన్ని దర్శించి అన్నమయ్య చేసినవి అధ్యాత్మ సంకీర్తనలు. వీటిలో కొన్ని జీవుల సంసార క్లేశాలను, వాటిని గడిచే భగవంతుని రక్షకునిగా భావించటమనే ఉపాయాన్ని తెలియ జేస్తాయి.

ఉదాహరణకు :

ఇంతే ఇంతే ఇంకా ఎంత చూచినా
చింతల చిగురు లెక్క చేగదేరి నట్లు

x x x

ఆనిన సంసారమున నలయికలే పెక్కు

x x x

పూని హరి జేతులార బూజించు టొకటే

x x x

చనవై శ్రీ వెంకటేశు శరణను టొక్కటే
పని వడి చెరకున బండు పండినట్లు

కొన్ని సంకీర్తనలు స్వామి దివ్య స్వరూపాన్నిలా వర్ణిస్తాయి.

అరుదైన శంఖ చక్రాదు లిరుగడ గంటి
సరిలేసి యభయ హస్తము గంటిని
తిరు వేంకటా చలాధిపుని జూడగ గంటి
హరి గంటి, గురుగంటి, నంతట మేలుకంటి.

ఇది అన్నమయ్య కలలో దర్శించిన స్వామి రూపం. భగవంతుడెక్కడ వున్నదీ ఇదమిత్థమని తెలియక తికమకపడి చివరికి వెంకటాద్రిపై ఉన్నాడని తెలిసి సేవించి నాడట అన్నమయ్య.

ఇది కల్ల యనరాదు యిది నిశ్చయింపరాదు
పదిలాన గొలువగా ప్రత్యక్షమయ్యీవు
యెదలో నుండుదువని యివన్ని వేదాలు చెప్పగా
వెదకి ధ్యానము సేతు వెస గనుగొంటలేదు.

x x x

అంతటా నుండువని ప్రహ్లాదుడు చెప్పెననగా
చింతించి పట్టదలతు చేతికి చిక్కుట లేదు.
సంతత జ్ఞానాన నీ సాకారమున్నదందురు
మంతనాన బిల్తు నొక మాట వినబడదు.

x x x

యివల శ్రీ వేంకటాద్రి నిరవైనీ వున్నాడవు
తివిరి సేవించితిమి ద్రిష్టమాయ మాకు,

అన్నమయ్య భగవంతుని యందు నాయక భావాన్ని, తనయందు నాయికా భావాన్ని ఆరోపించుకొని చేసినవి శృంగార వర్ణనలు. ఇందులో వివిధ నాయికలు, వారికి — వెంకటేశునికి కల ప్రేమ — ప్రణయకలహం మొదలైన శృంగారమంతా హృద్యంగా ముచ్చటించ బడింది.

ఆమె విరహోత్కంఠిత. స్వామి వచ్చునని వేచి వేసారినది. సమయానికి స్వామి రాలేదు. రాత్రి గడచి తెల్లవార నున్నది. అప్పటికి స్వామి వచ్చెనట.

ఉదయాద్రి తెలుపాయె నుడు రాజు కొలువీడె
అద నెరిగిరాడాయె నమ్మ నా విభుడు.
చన్నులపై ముత్యాల సరులెల్ల జల్లనాయె
కన్నులకు గప్పొదవె గాంత నాకిపుడు
కన్నె కలువల జాతి కను మోడ్చినది మీద
వెన్నెల వేసంగి మొగ్గ వికసించెగదవె

X X X

పన్నీట జలకమార్చి పచ్చ కప్రము మెత్తి
చెన్నుగం గొప్పున విరులు చెరువం దురిమి
ఎన్నంగల తిరువేంకటేశుం డిదెననుం గూడె
కన్నుల మనసునుం దనియం గరుణించె గదవె

'ముగ్ధ' ఐన నాయిక యొకతె స్వామితో ఇట్లా అంటున్నది—

ఊరకుండనీరా మమ్ము నుడికించకా
గారవించె నీ నవ్వు గాలమువో నాకు
చిరుత నవ్వు నవ్వగా చెక్కు నొక్కి యెత్తి నన్ను
కరిచేవు మరికొంత కారింపేకాదా
తరి నీ మనసునను దలచినట్లుండు
గురిగా నదివో నాకు గుండెలోని అమ్మ.

మంచము పై నుండగాను మచ్చిక నా వొద్ద బండి
ముంచి చేయి వేసే వది మోపే కాదా
యెంచే నీకు జూడ నది యిచ్చక మైనట్లుండు
తెంచ రాని పొద్దు పొద్దు దిగులువో నాకు

భ్రమసి నేనేండగాను పట్టి నన్ను గౌగలించి
తమ కించే విది గొంత తగులే కాదా
అమర శ్రీ వేంకటేశ ఆదరించి కూడితివి
చెమటలు నీకుగాని సేసలు వో నాకు.

ఇట్లే ఒక ఖండిత నాయిక తన ప్రియుడు శ్రీ వెంకటేశ్వరుడు వచ్చుచుండగా తన చెలితో ఏమన్నదంటే—

ఆ మాట మీ రెరగ రాతడె కాని
తామసించినాడ నుండె తన కేలె వెరపు
విచ్చేయు మనవె విభుని నిక్కడికె
యిచ్చటనే విన్నవించె నేమి గల్లాను
ఘుచ్చట తీరదు తన మొగము చూచిన దాకా
తచ్చి వేసి నేనుండగ తన కేలే వెరపు
తప్పక చూడుమనవె తానిట్టె నా దిక్కు
యిప్పుడె మంచిది సేసె నేమి గల్లాను.
దప్పి వోదు నేడు నాకు తనతో మాటాడుదాకా
తప్పు లెల్లా వొప్పులయ్యీ తన కేలె వెరపు
తలచు కొన్మనవె తన పొందు నా పొందు
యెలమి గాగిట దీర్చె నేమి గల్లాను
అలమె శ్రీ వెంకటేశు డందుకే మెచ్చినదాకా
తల వంచుకున్నాడు తన కేలే వెరపు.

మొదలైన శృంగార కీర్తనలు మధురంగా వుంటాయి.

ఈయన భాష చాల వరకు గ్రాంధిక–వ్యావహారిక భాషా సంకీర్ణం. సాధారణంగా గ్రంథాలలోని భాషకు, వ్యవహారభాషకు మధ్య చాలా భేదం ఉంటుంది. కాని ఆ అంతరానికి సదుమవారధిని నిర్మించాడన్నమయ్య! ఈతని కవిత్వంలో భక్తి పారవశ్యంతోబాటు, భాషా వైశిష్ట్యం కూడా మనకు కనిపిస్తుంది. ఈయన ప్రయోగాలు, సామెతలు నాటివ్యవహార భాషకు నిదర్శనాలు. ఉదాహరణకు -

చదురాలు, బాలులాల, తమ్మిలాల, ఆయ, కూడుక, అప్పన, చింక, నిలచీను, ఓర్చీను, మొదలైనవి, దుర్భాషమాటలు, నిత్యకొత్తలు (ఇది ఇప్పుడు గోదావరి జిల్లాలో ప్రయోగంలో ఉండే సర్వకల్లవంటిది) వంటి పదాలు ప్రయోగాలు అన్నమయ్య కవితలో కోకొల్లలు. వు, వూ. వా. వోలతో మొదలయ్యే విధంగా వకార సంధి చేయటం ఈయన అలవాట్లు. ఇది కూడా ఉచ్చారణకు యథా తథమైన లిఖిత రూపమే.

ఇలాగే అన్నమయ్య సామెతలలో కూడా అందె వేసిన చేయి అని చెప్పవచ్చు. ఉదాహరణకు—

కోమలపు మగవాడు కోలదు లెరగునా
మరిగించి కలిసితే మరి చలి వాయదా
చివురు బలిసితేనే చేగలై నిలువనా
కూడు వండుట గంజి కొరకా

వంటివి చాలా ఉన్నాయి.

అన్నమయ్య వివిధాలంకార రచనలో సిద్ధహస్తుడు. అతని ఉపమకు ఒక్క ఉదాహరణ—

ఏమిగల దిందు నెంతగాలంబైన
పామరపు భోగ మాపదవంటి దరయ
కొండవంటిది యాస గోడ వంటిది తెగులు
బెండువంటిది లోని పెద్దతనము
పుండువంటిది మేను, పోలించినను మేడి
పండు వంటిది సరసభావ మింతయును
కంచు వంటిది మనసు కలిమి గల దింతయును
మంచు వంటిది రతి భ్రమత వంటిది
మించువంటిది రూపు మేలింతయును మట్టు
మెంచు వంటిది దీని ప్రియమేమి ప్రాతి

మొదలైనవి ఎన్నెన్నో ఉన్నాయి.

అన్నమయ్య తెలుగులో ఎంత సుందరంగా రచించగలడో అంత హృద్యంగానూ సంస్కృతంలో కూడా కవిత చెప్పగల దిట్ట.

ఒక ఉదాహరణ-

దేవ దేవం భజే దివ్య ప్రభావం
రావణాసుర వైర రఘుపుంగవం
రాజవర శేఖరం రవికుల సుధాకరం
ఆజానుబాహుం నీలాభ్రకాయం
రాజాధి కోదండ రాజదీక్షా గురుం
రాజీవ లోచనం రామచంద్రం

నీల జీమూత సన్నిభ శరీరం ఘన వి
శాల వక్షసంవిమల జలజనాభం
కాలాహి నగహారం ధర్మ సంస్థాపనం
భూలలనాధిపం భోగ శయనం
పంకజా సన వినుత పరమ నారాయణం
శంకరార్జిత జనక చాప దళనం
లంకా విశోషణం లాలిత విభీషణం
వేంకటేశం సాధునిబుధ వినుతం

ఇలాంటి సంస్కృత కీర్తనలు ఈయన కృతుల్లో అనేకం ఉన్నాయి. అన్నమయ్య అంతటా భగవంతునే దర్శింప గలిగిన దార్శనికుడు ఆయన ఇలా అంటాడొకచోట–

హరి నీమయమే అంతాను
అరసి నీకు శరణనియెదమ
X X X
యెవ్వరి బొగడిన యెక్కడ నుండిన
నివ్వటిల్లనది నీ రూపే
నెవ్వదీర నిదె నిను విశ్వరూపు
డెవ్వల నని శ్రుతు లెంచీ గాన

తన పద సాహిత్యంలో భగవత్పద పద్మాలను భజించి తన జీవితాన్ని ధన్యం చేసికొన్న మహనీయుడు అన్నమయ్య. ఆయన పద సాహిత్యంలో చాలా వరకు వెలుగొందనా వెలుగొందవలసిన నిధి తరగకుండా ఉండనే ఉన్నది.

నిజమే –

భూగర్భంలో నిక్షిప్తమై వున్న సంపదను వెలికి తీసి ప్రజలముందు ఉంచుతున్నాం నుంచిదే ! ప్రజా జీవనం, సుఖసంతోషాలతో కల కల లాడవలసిందే. అలాగే మరుగు పడిన సాహిత్య సంపదను కూడా మనం వెలికి తీయాలి. తీసి – భావితరాల వారికోసం భద్రపరచాలి. తాళ్ళపాక కవుల రచనల్లో నిఘంటువుల కెక్కని పద సంపద చాలానే ఉన్నది. ఇప్పుడు బృహదాంధ్ర నిఘంటునిర్మాణం జరుగుతూ ఉన్నది గదా ! అప్పుడీ పద సంచయాల్ని అందులోకి చేర్చాలి. అన్నమయ్యను గురించి ఇంకా జరగవలసింది చాలానే ఉన్నది. అందులో కొంత భాగాన్ని మా జగన్నాధరావుగారు విజయవంతంగా పూర్తిచేశారు. చేశారు గనుకనే వారిని మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాను.

అన్నమాచార్యులవారి కీర్తనలు గాయనీ గాయకులకు చాలాకాలంగా తెలుసు. వారందరూ తమ తమ శక్త్యానుసారం ఆచార్యులవారి కీర్తనలను పాడుతున్నారు. రసహృదయులు ఆనందిస్తున్నారు.

కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు అన్వేషించి, శోధించి, మారుమూలగా పడి వున్న అన్నమయ్య పదసంపదను వెలుగులోకి తీసుకొచ్చారు. ఆ కీర్తనలను సముచితంగా సంస్కరించి తిరుమల తిరుపతి దేవస్థానంవారు పుస్తకాలుగా ప్రకటిస్తున్నారు. కాని ఇవి 'స్వర'సహితం కావు.

ఒక కళలో విపులమైన ప్రవేశం వుండడం వేరు. ఆ కళకు సంబంధించిన 'శాస్త్రం' కూడా తెలిసిఉండడం వేరు. గొప్పగా కవిత్వం వ్రాసిన వారికి ఛందోవ్యాకరణాది శాస్త్రాలలో కూడా క్షుణ్ణమైన ప్రవేశం ఉంటుందని అనుకోనవసరం లేదు. అలాగే గొప్పపండితులైన వారు కమ్మని కవితను అల్లగలరని కూడా అనుకోనవసరం లేదు.

కానీ, కవులకు-అంతో యింతో పాండిత్యము, పండితులకు పద్యం వ్రాయగల నైపుణ్యము ఉండవచ్చు. అటు కవితారచనలోనూ, పాండిత్యంలోనూ, అసమానులనిపించుకొన్న వారి సంఖ్య స్వల్పం. ఇది సాహిత్యరంగానికే పరిమితం కావలసిన అవసరం లేదు. సంగీతం, చిత్రకళ, శిల్పకళ, వంటి వాటన్నిటికీ వర్తిస్తుంది. పరమాద్భుతంగా పాడేగాయకునికి, తను పాడుతున్న రాగంయొక్క అనుపానులన్నీ తెలుసుననలేము. కానీ తెలియడం మంచిదే! అయితే అలా తెలియ జెప్పగల వారిసంఖ్య రానురాను తగ్గిపోతున్నది. నిజానికి ఇలా జరగకూడదు. ఇలా జరగడం జాతికి మంచిదికాదు.

అన్నమయ్య కీర్తనలను-మరీ విశృంఖలంగా స్వరపరుస్తున్నారనడం అతిశయోక్తి అనిపిస్తే-ఒక క్రమ పద్ధతిలో, స్వరపరచడం లేదనైనా అనుకుందాం. ఎవరి స్థాయిని అనుసరించి వారు, ఎవరి అనుకూల్యాలను బట్టివారు, ఈ కీర్తనలను స్వరపరచి పాడుతున్నారని ఆ రంగానికి చెందిన పెద్దలంటున్నారు. దీన్ని క్రమపరచడం అవసరం! ఆ పనిని మంచాళవారు ప్రారంభించారు. అన్నమయ్య వారు సూచించిన అపురూపరాగాల నెన్నిటినో పరిశోధించి, వాటి స్వరూపాలను పునరుజ్జీవింపజేసి, ఆ రాగాలలోనే కీర్తనలను స్వరపరచారు. వ్రాతప్రతిని తయారు చేయించారు. ఒక్కొక్క కీర్తనను స్వరపరచడానికి, మూడు నాలుగు రోజులు మథనపడిన సందర్భాలున్నాయి. ఒకే రోజున రెండు మూడు కీర్తనలను స్వరపరచిన సందర్భాలూ ఉన్నాయి.

సంగీత సాహిత్యాలు, బహుజనామోదాలైన లలితకళలు. ఒక రంగంలో బాగా ప్రవేశమున్నవారికి రెండవరంగాన్ని గురించి ఎక్కువగా తెలిసే అవకాశం లేదు సరేకదా -

తక్కువగా తెలిసే అవకాశం కూడా తక్కువే! పరమరమణీయంగానూ పరమశాస్త్రోక్తంగానూ పాడుతున్న గాయకుడు ఆ పాటను, అసందర్భంగా విరిచి, ఘోరమైన ఉచ్చారణతో పాడినప్పుడు సాహిత్యారాధకుడు భరించలేడు.

శాస్త్రీయ సంగీతం విషయంలో ఇదే జరుగుతున్నది. గాయకుని గానంలో 'శాస్త్రీయ సంగీతం' ఉండవచ్చుగాక–సాహిత్యం చచ్చుబడి పోతున్నది. ఎందువల్లనంటే ఆ గాయకునికి, కీర్తనలలోని సాహిత్యంతో పరిచయంలేదు. కీర్తనకర్త, ఏ భావాన్ని అభివ్యక్తం చేయడానికి, ఏ పద సముచ్చయాన్ని వాడిందీ గాయకునికి పూర్తిగా తెలియాలి కానీ అలా తెలిసినవారు చాలా కొద్దిమందే!

ఆ కొద్దిమందిలో మంచాళ జగన్నాధరావుగారొకరు. సంగీతంలోనూ, సాహిత్యంలోనూ, వారికి గల చిరకాల 'పరిచయం' వల్ల, ఈ పనిని వారు సులభంగా నిర్వహించగలిగారు. 'పరిచయం' అని మర్యాదకోసం అనడమే. ఈ రెండు రంగాలలోనూ, వారు చేసిన కృషికి నిదర్శనాలు ఈ మూడు సంపుటాలు!

కీర్తనలోని కవి హృదయం, పఠితకు సులభంగా బోధపడడానికి అవతారికలు తోడ్పడతాయి. ఈ అవతారికలను రూపొందించడంలో సాధ్యమైనంతవరకూ కీర్తనలలోని పదాలనే ఉపయోగించడం మరో విశేషం! ఆ పదాలతో ఆనాటి వచనాశైలికి సన్నిహితంగా వుండే రీతిలో 'అవతారిక'లను కూర్చడానికి మంచాళవారు కృషి చేశారు.

రాగలక్షణం గురించి వివరించడం మరో ప్రత్యేకత. ఇలా వివరిస్తున్నప్పుడు సంప్రదాయంగా వస్తున్నపద్ధతులేవో, ఔత్తరాహులు ఇదే రాగాన్ని ఏ పేరుతో పిలుస్తారో, ఎలా ఆలపిస్తారో చెప్పడమే కాకుండా, ఆ రాగానికి సన్నిహితంగా ఉండే రాగాలనుకూడా తెలియచేయడంవల్ల, కొత్తవారు ముందు జాగ్రత్త పడడానికి వీలవుతుంది!

'పద్మాలయ'
159/2R.T.
విజయనగర్ కాలనీ
హైదరాబాద్-500457

డాక్టర్ రావూరి భరద్వా
తెలుగు ప్రసంగ కార్యక్రమ ప్రయో
ఆకాశవాణి–హైదరాబాద్-4

# విషయసూచిక

**అవతారిక :**

ఈ పదము నందలి నాయిక స్వాధీన పతిక. నాధుడగు శ్రీ వేంకటేశ్వరుని కృప తనపై కలుగగా "ఏమయ్యా! మచ్చికతో మనము మాటలాడు కొనగా, ఇంకొకతె యెవరో తనలో తాను తిట్టు కొనినదట. ఆమెను వేడుకొని చన విచ్చి లాలించవయ్యా! ఆమె తన్నను కొనుట నిన్ననుట గాదా! మన మిద్దరమును ఏకాంతముగ నున్నప్పుడు చూచి ఆమె చెలులపై కోపగించు కొనుచున్నదట. ఆమెకు బుద్ధిచెప్పి చేరదీసి బుజ్జగించవయ్యా! ఆమె పెద్దరికమును గౌరవించి పలుకొను వాడవు నీవేగదా! ఓ శ్రీ వేంకటేశ్వరుడా! నిజము చూడబోయిన ఆమెయు, నేనును ఒకటే! నీవు నీవే" అని చెప్పు చున్నట్లుగా అయ్యవారు పాడుకొన్నారు.

ఈ పదము నందలి ధోరణి గమనించినచో 'మధుర భక్తి పరమావధిని అన్నమయ్య మూడవ చరణము నందలి ఆఖరి రెండు పంక్తులలోను సూచించినారా' అనిపించుచున్నది. ఆపె ఆపెయట, అతడాతడట. అనగా 'జీవాత్మలన్నియు నీయురము నందుండు అలమేల్మంగనగు నా రూపములే! పరమ పురుషుడవగు నీవు నీవేయని తెలుసు కొనుటయే చరితార్థత' అని అయ్యవారి యూహ కావచ్చు.

**రాగ లక్షణము :**

తోడి ప్రాచీన రక్తిరాగములలో నొకటి- కొందరు లక్షణకారులు దీనిని దేశీయరాగ మని చెప్పియున్నారు. కాని ఇది కొన్నివందల యేండ్లనుండి కర్నాటక సంప్రదాయములలో ఇమిడిపోయి తనదేశీయ లక్షణములను పూర్తిగా వదలుకొనినట్లున్నది. మహాసముద్రమువంటి గంభీరసంచార సందర్భములు గల యీరాగమునందు తాళ్ళపాకవారినుండి నేటివరకు ఎందరో వాగ్గేయకారులు రచనలు చేసియున్నారు. ఇందలి గమక వరికాదులు, స్వరలిపి విధానములకు అతీతములై ఆహిరి, సైంధవి, హుసేని, నీలాంబరి వంటి రాగములవలె, గురుముఖమున అభ్యసించ వలసి యున్నది. ఇందుముఖ్యముగా క్షేత్రజ్ఞుల వారి పదములయందుగల రాగభావములు ప్రాచీన ములై తాళ్ళపాకవారి రచనలయందలి ఛాయలు ఇంకను కలవని తోచుచున్నది. ఇది యిప్పటి వాడుకప్రకారము 72 మేళకర్తలలో ఎనిమిదవదిగా గుర్తింపబడుచున్నది. సంపూర్ణ సంపూర్ణము. దీనిని 'హనుమత్తోడి'యని వ్యవహరించుటయు కలదు.

తోడి—రూపకం

ఏల వూరకున్నాడవు ఇంకా నీవు
పాలించి మన లోనివే పంతాలు గావా ! ॥పల్లవి॥

మచ్చికతో నీవు నేను మాటలాడి నందుకే
తచ్చి యాపె దిట్టుకొని దానే తాను
విచ్చన విడి నందుకు వేడు కొనవయ్యా నీవు
నెచ్చెలి తన్నును కొంటే నిను నంట గాదా ! ॥ఏల॥

ఇద్దరము నేక తాన ఇట్లనుండి నందుకే
కొద్దిమీర చెలులపై గోపగించీని
బుద్ధి చెప్పి చేయువట్టి బుజ్జగించవయ్యా నీవు
పెద్దరిక మాపెది నీ పేరే యింతాగాదా ॥ఏల॥

మక్కువ (శ్రీ) వేంకటేశ మనము గూడి నందుకే
కక్కసించి వూరకైనా గాతాళించీని
వొక్కటే ఆపే నేను వొరసి కూడితి విదె
నిక్కము దెలుసుకొంటే నీవు నివే కావా ! ॥ఏల॥

శృం : 26—455

ప. - ప ద ప మా మ || గా ప మ గ రి రి స ||
- - ఏ ల వూ ర || కు న్నా - - - డ వు ||

1. స స రి స ని ధ ని || సా - - - స రి ||
ఇం క - నీ - - - || వు - - - - - - ||

2. గ మ ప ద ని స ని ద పా ప మ || గా ప మ గ రి రి స ||
- - ఏ - ల - వూ - - ర - || కు న్నా - - - డ వు ||

స స రి స ని ధ ని || సా - - - స రి || - గ మ దా ద మ || ద ప ద ని స స ||
ఇం ం క - నీ - - || వు - - - - - - || - పా - లిం - చి || మ న లో - ని వే ||

- ద ని సా ఠి ని ద మ || ద ప ప మ గ గ రీ సా ||
- పం - తా - - లు - || గా - - - - - - - వా ||

- మ మ మ మా || ద ని ద మ గ మ గ రి స ||
- మ చ్చి క తో || నీ - - వు నే - - - సు ||

- స రి గ మ గ గ రి స || స ని ధా నీ సా ||
- మా - ట - లా - - డి || నం - - దు కే ||

- సా ద ప ప ప మ గ మా || ని ని పా ద మ పా ||
- త చ్చి - యా - - - పె || తి - - ట్టు కొ నీ ||

- గ మ ప ద నీ ద మ || పా - - - - || - ద ప ద ని ద || స ద ని సా - |
- దా - నే - - తా - || ను - - - - || - వి చ్చ న వి డి || నం - దు కు - |

స రి గ మ గ గ రి సా || స ని దా నీ సా ||
వే - డు - కొ - న వ || య్యా - - నీ వు ||

- ని ని ని ద స రి || స స ని ని ద ద ప దా ||
- నె చ్చె లి త - - || న్న ను - కొం - - - లే ||

- గ మ ప ద ని స ని ద ప మ || ద ప ప మ గ గ రీ సా ||
- ని - ను - నం - - - ట - || గా - - - - - - - దా ||

- ప ద ప మా మ || గా ప మ గ రి రి స ||
- ఏ - ల పూ ర || కు న్నా - - - డ వు ||

**అవతారిక :**

ఈ కీర్తనమునందు "ప్రాణులు పొల్లకట్టు దంచి దంచి పోగులు వేసుకొనునట్లు పనికి రాని పనులయందు పడి తిరుగుచుందురు. భగవంతుడైన హరిని భజించుటచే ముల్లును ముల్లుతోనే తీసినట్లు సుఖపడుదురుగదా ! ఆనిన సంసారమునందు యలయికలబడి అల్లాడుచుందురు. పూని హరిని గొలిచి పుణ్యములనార్జింపరాదా ! తన విజ్ఞానములను తానే తలచుకొనుటలో నేమున్నది? శ్రీవేంకటేశ్వరుని శరణమనిన జీవికి తియ్యనిదగు చెఱకున పండుపండినట్లై, ఆనందమును కలిగించును కదా!" అని అయ్యవారు బోధించుచున్నారు.

**తోడి—రూపకం**

ఇంతే యింతే యింకా నెంత చూచినా
చింతల జిగురు లెక్క చేగ దేరినట్లు. ॥పల్లవి॥

పుల్లములో నెంచ నెంచ నుద్యోగములే పెక్కు
పొల్లకట్టు వంచ దంచ బోగులైనట్టు
బల్లిదుని హరినాత్మ భావించుటొకటే
ముల్ల (ల్లు) ముంట దీసి సుఖమున నుండినట్లును. ॥ఇంతే॥

ఆనిన సంసారమున నలయికలే పెక్కు
చానిపి జవి వేడితే జప్పనైనట్టు
పూని హరి జేతులారా బూజించు టొకటే
నూనె గొలిచి కుంచము నుసికిలినట్లు. ॥ఇంతే॥

వెనక దలచుకొంటే విజ్ఞానములే పెక్కు
తిన దిన వేమెల్లా దీపైనట్టు
వనవై శ్రీ వేంకటేశు శర ణనుటొక్కటే
పని వడి చెఱకున బండు పండినట్లు. ॥ఇంతే॥

అ : 10—80

ప. దనిసా స నిదా || ద పపమ పా - - ||
ఇం - తే యిం - తే || యిం - - - కా - - ||

పపమ గ గా - - || గ మ ప ద ని ద పా ||
నై - - - త - - || చూ - - - - చి నా ||

మ ప ద ప మా - || మ ప ద ప మా మ ||
చిం - - భ ల - || జి - గు రు లె క్కి ||

రి స రి గ మ ప గ || మ ద ప ద ద మ ప ద నీ ||
చే - - గ దే - రి || న - - - ట్లు - - - - || ||ఇంతే||

చ. - ప ద ప మ మ ప || గ మ ప మ ప ద ప మ గ రి సా ||
- వె న క ద ల చు || కొం - - - - - - టే - - - - ||

- స సా స ని ధా || నీ సా సా ||
- వి జ్ఞా న - ము || లే పె క్కు ||

- స రి గ మ ప ద నీ || ద ప దా - - ||
- తి న ది న వే - - || మె - ల్లా - - ||

ద ని సా - ని ద ప ప మ పా || ప ప మా పా - - ||
తీ - - - - వై - - - - || న - - ట్టు - - ||

- ద ప దా దా || ద గ రి సా స ||
- చ న వై (శ్రీ) || వెం - క టే శు ||

- స రి గ మ గా || - రి సా - - ||
- శ ర ణ ను టొ || - క్క - - - ||

- ద ని స సఁ రి సఁ సఁ ని || సఁ ని ని ద ని ద ద మ పా ||
- ప ని వ డి చె - అ - || కు - న - పం - - - డు ||

రి స రి గ మ ప గ || మ ద ప ద గ మ ప ద నీ ||
వం - - డి న - - || ట్లు - - - - - - - - ||  ||ఇంతే||

**అవతారిక :**

శ్రీ వేంకటేశ్వరుని దాసులకు చతుర్దశ భువనముల యందును పొందరానిది, దాటరానిది, అందరానిది యనునవి ఉండవనియు, హరిదాసులైన వారికి అన్నియును వశమగుననియు చెప్పుచు హరిభక్తియెంత గొప్పదో అయ్యవారు విశదీకరించుచున్నారు.

**రాగ లక్షణం :**

భూపాలం ప్రాచీనరక్తి రాగములలో నొకటి. ఇది యిప్పటి వాడుక ప్రకారము 8వ మేళమగు హనుమతోడి జన్యము.

ఆరోహణ : స రి గ ప ద స

అవరోహణ : స ద ప గ రి స ॥

దీనిని కొందరు మాయామాళవగౌళ జన్యము గాపాడుచుండుటయు కలదు. కాని రేవగుప్తి, బౌళి మొదలగు రాగములు 15 వ మేళజన్యముగా వాడుకయందుండుట వలన అట్లు పాడినచో భూపాళకు ప్రత్యేకించబడిన రాగస్వరూప మేర్పడదు. దీనిని లక్షణకారులందరు 8వ మేళజన్యమనియే చెప్పియున్నారు. ఇందు ప్రాచీన వాగ్గేయకారుల రచన లచ్చటచ్చట కానవచ్చుచున్నవి. సంప్రదాయము నెరిగిన విద్వాంసులు తోడి జన్యముగానే పాడుచున్నారు.

**భూపాళం — తిశ్రఏక**

ఆకాశ మడ్డమా అవ్వలయు నడ్డమా
శ్రీకాంతు భజియించు సేవకులకు. ॥పల్లవి॥

పాతాళ మడ్డమా బలిమధన దాసులకు
భూతలం బడ్డమా పుణ్యులకు
సేతు కైలాసములు చిర భూములిన్నియును
హె ।త్రోవలట పరమ భాగవతులకును. ॥ఆకాశ॥

అమరావతడ్డమూ హరి దాసులకు మహా
తిమిరంబు లడ్డమూ దివ్యులకును
కమలాసనుని లోకం బదియు నడ్డమూ
విమలాత్ములై వెలుగు విష్ణుదాసులకు. ||ఆకాశ||

పరమ పద మడ్డమూ బ్రహ్మాండ ధరుడైన
ధర వేంకటేశ్వరుని దాసులకును
యిరవైన లోకము లనిన్నిటా భోగించి
వరుసలను విహరించు వర వైష్ణవులకు. ||ఆకాశ||

అ : 5–191

ప. స రి గా పా | గా రి సా || స రి గా పా | గా రి సా - ||
ఆ - కా శ | మ డ్డ మూ || అ - వ్వలయు | న డ్డ మా - ||

గా పా పా | ప ప ద ప పా || గా ప గ రి | సా - - - - ||
శ్రీ కాం తు | భ జి యిం - చు || సే వ కు ల | కు - - - - || ||ఆకాశ||

చ. ప గ గ ప పా | పా ద పా - || ప గ గ ప పా | పా ద ద పా ||
పా - తా - శ | మ డ్డ మా - || బ లి మ ధ న | దా సు ల కు ||

ప గ గ గ పా | పా ద ద పా || ప గ ప ప ప ద | పా - - - - ||
భూ - త లం - | బ డ్డ మూ - || పు - ణ్యు ల కు - | ను - - - - ||

ప గ ప ప దా | ద స స స సా || స స రి గ రీ | సా స స సా ||
సే - తు కై - | లా - స ము లు || చి ర భూ - ము | లి న్ని యు ను ||

ప ద సా సా | ద ద ప ప పా || గ ప గ గ రి | గ రి సా - ||
పై - త్రో వ | ల ట ప ర మ || భా - గ వ తు | ల కు ను - || ||ఆకాశ||

**అవతారిక :**

త్రిన కాలమునాటి తిరుమలనాధుని వైభవములు ఎట్లుండెడివో అన్నమయ్యావారు ఈ కీర్తనమున చెప్పుకున్నట్లు తోచుచున్నది. మణిమయ కాంతులతో ఆభరణములు, అల కారములు, దీపములుగలిగి, కన్నులవైకుంఠముగా నుండియుండవచ్చును. హరి భక్తు లటునిటు నడయాడుచుండగా సుస్వరయుక్తమగు వేదమంత్రాదులు వినవచ్చుచుండగా నిత్యోత్సవములతో వెలుగొందు స్వామివారిని, వారి వైభవమును తాను స్వప్నమునందు కనుగొనిన రీతిగా గీతరూపమున అయ్యవారు పాడుకొన్నదే యీరచన.

భూపాళం — ఝంపె

ఇప్పుడిటు కలగంటి నెల్లలోకములకు
నప్పడగు తిరువేంకటాద్రీశు గంటి. ॥పల్లవి॥

అతిశయంబైన శేషాద్రి శిఖరముగంటి
ప్రతిలేని గోపుర ప్రభలుగంటి
శతకోటి సూర్యతేజములు వెలుగగ గంటి
చతురాస్యు బొడగంటి జయ్యాన మేలుకంటి. ॥ఇప్పు॥

కనకరత్న కవాటకాంతు లిరుగడగంటి
ఘనమైన దీప సంఘములు గంటి
అనుపమ మణి మయమగు కిరీటము గంటి
కనకాంబరము గంటి గ్రక్కన మేలు కంటి. ॥ఇప్పు॥

అరుదైన శంఖ చక్రాదు లిరుగడ గంటి
సరిలేని యభయ హస్తము గంటిని
తిరు వేంకటాచలాధిపుని జూడగ గంటి
హరి గంటి గురు గంటి నంతట మేలు కంటి. ॥ఇప్పు॥

ప. స రి గా గ | గ ప పా ప || పా ద పా | గ గ రి సా ||
ఇ ప్పు డి టు | క ల గం టి || నె ల్లె లో | క ము ల కు ||

సా రి గ గ | గ ప గా రి || స రి గ ప గ | గ రి సా - ||
న ప్ప డ గు | తి రు వేం క || టా - ద్రీ - శు | గం - టి - || ||ఇప్పు||

చ. గ గ గ గ ప | ప ప ద ప ప || ప గ ప ప ద | ద స స స స ||
అ తి శ యం - | బై - న శే - || షా - ద్రి శి ఖ | ర ము గం - టి ||

రి స రి గ గ | గ రి రి స స || స స రి రి గ | గ గ గ గ గ ||
ప్ర తి లే - ని | గో - పు ర - || ప్ర భ లు క ను | గొం - టి - - ||

స రి రి గ గ | గ గ గ గ గ || రి రి గ గ ప | గ గ రీ స ||
శ త కో - టి | సూ - ర్య తే - || జ ము లు వె లు | గ గ గం టి ||

స రి రి గ గ | గ రి రి స స || స స ని ద ద | ద ప గ రి స ||
చ తు రా - స్య | పొ డ గం - టి || జ - య్యా న - | మే - ల్కాం - టి ||
||ఇప్పు||

**అవతారిక :**

ఇందలి నాయిక శాంతురాలు, చతుర, ప్రౌఢ. నాయకని చేతలను చెప్పుచు "నీవు పిలచితివి గనుక నీ చెంతకు వచ్చి ప్రేమను చూపితిని. నీవలిగి యుంటే నేల యలిగితివని అడిగితినా! నీవు నిలిచి ప్రేమతో చూచితివి గనుక నిన్ను నేను చూచితిని. నీవు తలవంచుకొని యుండినచో నే నేమైన అనియుందునా ? నీవు నన్ను చెనకితివి గనుక నేను చేబలిమి చూపవలసి వచ్చినది. నీవు మనసిచ్చి వచ్చితివి గనుక మారుగా నేనవ్వితిని. నీవు నన్ను పై కొంటివి గనుక మారుచేసితిని. నిన్నేమైనా మాయలుపన్ని వలలు వేసితినా పోనిమ్ము. ఇట్లే నా శ్రీవేంకటేశ్వరుడు నన్నేలు కొన్నాడు. జీవాత్మపరమాత్మలవలె మనమిద్దరమొకటైనప్పుడు నేరములు నెపములు ఎంచుట మనకేల"? అని తనమనోభావములను శ్రీవేంకటేశ్వరునకు చెప్పుకొని ఆనందించుచున్నది.

భూపాళం — త్రిశ్రఏక

మూలనున్న వారి నీవు ముంగిట వేసేవు గాక
గోలవై యూరకుండితే కొంగు వట్టేనా ! ॥పల్లవి॥

పిలువగాబో నీతో ప్రేమమున నూ కొంటి
అలిగినట్టే వుంటే నదేమనేనా
నిలిచి చూడగబోనే నిన్ను జూచితిని
తలవంచుకొనియుండే దడవబోయేనా ! ॥మూల॥

చెనకగాబోనే జే బలిమి చూపితిని
కొనగొనలనే వుంటే గోర దీసేనా
మనసిచ్చి నవ్వగాబో మారుకొని నవ్వితిని
వెనకటివలె నుండే వేగిరించేనా ! ॥మూల॥

పైనొరగగానే పో పంతానకే కూడితిని
మాని నీవూరకుండితే మాయ నేసేనా
యీ నెపాన శ్రీవేంకటేశ నన్ను నేలితివి
నేనే నీవైన మీద నేరమెంచేనా ! ॥మూల॥

శృం: 27–504

ప.  పా ద పా గ | రీ గ రీ స | ప ద స స స రి | గా రి సా స ||
మూ ల ను న్న | వా రి నీ వు | ముం - గి ట వే - | సే వు గా క ||

స రి గ పా - | ప ద స ద ద ప | గ రి గ ప ప ద | పా - - - - ||
గో - ల వై - | యూ - ర కుం డి తే | కొం - గు వ ట్టే - | నా - - - - ||మూల||

చ.  ప ద స ప ద ప | గా రి సా | ప ధ స స స రి | గ ప గ రి సా ||
పి లు వ గా - - | బో నీ తో | ప్రే - మ ము న - | నూ - కొం - టి ||

స ద ద ప దా | ద ప దా - - | ప ప గ ప ప ద | పా - - - - ||
అ లి గి న ట్టే | యుం - చే - - | న దే - మ నే - | నా - - - - ||

ప ద సా స రి | గ రి గా - - | రి గ ప గా రి | సా రి స సా ||
ని లి చి చూ - | డ గ బో - - | నే - - ని న్ను | చూ చి తి ని ||

ప ద స రి గ గా | గ రి రి స స స | సా రి స ద ప ద ప | గ ద పా - - ||
త ల వం - - చు | కొ ని యుం - చే - | త డ - వ - బో - | యే - నా - - ||
||మూల||

**అవతారిక :**

"జగత్తును కల్పించి వేరువేరు శక్తుల నొసగి, వివిధరూపములతో దేవతలను సృష్టించి, వారివారికి పనులు కల్పించి జీవులను పుట్టించి, పెంచి లయింప జేయుచు క్రీడించుచున్న నీవు పరమాత్ముడవై యుండియు, శత్రుసంహారమునకు కారణముగా నీభార్యనే పెట్టితివి నీకు బిడ్డల మైన మమ్ములను మృత్యుభయముతో నిత్యము బాధపడునట్లుల జేసితివి ?" అని అయ్యవారడుగు చున్నారు.

**రాగ లక్షణం :**

ధన్యాసిరాగము ప్రాచీనము. ఇప్పటి పద్ధతిప్రకారము ఇది 8వ మేళమగు **తోడి** జన్యము. వెంకటమఖి ఈ ధన్యాసి రాగము నారీరీతిగౌళ మేళజన్యముగాను, భాషాంగముగాను చెప్పియున్నారు ఐనను సుబ్బరామ దీక్షితులవారు ఈధన్యాసియందు శుద్ధరిషభ ప్రయోగములే యుండుటవలన దీనిని **తోడి**జన్యముగనే **పా**డుట సంప్రదాయముగా నున్నదని చెప్పియున్నారు. ఇది రక్తిరాగము. పూర్వులరచనలు, భక్తిరసప్రధానములగు కీర్తనలు ఎన్నోయీరాగమున గలవు.

ఆరోహణ : స గ మ ప ని స !

అవరోహణ : స ని ద ప మ గ రి స !

**ధన్యాసి — ఝంపె**

ఏలయ్య పరమాత్మ యేలికవు మాకునై
నాలినే పెట్టితివి నాడూను
కాలునికి మమ్మునరిగాపులే కమ్మనుచు
నేలనే తిప్పేవునేడూను ! ॥పల్లవి॥

భారమగు నీటిలో బవళించి నీ వాది
నారాయణుడవైతి నాడూను
పైరుగా నిందరిని ప్రకృతి లోపలదెచ్చి
నారుగా బోసితివి నాడూను !

నారపేరిడి తండ్రి నందనుని బిలువ గరు
ణారసము నించితివి నాడూను
చేరికడు మమ్ము రక్షింప నోపక వట్టి
నేరములె యెన్నెవు నేడూను ! ॥ఏలయ్యా॥

దట్టముగ జొచ్చి యిందరి దేహములలోన
నట్టనడు మెక్కితివి నాడూను
అట్టలుగ బ్రహ్మాండ మవియించి జంతువుల
నట్టేటముంచితివి నాడూను
ఒట్టి యిందరికి సరయూ (యువు) దరిని మోక్షంబు
నట్టు కొట్టితి గొంత నాడూను
పొట్టపొరుగున దెచ్చి భూతముల మెడగట్టి
నిట్టి (ట్ట) పిడి నేపేవు నేడూను ! ॥ఏలయ్యా॥

పొలుపుగా మమ్మిట్లు బుట్టించు కొరకు నే
నలిన నాభుడవైతి నాడూను
పలువేలుపులకెల్ల పదవులన్నియు నొసగి
నలుగడల నునిచితివి నాడూను
చలముకొని దానవుల జక్కాడిదేవతల
నలకువలు దీర్చితివి నాడూను
చెలగి యిందరి గావ శ్రీవేంకటాద్రిపై
నెలకొనిటు నిలిచితివి నేడూను ! ॥ఏలయ్యా॥

ప. స గ మా ప | ప ప పా మ || పా ని ని స | ని ద ప పా ||
ఏ - ల య్యా | ప ర మా త్మ || ఏ లి క వు | మా - కు నై ||

ప ని స స్సా రి స | నీ స ని ద ప మ || ప ని స రి ని | సా - - - ||
ఆ - లి నే - - | పె - - ట్టి తి వి || నా - డూ - - | ను - - - ||

ప ని స స సీ | స గ రి స రి || సీ స సా రి స | నీ స ని ద ప మ ||
ఖా - లు ని కి | మ - మ్మ స రి || గా పు లే - - | గ - - మ్మ ను చు ||

ప ని స సా రి స | నీ స ని ద ప మ || ప మ గ రి | సా - - - ||
నే - ల నే - - | తి - - ప్పే - వు || నే - డూ - | ను - - - ||

చ. గా మ ప ప | గా రి సా || స గ రి స రి | రి ని సా స ||
భా ర మగు | నీ టిలో || ప వ ళిం - చి | నీ - వా ది ||

స గ మా మ | మ ప ప మ గ గ || గ మ పా - | పా - - - ||
నా - రా య | ణు డ వై - - తి || నా - డూ - | ను - - - ||

గా మ పా | ప ని ద ప మ || గ మ ప పా | ని ని సా స ||
పై రు గా | నిం - ద రి ని || ప్ర కృ తి లో | ప ల దె చ్చి ||

ప ని స స ని స ని | ద ప ప మ గ || రి స రి నీ | సా - - - ||
నా - రు గా - - - | పో - సి తి వి || నా - డూ - | ను - - - ||

ప ని ని ని ద | ప ప ప ప మ || ప ని ని ని ని | ని ద ప ప మ ||
నా - ర పే - | రి డి తం - డ్రి || నం - ద ను ని | పి లు వ గ రు ||

ప ని స స స | స గ రి ని || ని ద పా నీ - | సా - - - ||
ణా - ర స ము | నిం - చి తి వి || నా - - డూ - | ను - - - ||

ప ని స స గ | మ గ రి స ని || ప ని స స ని | ద ప నీ స ||
చే - రి క డు | మ - మ్ము ర - || ఊం - ప నో - | ప క వ ట్టి ||

ప ని స స ని | ద ప పా మ || గ రి స రి ని | సా - - - ||
నే - ర ను తె | యె - న్నె వు || నే - - డూ - | ను - - - || ||పల

**అవతారిక :**

ఇందు నాయిక విరహార్త. "మాచెలి విరహార్తయై మనసు నిలుపలేక మాటలాడలేక నీ కొరకై ఎదురు చూచుచున్నది. ఈమెను లాలించి మన్నించి పలుకొనవయ్యా శ్రీవేంకటేశ్వరుడా" అని చెలులు శ్రీ వేంకటేశ్వరునితో చెప్పుచున్నారు.

ధన్యాసి – రూపకం

చిత్తగింతువు రావయ్య చెలికడకు
పొత్తుల తలపోతల బోగించీని ॥పల్లవి॥

మనసు నిలువ రాక మాటలను బొద్దువోక
వొనరి విరహమున నున్నది చెలి
కొనలు సాగిన యాల కొప్పున బెట్టే సేస
దనివోక కూటమికి దమకించీని. ॥చిత్త॥

చెమటల దొప్పదోగి సిగ్గులనే కడుమాగి
అమరిన జవ్వనాన నలసీ జెలి
తిమురు వలపులను తియ్యని సొలపులను
జమళిపులకలతో జాజుకొనీని. ॥చిత్త॥

యెగురు చూపులు చూచి యిట్టె కౌగిటికి లాచి
ముదమున జేతులెత్తి మొక్కీ జెలి
అదన శ్రీవేంకటేశ అట్టె నీవు గూడగాను
వుదుటు గళలు రేగి వూరుపు లాగీని. ॥చిత్త॥

శృం : 25–168

ప. సా రి స నీ - ద ప మ || ప ని స రి స రి ని స ||
చి త్త - గిం - - తు వు || రా - వ - - - - య్యా - ||

గ మ పా ని ప మా ప మ || గా ప మ గ రి సా ||
చె లి క - - డ - - || కు - - - - - - ||

- స మ మ మ మ || మా ప ప మ గా ||
- పొ త్తు ల త ల || పో త ల - - ||

- గ మ ప ని సా రి స || సా ని ద ప మ గ మ ప ని ||
- బో - గిం - చీ - - || ని - - - - - - - - - || ||చి త్త||

చ. - ప ప ప ప ప ప మ || గా ప మ గ రి సా ||
- మ న సు ని లు ప - || రా - - - - క ||

- ఫ ని స గ మా || మా ప మ గ మ పా ప ||
- మా - ట ల ను || ప్రొ - - - ద్దు వో క ||

- గ మ పా ప ని || సా రి ని సా ని ద పా ||
- వా న రి వి ర || హా - - ము న - - ||

ని ప మా ప మ గా ప మ గ రి || సా రి ని సా - - ||
ను - - న్న - - ది - - - || చె - - లి - - ||

- ప గ మా పా ప || ని స ని ద పా ప మ పా ||

- గ మ ప ని స || సా రి ని సా సా ||
- కొ ప్పు న - బె || ట్టి న - సే స ||

- స మ మ గ ప మ గా || రి స రి ని సా ||
- త ని వో - క - - || కూ - ట మి కి ||

ప ని స రి స ని దా పా || ని ప మా ప మ గా గ మ ప ని ||
త - మ కిం - - - || చీ - - ని - - - - - - ||

ప. సా రి స నీ - ద ప మ || ప ని స రి స రి ని స ||
చి త్త - గిం - - తు వు || రా - వ - - - య్యా - ||

**అవతారిక :**

నాయిక రమణునితో "యెడ మాటలు మాని చిడిముడి చూపులు వదలి, నా భాగ్యము పండించి నా ముద్దు చెల్లించి నన్నేలుకొమ్మనవే! ఆతనితో పెనుగులాడుట నా వశమా? నేను ఆడుదానను కాదటవే! ఆతడు వేళ యెరిగి పిలిచెదనంటే అది నాకెట్లు తెలుసునే! ఇన్నిమాటలేల ఒక్కటే విన్నపము. వచ్చి నన్నేలుకొమ్మనవే" అని దూతికతో చెప్పి నాయకునకు మనవు లంపుచున్నది.

ధన్యాసి — త్రిపుట

ఒక్కటి విన్నపమే వున్నమాట లికనేల
యిక్కువతో రమణున కెరుగించ గదవే ! ॥పల్లవి॥

యెడమాటలాడే నంటే యెందాకా దిరుగవచ్చు
నడుమ దన చిత్తము నాభాగ్యము
తడయక చూచేనంటే తనిపి యెంతటగల్లు
చిడి ముడి నా చనవు చెల్లించుమనగదే !! ॥ఒక్కటి॥

యెలమి చెనగేనంటే యెంతట దీరీనాస
బలిమికాడు తాను భామను నేను
వెలయ బిలిచేనంటే వేళ యెట్టుగా దెలుసు
తలకొని నను నిట్టే దయజూడు మనుమీ !! ॥ఒక్కటి॥

వెస బెండ్లియాడేనంటే వేడుకకు విలువేది
వసమాయదా నాకు వలపు నాది
యెసగి శ్రీవేంకటేశుడేలె నన్ను దూరనేల
పొసగ నన్నికనిట్టే భోగించుమన (ని) వే ॥ఒక్కటి॥

శృం : 13-160

ప. - - ప ప ప మ గ గ రి రీ || సా స గ రి స రి ని సా ||
- - ఒ క్క - - - టి - - || వి - - న్న - ప - మే ||

- - ఫ ని సా గా || మ ప ప మ గ మ ప ని సా రి స ని ద ||
- - వు - న్న మా || ట లి క - నే - - - - - - - - ||

పా సా స ని ద ప నీ || సా - స మ గ గ రి రీ ||
ల యి క్కు - - - వ || తో - ర మ - ణు - - ||

సా ప ని సా రి స ని ద పా ప మ || గ మ
ని కె రి గిం - - - - చ గ - || ద వె ||ఒక్కటి||

చ. - - ప ప పా ని స ని ద || ప మ గా ప మ గ రి సా ||
- - యె డ మా ట - - - || లా - డే నం - - - ఛే ||

- - ఫ ని సా గా || మ పా ని స ని ద పా ||
- - యెం - దా కా || తి రు గ - - - వ ||

పా గ మ ప ని ద ప ప || ప మ గ రి సా - - ||
చ్చు న డు మ - - త న || చి - - త్త ము - - ||

- - స ప ప ప మ గ మా || పా - ని స ని ద పా ||
- - నా - ఖా - - - - || గ్య - ము - - - - ||

- - గ మ ప ని సా || సా మా ప మ గ రి రీ సా ||
- - త డ య - క || చూ సే - - నం - - ఛే ||

- - ప ని సా - గ రి స || స ని రి స ని ద పా ప మ ప ని ||
- - త ని వి - - యెం - || త - ట - - - క - - లు - ||

సా స స మా ప మ గా గ రి రీ || స గ రి స రీ సా స ని సా ||
గు చి డి ము - - - డి - నా || చ - న - - వు - - - ||

- - ప ని సా రి స స ని నీ స ని ని ప || పా ని ప ప మ గా ప మ గ రి సా - గ ||
- - చె - ల్లిం - - - - - చు - - - - || మ - - న - - గ - - - దే - - ||

మా ప ప ప మ గ గ రి రీ ||
- ఒ క్క - - - - టి - - ||



**అవతారిక :**

ఈ కీర్తనమున "పరమాత్ముడగు శ్రీవేంకటేశ్వరుని యునికి నిజమా కల్లయా అని చెప్పుటకు వలను గాకున్నది. దేవదేవుని యునికిని ప్రత్యక్షముగా తెలుసుకొని అలౌకికానుభవములను పొందుచునేయున్న జీవుడు, తన మాయామయమగు అవిద్యయందు మునిగి తెలియ జాలకున్నాడు" అని అయ్యవారు పాడుకొనుచున్నారు.

**ధన్యాసి – త్రిపుట**

ఇది కల్లయనరాదు యిది నిశ్చయింపరాదు
వదిలాన గొలువగా ప్రత్యక్షమయ్యేవు ! ॥పల్లవి॥

యెదలో నుండుదువని యివన్ని వేదాలు చెప్పగా
వెదకి ధ్యానము సేతు వెస గనుగొంటలేదు
చెదరకందే మరి జీవుడు నున్నాడందురు
పదిలముగా జూతు భావించరాదు !! ॥ఇది॥

అంతటా నుందువని ప్రహ్లాదుడు చెప్పెననగా
చింతించి పట్టదలతు చేతికి చిక్కుటలేదు
సంతతజ్ఞానాన నీ సాకార మున్నదందురు
మంతనాన బిల్తునొకమాట వినబడదు !! ॥ఇది॥

రవిలో నుందువని సురలు నిన్నుగొలువగా
తవిలి పూజించేనంటే దగ్గరి వచ్చుటలేదు
యివల శ్రీవేంకటాద్రి నిరవై నీ వున్నాడవు
తివిరి సేవించితిమి ద్రిష్టమాయ మాకు ॥ఇది॥

అ : 8–210

ప. - - పని | సా సా || నిసరిసనిస | నిదపా ||
- - ఇది | కల్ల || య - న - - - | రా - దు ||

- - గమ | పనిదపమా || మగపమగరి | సారినిసా ||
- - ఇ ది | ని - - - శ్చ || యిం - ప - - - | రా - - దు ||

- - పని | సా సా || సగరిసరిని | సా సా ||
- - పది | లా నా || గో - లు - - - | వ గ ||

- - పని | సారిసనిదపా || మగమపామ | మ గరీసా ||
- - ప్ర - | త్య - - - - - ఘ || మ - - - - | య్యే - - వు ||

చ. - - గమ | పా మా || నిపపమగా || గరిరీసా ||
- - యెద | లో నుం || డు - దు - - || వ - - ని ||

- - ని ని | సారిసనిసనిధపా || ని సా | గా మా ||
- - యిన్ని | వే - - - - దా - - || లు చె | ప్ప గా ||

- - గమ | పని నీ || నిసారిసనిస | నిదపా ||
- - వెద | కి - ధ్యా || న ము - - - - | సే - తు ||

పమగమ | పనిదపమా || గ మపా - మ | పమగరిసా ||
- - వెస | గ - - - ను || గొం - ట - - | లే - - - దు ||

- - పప | పనిపమ పనిపా || పనిసరినిస | సగరీసా ||
- - చెద | ర - - - కం - - || దే - - - - - - | మ - - రి ||

- - సః పః | పః మః గ రిః గ రిః సా || నీ సా రిః సః ని ధ | ప ని సా ||
- - దే - | పు - - - డు - - || ను న్నా - - - - | డం దు రు ||

- - సః ని | గా గా || గః పః మః గ రిః | సా రిః ని సా ||
- - ప ది | ల ము || గా - - - - | జూ - - తు ||

- - ప ని | సః రిః సః ని ద ప మ గ || ప మ ని ప ప మ | గ గ రి సా ||
- - ఖా - | విం - - - చ - - - || రా - - - - - | దు - - - || ||ఇది||

అవతారిక :

ఈ కీర్తనమునందు "కన్నులకు కనబడుచున్న ఈ జగత్తంతయు ఓవిష్ణువా! నీ మహిమయే! ఐనను నాయంతరాత్మవై నీవుండుట వలన నాకు అదియే వైకుంఠము. ఇక అంతులేని నరకపుల వెరపు నాకేల ? నా తనువునందు అనవరతము నీ నామజపము నెలకొనియున్నది, నీవు కల్పించిన మాయామయమగు సంసారపు భయము నాకేల ? రేపన్నదానిలో యేమున్నదో, తెరమరుగు చేసిన ఓ దేవుడా! నాచుట్టునుండెడి వారందరును నాకు చుట్టములే! సద్గురుని యనుగ్రహమువలన నీమరుగు చొచ్చితిని. శ్రీవేంకటేశ్వరుడా! నీదాసుడనైన నేను పుట్టినట్లేయుండి నను నాయెంగిలు లెల్ల బాసినవి" అని అయ్యవారు ఆత్మసమర్పణము చేసికొనుచు స్వామియగు శ్రీవేంకటనాథుని కీర్తించుచున్నారు.

ధన్యాసి – ఝంపె

పుట్టినట్టె వున్నవాడ పోలేదు రాలేదు
యిట్టె నీదాసుడనైతే యెంగిలెల్ల బాసె ! ॥పల్లవి॥

వెలినున్న జగమెల్ల విష్ణుడ నీమహిమే
అలరి నాలోన నీవే అంతరాత్మవు
తెలిసి నేనున్న చోటే దివ్యవైకుంఠము
వెలలేని నరకముల వెరపెల్ల దీరె ! ॥పుట్టి॥

తనువుతో నుండేది నీ తలచిన తలపే నా
మనువు సంసారము నీమాయచేతిదే
పనుల నాకర్మము నీపంచినట్టి పనుపే
మనసులోపలి యనుమానమెల్ల బాసె ! ॥పుట్టి॥

తెరమరుగు దినాలు దేవుడ నీకల్పితమే
సొరిది యీసురలెల్ల చుట్టాలె నాకు
నిరతి శ్రీవేంకటేశ నీమరగు చొచ్చినేడు
గురునియానతి చేత గొంకులెల్ల బాసె ! ॥పుట్టి॥

ప. స స స ని దా పా । ప మ పా ప ప మ గ మా ॥
పు ట్టి న - ట్టె - । పు - న్న వా - - - డ ॥

గ మ ప ని ద ప మ గ । ప మ గ రి సా స ॥
పో - తే - - దు - - । రా - - - లే దు ॥

స మ మ మా । మ ప ప ప మ గ మా ॥
యి ట్టై నీ దా । సు డ నై - - - తే ॥

ప ని స గ రి స । సా రి ని సా ॥
యెం - గి లె ల్ల । బా - - సె ॥ ॥పుట్టి॥

చ. - ప ని నీ ని । రి స ని ద పా ప మ ॥
- వె లి ను న్న । జ - గ - మె ల్ల - ॥

- గ మ ప ని ద ప । ప మ గ ప మ గ రి సా ॥
- వి ష్ణు డా - - - । నీ - - - మ హి - మే ॥

- స రి సా నీ । రి స ని ధ ఫా నీ సా ॥ - స మ మా ప మ గ । ప మ పా - ॥
- అ ల రి నా । లో - న - నీ - వే ॥ - అం త రా - - - । - త్మ వు - ॥

- ప ని నీ నీ - - । రి స ని ద పా మ ॥ - ప ని స గ రీ । సా రి ని సా ॥
- తె లి సి నే - - । ను - న్న - చో టె ॥ - ది వ్య వై - - । కుం ఠ - ము ॥

- ప ని స గ గ । గ ప మ గ రి సా - స ॥ ప ని స రి ని స ని ద ప మ ।
- వె ల లే - ని । న ర క ము - ల - - ॥ వె - ర - పె - - - ల్లి - ।

గ మ ప ని సా - ॥
ది - - - రే - ॥ ॥పుట్టి॥

ఈ పదమునందలి నాయిక రూపగర్విత. ఈమెకు సఖి "చెలీ నీవెంతజేలవే, పేరవెట్టి పాలు తిరిగికాచినచో విరిగిపోవా ? అల్లే చవిగొన్న వలపుతీపులు యెడమైతే కారముగాదా బంగారమువంటి దగు యౌవనమును యనుభవించవలెను గాని వ్యర్థముగా పోగొట్టుకొందురా అనకూలుడగు నాయకుడు నిన్ను లాలించినచో లోనుగావలదా ! అతని నవకంపు చేతలను ఏల కొనవలదా ? శ్రీవేంకటేశ్వరుడగు నీపతి నిన్ను కూడిక లిమ్మనగా యీరాదటే ! వెనుకటి కోపములను తలచి తపించి మనసులు విరచుకొందురటే ! వేసవియెండలు వానకాలమునాటి దాచుకొనగలమా!" యని యెంతో మధురమైన యుపమానములతో చెప్పుకొనుచున్నదని అయ్య వారు లోకవృత్తమునందలి విషయములను కడు మనోజ్ఞముగా పాడుకొన్నారు.

ధన్యాసి — రూపకం

వేసవి యెండలుండునా వేరె వాన కాలానకు
పాసినకాకలు రతి పచరించవచ్చునా! ॥పల్లవి॥

పేరబెట్టితే వలపు పెరుగువంటిదెపో
కేరి కాచబోతే విరిగిపోవుగాని
గారవించే రమణుని కతలకులోగావే
దూరబోయ్యేవుగనక తుత్తుమురౌ మనసు ! ॥వేసవి॥

చవిగొంటే తమకను చక్కెరవంటిదె పో
కవవాసితే అట్టె కారమౌగాని
నవకపునాయకుని నవ్వులెల్లా జేకొనవే
తివిరేరుగనక పై తీగెసాగు చలము ! ॥వేసవి॥

పనిగొంటే జవ్వనము బంగారువంటిదెపో
దినము దాచ్చితే వన్నెదీసుగాని
యెనసెను శ్రీవెంకటేశుడు నిన్నింతలోనే
పెనగేవు గనక ముప్పిరి గొను బీరము ! ॥వేసవి॥

ప. స గ మ ప ని ప ప మ గ || రి స రి ని̣ సా ||
వే - స వి - యెం - - - || డ లం - డు నా ||

గ మ ప ప ని స || రి స ని ద ప మ గ రి స రి ని̣ ||
వే - రె వా - స || కా - - - లా - - - ని - కు ||

సా రి స ని ద పా - || ప మ గ మ ప ని స గ రి స ||
పా - - సి - న - || కా - - - క - లు - ర తి ||

ప ని స రి ని స ని ద పా || మ గ ప మ ని ప ప మ గ రి సా ||
ప చ రిం - - - - - చ || వ - - - చ్చు - - - నా - - || ||వేసవి||

చ. - గ మ పా ప || ని స ని ద ప మ పా ||
- పే ర బె ట్టి || తే - - - వ ల పు ||

- గ మ ప ని ద ప మ గ రీ || సా రి ని̣ సా ||
- పె రు గు - వం - - - టి || దే - - పో ||

- రి స ని̣ ధ̣ ప̣ ని̣ స || స మ మా ప మ మ గ గా ||
- కే - రి - కా - చ || బో - తే - - - - - ||

- స గ మా పా ప || ని స ని ద పా - - ||
- వి రి గి పో వు || గా - - - ని - - ||

- స రి సా ని - || రి స ని ద ప ని స స ||
- గా - ర విం - || చే - - - ర మ ణు ని ||

- ప స ని స మ గ గ రి రీ || సా రి ని సా ||
- క త - ల కు - లో - - || గా - - వే ||

- ప ని సా సా - || సా స ని రి స ని ద పా ||
- దూ - ర బో - || ధ్యే వు - గ - న - క ||

ని స ని స ని ప ప ని ప ని ప మ మ ప మ ప మ గ || ప మ ని ప మ గ రి సా ||
తు - - - - - త్తు - - - ము - లా - - - - - - || మ - న - - - - సు ||

||వేసవి||

**అవతారిక :**

శ్రీమె విరహోత్కంఠిత. నాయకుడగు శ్రీవేంకటేశ్వరునికి నాయిక విరహమును వర్ణింపుచు "మాచెలి విరహావస్థలు జూచి ఆమెయందు నీకేల దయపుట్టదయ్యా" అని చెలులు శ్రీవేంకటేశ్వరుని వేడుకొనుచున్నారు.

**రాగ లక్షణం :**

ఆహిరిరాగము ప్రాచీనము. వెంకటమఖి సంప్రదాయమున నారీరీతి గౌళ జన్యముగాను, భాషాంగముగాను ప్రతిమధ్యమము తప్ప తక్కిన స్వరములన్నియు పలుకునదిగాను వివరించియున్నారు. కాని యిప్పటి వాడుక ప్రకారము వకుళాభరణ జన్యముగానుండి 'ని ద ని స' అను సందర్భమున చతుశ్రుతిధైవతమును, 'స గ స' అనునప్పుడు సాధారణ గాంధారమును పలుకుచు భాషాంగముగా యీరాగము ఒప్పుచున్నది. దీనిని పూర్వాచార్యులు 8వ మేళముగా చెప్పియున్నారు. ఇందలి గ మ క వ రి కాదులు గురుముఖమున అభ్యసించి పాడుకొనవలెను. ఇందుగల స్వరములయందు నొక్కు, జారు, కంపితము పలుకు విధము కొంత కష్టసాధ్యము. 'ని ద ని స' అను నప్పుడు మాత్రమే చతుశ్శృతి ధైవతము పలుకును. 'ద ని ద ప' అను నప్పుడు శుద్ధధైవతమే పలుకును. 'స గ మ ప' అను ప్రయోగము తరచుగా వచ్చును. 'స గ స ని' అనునప్పుడు సాధారణ గాంధారము ఛాయామాత్రముగా తోచును.

**ఆరోహణ :** స రి స గ మ ప ద ని స ।

**అవరోహణ :** స ని ద ని ద ప మ గా రి స ॥

**ఆహిరి – ఝంపె**

రమణి భాగ్యమునేడు రచ్చలకెక్కె
తమకపు వలపు నీతలకేల యెక్కదో ! ॥పల్లవి॥

చెలితలపులో చింత చెక్కిటి చేతికి వచ్చె
యెలమి నీచిత్తమింకా నేలరాదో
నిలువున కాకలెల్లా నిట్టూరుపుల బుట్టె

దట్టపు గోరికలెల్లా తనుపులకలదీరె
యిట్టెవిన్నపాల గతలేల తేరవో
చిట్టకపు విరహము చెమటలగాన వచ్చె
గట్టిగా నీమోహమేల కానరాదో ! ॥రమణి॥

నిక్కుగుచము లింతివి నీ కౌగిటనే మించె
యెక్కువనీ సిగ్గు లికనేల మించవో
ప్రక్కన శ్రీవేంకటేశ పడతిగూడితి విట్టె
తక్కించి మన్నించ నీకు దరియెట్టాయనో ! ॥రమణి॥

శృం : 26–96

ప. పదపమా । గమ పదపమగరిసా ॥
రమణిభా । గ్య -ము - నే - - - డు ॥

సప పపమగమ । పాదని దపా ॥ గమ పదని । స. స స ని సా ॥
ర - చ్చ - ల - - । కె - - క్కె - ॥ త మ క పు - । వ ల పు - నీ ॥

నిదని సా రి స నీ । ని పద ప పా ॥
త - ల కే - - ల । యె - - క్క దో ॥ ॥రమణి॥

చ. గమపదదపా । పపమా గమగరిసా ॥
చెలితల - పు । లో - - చిం - - - త ॥

స రి స నీ । సగమ పదపమగమా ॥
చెక్కిటి చే । తి - కి - వ - - - చ్చె ॥

సగమపా । పద దపపమమ ॥ పదని సా - ని । దనిదపా - ॥
యెలమి నీ । చిత్తమిం - - - కా ॥ యే - ల రా - - । - - - దో - ॥

సఁ రిఁ సఁ సఁ నిదని | సఁ రిఁ సఁ సఁ నిదని ||
నిలు - వు - - న | కాక - లె - - ల్లి ||

సాఁ గ మ గ రి సా | రిఁ సఁ నీ సా సఁ ||
నిట్టూ - - - రు | పు - లబు ట్టె ||

దని సాఁ రిఁ రిఁ స నిదని | సఁ రిఁ సఁ నిదనిదప ||
తలి రుబో - - - డి - | పై - - - నీ - - కు ||

మప ప పమగ మా | గరిసగ మా ||
దయ యే - - - ల | పు - ట్టదో - ||

||రమణి||

**అవతారిక :**

ఈ పదమునందలి నాయిక ముగ్ధ. ఈమె భారములను, కష్ట నిష్ఠురములను ఎవరితో నైన చెప్పుకొనుటకు కూడ మొగమాట పడునట్టి స్వాభావిక—నాథుడగు శ్రీవేంకటేశ్వరుని సన్నిధిని "ఏకాంతము దొరికినంతనే విరహార్తనై ఇతరములేమియు లేకున్నను కనులార నిన్ను జూచుటకు వీలుకలుగకున్నది. కొలువుకూటమున మందిమేళమున నీవుందెదవు. అక్కడికైన నను వచ్చి దర్శింతమనగా పరాకులు చేయుచుందువు. నీ చెక్కులు నొక్కి హెచ్చరించెదనన్న అట్టి వారు వేవేలు నీచెంత నెప్పుడును వుందురు. నేను నెపము లెన్నువారికి వెరువను. అలమేలుమంగ నగు నాకు అందరును చుట్టములే! ఓ శ్రీ వేంకటేశ్వరుడా నీకృపాకటాక్షమునకు పాత్రురాల నైతిని అదియే పదివేలు" అని ప్రేమోత్కంఠితయై చెప్పుకొనుచున్నది.

**ఆహిరి – రూపకం**

ఏమిభాగ్యముననో యిటు విచ్చేసితిగాక
వోమి నీ యవసరము వొకరికి నబ్బునా!                    ॥పల్లవి॥

కడువిరహినై నిన్ను గన్నుల చూచే మంటేను
వడదేరి కొలువు చావడినుందువు
తడవి అక్కడికైన దగ్గరేనంటే నిన్ను
యెడసి నావంటివారు ఎందరైనా వత్తురు!                    ॥ఏమి॥

పక్కన నే నీకు విన్నపము సేసుకొనేనంటే
యెక్కడలేని పరాకు యెప్పుడు నీకు
చెక్కువట్టి తీసి నిన్ను చేతనెచ్చరించేనంటే
వెక్కసాన నట్టివారు వేవేలు గలరు!                    ॥ఏమి॥

పారితెంచి నే నిన్ను బలిమి గూడేనంటే
నేరుతు రందుకు దగునెపము లెల్లా
కోరి శ్రీవేంకటేశుడ కూడితివి నన్నునిట్టె
యీరీతి నలమేల్మంగను యిందరు చుట్టాలే!                    ॥ఏమి॥

శ్లో : 13–22

ప. - ప ద పా ప ప మ గ మా || గ మ ప ద ప మ గ రి సా సా ||
- ఏ - మి భా - - - గ్య || ము - న - నో - - - యి టు ||

రి స నీ సా స గ మా || పా ద ని ద పా ||
వి - - చ్చే సి - - || తి గా - - క ||

- ప ద నీ సా రి స స ని || ద ప ద ని సా ||
- వో - మి నీ - - - - || య వ స ర ము ||

- మ గ మా ప ద ని స ని ద || ప ద ద పా మ గ మ గ రి సా ||
- వొ - క రి - కీ - - - || న - బ్బు - - నా - - - - || ||ఏమి||

చ. - ని ద ని స నీ || ద ని దా పా మా ||
- క డు వి ర హి || నై - - ని న్ను ||

- గ మ ప పా ద ప ప మ | గ మ గ రి స ని ||
- క న్ను ల చూ - - - - | చే - మం చే - ను ||

- స స సా రి స స ని ధ ఫ || ధ ని సా రి స స ని || స గ మా పా ద ప ప మ ||
- యె డ దే - - - - రి - || కొ లు వు చా - - - || వ డి నుం దు - - - - ||

పా - - - - || - ప ప ద ప ప మ పా || ప ద నీ సా - ని సా ||
వు - - - - || - త డ వి - - - అ || క్క - డి కై - - నా ||

- ని ని ద ని సా స ని || ని స రి రి సా స ||
- ద గ్గ రే - - - - || నం - - చే ని న్ను ||

- సఁ గఁ మఁ గఁ సఁ రిఁ సఁ ని || ద ని సఁ రిఁ సఁ ని ద ని సఁ రిఁ సఁ ని ||
- యె డ సి - - - నా - || వం - - - టి - వా - - - రు - ||

ద ప ద ని సా || - ని సఁ నీ - ప ద ప ||
ఎం ద రై - నా || - వ - - - - త్తు రు || ||ఏమి||

**అవతారిక :**

ఇందలి నాయిక బాల, ముగ్ధ, స్వాధీనపతిక. వెన్నెల వెలుగులు మోమునకు, చిరునవ్వులు చిగురుమోవికి, పాలిండ్లమెరుగులు పయ్యెదకు, వయ్యారపువంపులు నడకలకు, యౌవనపుసొగసులు శరీరమునకు అందముల నిచ్చుచుండగా, ఈమె తిరువేంగళనాధుని పొంతలలో చింతలుడిగి సుఖించుచున్నదని అయ్యవారు చెప్పుచున్నారు.

ఆహిరి – ఝంపె

ఇన్నియును దగగలిగె నీయింతి కిదె యిపుడు
కన్నియల కిందరికి గలిగె మోహములూ! ॥పల్లవి॥

నిగనిగని మెఱుగు వెన్నెల మోమునకు గలిగె
చిగురుమోవికి గలిగె జిఱునగవులు
పగటు గను గొనల బలపలని కెంపులు గలిగె
పొగరు చెమటలు గలిగె పొలతి చెక్కులను! ॥ఇన్నియు॥

ఒయ్యారమగు నలపు లువిద మేనికి గలిగె
గయ్యాళి నడపులకు గలిగె మురిపెములు
తొయ్యలికి గలిగె సంతోషంబు బరవశము
పయ్యెదకు గలిగె బయిపైని నునుబూత! ॥ఇన్నియు॥

వెలది కిప్పుడు గలిగె వెంకటేశ్వరుకరుణ
తలపులకు గలిగె చింతా వియోగంబు
పులకలకు గలిగె దలపులలోని జొంపములు
అలుకలకు గలిగె బాయని విలాసములు! ॥ఇన్నియు॥

శృం : 4–87

ప. - ప ద ప ప మ | గ మ మ గ రి స ||
- ఇ న్ని - యు ను | ద గ గ - లి గె ||

రి స స ని సా గ | మ ప ప ప మ గ మా ||
నీ - - - యిం తి | కి దె యి - పు - డు ||

- ప ద నీ స స | రి స స ని స స స ని ||
- క - న్ని య ల | కిం - - - ద రి కి - ||

ద ని స రి స ని సా స నీ | ద ప ద ప ప మ గ మ ||
క - లి - గె - మో - - | హ ము లు - - - - - || ॥ఇన్నియు॥

చ. - మ మ మ మా | గ మ ప ద ప మ గ మ ||
- వె ల ది కి | ప్పు - డు - గ - లి గె ||

- స గ మా పా | ద ని దా ప ప మ ||
- వెం - క చే | శ్వ - రు క రు ణ ||

- గ గ మా మ గ సా | రి స స రి స స ని నీ ||
- త ల పు ల - కు | క - లి గె - చిం - - ||

స గ మ పా | ద ని దా పా - || - ప ద ప ద ని | స స స ని స స ||
తా - వి యో | గం - - బు - || - పు ల క ల కు | క లి గె - త ల ||

స గ మా మ గ రి స | రి స స ని స స స ||

- ప ద నీ సం సం | రిం సం సం ని సం సాం ||
- అ లు క ల ను | గ - లి - గె బా ||

ద ని సం రిం సం ని సాం సం ని | ద ప ద ప ప మ మ గ || మ
య - ని - వి - లా - - | స ము లు - - - - - || - ॥ఇన్ని యు॥

**అవతారిక :**

ఇందు శ్రీలక్ష్మీనారసింహులు సరసములను వర్ణించుచు "ఆమె కిన్నెర మీటి పాడుచుండగా, ఆపాటకు పరవశించి దూరమునందున్న నీవు వడివడిగా వచ్చి, సరసకూర్చుండి ఆమెను లాలించి ఆనందించితివి. మేడపై నుండి ఆమె ఎలుగెత్తి పాడుచు తామర పూవులను నీపై విసరగా ఆమె వద్ద చేరి వినోదించితివి. శ్రీవేంకటేశ్వరుడవై అలమేలుమంగయగు ఆమెను వేంకటాద్రిపై విహరించుచు వలితివి," అని చెలులు స్వామియగు శ్రీనివాసుని నుతించుచున్నారు.

ఆహిరి – త్రిపుట

ఎటువ టి వలపులో యిద్దరికిని
చిటుకంటే మెచ్చేవు శ్రీనరసింహా ! ॥పల్లవి॥

గిరులెక్కి లకిమమ్మ కిన్నెర వాయించుకొంటా
పరగ నీ మోము తప్పక చూడగా
సరుగన నీవు వచ్చి సంగడినే కూచుండి
సిరులతో బొగడేవు శ్రీనరసింహా ! ॥ఎటువంటి॥

యెదురు మేడపై నెక్కి యెలుగెత్తి పాడిపాడి
వుదుటున దామరపూవుల వేయగా
పొదిగి నీ వంతలోనే బుజముపై జేయివేసి
చెదరక చెక్కంటేవు శ్రీనరసింహా ! ॥ఎటువంటి॥

పఱపుపై నీకె పరాకున జెలితోడ
అఱిముఱి నిన్ను జూపేకాంత మూడగా
మెఱయ శ్రీ వేంకటాద్రిమీద వచ్చి కూడితివి
చెఱగువట్టి చొక్కుతా శ్రీనరసింహా ! ॥ఎటువంటి॥

శృం : 25–161

ప. - - స ప ప ప మ గ మా ॥ ప పా ద ని దా పా ॥
- - ఎ టు వం - - - టి ॥ వ ల పు - - లో ॥

- - ప ప ప మ గ మా ॥ గ మ ప మ గ మ మ గ రి సా ॥
- - ఇ ద్ద - - - రి ॥ కి - - - - - - ని - - - ॥

రి స నీ స గ మా పా ॥ ప పా ద ని దా పా ॥
- - - చి టు కం చే ॥ మె చ్చే వు - - - ॥

- - ని స ని ద ప మ ॥ గ మ ప మా ప గ మ గ రి సా ॥
- - శ్రీ - నా - ర - ॥ సిం - - - - హా - - - - ॥ ॥ఎటువంటి॥

చ. - - ప ప ద ప ప మ పా ॥ పా ద ని స ని సా సా ॥
- - గి రు తె - - - క్క ॥ ల కి - - - మ మ్మ ॥

- - స రి సా సా - ని ॥ ద ని సా - ని ని ద దా పా ॥
- - కి న్నె ర వా - - ॥ యిం - చు - - కొం - - టా ॥

- - ప ద పా ప మ ॥ గ మ ప ద ప మ గ మ గ రి సా ॥
- - ప ర గ నీ - ॥ మో - - - - - ము - - - - ॥

సా స ప ప మ గ మా ॥ ప ద నీ - ప ద ప పా ॥
త త్ప క - - - చూ ॥ డ - - - - గా - ను ॥

- - ప ప ప ప మ గ మా ॥ ప పా ద ని దా పా ॥
- - స ర గు - - - న ॥ నీ వు వ - - చ్చి ॥

- - ప ద నీ సా ॥ సా - రి స నీ సా ॥
- - సం గ డి నే ॥ కూ - ర్చుం - - డి ॥

- - స రి గ మ గ రి సా ॥ ని స ని ప ద ని సా ॥

- - సి రు ల - - - తో ॥ పొ - గ - డే - వు ॥

- - ని స ని ద ప మ ॥ గ మ ప మా ప గ మ గ రి సా ॥

- - శ్రీ - నా - ర - ॥ సిం - - - - హ - - - - ॥

- - స ప ప ప మ గ మా ॥

- - ఎ టు వం - - - టి ॥

**అవతారిక :**

దేవదేవోత్తముడగు శ్రీవేంకటేశ్వరుని నాయకునిగా పొందిన ఆమె అతని వైభవములను, చిలిపిమాటలను, చేతలను అన్యాపదేశముగా కొనియాడుచు 'నేను మోసపోయితి' నని చెప్పుచున్నది. ఈమెయందు నాయకుడు అనుకూలుడు. అనుమానముచే కోపించుకొని యున్న యీమెకు ఆతని చేతలన్నియు మర్మగర్భితముగా కనబడుట సహజమేకదా! "మాటలలో దాగి యున్న యీచమత్కారము నెరుగనైతి. నీ చూపులలో గల ఆశలను చూచి వాని వెనుక దాగి యున్న మాయలను గుర్తింపలేనైతి. నీవు నాకు ప్రియుడవగు శ్రీవేంకటేశ్వరునివని తలచినాను గాని, దేవదేవోత్తముడవని గుర్తింపనైతిని, నీ వైభవములను చూచి, పొందవలెనని ఆశించితినే గాని వానికతీతమగు ఆనందమును తెలియనైతిని'' అని యీమె నాయకునితో చెప్పుకొనుచున్నది.

ఆహిరి – ఝంపె

ఆలాగు పొందులును నటువంటి కూటములు
నీలాగు తొల నేడిదె చూడనయితి! ॥పల్లవి॥

అడియాస చూపులకు నాసగించితి గాని
వెడమాయలని లోను వెదకలేనైతి
కడువేడుకల దగిలి గాసి బొందితిగాని
యెడలేని పరితాప మెరుగలేనైతి! ॥ఆలాగు॥

చిఱునగవు మాటలకు జిత్తగించితి గాని
తరి తీపులని లోను దలపనైతి
వరుస మోహపు బిసల వలల జిక్కితిగాని
గరువంపు బొలయలుక గానలేనైతి! ॥ఆలాగు॥

శ్రీ వేంకటేశ్వరుని జింతచేసితి గాని
దేవోత్తమునిలాగు దెలియ లేనైతి
ఈ వైభవముపై నిచ్చగించితిగాని
యీ వైభవానంద మిది పొందనైతి! ॥ఆలాగు॥

అ : 5–80

ప. నీ ద ప మ । పా మ గ మ ॥ గ మ పా ద । నీ ద ప మ ॥
ఆ లా - గు । పొం దు లు ను ॥ అ టు వం టి । కూ ట ము లు ॥

ప ద నీ స । సా ని సా ॥ ని ద ద ప మ । గ మ పా ద ॥
నీ - లా గు । తొ ట నే ॥ డి దె చూ - డ । నై - తి - ॥ ॥ఆ॥

చ. స రి సా ని । ద ని స స ని ॥ స రి స స ని । ద ని స స ని ॥
అ డి యా స । చూ - పు ల కు ॥ నా - స గిం - । చి తి గా - ని ॥

ద ని స రి స । స ని స ని ద ప మ ॥ గ మ ప ద ని । ద ప పా - ।
వె డ మా - య । అ - ని - లో - ను ॥ వె ద క లే - । నై - తి -

స గ మ గ మ । మ ప ప ప మ ॥ ప ద ని ని ప । ద ప పా మ ॥
క డు వే - డు । క ల ద గి లి ॥ గా - సి పొం - । ది తి గా ని ॥

ప ద నీ స । రి స నీ ప ॥ ద ని స స ని । ద ప పా - ॥
యె డ తే ని । ప రి తా ప ॥ మె ఱు గ లే - । నై - తి - ॥ ॥ఆ॥

**అవతారిక :**

ఈ పదమునందలి నాయిక ధీర, ప్రౌఢ, స్వీయ. ఈమెపై నాథుడగు శ్రీవేంకటేశ్వరుని యనుగ్రహముగలిగి ఆతడురాగా ఈమె "నీతో నొత్తి విన్నవించుటకు వోపలేని దానను. విరహార్తనై యున్న నేను యెప్పుడేమౌదునో. ఇప్పుడైన నొకసారి నన్ను చేరదీయరాదా? అగ్గలమైన నీపై వలపుచే మాటలు తడబడుచున్నవి మరువక నాకడకొకసారి రాలేవా? నాకు వేవేలు పనులున్నవి ఈకాయమును నీవొకసారి కౌగలించుకొని నన్నొకసారి ఆనందింపజేయలేవా? నా యౌవనమును నీకు దవ్వుదవ్వుల నుండియే యింతవరకు జరిపితిని. ఇప్పుడైన నాకడ పవ్వళించి బాయకుండరాదా?" అని కడుదీనముగా శ్రీవేంకటపతిని వేడుకొనుచున్నది.

**ఆహిరి – రూపకం**

పాయరాని పదివేలు పనులు నీకు యీ
కాయము నీవిప్పుడైన కౌగలించుమీ! ॥పల్లవి॥

చిత్తజ తాపముచేత చిక్కువడ్డ దానం గాన
వొత్తినీతో విన్నవించ నోపంగాని
యెత్తిన నీ విరహాన యేమౌదునో నన్ను
చిత్తగించ యెప్పుడైన జేరంగ రమ్మి! ॥పాయరాని॥

తరి నిన్నుంబాసి మాట తడబడే దానంగాన
నెరి నిన్నుం దూరనాడ నేరంగాని
యెరగొని తలచిర యెరంగకున్నప్పుడైన
కరగి మఱవక నాకడ చూడుమీ! ॥పాయరాని॥

దవ్వుల నిందాక నీకు తమకించే దానంగాన
జవ్వన మంటకు మనం జాలంగాని
రవ్వైన వేంకట రమణ నా వద్ద నిట్టే
పవ్వళించి నేడైనా బాయకుండుమీ! ॥పాయరాని॥

ప. ప ప ద ని స సా ॥ ని ప ద స దా పా ॥
పా య రా - - ని ॥ వ ది వే - - లు ॥

ప మ గ మ పా ద ని ద ప ॥ ప మ గ మ ప మ గ మ గ రి సా ॥
వ - ను - - లు - - - ॥ నీ - - - కు - - - యీా - - ॥

సా రి స స ని స ని సా ॥ స ప ప ప మ గ మా ॥
కా య - ము - - - నీ ॥ వి ప్పు డై - - - న ॥

గ మ ప ద పా ద ని సా స ని ॥ ద ని ద పా - ॥
కా - - - గ లిం - చు - - ॥ మీ - - - - ॥ ॥పాయ॥

చ. ప ప ద ప ప మ గా ॥ గ మ పా ద ని దా పా ॥
చి త్త జ - - - తా ॥ ప - ము చే - - త ॥

ప ద ని ని ప ద ప ॥ ప మ గ మ ప మ గ మా ॥
చి - క్కు వ - డ్డ - ॥ దా - నం - గా - - న ॥

పా ద ప ప మ గ మ మ గ రీ ॥ స పా రి స స ని సా ॥
వా త్తి - నీ - - - తో - - ॥ వి న్న విం - - - చ ॥

స గ మా పా ద ని స నీ ప ॥ ద ని దా పా - - ॥
నో - - పం గా - - - - ॥ - - - ని - - ॥

ప ద నీ సా రి స స ని ॥ ని ద నీ సా సా ॥
యె - త్తి న నీ - - - ॥ వి - ర హా న ॥

స రి గ మ మ గ రీ సా స ని ॥ ని ద నీ సా - - ॥

ని ని ద ని సఁ రిఁ సఁ ని ద ని ॥ ద ని సఁ రిఁ సఁ ని ద ని ద ప ॥
చి త్త గిం - - - - చి - - - - ॥ యె - ప్పు - డై - - - న - ॥

ద ని సా సా - ని నీ - ప ॥ ద ని ద పా - - ॥
జే - రం గ - - ర - - ॥ - - - మ్మి - - ॥ ॥పాయ॥

**అవతారిక :**

ఈపదమునందలి నాయిక మానవతి. ప్రౌఢ. ఈమె చేతలకు నాయకుడు కోపగించుకున్నాడో లేక అతని చేతలకు ఈమె కోపగించుకొన్నదో తెలియని సఖులు "మీయిద్దరు పొలయలుకలలో ఎట్లు నడచుకొన్నారో తెలియుటలేదు. ఆమె బిగిసియున్నది. నీవేమి చేసితివో ? కోపగించుకొంటివేమో, ఆమె మ్రొక్కవలసి వచ్చినది. తీపులను తిట్టియుందువేమో, అందులకామె దీవించవలసివచ్చె, చూపులను నీవామెను జంకించితివేమో ! అందుకామె పెనగవలసివచ్చె- నీవామె చేపట్టి దిగిచితివో యేమో ఆమె తన చెక్కులనొక్కవలసి వచ్చె. నీవు బలిమిగా నవ్వుటచే ఆమె సిగ్గుపడవలసివచ్చె. అట్లేనీవు పైకొనగా ఆమె నీకు కైవశము గావలసివచ్చె. ఏమిచేసి కొంటివో శ్రీవేంకటేశ్వరుడా" అని గోముగా వారి పొలయలుకలు సర్దిచెప్పి వారినేకముచేయుటకు ప్రయత్నించుచున్నారు.

**రాగ లక్షణము :**

సోమ ప్రాచీనరాగము. 14వ మేళమగు వకుళాభరణ జన్యము. ఇదిప్రాచీనరాగమైనను ఇందు ఇతర వాగ్గేయకారుల రచనలు దొరకుటలేదు. దీనికి నామ సామ్యముగల సామ అను మరియొక రాగముగలదు. అదియు అంత ప్రచారమునందు కానవచ్చుటలేదు. కాని కొన్నియైనను రచనలు అందు వినబడుచున్నవి.

సోమయను రాగమునకు రచనల మాటయట్లుండ, రాగ స్వరూపమును చెప్పెడి యాధారములు కూడ దొరకుట కష్టముగనే యున్నది. అందమగు స్వరసంపుటితోనుండిన యిట్టి రాగములు వాడుకనుండి తొలగిపోవుట తిరిగి ప్రచారమునకు వచ్చుట విచిత్రముగా నున్నది.

**ఆరోహణ : స రి మ ప ను ద ని స**

**అవరోహణ : స ని ద మ గ రి స**

**సోమ — త్రిపుట**

బిగిసి యాపె నీకు బెట్టని కోట
యెగసక్కెలకు నీవు యేమి సేసుకొంటివి ? ॥పల్లవి॥

కోపగించుకోబోగా కొలిచి మొక్కవలసె
తీపుల దిట్టినందుకు దీవించవలసె
చూపుల జంకించగాను నూడక పెనగ వలసె

చేపట్టి తియ్యగ బోగా చెక్కులు నొక్కవలసె
చేవమీర నవ్వగాను సిగ్గువడవలసె
కావరించి పైకొనగా కైవశము గావలదె
యే (యీ) విదాన నుండి వుండి యేమిసేసుకొంటివి ? ॥బిగిసి॥

కాకలుసేయగబోగా గక్కన గూడవలసె
పోకముడి యంటగాను భోగించవలసె
వేకపు శ్రీ వేంకటేశ వెలది గలిసి తిట్టె
యేకట నీ యంత నీవు యేమి సేసు కొంటివి ? ॥బిగిసి॥

రేకు: 27–389

ప. - - మ ప మా ద ని స ని ॥ ద మా మ గ రీ సా ॥
- - బి గి సి యా - - - ॥ పె - నీ - - కు ॥

సా స స ని ని ధ ధ ని స రి ॥ మ ప ప మ ద ని ద మ గ రి సా ॥
- బె ట్ట - - - ని - - - ॥ కో - - - ట - - - - - - ॥

- - స రి మ గ రీ మ ప ॥ మ దా ని ద నీ ॥
- - యె గ స - - క్కే - ॥ ల కు నీ - - ॥

సా స రి స ని సా ని స నీ ॥ ద ని ద మ మ గ రీ సా ॥
వు యే - మి - - సే - - ॥ సు - కొం - టి - - వి ॥ ॥బిగిసి॥

చ. - - మ మా మ ప మ గ ॥ రి స రి మ గ రి రి స నీ సా ॥
- - కో ప గిం - - - ॥ చ - - గ - - బో - - గా ॥

- - ధ ని సా - రి మ గ రీ ॥ రి స రి మ ప మ ద ద మా ॥
- - కొ లి చి - - మొ - - ॥ క్క - - వ - - ల - సె ॥

- - ద ని సాం సా - ని ॥ ద ని సా రి స ని ద ద మ మా ॥
- - తీ - పు ల - - ॥ తి - ట్టి - - - - నం - దు ॥

గా స రి మా - ప గా ॥ మ గ రి స రి మ పా - - ॥
కు దీ - విం - - చ ॥ వ - ల - - - సె - - ॥

- - స రి మ ప మా దా ॥ ద మా దా - నీ సా ॥
- - చూ - పు - - ల ॥ జం - కిం - చ గా ॥

సా స రి మా - ప గా ॥ మ గ రి స ని ద ని ని సా ॥
ను సూ - డు - - పె ॥ న - గ - - - వ ల సె ॥

- - స సా సా రి స ని ద ॥ ద మా దా - ని ద నీ ॥
- - యే పు న - - - - ॥ నెం - త - కు - నెం ॥

సా సా రి స ని స నీ ద ని దా ॥ మ గా మ గ రీ సా ॥
త యే - - మి - - సే - - ॥ సు కొం టి - - ధి ॥ ॥భిగిసి॥

**అవతారిక :**

ఈ పదమునందలి నాయిక రూపగర్విత. కలహాంతరిత. ఈమె సౌందర్యాదులను నాయకుడగు శ్రీవేంకటేశ్వరునకు చెప్పుచు "మాచెలి నోరెత్తితే పగడాలు రాసులుగా పడగలవు. ఈమె కనులెత్తి చూచితే కెంపులే రాలేను సుమా! మాచెలి రత్నాలరాసులు కానుకలివ్వగా భండారమున దాచుకొనవా, సొమ్ములు చేయించుకొని అలంకరించుకొనవా, ముత్యాల సేరులు పెట్టి మాయమ్మవారిని పెండ్లాడితివి. ఇప్పుడేమైనది, ఏల అలిగియున్నావు" అని చెలులు విన్న వించుచున్నారు. ఇందు అయ్యవారు చిత్రించిన వాక్చిత్రము చమత్కారముగా నున్నది. అమ్మ వారు నోరువిప్పినచో అగ్నిగోళములవంటి పగడములు రాసులౌనట. స్వామివారిని ఆమె తిట్టి నను తప్పులేదట పైగా వెలలేని యీరత్నరాసులు ఆతడు భండారమున దాచుకొనవలెనట. సొమ్ములు చేయించుకొని బండారమున అలంకరించుకొనవలెనట. అహో! యేమి చమత్కార మాయ్యా నీది అన్నమయ్యా !

**రాగ లక్షణం :**

మాళవి గౌళ ప్రాచీనరాగము ఇది యిప్పటి వాడుకప్రకారము 15 వ మేళమగు మాయా మాళవ గౌళగా వ్యవహారింప బడుచున్నది. సంపూర్ణ-సంపూర్ణము. ఇందు యితర వాగ్గేయకారుల రచనలు అక్కడక్కడ కనబడుచున్నవి. సంగీత విద్యాప్రారంభకులకు యీ రాగమునందు సరళి, జంట, అలంకారములు మొదలగు ప్రారంభికరచనలు చెప్పుట పరిపాటి. ఇట్లు చెప్పెడి పద్ధతి ఎప్పటినుండి ప్రారంభమైనదో ఇదమిత్థముగా చెప్పుటకు వలను కాకున్నది. కాని అన్నమాచార్యులవారికి సమకాలికులగు పురందరదాసులవారు ఈ బోధనా పద్ధతిని ప్రవేశపెట్టిరని వినవచ్చుచున్నది.

**మాళవిగౌళ – రూపకం**

ఏమాయ నిందుకు నీ వెగ్గులేల పట్టేవు
కామిని నీ చెక్కు నొక్కి కైకొనవయ్యా ! ॥పల్లవి॥

పడతి నోరెత్తితేను పగడాలే రాసులయ్యీ
యెడపు నిన్ను దిట్టితే నేమాయనయ్యా
కడలేని రత్నాలు గానుక వచ్చిన నీవు
తడవి భండార్నాన దాచుకోవటయ్యా ! ॥ఏమయ॥




మగువ చూపులవంక మాణిక్యాలే రాలీని
తగ గోపించి చూచితే తప్పటవయ్యా
సొగిసి మఱులు దాచి సొమ్ములు నీకిచ్చితేను
జిగి మేన ధరియించి చెలగవటయ్యా ! ॥ఏమాయ॥

ముంచి చెలి నవ్వితేను ముత్తేలే రాలీని
యించుక గేలిసేసితే నేమాయనయ్యా
పెంచెపు శ్రీ వేంకటేశ పెండ్లి ముత్యాల సేస
వంచి కూడి చెలి మాన వచ్చు నటయ్యా ! ॥ఏమాయ॥

శృం : 26—167

ప. సా స ని దా పా ॥ ప మ గా మా ద ప దా ॥
ఏ మా - - య ॥ నిం - - దు కు - నీ ॥

ని స ని ద ప మ ప ద ప మ గ రి ॥ స రి గ మ పా గ మ ప ద నీ ॥
వె - - -గ్గు - తే - - - ల - ॥ ప - - - - ట్టే - - - వు ॥

స రి గ మ గ రి సా ॥ ని స రి స ని ద నీ స ॥
కా - మి - ని - నీ ॥ చె - - -క్కు - నొ క్కి ॥

స స ని ద ని ని ద ప ద ద ప మ ॥ ప మ గ రి గ మ ప ద నీ ॥
కై - - -కొ - - న - - - ॥ వ - - -య్యా - - - - ॥ ॥ఏమాయ॥

చ. - స ద పా మ ప ద ప మ ప ॥ ప ప మ గ మా ద ప ద ॥
- ప డ తి నో - - - - - ॥ రె - - - త్తి తే - ను ॥

- ప ద నీ సా ॥ స ని దా ప మ పా ప ॥
- ఫ గ డా లే ॥ రా - - స్తు - ల య్యా ॥



- గ మ ని ద పా ॥ ప ప మ గ మ ద ప మ గా ॥
- యె డ పు ని న్ను ॥ ది - - - ట్టి - తే - - ॥

- రి గ మా - ద ప మ గా ॥ ప మ గ రి సా - - ॥
- నే - మా - - - - య ॥ న - - - య్యా - - ॥

- ప ద ని స రి గ రి స రి ॥ గ మ ప మ గ రి సా స ॥
- క డ లే - - - - - ని ॥ ర - - - - - - త్నా లు ॥

- స ని స రి సా స ॥ రి స ని ద నీ సా ॥
- కా - ను - క వ ॥ చ్చి - న - నీ వు ॥

- ప ద నీ సా ॥ స ని దా ప మ పా ॥
- త డ వి బం ॥ డా - - రా - న ॥

మ గ మ ద ప ద ని స ని ద ప మ ॥ ద మ గ రి స రి గ మ ప ద నీ ॥
దా - చు - - - కో - - - వ - ॥ ట - - - - - య్యా - - - - ॥

॥ఏమాయ॥

**అవతారిక :**

ఈ కీర్తనమునందు "జీవులు చేసెడి పాపములు ఎట్టివైనను, అవి అల్పాతి యల్పములు. అతి ఘనమగు మహిమాతిశయముగల నీ నామము కావలెనా వీనిని యణచుటకు ! ఇది పిచ్చుకపై బ్రహ్మాస్త్రము వేసినట్లు, ఒక పోకను గొనుటకు కొండంత బంగారమును వెల యిచ్చినట్లును, సముద్రము ఓడపై దాటి ఇనుమును తెచ్చుకున్నట్లును వున్నది. ఎట్టి తపంబులైనను, పుణ్యములైనను నీ నామఫలమునకు సాటియా? వెంకటాచలపతియగు శ్రీవేంకటేశ్వర నామస్మరణ మాత్రము జీవులను తరింపజేసెడి దివ్యప్రభావా! నీకు నమస్సులు" అని అయ్యవారు నారాయణ మంత్ర ఫలంబును కొనియాడుచు స్వామిని కీర్తించుచున్నారు.

**మాళవగౌళ — ఆది**

నారాయణ నీ నామ మహిమలకు
గోరబోవుటకు గొడ్డలి దగునా ! ॥పల్లవి॥

హరి యని నొడిగిన నణగెటి పాపము
సిరులనేను నుతిసేయగ గలనా
పరగిన పిచ్చుకపై బ్రహ్మాస్త్రము
దొరకొని వూరకె తొడిగిన యట్లు ! ॥నారా॥

అచ్చుతయనగా నందెటి సంపద
యిచ్చల నెంచిన నిలగలవా
కొచ్చికొచ్చి యొక కొండంత కనకము
వెచ్చపు బోకకు వెల యిడినట్లు ! ॥నారా॥

యెదుటనె శ్రీ వేంకటేశ్వర యనగా
బొదిగెటి తపముల పుణ్యము గలదా
కదిసి సముద్రము గడచి వోడలో
జిదిసి యినుము దెచ్చిన యట్లు ! ॥నారా॥

అ : 9–285

- గ మా పా - ప ద ప మ | గ మ ప మ మ గ | రి స రి గ ||
- నా - కా - య ణ నీ - | నా - - మ మ - | హి మ ల కు ||

- స రి గ మా ప ద పా ప మ | గ మ ప ద ప మ గ రి | స రి గ మ పా ||
- గో - ర బో వు - ట కు - | గో - - - డ్డ - లి - | త - గు - నా ||
||నారా||

- ప దా ని సా స ని దా పా |
- నా - రా - య - ణ నీ |

- ద దా ద దా ప ద ప మ గ మ | ప ద ప మ గ మ గ రి | స రి గ మ ||
- హా రి య ని నొ - డి - గి న | న - ణ - గె - టి - | పా - ప ము ||

- స దా ప ప మ గ మ మ గ రీ | స రి గ మ | ప ద ప ద పా ||
- సి రు ల నే - - ను ను - తి | సే - య గ | గ - ల - నా ||

- ప దా ని సా స రి సా స ని దా | ప మ గ మ పా - ద | నీ స స ||
- ప ర గి న పి - - చ్చు - క | పై - - - బ్ర - - | హ్మే స్త్ర ము ||

- స రీ గ మా మ గ రీ సా స ని | రి స ని ద స ని ద ప |
- దొ ర కొ ని వూ - - ర కె - | తొ - డి - గి - న - |

ని ద ప మ ద ప మ గ || మ గ మా పా - ప ద ప మ |
య - - - ట్లు - - - || - నా - రా - య ణ నీ - |

**అవతారిక :**

ఈ పదము నందలి నాయిక ముగ్ధ. నాయకుడకు శ్రీ వేంకటేశ్వరుని తమ చెలి కడకు గొనివచ్చిన చెలులు అతనితో "నీవు సర్వము నెరిగినవాడవు మా చెలియగు అలమేలు మంగాదేవి ముగ్ధ. మిమ్ముల నిద్దరును ఒకచో చేర్చుటయే మా పని. ఇక మీదటి పని నీది. చేతులతో మ్రొక్కి చిరునవ్వులు నవ్వుచు ఆమె అక్కడే నిలచియున్నది. నీకు మేము యింకేమి చెప్పవలెను. గుట్టుగా కన్నులెత్తి చూచి కానుకలు నీకిచ్చిన మా చెలితో పన్నుకొని సరసాలు నీవలె పంచుకోవలెగాని పలుకుటకు మాకేమి యున్నది. ఆమె వలపు నీపై నుంచి మనసు నీకే యిచ్చినది. ఇచ్చకముల నెరిగిన నీవే ఆపై పనులెరుగుదువు." అని మేలమాడుచు ఆది దంపతులగు నాయికా నాయకులను సన్నిహితుల జేసిరని అయ్యవారు చెప్పుచున్నారు.

**రాగ లక్షణము :**

మంగళకైశిక రాగము భాషాంగము. రెండు మధ్యమములు సందర్భానుసారముగ నిందువచ్చును. వెంకటమఖి సంప్రదాయమున చ్యుత మధ్యమము యీ రాగమున చెప్పినను ఏలనో దీనిని భాషాంగ మనలేదు మాయా మాళవగౌళ జన్యముగా ఇప్పుడు దీనిని పరిగణింప వలసియున్నది అతి ప్రాచీన రాగమగు యీ మంగళకైశిక 72 మేళకర్తల పద్ధతి రాకమునుపే ఎంతో ప్రచారముననున్నది.

స రి గ మ ప మ ద ని స - స ని ద ప మ గ రి స అను ఆరోహ ణావరోహణములు కలిగియున్నను 'గ మ మ² మా మ² గ రి సా - స ని రి గ మా - మ గ ద ప స ని రి స' అనునవి విశేష ప్రయోగములుగా గుర్తుంచుకొనవలయును. ఇచ్చట ఒక్క విషయము మనము చెప్పుకొనవలసియున్నది. మేళకర్తల పద్ధతికి పూర్వముండిన రాగములు చాలవరకు ఆరోహణావరోహణములపై గాక కొన్ని ముఖ్యమైన స్వర సందర్భములు గల రాగపు ఛాయలతోనే ఎక్కువగా గుర్తింపబడుచుండెడి వేమోనని అనుకొనవలసి యున్నది. ఇందుకు మంగళకైశిక, ఆహిరి, ఘంటా, సైంధవి, నవరోజు, మారువ, ద్విజావంతి, గౌరిపంతు మొదలగు రాగముల స్వరూపలే ఉదాహరణములు.

**మంగళకైశిక — రూపకం**

ఇందాకా మాపని యిక నీపని
కందువాయ వలపులు కపట మేమున్నది ? ॥పల్లవి॥

చేతులనె మొక్కి మొక్కి సెలవుల నవ్వు నవ్వి
ఆతలనె నిలుచున్న దదివో చెలి
కాతరాన యిక మీద గలిగిన పనులు నీ
చేతి వింతె యిక నీతో చెప్పనేమి వున్నది ! ॥ఇందాక॥

కన్నులనె నిన్నుజూచి కానుక నీకంది యిచ్చి
అన్నిటా గుట్టున నున్నద దివో చెలి
సన్నలూను మీలోని సరసాలు నిట మీద
పన్నుకో నీవె నేర్తువు పలుక నేమున్నది ! ॥ఇందాక॥

మచ్చిక నీకు జేసి మనసు నీపై బెట్టి
యిచ్చట గాగిలించె నిదివో చెలి
అచ్చపు శ్రీ వేంకటేశ ఇట్టె నీవు గూడితివి
యిచ్చకము లిట మీద నిన్ని నెఱుగుదువు ! ॥ఇందాక॥

శృం: 15-255

ప: సా - ని ద ద మా || మ గ మా ద ప దా - ||
ఇం - - దా - క || మా - - ప - ని - ||

మ మ గ మ మ మ గ మ మ మ || ద ప ద మ పా - - ||
యి క నీ - - - - - - - || - - ప - ని - - ||

గ మ మ మ మ గ రి స || స ని ధ ధ రి స రీ ||
కం - - దు వా - - య || వ - ల పు లు - - ||

స మ గ మా ద ప దా || స ని ద ని సా - ||
క ప - ట మే - - || ము - - న్న ది - || ॥ఇందాక॥

చ. - ద ద ద స ని దా || ద మ ప ప ప మ గ మ ||
- చే తు ల నె - - || మొ - క్కి మొ - - - క్కి ||

- రి గ మ మ గా మ మ మా మ ద || మ మ గ మ మ గ రి స ||
- సె ల వు ల నే - - - - - || న - - వ్వు న - - వ్వి ||

- రి స స ని స రి స || ని స రి స స ని ధా ధ ధ ||
- ఆ త ల నే - - - || ని - ల - చు - - న్న ది ||

రి స రి గ మా - మ ద || మ మ మా - - ||
అ ది వో - - - - - || - చె లి - - ||

- స రి గ మ ద ద || ప మ గ మ ద ప దా ||
- కా - త రా - న || యి - క - మీ - ద ||

గ మ ద ద ని ద || స ని ద ని సా - ||
క లి గి న - - || ప - ను లు నీ - ||

- స రి గ మ గ రి సా || ని స రి స స ని దా ని స రీ ||
- చే - తి - - - నిం || తె - - - యి - క నీ - - ||

స ని ద మ ప ప మ గ మ || స గ మా ద ప ద ని || సా - ని ద ద మా ||
తో - - - చె - - - ప్ప || నే - మి యు - న్న ది || ఇం - - దా - క ||

**అవతారిక :**

ఈ పదము నందలి నాయిక ముగ్ధ. నాయకుని చేతలకు ఆతనికడ నేమియు నన జాలని బేల. ఆతని సన్నలను, సంకేతములను, గుర్తించియు గుర్తించనియట్లు చెలులతో యలుక లేని యలుక కనబరచుచు "నాథుని గొప్పదనమును నాకడ చెప్పకొనకురే చెలులారా! కన్నుల చూచుటలు, కాకలుసేయుటలు, సన్నలు చేయుటలు, చవులూరించుటలు, నవ్వులు సేయుటలు, పువ్వులు వేయుటలు, బుజ్జగించుటలు, నెయ్యపు మాటలాడుటలో మునిగి, శ్రీవేంకటేశ్వరుడు పతియైతన యురమున జెట్టుకొన్న నన్ను దించుటయేమరచియున్నాడు" అని చెప్పచున్నది.

అహో! అలమేలుమంగపతీ! నీ లీలలు అద్భుతములు. వానిని కనులారగని వర్ణించిన అన్నమయ్య రచన లింకను అద్భుతములు. ఇందలి నాయిక సౌందర్యరాశి. ఆమె సౌందర్యమును ఇనుమడింపజేసెడి చేతలతో నాయకుడానందించుచున్నాడని ఆమె తెలిసికొనియు తెలిసి కొననట్లు చెలులకు చెప్పచున్నదని అయ్యవారు చమత్కారముగా ఈ పదము పాడుకొన్నారు.

**రాగ లక్షణము :**

మలహరి రాగము ప్రాచీనము. ఇది యిప్పటి వాడుక ప్రకారము 15వ మేళమగు మాయా మాళవగౌళ జన్యము. 'స రి మ ప ద స - స ద ప మ గ రి స' అనునవి ఆరోహ ణావరోహణములు మతభేదములు లేక లక్షణకారులందరును ఒకే విధముగా చెప్పిన రాగములలో నిది యొకటి మహానుభావులైన పురందరదాసులవారి పిళ్లెయారి గీతములు ఇప్పటికిని వాడుకయందున్నవి. ఇటీవలి వాగ్గేయకారులు యీ రాగమునందు రచనలు చేసినట్లు కాన వచ్చుటలేదు. ఈ రాగమునందు తాళ్ళపాకవారి రచనలనేకములు కనబడుచున్నవి. ముద్దుస్వామి దీక్షితులవారి రచన మాత్రము ఒకటి యిప్పుడు పాడుచున్నారు.

**మలహరి – రూపకం**

ఆయలేరే యేమిచెప్పే రాతని సుద్దులు నాకు
తాయి మక్కళాలేకాక దయగద్దా తనకు! ॥పల్లవి॥

కన్నుల జూడనే పట్టె కాకలు సేయనే పట్టె
యిన్నిటా తా నన్నుగూడే డెప్పుడోకాని
సన్నలు సేయనే పట్టె చవులు చూపనే పట్టె
వెన్నెల బాయిటికి రావేళలేదు తనకు! ॥ఆయ॥

నవ్వులు నవ్వనే పట్టె నాలి సేయనే పట్టె
యివ్వలనన్ను గూడేది యెన్నడే రామ
పువ్వులవేయనే పట్టె బుజ్జగించనే పట్టె
పవ్వళించ బొద్దులేదు పనులేలే తనకు ! ॥ఆయ॥

మాటలాడనే పట్టె మనసు చూడనే పట్టె
యీటున గాలుదొక్కేది యెన్నడే తాను
పాటించి శ్రీ వేంకటాద్రిపతి నన్ను నురముపై
తేటలుగా నెక్కించుక దించనెడ లేదు ! ॥ఆయ॥

శృం : 23–303

(ఇది పెద తిరుమలాచార్యులవారి కీర్తన)

ప. - మ ప ద స ద || మ ప దా ద ద వ పా మ ||
- ఆ య లే - రే || యే - - మి చె - - ప్పే ||

మ గ రి స రి మా || ప ద ద ప ప మ పా ||
రా - - త ని సు || ద్దు లు నా - - - కు ||

- మ మ మా మ గ || రి మ ప ద ప మ గ రి స ||
- తా యి మ క్క - || శా - - - లే - గా - క ||

- మ ప దా సా || ద ద ప మ గ రి స రి మ ప ద ప ||
- ద య గ ద్దా || త - న - - - కు - - - - - || ॥ఆయ॥

చ. - స రి మ మ మా || ప ద ప మ గ రి స రి గా ||
- క - న్నుల జూ || డ - నే - ప - - - ట్టె ||

- స రి మ మ ప మ గ రి || స ధ ధా సా ||
- కా - క లు సే - - - || య నే ప ట్టె ||

- స రి రి రీ || ద ద ప మ గ రి గ రి సా ||
- యి న్ని టా తా || న - న్న - గూ - - - డే ||

స రి మ మ ప ద ప ద || పా - - - - ||
దె - ప్పు డో కా - - - || ని - - - - ||

- ప ద స స రి మా || గ రి స రి గా ||
- స న్న లు సే - - || య నే ప - ట్టై ||

- స రి ప మ గా రి || స రి గా గ రి రీ సా ||
- చ వు లు - చూ - || ప - నే ప - - ట్టై ||

- ప ద స స రి గా || రి స రి సా - ||
- వె న్నె ల కా - - || యి టి కి రా - ||

- ద రి సా ద ప మ || ద ద ప మ గ రి స రి మ ప ద ప || ద
- వే - ళ లే - దు || త - న - - - కు - - - - - || - ||ఆయ||

**అవతారిక :**

సంకీర్తనమునందు శ్రీహరి నామమును జపించుటయు, శ్రీహరి పూజలను చేయుటయు ధృవవరదుడగు నాతనిని తలచుటయు, సూర్యచంద్రులే నేత్రములుగా గలిగిన ఆ పరమాత్ముని తెలుసుకొనుటకు ప్రయత్నించుటయు, సంకెలను బాపుకొనిన జాణలు సంకీర్తనమునందు లగ్నమనస్కులై చేయదగిన పనియని అట్లు చేసిన వారికి ఆత్మశాంతి, గృహశాంతి, గ్రహశాంతి, దేహశాంతి మొదలగు సౌకర్యములు కలుగునని అయ్యవారు చెప్పుచున్నారు.

మలహరి — ఆది

సంకెలేక తలచిన జాణలకు
సంకీర్తనమె పో సర్వశాంతి ! ॥పల్లవి॥

భవహరమగు శ్రీపతి నామమె
జవకట్టి తలచితే జన్మశాంతి
తవిలి హరిపూజ తాజేయుటె
కువలయమున నిదిగో గృహశాంతి ! ॥సంకె॥

అంది ధృవవరదుడ యనినదె
కందువైన సర్వగ్రహశాంతి
యిందు రవినయనుని నెరుగుటె
చందమైనదిదివో నక్షత్రశాంతి ! ॥సంకె॥

భావించి యనంతుని బలుకుటె
కావించిన దిదివో కాలశాంతి
శ్రీ వెంకటనాథుని చేరుటె
దేవ మానవులకును దేహశాంతి ! ॥సంకె॥

అ : 16 (1)—20

(ఇది చిన తిరుమలాచార్యుల వారి రచన)

. మ మ ప ద ప మ స స రి స | సా ఫ ధ | స రి మా ||
సం కె తే - - - క త ల చి | న జా - | ణ ల కు ||

ద ప ప మ పా ద స ద సా | రి స ద ప దా ద ప | మ గ రి సా ||
సం - - - కీ - ర్త న మె | పో - స - ర్వ - - | శాం - - తి || ||సం కె||

౯. పా ద ప ప మ ప మ మ గ రీ మా | గ రి స రి గా | రి రి సా ||
భ వ - హా - ర - మ - గు (శ్రీ) | ప తి నా - - | - మ మె ||

ధ ఫ ధా సా రి స రి మ | పా ద ప ప మ | రి మ ప ద పా ||
జ - వ క ట్టి త ల చి | తే జ - న్మ - | శాం - - - తి ||

మ ప ద స స సా రి | స రి మా ప మ | గ రి సా ||
త వి లి హ రి పూ జ | తా - - చే - | - యు ట ||

స రి మ గ రి స స రి మ గ రి స | ద ప మ గ | రి స రి మ పా ||
కు - వ - ల య ము - న - ని ది | గో - గృ హ | శాం - - - తి ||

**అవతారిక :**

ఈ కీర్తనమునందు "చరాచర ప్రపంచమునకు మూలమైన ఈశ్వరుడు శ్రీ వేంకటేశ్వరుడొక్కడే, ఆతని మన్ననయను ప్రేమామృతము వలననే జీవులు మనుచున్నారు. కల్ల నిజములకు వ్యత్యాసము లెరుగని జీవులు మాయామగునది ఈ ప్రపంచమని యెరుగలేకయున్నారు. సంసారములయందలి సుఖదుఃఖముల యనుభవములకు తామే కర్తల మని యనుకొనెడి యల్పబుద్ధులు యీ జీవులు. అతి చంచలములగు పంచేంద్రియములకు వశులై యుండెడివారగు వీరు మతి చంచలములను మాన్పుకొనగలరా? శ్రీ వేంకటేశ్వరుని కృప జన్మ జన్మములకును సంచయము చేసికొని వీరు మనవలెను గదా!" అని అయ్యవారు వేంకట నాథునికి విన్నవించుకొనుచున్నారు

**మలహరి — ఆది**

ఇన్నిటికి మూలం బీశ్వరు డాతని
మన్నన కొలదినె మలయుట గాక ! ॥పల్లవి॥

మాయా మయమై మనియెడి జగమిది
చాయల నిందు నిజముగలదా
కాయము సుఖదుఃఖములకు బొత్తిది
రేయి బగలు నొక రీతే కలదా ! ॥ఇన్నిటి॥

దైవా ధీనము తగు సంసారము
వారిని జీవుల వశమవునా
ధావతి మనసిది తన కర్మమూలము
వేవేలైనా విడువగ వశమా ! ॥ఇన్నిటి॥

పంచేంద్రియముల బరగేటి బ్రదుకిది
చంచలంబు నిశ్చలమవునా
యెంచగ శ్రీ వెంకటేశ్వరు కృపతో
సంచయ మయితే సతమవుగాక ! ॥ఇన్నిటి॥

ప. - మా - ప దా సా సా | సా రి స ద ద | పా ద ప మ మ ||
- ఇ - న్నిటికి మూ లం | బీ - - శ్వ రు | డా - - త ని ||

- రి మా ప దా ద ప ప మ మ గ గ రి | స రి గా రి గ | గ రి రీ సా ||
- మ - న్న న కొ - ల - ది - నె - | మ - ల యు ట | గా - - క ||

॥ఇన్నిటికి॥

చ. - మా మా మ మ మ | మ ప దా ద ప ప మ | గా గ రి స రి గా ||
- మా యా మ య మై | మ - ని యె - డి - | జ గ - మి - ది ||

- ధ సా రి రీ మా ప మ గ రి | సా స రి గా గ రి | గా - - ||
- చా - య ల నిం - - దు ని | జ ము - గ ల - | దా - - ||

- స రీ మ మా ప ద పా | ద మ ప ద | సా స స ||
- కా - య ము సు ఖ దుః | ఖ ము ల కు | పొ త్తి ది ||

- స రీ మ మా గ రి స రి | గ రి సా | ద ద పా ||
- రే - యి వ గ లు నొ క | రీ - తే | గ ల దా ||

- మా - ప ద ద సా సా |
- ఇ - న్ని టి కి మూ లం |

**అవతారిక :**

ఇది దలి నాయిక ప్రౌఢ, జాణ, ఈమె "నీకు ఇష్టమున్నను లేకున్నను నేడు నా మగరువై నన్నేలుకోవలసి వచ్చెను. చిన్న నాడు బొమ్మ పెండ్లిండ్లు చేసుకొను వేళ, సఖులతో చెట్టా పట్టాలాడుకొను వేళ, నీవు నన్ను చూచి నవ్వితివి. అందుచేతనే నేనపుడు నీకిల్లాలినైతిని. నీవు కొంటె తనమునకే అట్టిచేష్టలు ఆనాడు చేసియుండవచ్చును. ఇప్పుడు నిన్ను చూచిన నాకు నవ్వు వచ్చుచున్నది." అని ఎక సెక్కెముగా నాయకుడగు శ్రీ వేంకటేశ్వరుని గోముగా హేళన చేయుచున్నది.

**రాగ లక్షణము :**

పాడి ప్రాచీన రాగము. ఇప్పటి వాడుక ప్రకారము ఇది 15వ మేళమగు మాయా మాళవ గౌళజన్యము.

ఆరోహణ : స రి మ ప ద ప ని స

అవరోహణ : స ని ప ద ప మ రి స ।

ఇందు ఆధునికుల రచనలు కానవచ్చుట లేదు. తాళ్ళపాక వారి రచన లనేకములు గలవు ఒకప్పుడిది బహుళ ప్రచారమున గల రక్తి రాగములలో నొకటియేమో !

**పాడి — త్రిపుట**

అందుకు నిందుకు బతి ఆయ గదరా
నందక ధరుడు నేడు నవ్వువచ్చీ నాకు !                ॥పల్లవి॥

చిన్న దాననై బొమ్మపెండ్లి నే జేయుగాను
నన్ను జూచి నీవు నాడే నవ్వితివి గదరా
చెన్నుగ నాకిట్టె సన్న సేసి నీవు గూడ గాను
నన్ను నిన్ను జూచి నేడు నవ్వు వచ్చీ నాకు !                ॥అందుకు॥

పడుచులు నేను చెట్టాపట్టాలు పట్టుకాడగా
నడుమనే నన్ను జూచి నవ్వితివి గదరా
చిడుముడి నీవు నన్ను జెట్టపట్టుకోగా నేడు

పొలసి గుజ్జన గూళ్ళు బువ్వాలాడే నన్ను జూచి
నలువంక నాడు నీవు నవ్వితివి గదరా
యెలమి శ్రీ వేంకటేశ యిటు నా మోవి బువ్వము
నలి నీ వంటి కూడగా నవ్వు వచ్చీ నాకు ! ॥అందుకు॥

శ్రృం : 26-45

- - ప దా పా || మా - రీ సా || స రీ సా నీ || స రీ మా - - ||
- - అం దు కు || నిం - దు కు || ప తి ఆ య || గ ద రా - - ||

- - ప దా పా || ? ని స రీ సా || సా ని ప ద పా || మా రి స రి మా ||
- - నం ద క || ధ రు డు నే డు || న - వ్వు - వ || చ్చీ - నా - కు ||
॥అందుకు॥

- - మ మా పా || ద ప ద పా మా || రీ స స రి స ని || ధ ధ ధ నీ సా ||
- - పి న్న దా || న - - వై బొ || మ్మ పెండ్లి - నే - || సే - య గా ను ||

రి స రి మా మా || మ ప మ ద ప దా || ప మ ప ప ని స ని || ప దా పా - - ||
న - న్ను జూ చి || నీ - వు నా - దే || న - వ్వి - తి వి - || గ ద రా - - ||

- - ప ప మ ప మ || స స ని సా సా || రి స రి మా ప మ రీ ||
- - చె న్ను గ నా - || కి ట్టె - స న్న || సే - సి గూ - - డ ||

రి స ని సా సా ||
గా - - ను - ||

సా ని సా రీ || సా ని ప ద ప మ || రి మ ప దా ప మ || రి స రి మా - - ||
న న్ను నీ వు || చూ చి నే - ఋ - || న - వ్వు వ చ్చే - || నా - - కు - - ||
॥అందుకు॥

**అవతారిక :**

ఈపదమునందు ఉపమానముగా పువ్వులను అయ్యవారు పేర్కొనుచు నారు. "(శ్రీ) వెంకటేశ్వరునకు నాయికపరముగా నీవు జాజిపూవువంటివాడివి. అతికోమలమగు దిరిశెనపూ వెట్లగుదువు? నీ జాడలు, నీచర్యలు నీవుమానేవా! సంపెంగపూవుల వాసనలు వాటికేయుండును. పరికించిచూచితే వేరుకంపులుకలుగునా! పొగడపూవులతావి, మాదకత వానియందు కలుగకుండునా! నిగిడిన నీచేతలు ఇతరులకబ్బునా! నీకూటములకు చొక్కిన మాకు మీయందలి ఆశలు మానినా! నీగుణములు నీవును, మాగుణములు మేమును మానలేముగదా! ఇవికొందరికి యింపులు, మరికొందరికి కంపులు పుట్టించినచో పుట్టించు గాక!" అని దక్షిణనాయకుడగు స్వామికి విన్నవించుచున్నారు.

**పాడి – త్రిపుట**

జాజు జాజేకాక దిరిశపు బువ్వౌనా
నీ జాడెంతయిన నీవు మానేవా! ॥పల్లవి॥

సంపెంగ పూవులలోన సారెకుజూచిన తన
కంపేకాక తనకాక మానీనా
యింపులు గొందరికి యీరసాలుగొందరికి
జంపుల నీగుణముల జూడమానేవా! ॥జాజు॥

పొగడ పూవులలోన పొందుగ జూచిన తావి
తగుగాక తామదము మానీనా
నిగిడిన నీచేత నీబోట్లకే కాక
నుగిడి నీగుణములు మంచివయ్యీనా! ॥జాజు॥

కామించి కలువలు కన్నుల నద్దుకొనిన
కామునమ్ములు నేడు గాక మానీనా
దీమసపు వెంకటేశ తెమలనికూటముల
ఆముని మాకోరికల ఆసమానీనా! ॥జాజు॥

ప. - - ప ద | ప మ పా స ని స ప || ప ద ప మ ప ద | ప మ రీ సా ||
- - జా - | జు - - జా - - - || జే - - - - - | కా - - క ||

- - స ని | ధ ధ ధా ని స రి స || రి మ ప ద ప ద | ప మ రి స ని స రి మ ||
- - ది రి | శ - - న - - - || పు - - - - - | వ్వా - - నా - - - ||

పా ప మ | ప ని సా || స రి ప మ రీ | రి స ని సా ||
- నీ - | జా - డెం || తై - - - - | న - - - ||

- - రి మ | ప ని స రి స ని ప ద || ప మ దా | ప మ రి స ని స రి మ || పా
- - నీ - | వు - - - మా - - - || నే - - | వా - - - - - - - - || -

||జాజు||

చ. - - స ప | ప మ పా దా || ప మ ప ద | పా - మ రి స ||
- - సం - | పెం - - గ || పూ - - వు | ల - - లో - ||

రీ స ని | ధ ధ ధా ని స రి స || స రి ప మ రి స | రి మ ప ద ||
న సా - | రె - - కు - - - || జూ - - - చి - | న - త న ||

పా ప మ | ప ని స రి స ని ప ద || ప మ ప ద ప మ | రి రి సా ||
- కం - | పే - - - గా - - - || క - - - - - | త - న ||

- - స ద | ప ద ప మ ప ద || ప మ రి స | రి మ ప ద పా ||
- - కా - | క - మా - - - || సి - - - | నా - - - - ||

- ద ద | ప మ పా స ని సా || రి రి స ని సా | ని స రి స రీ ||
- యుం - | పు - - లు - - || కొం - - - - | ధ - రి - కి ||

సా స ర్ | మా ప మ రీ || ర్ స ని స ర్ స | స ని పా ని ని ||
- యా - | ర - - సా || లు - - - - - | గొం - - ద రి ||

సా ప ని | స ర్ స ని ప ద ప మ || రి మ ప | స ని సా ||
కి జం - | పు - - - ల - - - || నీ - గు | ణ ము ల ||

- - ర్ ర్ | స ని ప ద ప మ ప ద || ప మ పా - మ | రి స ని స రి మ ||
- - జా - | డ - - - మా - - - || నే - - - - | వా - - - - - ||

**అవతారిక :**

"శ్రీహరి నామమే నాకు పిత్రార్జితము, నిలువుననిధి ఇదియే నాకు కలకాలము గాదెలలో దాచుకొన్న ధనము, శ్రీపతిని తలచుకొనుటయే మాయింటగల భాగ్యములు. వేంకటపతి సేవలు మాకుసంసార సుఖములు, సర్వభోగములు, అన్నియునవియే ! హరి నొల్లనివారికి ఇవి దొరకవు." అని అన్నమయ్యవారు తమ విష్ణుభక్తిని యీకీర్తనమునందు చెప్పుకొనుచున్నారు.

**పాడి _ఆది**

నమ్మిన దిదివో నాపితురార్జిత
మిమ్మహిజూడరో యిది మీదిగాదు ! ॥పల్లవి॥

నలినదళాక్షుని నామాంకితమే
నిలువున బాతిన నిధానము
కలకాలమిదే గాదెలకొలుచులు
నలుగడ నిదియే నాలుకరుచులు ! ॥నమ్మిన॥

శ్రీపతిరూపమె చింతించు తలపె
పైపై మాయింట భాగ్యములు
ప్రాపల మిత్రులు బుత్రాదులిది
వైపగు మాకిదె వ్యవసాయములు ! ॥నమ్మిన॥

శ్రీవేంకటపతి సేవిదియెకచే
భావించు నాయుష్యభౌష్యములు
కైవల్యపదవిదె కాయజసుఖమిదె
సావధానముల సంసారమిది (దే) ! ॥నమ్మిన॥

ప. పా ద ద ప ప ప మ | మా ప మ | మ రి రి స ||
న మ్మిన ది ది వో - | నా పి తు | రా - ర్జిత ||

స రి మ మ మ ప ప మ | ప ద ద ప | ప పా మ ||
మి - మ్మహి జూ - డ రో | యి ది మీ - | ది గా దు || ॥నమి

చ. ప ప ద ద పా ప మ | మ రి మా | ప ద పా ||
న ళి న ద ళా క్షు ని | నా - మాం | కి త మే ||

ప ద ప ని సా స ని | స రి రి రి | సా - - ||
ని లు వు న జా తి న | ని ధా - న | ము - - ||

స రి మ మ రి రి స స | స ని స రి | రి స స స ||
క ల కా - ల మి దే - | గా - దె ల | కో లు చు లు ||

స ని ప ద ప మ రి స | స రి మ మ | మ ప ప మ ||
న లు గ డ ని ది యే - | నా - లు క | రు చు లు - || ॥న॥

**అవతారిక :**

ఇందు శ్రీనివాసుని వైభవములను వర్ణింపుచు "రంభాది అప్సరసలు నాట్యమాడుచును, గాన విశారదులగు సురకాంతలు కానుకలతోను వేచియున్నారు, నీవుపర్యంకమున పవ్వళించెదవో యీ విభవముల ననుభవించెదవో సెలవియ్యవయ్యా ! స్థిరముగా తిరువేంకటగిరిపై నెలకొన్న ఓవేంకటనాథా" అని అయ్యవారు చెప్పుచున్నారు.

**పాడి — ఆది**

దేవరచిత్తం దివ్యనిధి
దేవ నిర్మిత విధి యవధానం ! ॥పల్లవి॥

అతివలు నాట్యంబాడెదమ నీవు
న్నతి మెఱయుచు నున్నారిదివో
ప్రతినలతో రంభయు, మేనకయును
ధృతి కరుణాంబుధి ధీయవధానం! ॥దేవర॥

గానవిద్య తమకంబున వినుమని
కానుకలివె సురకాంతలవి
కానుపించురో గంధర్వసతులను
ధీనత పంపును ధీయవధానం ! ॥దేవర॥

పరక్యంబునం బవళించెదవో
శిరుల విభవములం జెలంగెదవో
తిరువేంకటగిరి దేవయన్నిట
తిరమందితివిటు ధీయవధానం ! ॥దేవర॥

ప. - ప మా ప దా ప మ రి రి | స రి మ మ | పా - - ||
- దే - వ ర చి - త్త ము | ది - వ్యా ని | ధి - - ||

- ప దా ప నీ సా స ని ప ద | ప మ ప ద | ప మ రీ స రి మ ప || ద
- దే - వ ని - ర్మి - త వి | ధి - య వ | ధా - - నం - - - || - ॥దే

చ. - మా - ప దా ప మ రి రి | - స నీ ధ ధా | ధ ని సా ||
- ప - ర్యం - కం - బు న | - ప వ ళిం - | చె ద వో ||

- స రీ మ మా ప ద ప మ | ద ద ప మ రి స రి మ | పా - ద పా ||
- సి రు ల వి భ వ ము ల | జె - లం - గె - ద - | వో - - - ||

- ప దా ప నీ స రి స ని | స రి మా రి రి | స ని సా ||
- తి రు వేం - క ట గి రి | దే - - వ య | - న్ని ట ||

- స రీ స నీ స ని ప ద | ప మ ప ద | ప మ రీ స రి మ ప || ద
- తి ర మం - ది తి వి టు | ధీ - య వ | ధా - - నం - - - || - ॥దే

**అవతారిక :**

ఇందలి నాయిక చతుర, ప్రౌఢ, జాణ. ఈమె వ్యంగ్యముగా నాయకుని తప్పులను తెలియజెప్పుచు "నేను నీ గురించి పదుగురిలో నేమైన ఆడితినా, నీ వెంట తిరిగి నీ పనులను నాకు చెప్పుటకు వేగులను నియమించితినా, నాతులందరును గల సభలయందు నీపై వ్యంగ్యములాడి నవ్వితినా, నిన్ను చురుకు చూపులతో గుండెనాటునట్లు చూచితినా, నాకేమైనను కావలసినచో నీకు అనతివ్వగలదాననేగాని, ఆడుకొనేదాననా! అందుకే నామనసు కష్టపడుచున్నది. ఎవ్వరు నీ గుణములను బయలుపరచి నిన్నాడుకొని వ్యంగ్యముగా నవ్వుకొని హేళనచేయుచున్నారో తెలియకున్నది." అని నాయకునితో చెప్పుచు ఆతని నడతలను తెలిసియు తెలియని దానివలె నటించుచు ఈరూపగర్విత తనను ఆజ్ఞాపించు దానిగా చెప్పుచున్నది.

**రాగ లక్షణము :**

బౌళి రాగము ప్రాచీన రక్తిరాగములలో నొకటి. దీనిని పూర్వాచార్యులు ఘనరాగ ఉత్తరపంచకమున చేర్చియున్నారు. ఇది మాయామాళవగౌళజన్యముగా యిప్పటిగ్రంథకర్తలు పేర్కొనియున్నారు.

ఆరోహణ : స రి గ ప ద స

అవరోహణ : స ని ద ప మ గ రి స ।

అని యుంటుటచే ఇది 51 వ మేళమయిన కామవర్థని జన్యమనిదను అనవచ్చును. ఉత్తరదేశస్థులు ఇదే ఆరోహణావరోహణములు గలరాగమును 'త్రివేణి' యందురు. తాళ్లపాకవారి రచనలయందు యీరాగము కొంచెము అధికముగనే కనబడుచున్నది. దీనికి సన్నిహితములును మాయామాళవగౌళజన్యములును అగురాగములిప్పుడు వాడుకయందు లేనివి ఎన్నియో వీరిరచనలయందు కనబడుచున్నవి. మెంచబౌళి. మేచబౌళి, అనికూడ యీరాగమునకు పేర్లు ప్రచారమునగలవు.

**బౌళి — రూపకం**

కల్లసుమ్మీ రమణుడ కలగీ నిందు కేమతి
తొల్లిటి నీగుణమెట్టు తోచెనో కాని ! ॥పల్లవి॥

ఆడజుమ్మీ నిన్ను నేను అంతచులుక నిమాట
వాడికె నీకెట్టు నిందవచ్చెనో కాని
తోడవేగు వెట్టసుమ్మీ దొరవు నీమీద నేను
[illegible] ॥కల్ల॥

నవ్వజుమ్మీ నే నిన్ను నాతులయీసభలోన
అవ్వల నీమీదనెట్టు అంటెనో కాని
యెవ్వరితో చెప్పజుమ్మీ యిట్టునట్టు అని నిన్ను
దవ్వులనీ కాక యెట్టు తగిలెనోకాని ! ||కల్ల||

చూడజుమ్మీ నిన్ను నేను చురుకన గుండెనాట
ఆడనే నీవెట్టు గుటియైతివో కాని
వేడుక శ్రీవేంకటేశ వెలయ నన్ను గూడితి
వాడుకో లిదే సుమ్మీ ఆనతిత్తుగాని ! ||కల్ల||

శ్రుం : 26 — 81

ప. ప ద పా పా || గ ప గ రి సా || స రి సా స ని ధా || స రి గ రి గా ||
క ల్ల జు మ్మీ || ర మ ణు - డ || క ల గీ నిం - - || దు కే మ - తి ||

గ ప దా సా || స ని దా ని ద పా || గ ప ద ప గ రి || స రి గా - - ||
తొ ల్లి టి నీ || గు - ణ మె - ట్టు || తో - చె - నో - || గా - ని - - ||కల్ల||

చ. స రి గా పా ద ప || గ ప గ రి సా || స రి స ని ధ ధ || స రి గా - - ||
ఆ డ జు మ్మీ - - || ని న్ను నే - డు || అం త చు ల క ని || మా - ట - - ||

గ ప దా సా || స ని దా ని ద పా || గ ప ద ప గ రి || సా - - - - ||
వా డి కె నీ || కె - ట్టు నిం - ద || వ చ్చె నో - గా - || ని - - - - ||

గ ప దా సాం || స రి గ రి గా || గ ప గాం రీ || గ రి సా సా ||
తో డ వే గు || వె ట్ట సు - మ్మీ || దొ ర వు నీ || మీ ద నే ను ||

స గ రీ సా స ని దా || ప ని ద పా ద గ || గ ప ద ప గ రి || సా - - - - ||
యే - డ ని న్నె - వ్వ || తే - - సం దే - || హిం చె నో - కా - || ని - - - - ||

||కల్ల||

**అవతారిక :**

ఇందు హరిదాసుల పాదతీర్థముగొనుచు, వారిని సేవించుట యందు నిమగ్నులై, శరీరమునందు హరిముద్రలు ధరించి, శ్రీహరి పాదములను చింతించుచు, నామజపమును చేసికొను వారియందు ఆ స్వామి కటాక్షము అమృతమై, మోక్షమై అలరారునని అయ్యవారు వైష్ణవ సంప్రదాయములయందు తమకుగల నమ్మికను, స్వామియందు గల భక్తిని చెప్పుకొనుచున్నారు

బౌళి — తిశ్రఏక

తెలిసినవారికి తెరువిది మరి లేదు
నళినాక్షు బొగడెడి నామములో నున్నది ! ॥పల్లవి॥

ఆకసాన లేదు మోక్ష మటు పాతాళమున లే
దీకడ భూలోకమందు యెందులేదు
పైకొని ఆసలెల్ల పారదోలి వెదకితే
శ్రీకాంతు బొగడేటి చిత్తములో నున్నది ! ॥తెలిసిన॥

సురలవద్ద లేదు సోదించ వమృతము
సరిదిక్కులందు లేదు జలధిలో లేదు
శరణాగతుల పాతజలములు చేర్చికొనే
హరిదాసుల బూజించే అరచేతనున్నది ! ॥తెలిసిన॥

రాజసాన సుఖమేది రాసి కర్మమందు నేది
వోజతోడ నియతుడై వుండేవానిది
సాజాని శ్రీవేంకటేశు సరిముద్రలు ధరించే
తేజముతో విజ్ఞానదేహములో వున్నది ! ॥తెలిసిన॥

అ : 21—60

(ఇది పెద తిరుమలాచార్యులవారి రచన)

ప. స రి గ గ పా | ప ప ద ప గ గ || గ ప గ రి సా | - - - - - - ||
తె లి సి న వా | రి కి తె రు వి దె || మ రి లే - దు | - - - - - - ||

స ధ ధ స స స | స స రి స స రి || గ ప గ గ రీ | సా రి స సా ||
న లి నా - క్షు ని | బొ గ డె డి - - || నా - మ ము లో | ను న్న ది - ||తెలిసిన||

చ. గా ప గా రి | స స రి స స ధ || సా రి రి గ ప | గ గ రి రి స స ||
రా జ సా న | సు ఖ మే - ది - || రా సి క - ర్మ | మం - దు నే - ది ||

ప గ గ పా ప | ప ప ద ద ప ప || ప గ ప ప ప ద | పా పా - - ||
వో - జ తో డ | ని య తు డై - - || వుం - డే - వా - | ని ది - - ||

ప గ ప ప ప ద | ద స స స స స || స స రి రి స స | స స రి రి స స ||
సా - జా ని శ్రీ - | వేం క టే - - శు || స రి ము - ద్ర లు | ధ రి యిం - చి - ||

స స రి గ రి స | స ని ద ప ద ప || గ గ ప ప ద ప | గ గ రి స స స ||
తే - జ ము తో - | వి - జ్ఞా - న - || దే - హా ము లో - | ను - న్న ది - - ||
||తెలిసిన||

**అవతారిక :**

వర్నన్మధుని భ్రమయందు తగులుకున్న జీవుని గతి యెటువంటిదనగా, వెలికి దెలియక బాధించు రోగమువలెను, తడిపాతతో మెడకోయుటవలెను, నీడలోపలి యెండవలెను, తాడుపై తపసుచేయుట, పాడుపడిన యూరిలో కాపురముండుట వలెనుండునని చెప్పుచు, శ్రీవేంకటేశ్వరుని కొలువక, నీటియందు ప్రయాణించువారు ఓడనువదలి కేకలిడుటవంటిదని అన్నమయ్య వారు చెప్పుచున్నారు.

జీవునికి సహజములగు భ్రమ ప్రమాదములను చిన్న చిన్న ఉదాహరణలతో చెప్పుచు తనయందే నిలచియున్న పరమాత్ముడగు శ్రీవేంకటేశ్వరుని తెలిసికొనలేక సన్నిహితుని వలె భ్రమియింప జేయు సూనాస్త్రిని వలలయందు తగులుకొనుచున్నారని చింతించుచున్నారు.

బౌళి — త్రిపుట

ఎట్టు చేసిన చేసె నేమిసేయగ వచ్చు
చుట్టపు విరోధంబు సూనాస్త్రి చెలిమి ! ॥పల్లవి॥

ఒడలిలోపలి రోగమొనర బరితాపంబు
కడుపులోపలిపుండు కడలేనియాస
తడిపాతమెడ గోత తలపు విషయాసక్తి
గుడిగుది తరువు అలకులము (అలగులము) ప్రాణులకు ! ॥ఎట్టు॥

నీడలోపల యెండ నెలకొన్న బంధంబు
గోడపై సున్నంబు కొదలేని యెఱుక
పాడూరిలో బ్రదుకు పాపకర్మపుబుద్ధి
తాడుపై తపసు తమధనము ప్రాణులకు ! ॥ఎట్టు॥

మంట జేసిన బొమ్మమనికి సంసారంబు
రెంటికిని గాని వీరిడి కొలువు బ్రదుకు
ఇంటివేలుపు వేంకటేశు గొలువకపరుల
వెంటదిరుగుట వోడవిడిచి వదరిడుట ! ॥ఎట్టు॥

ప.  - - గ । పా పా ॥ ప దా । దా పా ॥ - - గ । పా ద ప ॥ ప పా । గ రి గా ॥
- - ఎ । ట్టు జే ॥ సి న । జే సె ॥ - - నే । మి సే - ॥ య గ । వ - చ్చు ॥

- - స రి । గా గ రి ॥ గ పా ద ప । గ రి సా ॥ - - స రి । సా స ని ॥ ప దా ।
- - చు - । ట్ట పు - ॥ వి రో - - । ధం - బు ॥ - - సూ - । నా స్తు్రి- ॥ చె లి ।

స రి గా - ॥
మి- - - ॥ ॥ఎట్టు॥

చ.  - - ప ద । సా స ని ॥ ద నీ । దా పా ॥ - - ప గ । పా ప ద ॥
- - ఒ డ । లి లో - ॥ ప ని । రో గ ॥ - - మొ న । ర ప రి ॥

ప దా । సా సా ॥ - - స రి । గా గా ॥ గ గా । గ రి రీ ॥
తా - । పం బు ॥ - - క డు । పు లో ॥ ప లి । పుం - డు ॥

- - స రి । గ ప గ రి ॥ రీ - । సా - - ॥ - - ప ద । సా - రి గ రి ॥
- - క డ । లే - ని - ॥ యా - । స - - ॥ - - త డి । పా - - - త ॥

స సా । స ని పా దా ॥ - - ప ద । పా వ గ ॥ పా ద । సా సా ॥
మె డ । గో - - త ॥ - - త ల । పు వి ష ॥ యా - । స క్తి ॥

- - గ గ । పా - ద సా ॥ స ని దా । పా ద ప ॥ ప గా । పా ద ప ॥
- - గు డి । మీ - - ది ॥ త - రు । ప్పు అ ల ॥ కు ల । ము ప్రా - ॥

గ రీ । స రి గా - ॥ గ రి
ణు ల । కు - - - ॥ - -   ॥ఎట్టు॥

**అవతారిక :**

"ప్రకలిదప్పులకు లోనై అలమటించుట దేహధారులకు తప్పవుగదా ! యౌవన వార్ధక్యములయందలి వికారములను యెవరు తప్పించుకొనగలరు ! సంసారము నీమాయాకల్పిత మని తెలిసినను, దానిని పోద్రోయుటకు వశముగాకున్నది. సృష్టియందంతయు నిండియున్న నీ కరుణ మాయందొకింత కలిగించవే !'' అని శ్రీవేంకటేశ్వరుని అన్నమయ్యవారు వేడుకొను చున్నారు.

**గౌళ – ఆది**

ఎందును బోరాదీ సంసారము
కందువ నీమాయ గడవగ వశమా ! ॥పల్లవి॥

కలిమే చిత్తవికార హేతువది
అలరలేమి దైన్యహేతువు
పలులంపటములు బంధహేతువులు
తలగిన నడవదు తను పోషణము ! ॥ఎందు॥

మదవికారమిదె మహితయౌవనము
తుదవార్ధకమే దురంతము
ఇదె యర్థార్జన యాతాయాతన
అదియుమానితే నాకలిఘనము ! ॥ఎందు॥

ఎన్నిగడియించే వెన్నిటముంచే
విన్నిట శ్రీవేంకటేశ్వరుడ
అన్నిట నంతర్యామివి నీవే
కన్నుదనియ నను గావగదే ! ॥ఎందు॥

అ : 11 (1)–169

ప. ప గ ప ద స̇ ని ద ప | ప గ పా | గ రి రి స ||

ఎం - కు ను బో - రా - | దీ - నం | సా - ర ము ||

సా రి గ రీ - సా - రి | గ ప ద ని | ద ప ద గ ||

కం దు వ నీ - మా - య | గ డ వ గ | వ శ మా - || ॥ఎందును॥

చ. రీ రి రి రీ రీ | రి స రి రి | గ రి రి స ||

ఎ న్ని గ డిం చే | వె - న్ని ట | ముం - చే - ||

సా రి గ పా ప ప | దా ని ద | పా - - ||

వి న్ని ట శ్రీ వేం క | టే శ్వ రు | డా - - ||

స ద స̇ స̇ రి̇ రి̇ రి̇ రి̇ | సా̇ రి̇ గ̇ | గ̇ రి̇ రి̇ రి̇ ||

అ - న్ని ట నం - త - | ర్యా మి వి | ని - వే - ||

స̇ స̇ రి̇ స̇ స̇ ని ద ప | ప గ ప ప | ప ద గా ||

క న్ను ల ని య - న ను | గా - వ గ | దే - - || ॥ఎందును॥

**అవతారిక :**

ఇందు జీవునకు అనేక జన్మములనుండి వచ్చుచున్న కర్మానుబంధములగు అనుభవములను జ్ఞాపకము చేయుచు, ఇంత అసహ్యమగు బ్రదుకులను బ్రతికియు, పుట్టుట గిట్టుట యను సమయములయందు కలిగెడి రోతలను, బాధలను మరచి సంసారమునే కోరుచున్న జీవునికి తిరువేంకటనాథుని కృపావిశేషమును సంపాదించుకొని బాధలనన్నిటిని తొలగింపజేసుకొనుమని అన్నమయ్యవారు బోధించుచున్నారు.

**బౌళి – ఆది**

ఎప్పటిజీవుడె యెప్పటి జగమే యెంతగాలమును నీరితే
కప్పుక వచ్చితి వనాదినుండియు కర్మమ యింకా వేసరవా ! ॥పల్లవి॥

మఱచితివా తొలుజన్మంబుల మరణకాలముల దుఃఖపుబాట్లు
మఱచితివా యమకింకరులయి మర్దించిన బహుతాడనలు
మఱచితివా నరకకూపముల మాటికి మాటికి బరచిన బాధలు
మఱియును సుఖమని భవమే కోరెడు మనసా ముందరగానవుగా ! ॥ఎప్పటి॥

తలచవుగా జననకాలమున దనువిదియేయిటుపుట్టిన రోతలు
తలచవుగా బాల్యంబున తల్లిదండ్రుల శిక్షలు వ్యాధులును
తలచవుగా సంసారమునకును దైన్యంబున యాచించెటి యలమట
తలపుననిదియే వలెనని వోమెదు తనువాయింకా రోయవుగా ! ॥ఎప్పటి॥

కంటివిగా మలమూత్రాదులు కడుగగదీరని దినదినగండము
కంటివిగా కనురెప్పలనే కాలముగడచెటి కడత్రోవ
కంటివిగా శ్రీవేంకటపతి కరుణచేత నీవివేకభావము
అంటి యిటువలెనె సార్వకాలమును అంతరాత్మ నినుదలచవుగా ! ॥ఎప్పటి॥

అ : 11 (1)–142

ప. సా రి గ గ రి రి స | సా రి గ | గ రి రి స ||
ఎ ప్ప టి జీ - వు డె | యె ప్ప టి | జ గ మే - ||

సా రి గ గ ప ప ప | పా ద ప | పా - - ||
యెం త కా - ల ము ను | నీ రీ - | తే - - ||

పా ద ప ప ప ప గ | ప ప ద ప | పా ప గ ||
క ప్పు క వ - చ్చి తి | వ నా - ది | నుం డి యు ||

గ ప ప ప ద ప ప గ | గ ప గ రి | సా - - ||
క - ర్మ మ యిం - కా - | వే - స ర | వా - - || ||ఎప్పటి||

చ. స రి గ గ గా - - | గ ప గ రి | రి స స రి ||
మ ఱ చి తి వా - - | తొ లి జ - | న్మం - బు ల ||

స స రి స స ని ధ ధ | ధా స స | రి స సా ||
మ ర ణ కా - ల ము ల | దుః ఖ పు | బా - ట్లు ||

స రి క గ పా - - | గ ప ప ప | ప ద ద ప ||
మ ఱ చి తి వా - - | య మ కిం - | క రు లై - ||

గ ప ప ద ద ప ప గ | గ ప ప ద | పా - - ||
మ - ర్దిం - చి న ప హ్లు | తా - డ న | లు - - ||

గ ప ప ద ద సా - | సృ రి రి రి | రి రి రి రి ||
మ ఱ చి తి వా - - | న ర క కూ | - ప ము లు ||

సృ రి రి రి రి సృ సృ సృ | సృ రి రి రి | రి సృ సృ సృ ||
మా - టి కి మా - టి కి | ప ర చి న | బా - ధ లు ||

సృ రి రి గ గ గ గ రి | సృ రి రి గ | గ రి రి రి ||
మ రి యు ను సు ఖ మ ని | భ వ మే - | కో - రె దు ||

ప ద సా ని ద ద ప | ప గ గ రి | సా - - ||

**అవతారిక :**

ఈ కీర్తనమునందు సకల కల్యాణగుణ సంపన్నుడును, భక్తజనులపాలిటి కల్పతరువును, బలివంశ సంరక్షకుడును, భవరోగధన్వంతరియు, నగు ప్రహ్లాదవరదుని కీర్తిని పొగడుచు, అచ్యుతుడవు, అనంతుడవు, నీవే. ఈ వేంకటగిరియందు వెలసిన శ్రీ వేంకటేశ్వరుడవును నీవేయని అయ్యవారు కొనియాడుచున్నారు.

ధనుర్మాసమునందలి తొలిఝాములలో గంభీరమైన గౌళగాత్రముతో ఒకచేత కరతాళములును, వేరొకచేత తంబురయు ధరించి వేంకటనాథుని సన్నిధికి కాలిబాటవెంట నడచుచు గిరికంధరములు ప్రతిధ్వనించునట్లు యిట్టిగీతములను ఆలపించుచు పోవుచున్న ఒక వైష్ణవాచార్యుడు, ఈగీతమునకు స్వరరచన చేయుచున్నప్పుడు మనోనేత్రముల యెదుట గోచరించుచున్నారు.

బౌళి — ఝంపె

ఆనందనిలయ ప్రహ్లాదవరదా
భాను శశినేత్ర జయప్రహ్లాదవరదా ! ॥పల్లవి॥

పరమపురుష నిత్యప్రహ్లాదవరదా
హరియచ్చుతానంత ప్రహ్లాదవరదా
పరిపూర్ణగోవింద ప్రహ్లాదవరదా
భరిత కల్యాణగుణ ప్రహ్లాదవరదా ! ॥ఆనంద॥

భవరోగ సంహరణ ప్రహ్లాదవరదా
అవిరళ కేశవ ప్రహ్లాదవరదా
పవమానసుతకీర్తి ప్రహ్లాదవరదా
భవపితామహవంద్య ప్రహ్లాదవరదా ! ॥ఆనంద॥

బలయుక్తనరశింహ ప్రహ్లాదవరదా
లలిత శ్రీ వెంకటాద్రి ప్రహ్లాదవరదా
ఫలితకరుణారస ప్రహ్లాదవరదా
బలివంశకారణ ప్రహ్లాదవరదా ! ॥ఆనంద॥

ప. స రి గా గ | ప ద పా - || ప ద సా ని | ద ద పా - ||
ఆ - నం ద | ని ల య - || ప్ర - హ్లా ద | వ ర దా - ||

ప ద సఁ సఁ సఁ | నీ ద ప ప || గ గ ప ద ప | గ రి సా - ||
భా - ను శ శి | నే త్ర జ య || ప్ర - హ్లా - ద | వ ర దా - || ॥ఆనం॥

చ. ద ద ద ద ద | దా దా ద || గ ద పా గ | ప ద పా - ||
ప ర మ పు రు | ష ని త్య || ప్ర - హ్లా ద | వ ర దా - ||

ప గ పా ద | సా నీ ద || ప గ పా ద | సఁ సఁ సాఁ - ||
హ రి య చ్యు | తా నం త || ప్ర - హ్లా ద | వ ర దా - ||

సఁ రిఁ గాఁ రిఁ | సఁ రిఁ గాఁ రిఁ || సఁ రిఁ గాఁ సఁ | గ రిఁ సాఁ - ||
ప రి పూ ర్ణ | గో - విం ద || ప్ర - హ్లా ద | వ ర దా - ||

సఁ రిఁ సఁ సఁ ని | దా ద ప ప || ప గ ప ద ప | గ రి సా - ||
భ రి త క - | ల్యా ణ గు ణ || ప్ర - హ్లా - ద | వ ర దా - || ॥ఆనం

**అవతారిక :**

ఈ కీర్తనమునందు అన్నమయ్యవారు భగవంతుడగు శ్రీవేంకటేశ్వరుని కీర్తించుచూ "నీవు కమలాపతివి. కమలనాభుడవు. కమలదళముల వంటి కన్నులు కలవాడవు. కమలజునికి తండ్రివి.అనియు, జలనిధిని బంధించినవాడవు, జలధి నయనుడవు, జలధికన్యాకా రమణుడవు, జలనిధి గంభీరుడవు అనియు, ఘన నీల వర్ణుడవు, ఘనమగు దివ్యరూపము కలవాడవు, ఘన గంభీరుడవునై యొప్పుచున్నావు ఓ శ్రీవేంకటేశ్వరుడా ! నీవు అనేకములగు అవతారముల నెత్తిన వాడవు—నీకు యివే నా నమస్సులు." అని చెప్పుకొనుచున్నారు.

ఇందు గల మూడు చరణములయందును ఒక్కొక్క అందమగు పదమును గైకొని చిత్రవిచిత్రములుగా శ్రీనివాసునకు అన్వయించు నట్లు అయ్యవారు మాటలను అల్లుకొన్నారు. ఇది యొక సౌందర్యపూర్ణమగు కవితారీతి.

**బౌళి — చతురశ్రఏక**

గరుడ గమన గరుడధ్వజ
నరహరి నమోనమో నమో ॥పల్లవి॥

కమలాపతి కమలనాభా
కమలజ జన్మకారణిక
కమలనయన కమలాప్తకుల
నమోనమో హరి నమో నమో ॥గరుడ॥

జలధి బంధన జలధిశయన
జలనిధి మధ్య జంతుకల
జలధిజామాత జలధిగంభీర
హలధర నమో హరి నమో ! ॥గరుడ॥

ఘనదివ్యరూప ఘనమహిమాంక
ఘనఘనా ఘనకాయ వర్ణ
అనఘ శ్రీవెంకటాధిపతేహం
నమో నమోహరి నమో నమో ! ॥గరుడ॥

ప. స రి గ గ | ప ప ప ప || ద ప గ రి | స రి గ ప ||
గ రు డ గ | మ న గ రు || డ - ద్వ జ | న ర హ రి ||

గ రీ రి | సా - - || పా ద ప | ద ప గ రి || గ ప గ రి | - రి సా ||
న మో న | మో - - || శ్రీ - - | - - - - || హ రి న మో | - న మో ||
||గరుడ||

చ. స రి గా | ప ప ప ప || ప ప ద ద | పా పా ||
క మ లా | - - ప తి || క మ ల నా | - భా ||

గ ప ప ద | దా ని ద || ద ప ప గ | గ రి సా ||
క మ ల - | జ - న్మ || కా - - - | ర ణి కా ||

గ ప ప ప | ద ద ద స || స రి రి గ | రి రి రి స ||
క మ ల న | యన క మ || లా - - - | - ప్త కు ల ||

రి సా రి | సా ద ప || ద పా ద | పా గ రి || రి సా రి | సా - - ||
న మో న | మో హ రి || న మో న | మో హ రి || న మో న | మో - - ||
||గరుడ||

**అవతారిక :**

ఈకీర్తనమునందు పరమాత్ముడగు శ్రీవేంకటేశ్వరుని మహిమలను కొనియాడుచు "విష్ణువని, శివుడని, ఆది భైరవుడని, శక్తిస్వరూపివని, అయామతముల వారు తమ బుద్ధికితోచిన విధముగా పిలుచుకొని పూజించుకొందురు. వేదాంతుల మనోవీధియందు నీవు పరబ్రహ్మస్వరూపుడవు. అల్పబుద్ధులు నినుకొలిచి, వారికి ప్రాప్తించినంతయే పొందుదురు. ఘనులగువారు నిన్ను ఘనముగాదలచి, ఘనమగు ఫలమునే పొందుదురు. ఇదియెట్లున్నదనగా భాగీరథీతీరమున తీసిన బావులన్నిటియందును, ఆగంగయేవూటగా వూరినయట్లున్నదసుమా!" అని సర్వమత సామరస్యమును తెలియజేయుచు, ఏ పేరుతో పిలిచినను బ్రహ్మపదార్థమొక్కటేయని అయ్యనారు చెప్పుచున్నారు.

ఈకీర్తనము బౌళిరాగమునందు చెప్పియున్నారు. ఇది ఆదితాళమునకు వొదిగించుకున్నను, మాటలను వచనగానమునకు అనువగు విధముగా కూర్చియున్నారో యేమో ననిపించుచున్నది!

**బౌళి — ఆది**

ఎంతమాత్రమున నెవ్వరు దలచిన అంతమాత్రమేనీవు
అంతరాంతరములెంచిచూడ బిండంతేనిప్పటియన్నట్లు ! ॥పల్లవి॥

కొలుతురు మిమువైష్ణవులు కూరిమితో విష్ణుడని
పలుకుదురు మిము వేదాంతులు పరబ్రహ్మంబనుచు
తలతురు మిము శైవులు తగినభక్తులను శివుడనుచు
అలరి పొగడుదురు కాపాలికులు ఆదిభైరవుడనుచు ! ॥ఎంత॥

సరినెన్నుదురు శాక్తేయులు శక్తిరూపు నీ వనుచు
దరిశనములు మిము నానావిధులను తలపుల కొలదుల భజింతురు
సిరులమిమ్మునే యల్పబుద్ధి దలచిన వారికి నల్పంబవుదువు
గరిమల మిమునే ఘనమని తలచిన ఘనబుద్ధులకు ఘనుడవు ! ॥ఎంత॥

నీవలన గొరతేలేదు మరి నీరుకొలది తామెరవు
ఆవల భాగీరథిదరి బావుల ఆజలమేవూరినయట్లు
శ్రీవేంకటపతి నీవైతే మము జేకొని వున్నదైవమని
యీవలనే నీశరణని యెదను యిదియే పరతత్వమునాకు ! ॥ఎంత॥

అ : 7—159

ప. గా గ పా ప ద ప | గా ప ప | దా ప ప ||
ఎం త మా త్ర ము న | ఎ వ్వ రు | ద ల చి న ||

గా ప ప ద ప గ రి | స రి స రి | గా - రి ||
అం త మా - త్ర మే - | నీ - - - | వు - - ||

సా రి సా ధ ధ ధ | సా రి గ | - రి స రి ||
అం త రాం త ర ము | లెం చి చూ | - డ బిం - ||

గా ప గ పా గ రి | గ ప గ రి | సా - - ||
డం తే - ని ప్ప టి | య న్న - - | ట్లు - - || ॥ఎంత॥

చ. రి రి రి రీ రి రీ | స రి గ ప | గ రి రీ ||
కొ లు తు రు మి ముగ్మ | వై - ష్ణ వు | లు - - ||

స రి గ ప దా - - | పా ద గ | పా - - ||
కూ - రి మి తో - - | వి ష్ణు డ | ని - - ||

ద ద ద ద దా - - | ప ద ప గ | పా ద ద ||
ప లు కు దు రు - - | మి ము వే - | దాం తు లు ||

ప దా సా రి గ రి | సా - - | - - - - ||
ప ర బ్ర హ్మ మ ను | చు - - | - - - - ||

ṡ ṙ ṡ ṙ ṡ ṙ ṡ | ṙ గా | ṙ ṡ ṙ ||
త ల తు రు శై - వు | లు మి | ముగ్మ త గి ||

గ ప గ ṙ ṙ స ṡ ṙ | ṡ ద సా | - - - - ||
న భ - క్తు ల ను శి వు | డ ను చు | - - - - ||

ప ద ṡ ṙ గ ṙ ṡ ద | ప ద ప గ | ప ప దా ||
అ ల రి పొ గ డు దు రు | కా - పా - | లి కు లు ||

గ ప ప ప ద ప గ రి | స రి సా | - - - - ||
ఆ - ది భై - ర వుం - | డ ను చు | - - - - ||

**అవతారిక :**

ఈ పదమునందలి నాయిక విరహార్త. ఈమెను చూచి 'ఓ చెలీ మేఘశ్యాముని యందు లగ్నమయి యున్న నీ మనసు తెలియుచునేయున్నది. చెంపను చెయ్యిబెట్టుకొని నీవు విచారించెడి వేడుకయు నాకు తెలిసినది. నీ వక్షమునందుగల చంద్రరేఖలు తెలియుచునే యున్నవి. శ్రీ వేంకటేశ్వరుని కృపాకటాక్షమును పొందినదానవుగదా'' అని అలమేలు మంగాదేవిని చెలి మేలమాడుచున్నది.

**రాగ లక్షణము :**

నాదనామ క్రియ రాగము ప్రాచీనము.

ఆరోహణ : ని స రి గ మ ప దా

అవరోహణ : ద ప మ గ రి స నీ ।

ఆరోహణావరోహణములు లిట్లుండినను మధ్యస్థాయి యందలి నిషాదము కొంచెముగా సోకెడి సంగతులు గలిగియున్నది. 'ప ని దా పా' అను ప్రయోగమున కొంచెముగా కైశికి నిషాదము కూడ చేర్చుకొనుట వైణికుల సంప్రదాయము గనుక దీనిని భాషాంగమనియే చెప్పుకొనవలెను. ఇది యిప్పటి మాయా మాళవగౌళ మేళజన్యము. వెంకటమఖి సంప్రదాయమున యీ రాగమును సంపూర్ణ సంపూర్ణముగా చేర్కొని మాయా మాళవగౌళ మేళమునకును, దీనికిని అంతగా భేదము లేదేమో ననిపించునట్లుగా చెప్పియున్నారు.

**నాదనామక్రియ – ఆది**

సకలం హేసఖి జానామి తత ।
ప్రకట విలాసం పరమం దధసే ॥ ॥పల్లవి॥

అలిక మృగమద మయమపి కలనో ।
జ్వలతాం హేసఖి జానామి ।
లలితం తవ పల్లవిత మనసి ని ।
శ్చలతర మేఘశ్యామం దధసే ॥ ॥సకలం॥

చారుకపోల స్థల కరాంచితవి ।
చారం హేసఖి జానామి ।
నారాయణ మహినాయక శయనం ।
శ్రీరమణం తవ చిత్తే దధసే ॥ ॥సకలం॥

ఘన కుచ శైలాగ్రస్థిత విధుమణి ।
జననం హేసఖి జానామి ।
కనదురసా వేంకటగిరిపతే ।
విన్నుత భోగ సుఖవిభవం దధసే ॥ ॥సకలం॥

శ్రృం : 3–22

ప. సరి పమగా రి రి । సనిస రి । సా సని ॥
సకలం - హే స ఖి । జా - నా - । మి త త ॥

సరిమమ మా మా । గమ ప ద । పమ పా ॥
ప్రకట వి లా సం । ప ర మం - । ద ధ సే ॥ ॥సకలం॥

చ. ద దద ద దా దా । పదనిని । దద ప ప ॥
ఘ న కు చ శై లా । గ్ర - స్థి త । వి ధు మ ణి ॥

మమ మా మా గమ । పద పమ । పా - - ॥
జ న నం హే స ఖి । జా - నా - । మి - - ॥

గగగగ గా మా । పదపమ । పప ప మ ॥
ఘ న త ర యా వేం । క ట గి రి । ప తి యే - ॥

గగ మమదదపమ । గమపమ । గరిసా ॥
వి ను త భో - గ సు ఖ । వి భ వం - । ద ధ సే ॥ ॥సకలం॥

**అవతారిక :**

ఇందలినాయిక స్వీయ. ఉత్తమనాయికయగు అలమేలుమంగయే ఈమె. గనుకనే నాయకుడగు శ్రీవేంకటేశ్వరునితో "నీమోహమెల్లనా మ్రొక్కులలో కానవచ్చుటలేదా ? ఇంకను అద్దమువంటి నామనసు నేల శోధించేవు ! మొగమిచ్చకపుపనులు చేసి నిన్ను భ్రమియింపవలెనా ? అట్టి టక్కరితనములు నాకు తెలియవు. నేను నీకు సమర్పించిన కానుకలే యీనిజమును చెప్పుచుండుటలేదా ! ఇంకను నాగుణములను ఏమివిమర్శించుకొనుచున్నావు ? నీదాననగు నన్నిట్లు రవ్వసేయదగునా ? మచ్చరములకు నేరనిదానను. మన్నింపవయ్యా ! నాగుణములు మన కూటములయందే నీవెఱిగితివిగదా ! నేను నీఅలమేల్మంగను నన్ను పాలించుకోవయ్యా!" అని స్వామివారికి పొలయలుకలు తీర్చి తనను ప్రసన్నునిగా అమ్మవారు చేసుకొనుచున్నారు.

నాదనామక్రియ – రూపకం

కల్లగాదు యిది నీవు గన్నపనే
చెల్లునీకే యన్నియును చిత్తగించరాదా ! ॥పల్లవి॥

మొక్కిన నామొక్కులలోనే మోహమెల్లా గానరాదా
చొక్కపు నామనసేమి సోదించేవు
యిక్కడనే భ్రమయించ యిదిగొంత వలెనా
తక్కరితనము నేర దయ జూడు మికను ! ॥కల్ల॥

యిచ్చిన కానుకలోనే యితవెల్లా దెలియదా
తచ్చి మాగుణములేమి తలపోసేవు
రచ్చబెట్టి నీవింత రవ్వసేయవలెనా
మచ్చరమెఱగ నన్ను మన్నించుమికను ! ॥కల్ల॥

కూడిన నాకూటమిలో గుణమెల్ల గానరాదా
తోడనే మమ్మెంత నీవు తొరలించేవు
వేడుక మించితివి శ్రీవేంకటేశ నన్నునిట్టె
జాడ నలమేల్మంగను చనవులిమ్మికను ! ॥కల్ల॥

ప. - ప ప ప ప మ గ మా ॥ ద ప ద మా ప ప ॥
- క ల్ల గా - - - దు ॥ యి - - నీ - వు ॥

గ మ ప ద ప మ గ మ ప మ గ రి ॥ స రి స రి గ రి గా ॥
క - - - న్న - - - ప - - - ॥ నే - - - - - - ॥

- గ మ ప ద ని ద ॥ ప మ ప గ మా ॥
- చె ల్లు నీ - - కే ॥ య - న్ని యు ను ॥

- గ రి గా మా ద ద పా ॥ ప ప మా గ మ గ రి సా ॥
- చి - త్త గిం - - చ ॥ రా - - - - - - దా ॥ ॥కల్ల॥

చ. - ప ప ద ప ప ప మా ॥ గ మ ప ద పా గ మ ప ద ప మ ॥
- మ్రొ క్క - న నా - - ॥ మ్రొ - క్కు - - లో - నే - - - ॥

గ మ ప ద ని ని దా పా ॥ ద ప ప మ గా ప మ గ రి సా ॥
మో - హా - మె - - ల్లి ॥ గా - - - న రా - - - దా ॥

- స రి స రి స నీ ॥ స రి స రి గ రి గా ॥
- చొ క్క పు నా - - ॥ మ - న - సే - మి ॥

గ మ ప ద ప మ గ మ ప మ గ రి ॥ సా - - - - ॥
స్తో - - - దిం - చే - - - - - ॥ వు - - - - ॥

- స ప ప ప ప మ గ ॥ గ మ ద ప ద ప ద ప దా ॥
- ఇ క్క డ నే - - - ॥ భ్ర - మ - - - యిం - చ ॥

- మ మ మా ప మ గ రి ॥ స రి స రి గ రి గా ॥
- ఇ ది కొం త - - - ॥ వ - లె - నా - - ॥

- గ మ ప ద ని ని దా ॥ ప మ ప ద ప మ గ మ ॥
- తక్కరి - - - - ॥ త న ము - - - నే ర ॥

గ మ ద ద ప మ ప ప మ గ ॥ మ మ గ రి స రి స రి గా ॥
ద య జూ - - - డు - - - ॥ మి - - - - - క - ను ॥

ప ప ప ప మ గ మా ॥ ద ప ద మా ప ప ॥
క ల్లగా - - - దు ॥ ఇ - ది నీ - వు ॥

**అవతారిక :**

"జగన్నాటకసూత్రధారి నిర్మించిన యీ ప్రపంచమునందు అసహ్యించుకొన దగిన వేదియు లేవట ! మాయామోహితమైన మనసునకు వేరెట్లుతోచును? కాంతలపొందులు, పుట్టుట గిట్టుటలు, తినుట త్రాగుటలు, చూచుటలు మొదలగునవి వారివారికి ఏర్పరుపబడి మనసునకు ఇష్టములైనచో అన్నిటియందును ఇంపేతోచును. పనులు, చేతలు, జాతులు, నీతులు, సొగసులు ఎవరివివారికి ఇంపుగాకుండునా ! ఇదియంతయు నీకల్పితమేకదా !" అని శ్రీవేంకటేశ్వరునికి అయ్యవారు విన్నవించుకొనుచున్నారు.

**రాగ లక్షణము :**

గుజ్జరి ప్రాచీనరాగములలో నొకటి. ఇది యిప్పటి వాడుకప్రకారము 15 వ మేళమగు మాయామాళవగౌళ జన్యముగా చెప్పుకొనవలెను. కాని యీరాగస్వరూపమును గమనించినచో మాళవగౌళకు పూర్వమే ఇది అత్యంతప్రధానరాగములలో నొకటిగా నున్నట్లు తోచుచున్నది. సంపూర్ణ సంపూర్ణములుగా నుండినను కొన్నివక్రసంచార ప్రయోగముల కారణముగా రాగములు వేరు వేరు పేర్లతో గుర్తింప బడుచున్నట్లు ప్రాచీనుల గ్రంథములవలన విశదమగుచున్నది.

ఆరోహణ : స రి గ మ ప ద ని స, అవరోహణ : స ద ని ప మ గ రి స అని ఒకరును అవరోహణము స ని స ద ని ప ద మ ప గ రి స అనియొకరును, ఇందుగల గీతకీర్తనాదులను గమనించి ఆరోహణావరోహణములు తెలుసుకొనవలెనని వేరొకరు చెప్పియుండుటచే ఈ రాగమును అధ్యయనము చేయుట కొంత కష్టతరమగుచున్నది. ఐనను, మనకు దగ్గరివారగు త్యాగరాజస్వామివారి కీర్తనలు గమనించినచో రాగస్వరూపము కొంత విశదమగును.

గుజ్జరి – రూపకం

హేయమేమీలేదు జగమంతా రుచికరమే
మాయావికారమిది మలసెట్టురోసును ! ॥పల్లవి॥

కాయధారణములింపు కాంతల భోగములింపు
ఆయతమై వారి వారి యాహారాలింపు
సోయగపు గన్నులను చూచేటి వేడుకలింపు
ఛాయ్యమన్నసొడబడి సమ్మతించితేను ! ॥హేయ॥

పలుకులెల్లానింపు భావములెల్లా నింపు
చెలరేగి తమ తమ చేతలింపు
జలమల సంగతుల సహజములవి యింపు
వొలిసి తమ మనసు వొడబడితేను ! ॥హేయ॥

తగిన జన్మములింపు తమచక్కదనాలింపు
జగతివారికి వారి జాతులింపు
నిగిడి శ్రీవేంకటేశ నీమహిమలేయవి
ఒగరులేక మనసొడబడివుంటేను ! ॥హేయ॥

అ : 11 (1)–178

ప గా మ పా మ । గ మ గ రీ - ॥ స రి సా నీ । స రి గ రి గా ॥
హే య మే మి । లే - - దు - ॥ జ గ మం తా । రు చి క ర మే ॥

మా పా - ప । పా ద ప మా ॥ మ మ పా దా । పా ను గా - ॥
మా యా - వి । కా ర మి దీ ॥ మ న సె ట్టు । రో సు నో - ॥ ॥హేయ॥

చ. పా ద ద స ని । స స సా సా ॥ స రి ని స ద ని । ప ద మా పా ॥
కా య ధా - ర । ణ ము లిం పు ॥ కాం - త ల భో - । గ ము లిం పు ॥

మా ప ద స ని । సా రి సా ని ॥ సా రి రి స ని । ని స సా - - ॥
ఆ య త మై - । వా రి వా రి ॥ యా హా - ర ము । లిం - పు - - ॥

సా రి గ మా । గా రి రి సా ॥ సా రి స స ని । ద ని ప ద మ ప ॥
సో య గ పు । క న్ను ల ను ॥ చూ చే టి వే - । డు క లిం - పు - ॥

సా ని స దా । ని పా ద పా ॥ మ గ మ పా ఫ । గా రి సా - ॥
ఛా య ఘ న । సొ ఢ బ డి ॥ స - మ్మ తిం చి । తే - ను - ॥ ॥హేయ॥

అవతారిక :

ఈ పదమునందు 'రాగము' అను పదమునకు గల వివిధములగు అర్థములను స్ఫురింపచేయుటకు అన్నమయ్యవారు ఎంతో హృద్యముగా ప్రస్తరించియున్నారు. ఇందు నాయకుడగు శ్రీ వేంకటేశ్వరుని లీలలను ఒక్కటొక్కటిగను వర్ణించుచు, "చెలి యెదుట చేసిన దొక రాగము, చెలి మదిలో మూసియుంచిన దొక రాగము, పొలతి మేనపులకలను నింపుచు పూసిన దొక రాగము, ఆమె నెడబాసి విరహమున వ్రాసిన దొక రాగము, ప్రాణములపై కోపమున రాసిన దొక రాగము, ఇట్లు ఆయా సందర్భముల యందు సకల కళా కోవిదుడగు శ్రీ వేంకటేశ్వరుడు రాగములను, నీ యనురాగమునందు మేళవించి పాడుకొనుచున్నాడు సుమా" అని చెలి నాయిక యగు అమ్మవారికి తెలియచెప్పుచున్నది. రాగమనగ ప్రేమ, రాగమనగా రంగు, రాగమనగా సంగీతమునందలి స్వరముల సంపుటి, రాగమనగ కపోలములు మొదలగు అంగముల యందద్దుకొనెడి ఒక లేపనము. ఇట్టి అర్థముల నెన్నిటినో ఆయా సందర్భములయందన్వయించుకొనుటకు అనువుగా కనబడుచున్నది యీ పదమునందు

రాగ లక్షణము :

సావేరి పూర్వ ప్రసిద్ధములగు రక్తిరాగములలో నొకటి. ఇది మేళకర్తల ఆవిర్భావమునకు ముందు నుండియు వాడుకయందున్న రక్తిరాగము. ఐనను ఇప్పటి వాడుక ప్రకారము 15వ మేళమగు మాయా మాళవగౌళ జన్యముగా చెప్పుకొనుచున్నాము. స రి మ ప ద స స ని ద ప మ గ రి స అనునవి ఆరోహణావరోహణములు. తారస్థాయి యందు స రి ప మ గ రి సా అను ప్రయోగము గలదా అనియు, 'స ని స', 'మ గ మ' అను ప్రయోగములు కలవా, అనియు విద్వాంసుల మధ్య వాదోపవాదములు గలవు. కాని యిప్పుడు లభ్యమగుచున్న రచనలలో ప్రాచీనులగు క్షేత్రజ్ఞులవారి పదములలో ఇట్టి ప్రయోగములు గలవు. కనుక వాటిని పాటించినచో తప్పేమియులేదు. ఆరోహణావరోహణలపై ఆధారపడక రాగచ్ఛాయలను గమకవరికాదులను తెలిసి పాడుకొనదగిన అఠాణా, ఆహిరి, సైంధవి, హుసేని వంటి రాగములలో నిదియొకటి అని తెలిసికొనినచో ఇట్టి వాదోపవాదములకు తావుండదు.

సావేరి – ఝంపె

మెచ్చెనొక రాగంబు మీద మీద కడు

చేసె నొక రాగంబు చెలియెదుట గన్నులనె
మూసె నొక రాగంబు ముదిత మతినె
పూసె నొక రాగంబు పొలితి పులకలమేన
వ్రాసె నొక రాగంబు వనిత నినుబాసి ! ॥మెచ్చె॥

పట్టె నొక రాగంబు ప్రాణములపై నలిగి
తిట్టె నొక రాగంబు తిరిగి తిరిగి
పుట్టె నొక రాగంబు పొలతి డెందమునకును
మెట్టె నొక రాగంబు మెరయుచునె కదలి ! ॥మెచ్చె॥

కురిసె నొక రాగంబు కొప్పు పువ్వులనె సతి
మురిసె నొక రాగంబు ముంచిమేన
తిరువేంకటేశ్వరుడ తెలుసు కోనిక బొంది
పొరసె నొక రాగంబు పొలతి కుచములనె ! ॥మెచ్చె॥

శృం : 12-862

- ప ద ప మ | గా రి స స || - ప ద సా స రి ప మ | గా రి సా ||
- మె చ్చె నొ క | రా గం - బు || - మీ - ద మీ - - - | ద క డు ||

- రి మ ప ప | ద ప ప మ ద ప ద || ప ద స ని ద ప ప |
- ఇ చ్చె నొ క | రా - - - గం - బు || ఝు - - - తు ల కు |

ద ద ప మ గ రి గ రి స ||
నె - - - ల్ల - - - - || ॥మెచ్చె॥

- ప ద ప మ | ద ద ప మ గ రి గ రి సా || - స రి మ మ మ |
- చే సె నొ క | రా - - - గం - - - బు || - చె లి యె దు ట |

పా ద ప ప మ ద ప ద ||

- ప మ ప ద స | సా రి స ని ప దా ద || స రి మ ప ద | సా - - - ||
- మూ - సె నొ క | రా - - - - గం బు || ము ది త మ తి | నే - - - ||

- ప ద స స స | స రి గా రి స రి || - స రి ప మ గ గ రీ |
- పూ - సె నొ క | రా - - గం - బు || - పొ ల తి - పు - ల |

స రి గా గ రి రీ సా ||
క - ల మే - - న ||

- ప ద స స | సా రి స ని ప ద ప మ || - రి మ ప ద ప | మ గ రి సా ||
- ప్రా సె నొ క | రా - - - - గం - బు || - వ ని త ని ను | బా - - సి ||

॥మెచ్చె॥

**అవతారిక :**

ఈపదమునందలి నాయిక స్వీయ, ప్రౌఢ, ధీర, ప్రేమగర్వీత. ఈమెకు కోపము వచ్చి నను నాయకుడగు శ్రీవేంకటేశ్వరుడు శాంత మూర్తియై, ఆమెను, నవ్వును ముందలించి, బుజ్జగించి యేలుకొనవలెనట ! ఈమె "ఏమయ్యా ! బీరములాడే వారికి బిరుదులుండవచ్చునా ? తెగువ గలవారికి తిమ్మిరితనములు రేగవచ్చు, వాసులువట్టువారికి వట్టిబోలి మించినను మించ వచ్చును. నేరుపుగలవాడవు, తగవరివైనవాడవు. పూనెవట్టి నీకు బుద్ధి చెప్పవలదా ?" అని తప్పంతయు ఆతనిదే ఐనట్లు గద్దించి దండించు చున్నది,

సావేరి — రూపకం

నేనెంత కోపినైన నీకేల చలము
పూనిపట్టి నాకు నీవు బుద్ధి చెప్పరాదా ! ॥పల్లవి॥

బీరము లాడేవారికి బిరుదులే యెక్కగాక
వోరుపు గలవారికి వొరటున్నదా
నేరుపు గలవాడవు నేనేమనిన నీవు
ఆరితేరి చుట్టమవై అండనే వుండరాదా ! ॥నేనెంత॥

తెగువ గలవారికి దిమ్మురెల్లా రేగుగాక
మొగమోడే వారికి మోసమున్నదా
తగవరివట నీవు తత్తరించి నే మీరితే
నగుతా నన్ను బోదించి నమ్మించరాదా ! ॥నేనెంత॥

వాసులు వట్టేవారికి వట్టి జోలి మించుగాక
సేసవెట్టిన వారికి సిగ్గులున్నవా
ఆసతో శ్రీవేంకటేశ ఆయములు నే నంటితే
యీసులేక కూడితివి యిక మెచ్చరాదా ! ॥నేనెంత॥

శ్రృం : 26—591

సా స నిదా పా || పమ పదధ ప ప.మ ||
నే నెం - - త || కో - - పి నై - న - ||

పా పమ గా రి || సరిపమ మ ద నీ దా ||
నీ కే - - ల || చ - ల - ము - - - ||

సరిగరిస నిదా ప || మపదరిసనిదదపమగరి ||
నే - - - నెం - - త || కో - - - పి - నై - - - న - ||

సరి పా - మగరి || సరిపమ మదపా దా ||
నీ - కే - - - ల - || చ - ల - ము - - - - ||

పా పమ గా రిస || సని ఫా ధ సా రి ||
పూ - ని పట్టి - || బు - - ద్ధి చె ప్ప ||

మ ప దా ద ప ప మ పా || - పమగరిసరిమపదా ||
రా - - - - - - - || - దా - - - - - - - - - ||

॥నే నెంత॥

- ప ప ప మ గ గ రీ || స రి ప మ గా రి స ||
- బీ ర ము - లా - - || డే - - - వా రి కి ||

స ని పా ధ సా రి || మ ప దా ప మ గ గ రీ స ||
బి - రు దు లే - || యె - - క్కు - గా - - క ||

- స రి మ మ మ మ || పా - మ ద ప ద ద ||
- వో - రు పు గ ల || వా - - - - రి కి ||

మ ప ద రి స ని ద రి పా ప మ || పా - - - - ||
వో - ర - టు - - - - న్న - || దా - - - - ||

ప ద స స స స || స రి గా రి స రీ ||
నే - రు పు గ ల || వా - - డ - వు ||

రి ప మ గా రి రి || స రి ప మ గ గ రి స ||
- - - నే మ - || ని - న - నీ - వు - ||

ప ద స రి గ రి స || సా రి గ రి స స ని దా ||
ఆ - రి - తే - రి || చు - - ట్ట - ము - వై ||

ప ద గ గ రీ స || సా స రి మ ప దా || సా స ని దా పా ||
అం డ నే - వుం డ || రా దా - - - - || నే నెం - - త ||

**అవతారిక :**

ఈ పదము నందు నాయికానాయకుల పొలయలుకలు గమనించి చెలులు చతురుడగు స్వామివారిని ఉద్దేశించి 'ఏమయ్యా పంతము లాడుకోరా ! తమలోతాము బలిమిచేసుకోరా ! గబ్బితనములు చూపుకొనరా ? గర్వములు చేసికొనరా ? కన్నులనదలించుకొనరా ? కౌగిళుల నలముకొనరా ? యౌవనవంతులైన యువిదలకు మనసులు వింతలై యుండవా ? మీదొంతరవలపులు మీతోనే యున్నవిగదా ! నిండుజవ్వనియగు మాస్వామినికి తమకము లుండవా? నిబ్బరపు టాళ లుండవా? సన్నపు మోవితీపుల చవులుండవా! మాయింతి వింతలేని మనసుగలది సుమా ! శ్రీవేంకటేశ్వరుడా ! ఆమె చేతలను మన్నించుకొనవయ్యా ! అలవోకగా నాడిన సుద్దులకే యింత రాద్ధాంతములా" అని ముగ్ధయగు అమ్మవారిని గురించి నాయకుడగు శ్రీవేంకటరమణునికి నచ్చచెప్పుచున్నారు,

**రాగ లక్షణము :**

గౌళ ఘనరాగ పూర్వపంచకమునందు రెండవది. ఇది ప్రాచీన రాగములలో నొకటి ఇందలి స్వరసముదాయము శృంగార పదములకు ఒదుగునట్టు నప్పించుట అతికష్టము. మధ్యమకాల, దురితకాలములలో తప్ప ఈరాగమును ఇప్పుడు మనము వినుచుండుటలేదు. అభినయ ప్రధానములగు పదములు ఇందు విలంబకాలములో పాడినచో ఎట్లుండునో? ఇట్టి రసస్పష్టిచేసిన తాళ్ళపాకవారికి జేజేలు !

స రి గ మ రి మ ప ని స !

స ని ప మ రి గ మ రి స ! అనునవి ఆరోహణావరోహణములు. ఇది యిప్పటి వాడుకప్రకారము 15 వ మేళకర్త మాయామాళవగౌళ జన్యము.

**గౌళ — రూపకం**

వద్దు వద్దు ఖిలోన వట్టివాదులు
సుద్దుల మాటలకే సూడువట్టేరా ! ॥పల్లవి॥

పంతములాడితేనేమి బలిమిచేసితేనేమి
వింతలేని మనసుల వెలదులకు
దొంతర వలపులెల్ల తోడుతనే వెంటరాగా
యింతమాత్రపు వలపులివి చెల్లవా ! ॥వద్దు॥

గబ్బితనమైన నేమి గర్వము చూపిననేమి
వుబ్బేటి జవ్వనముల వువిదలకు
నిబ్బరపు టాసలెల్ల నిండుకొని వుండగాను
అబ్బురపు దమకములవి మానీనా ! ॥వద్దు॥

కన్నుల నొక్కిన నేమి కాగిలించుకొన్న నేమి
నిన్నుగూడి వుండినట్టి నెలతలకు
మన్నించు (శ్రీ) వేంకటేశ మరి నీ యానవుండగా
సన్నపు మోవితీపుల చవులెక్కవా ॥వద్దు॥

శృం. 14-54

\- స స ని పా ప మ ॥ ప మ గ మ రీ సా ॥
\- వ ద్దు - వ ద్దు - ॥ మీ - - - లో న ॥

\- స ని ధా స్రీ స ॥ ప మ గ మ రి స రి మ పా ॥
\- వ - ట్టి వా డు ॥ లు - - - - - - - - ॥

\- రి మ ప నీ ॥ స స ని స రి స రీ ॥
\- సు ద్దు ల మా ॥ ట ల కే - - - - ॥

ప మ గ మ రి గ రి స రి ప మా ॥ ప మ గ మ రి స ని స రి మ పా ॥
సూ - - - డు - వ - - - - - ॥ ట్టే - - - - - - రా - - - - - ॥వద్దు॥

\- రి మ ప నీ ॥ ప మ ప మ గ మ రీ ॥ - ధ ని పా రీ రి ॥
\- వం త ము లా ॥ డి తే నే - - - మి ॥ - బ లి మి చే సి ॥

ప మ గ మ రీ సా ॥
తే - - - నే మి ॥

- స రి సా స ॥ స ని ధా ని స రి స రీ ॥ మ రి మా ప ః స ప మ గ మ ॥
- విం త లే ని ॥ మ - న సు - - - ల ॥ వె - ల దు ల - ఒ - - - ॥

రి స రి మ పా - - ॥
- - - - - - - ॥

- రి మ పా స ని ॥ ప ప ని స రి స రీ ॥
- దొం త ర వ - ॥ ల పు - - - - ల్లి ॥

రి గ మా రి రి సా ॥ రి స ని ప ని సా స ॥
తో - - డు త నే ॥ వెం - - - ట రా గా ॥

- ప ని సా స ॥ ని స రి స రి రి రీ ॥
- యిం త మా త్ర ॥ పు - - - వ ల పు ॥

ప మ గ మ రి స రి స ని ప మా ॥ ప మ గ మ రి స ని స రి మ పా ॥
లి - వి - - - చె - - - ల్లి ॥ పా - - - - - - - - - - - ॥వద్దు

**అవతారిక :**

ఈ సంకీర్తన యందు 'వటపత్రశాయివై మహార్ణవమున పవ్వళించిన వాడవు, భూమిపై ధర్మము నశించెడి సమయములలో నీవు అవతారముల నెత్తి శిష్టులను ఆదరించి, దుష్టులను శిక్షించెడివాడవు. సకల భూతముల యందును నిండియున్నవాడవు. భక్తులకు వరము లిచ్చెడి దాతవు. వేద వేదాంగముల వలన సూచింపబడుచున్నావు. శ్రీవేంకటగిరి యందు స్థిరముగా నెలకొనియున్నవాడవు, నీవు వైకుంఠపతియైన ఆదినారాయణుడవు'' అని అయ్యవారు వేంకటనాధుని వినుతించుచున్నారు

**రాగ లక్షణము :**

సాళంగనాట ప్రాచీన ఘన రాగములలో నొకటి. ఇందు శృంగారరస ప్రధానములగు పదములు చెప్పిన ఘనత తాళ్ళపాకవారిదే. ఘనరాగములు గంభీరములగు నడకలతో నుండి స్వర సంచారములయందు మహావేగముగా పరుగులిడు సెలయేళ్ళవలె నుండుట సహజము. అట్లే పెద్దలును చెప్పియున్నారు. ఇందు లలితములగు మనో భావములను వ్యక్తపరచుట కొంత కష్ట సాధ్యమగు పనియే. సాళంగనాట 15వ మేళమగు మాయా మాళవగౌళ జన్యము.

ఆరోహణ : స రి మ ప ద స

అవరోహణ : స ని ప ద ప మ గ రి స ।

సావేరి మొదలగు సన్నిహితములగు రాగములనుండి దీనిని వేరుపరచుకొను గమక వరికాదుల ప్రయోగములు అధ్యయనము చేయవలసియుండుట వలననేమో ఇందు తరువాతి వాగ్గేయకారులు రచనలు చేసినట్లు కనబడుటలేదు.

**సాళంగనాట — ఝంపె**

అయమేవ అయమేవ ఆదిపురుషో
జయకరం తమహం శరణం భజామి ! ॥పల్లవి॥

అయమేవ ఖలుపురా అవనిధరస్తుసో
ప్యయమేవ వటదళాగ్రాదిశయనః
అయమేవ దశవిధ్యరవతార రూపైశ్చ
నయమార్గ భువిరక్షణంకరోతి ! ॥అయ॥

అయమేవ సతతం శ్రియఃపతిదేవేషు
అయమేవ దుష్టదైత్యాంతకస్తు
అయమేవ సకళ భూతాంతరేష్టుశ్రమ్యు
ప్రియభక్తపోషణం పిదృత్పనోతు ! ॥అయ॥

అయమేవ శ్రీవెంకటాద్రి విరాజితే
అయమేవ వరదోప్యాచకానా
అయమేవ వేద వేదాంతశ్చ సూచితో
అయమేవ వైకుంఠాధీశ్వరస్తు ! ॥అయ॥

అ : 11 (1)–17

ప. స రి మా మ | ప మ గా స || రి స ని స రి | సా - - - ||
అ య మే వ | అ య మే వ || ఆ - ది పు రు | ష - - - ||

స రి మ ప మ | ప ద సా - || స ని ప ద ప | మ గ రి సా ||
జ య క రం - | త మ హం - || శ ర ణం - భ | జా - మి - || ॥అయ॥

చ. మ మ పా ద | పా పా మ || గా గ రి రి | సా రి సా ||
అ య మే వ | శ్రీ వేం క || టా ద్రి - వి | రా జి తే ||

స రి మా మ | రి మ పా మ || ప ద ప స ని | సా - - - ||
అ య మే వ | వ ర దో పి || యా - చ కా - | నాం - - - ||

స రి మా మ | గా రి స ని || స రి మా మ | గా రి సా ||
అ య మే వ | వే ద వే - || దాం - త శ్చ | సూ చి తో ||

స ని స రి స | ద ప దా - || ప మ గా రి | సా సా - ||
అ య మే - వ | వై - కుం - || ఠా - ధీ శ్వ | ర స్తు - || ॥అయ॥

**అవతారిక :**

ఈ కీర్తనమున "వేడినవారికి వరములిచ్చెడి ఓ తిరువేంగళ నాథా! నీ నామజపమును చేసిన వారిని భవసాగరమును దాటించ గలవాడవు. ఇట్టి సర్వజ్ఞుడవగు పరమాత్ముడవు నీవు. నిన్ను యేమి వరంబు కోరుకొందు. జీవులకు కలిగిన వన్నియు నీ విచ్చినవే. ఇంకను నిన్నేమి కోరుకొందును." అని అన్నమయ్యవారు జీవుల అల్పత్వమును, పరమాత్ముని అనంతత్వమును గానము చేయుచున్నారు.

**సాళంగ నాట – ఆది**

ఒసగితి విన్నియు నొకమాఁటే
వెసనిక జేసే విన్నపమేది ! ॥పల్లవి॥

నారాయణ నీనామము దలచిన
నీరానివరము లిచ్చితివి
చేరినిన్ను నిటు సేవించిననిక
గోరి పడయనిక గోరికలేవి ! ॥ఒసగితి॥

హరి నీకొకమరి యటుశరణంటే
గరిమల నన్నిటు గాచితివి
నిరతముగా నికనిను నుతియింపుచు
అరగొరతని నిను నడిగేదేదో ! ॥ఒసగితి॥

శ్రీవేంకటేశ్వర చేయెత్తిమొక్కిన
భావమె నీవై పరగితివి
యీవరుసల నీవింతటిదాతవు
ఆవలనిను గొనియాడెడి దేమి ! ॥ఒసగితి॥

ప. స రి మ మ ప ద ప మ | ద ప సి ని | సా - - ||
ఒ స గి తి వి - న్ని యు | నొ క మా - | చే - - ||

సి రి ని సి ప ద ప మ | ప ద ప మ | గ స రి స ||
వె స ని క జే - సే - | వి - న్న ప | మే - ది - || ॥ఒసగితి॥

చ. మా ప ద ప మ గ స | రి స ని స | స రి మ మ ||
నా రా - య ణ నీ - | నా - మ ము | త ల చి న ||

మా ప ద ప మ గ రి | మా ప ద | పా - - ||
యీ రా - ని వ ర ము | లి చ్చి తి | వి - - ||

పా ప ప స ని రి స | సి రి మ గ | రి స స ని ||
చే రి ని - న్ను ని టు | సే - విం - | చి న ని క ||

సి రి ని స ప ద ప మ | ప ద ప మ | గ స రి స ||
కో - రి ప డ య ని వి | కో - రి క | తే - వి - || ॥ఒసగితి॥

**అవతారిక :**

ఇందు వేంకటాచలపతిని కొనియాడుచు "ఈతడు నరకాసురుని వధించి పదియారు వేల మంది కన్నియలను పెండ్లాడిన నాటి కృష్ణావతారుడే! శిశుపాలునికిచ్చి పెండ్లి చేయుటకు తనకు ఇష్టము లేకున్నను, అన్నయగు రుక్మి బలవంతము చేయుచుండగా ప్రార్థించిన రుక్మిణిని, విందులారగించిన చందము అలవోకగా గొనివచ్చి పెండ్లాడిన ఆ మదన గోపాలుడే యితడు! దేవదానవులు అమృతమునకై క్షీరసాగరమును మథియించు సమయమున వెలికివచ్చిన శ్రీ మహాలక్ష్మిని పెండ్లాడిన వైకుంఠ నాథుడితడే! ఇతనికి సమస్త శుభములును కలుగు గాక!" అని అయ్యవారు తిరువేంకటనాథునే ప్రార్థించుచున్నారు.

**రాగ లక్షణము :**

సౌరాష్ట్రరాగము ప్రాచీనము. ఇందు రెండు నిషాదములు వచ్చుచుండుటవలన ఇది భాషాంగము. 'ని సా ని' అనునప్పుడు కాకలి నిషాదము 'ద నీ ద పా' అనునప్పుడు కైశికి నిషాదమును పలికించుట సంప్రదాయము. ఇందుగల ధైవతములన్నియు చతుశ్రుతి ధైవతములే గనుక దీనిని వాడుకలో చక్రవాక జన్యమని చెప్పుట ఉచితము. వెంకటమఖి సంప్రదాయమున దీనిని మాయా మాళవగౌళ జన్యముగానే చెప్పియున్నారు.

ఆరోహణ : స రి గ మ ప మ ద ని స

అవరోహణ : స ని ద ని ద ప మ గ రి స ।

ఇది రక్తిరాగము. నిజమునకు సూర్యకాంతము (17) జన్యమా, చక్రవాకము (16) జన్యమా అనునది వివాదాస్పదమగు విషయము. మాయా మాళవగౌళ జన్యమనుటకు అవకాశమే ఇప్పుడు కనబడుచున్నది. ఏలననగా ఇందు చతుశ్రుతి ధైవతము మాత్రమే పలుకుచున్నది. రెండు నిషాదములు సమనుగానే వచ్చుచున్నవి. గనుకదీనిని 16, 17 మేళకర్తలలో దేని జన్యమన్నను అనవచ్చును.

**సౌరాష్ట్ర — ఆది**

శోభనమే శోభనమే
వైభవముల పావనమూర్తికి ! ॥పల్లవి॥

అరుదుగ మును నరకాసురుడు
సిరులతో జెరలు దెచ్చిన సతులా
పరువపు వయసులం బదారువేలను
సొరిది పెండ్లాడిన సుముఖునికి ! ॥శోభ॥

చెందిన వేడుక శిశుపాలుండు
అకదిపెండ్లాడంగ నవగళించి
విందువలెనె తావిచ్చేసి రుక్మిణి
సందడిం బెండ్లాడిన సరసునికి ! ॥శోభ॥

దేవదానవులు ధీరతను
దావతి పడి వార్థిన్ దరువంగను
శ్రీవనితామణిం జెలంగి పెండ్లాడిన
శ్రీ వేంకటగిరి శ్రీనిధికి ॥శోభ॥

శృం : 3-18

ప. ద ని స రి సా - ని | ద ని ద ద | పా - మ ||
శో - భ న మే - - | శో - భ న | మే - - ||

గ మ ద ప ద ద ప మ | గ మ గ స | రి రి సా ||
వై - భ వ ము ల పా - | వ న మూ - | - ర్తి కి || ॥శోభ॥

చ. మా మ గా రి స రి | స ని ధ ని | సా - - ||
దే వ దా న వు లు | ధీ - ర త | ను - - ||

స రి గ మ ప మ గ మ | ప మ ద ప | దా దా ||
దా - వ తి ప డి వా - | ర్థి త రు వం | గ ను ||

స రి గ మ గా రి రి | స ని ద ద | స ని రి స ||
శ్రీ - వ ని తా మ ణి | చె ల గి పెం | డ్లా - డి న ||

సా స ని ద ద ప మ | గ మ మ గ రి | స రి గ మ ||
శ్రీ వెం - క ట గి రి | శ్రీ - ని - - | ధి - కి - || ॥శోభ॥

**అవతారిక :**

ఇంచలితాయిక ఖండిత. ఈమెనాయకుని దండించి అడుగుటయందు సందేహములేదు. "చిన్నవి పెద్దవి అయిన విషయములను నేనేమైన ఆడినచో నీవు తిట్టితినని అందరికి చెప్పుకొందువా? నీకు| సేమతో పూవులచెండివ్వగా నిన్ను నేనొకటి వేసితినని ఆడుకొందువా ! పాదములను ఒత్తుటకు నేను సేవించగా నిన్ను కొట్టితినని యితరులకు చెప్పుదువా, పోనిమ్ము. ఇప్పటికైనను నన్ను కలిసితివి ఇట్టిచెప్పుకొనుటలే నీకు ఇష్టములైనచో కానిమ్ము. మంచిదాయ ; దానికేమి, మాటలేమైనా పోట్లవురా" అని ఎగసెక్కెముగా దెప్పిపొడుచుచున్నది.

సౌరాష్ట్ర — తిశ్రఏక

మంచిదాయ దానికేమి మాటలు పోట్లయ్యేనా
పెంచి యెంతసేసినా నీపెద్దరికి మింతేకా ! పల్లవి॥

మెల్లనే మాటాడితే మించి ఇందరి తోడాను
తెల్లమిగా నాదేవు తిట్టితినంటా
బల్లిదుడ వౌదువయ్యెపని ఇందే కానవచ్చె
కల్లలాడేవా నీవు కలుగగబోలును ! ॥మంచి॥

పూవుల చెండిచ్చితేను పూచి ఇందరితోడాను
వేవేలుగా చెప్పేవు వేసితినంటా
దేవరవుగావా నీవు తెలిసె నిన్నియు మాకు
నీవల్ల నేరమున్నదా నిజముగా బోలును ! ॥మంచి॥

పాదాలు సేవసేసితే పైపై నిందరితోడాను
గోదాన జెప్పేవు బెట్టి గుద్దితినంటా
యీదెస శ్రీవేంకటేశ యెనసితి విక మీర
సాదవుగావా ఇవే చవులు గాబోలును ! ॥మంచి॥

శ్రృం : 27—73

ప. సా ఁరి సా ని | దా ని దా ప | గ మ ద ప ప మ | గ స రి సా - ||
మం చి దా య | దా ని కే మి | మా - ట లు పో - | ట్లయ్యా - నా - ||

ధ ని స రి స రి | మ గ మ ద ద ప | మ గ మ మ ద ప | ద ద ని సా ఁ
పెం - చి యెం - త | చే - సి నా - నీ | పె - ద్ద రి - క | మిం తే - గా
||మం

చ. పా ప ప ప మ | గ మ ద ప ప మ మ గ రి |
మె ల్ల న నే - | మా - టా - డి - తే - - |

సా రి స ని ధ ధ | ని స రి సా - రీ - ||
మిం చి ఇం - ద రి | తో - - డ - ను - ||

గా మ మ ప మ | గ మ గ రి స రి |
తె ల్ల మి గా - | నా - - డే - వు |

గ మ ద ప ద ని స ఁరి స ని | ద ని దా పా - ||
తి - ట్టి తి నం - - - - - - | - - - టా - ||

స ని దా ద ని స రీ | గ మ గ ఁరి స ఁరి |
బ - - ల్లి - దు డ | పౌ - దు వ - య్యా |

స ని సా ఁరి గ ఁరి స సా | స ని ద ద ని ద పా ప ||
ప ని యిం- - దే - - | కా - - న - - వ చ్చె ||

మా మ గ మ ద ప | ప దా ద ప ప ||
క ల్ల లా - డే - | వా - నీ - వు ||

గ మ ప ద ని ద ప మ గ మ గ రి | గ మ పా ప మ దా ని ||

**అవతారిక :**

ఇందు మన్మథుని లీలలను, చతురతలను చెప్పుచు ఆతని కుసుమశర పరిధులలోనికి వచ్చినవారి చేష్టలను అతిమధురముగా వర్ణించుచు మన్మథావిష్టలగు యువతుల ముద్దుమాటలు, వయ్యారపు నడతలు, భావగర్భితమగు చిరునవ్వులు, యివన్నియు శ్రీవేంకటేశ్వరునకు వేడుకలని తరుణుల చేష్టవైభవములను అయ్యవారు వర్ణించుచున్నారు.

సౌరాష్ట్ర — త్రిపుట

ఎట్టు గడియించె నమ్మ యీవలపు
పుట్టించి నటువంటి పూటకాపుమరుండు ! ॥పల్లవి॥

తడబాటు నాలికకు తలకు మానంబునకు
నొడదాటు మఱపులకు నుదుటు దలపులకు
కడువేడుకలు కోరికలకు భయ మానలకు
జెడిదంపు గోపంబు బిత్తరి చూపులకు ! ॥ఎట్టు॥

అతి ముదము చింతకును అలపు గర్వంబునకు
మితిలేని తాపంబు మెత్తని తనువునకు
రతి గమ్మ చెమటలకు రచన విరహంబునకు
ధృతి లేమి మనసునకు గతి గమనమునకు ! ॥ఎట్టు॥

కురులు నెన్నుదుటికిని గుఱుతు లధరంబునకు
మురిపెంపు జిఱునగవు ముద్దు మోవునకు
దిరమైన వేడుకలు తిరువేంకటేశునకు
బరిణాపు మాటలివి పడతు లిందఱికి ! ॥ఎట్టు॥

శృం : 4–23

ప. - - స | దా ద ప || ప మ గ మా - | మ గ రి సా ||
- - ఎ | ట్లు గ || డి - - - - | ఝుం - - చె ||

స ని ధా | ని స రి స రి || - - గ మ | పా - మ మ గ రి ||
న - - | - - - - మ్మా || - - యీ - | - - - వ - ల ||

సా ద ద | సా సా || ని స రి స రి | రి స సా సా ||
పు పు - | ట్టిం చి || న - టు - - | వం - - టి ||

- - ద ని | సా స ని దా || ని ద పా - మ | మ గ ప మ మ గ రి ||
- - పూ ట | కా పు - - || మ - రుం - - | డు - - - - - - || ||

చ. - - ప ప | ద ని ద ప పా - మ || గ మ పా - మ || మ గ రి సా ||
- - కు రు | లు - - - నె - - || న్నూ - దు - - || టి - కి ని ||

- - స రి | సా-ని ధ ధ || ధా - ధ స ని | స రి రి స ||
- - గు ఱు | తు - ల ధ || రం - - - - | బు - న కు ||

- - స రి | గా మా || - - ప | పా ద ప ప మ ద ప ||
- - ము రి | పెం పు || - - చి | రు - - - - న గ ||

దా ద ని | సా రి స ని స స ని దా || ద ద నీ ద | పా - - ||
వు ము - | ద్దు - - - - మో - - || ము న - - | కు - - ||

- - గ మ | ద ప దా || ద ని సా - ని | రి స రి ||
- - ది ర | మై - న || వే - - - - | డు క లు ||

రి స రి | గ మ గ రి సా ||

సా రి స స ని దా | సా ౘ ని సా || - - ద ని | సా స ని దా ||
ఛే - - - - - | ళు న - కు || - - బ రి | ణా పు - - ||

ని స రి స రీ | రి స సా స || - - ద ని | సా స ని దా ||
మా - ట - - | లి - - వి || - - ప డ | తు లిం - - ||

ని ద పా - మ | మ గ ప మ మ గ రీ || సా
ద - జి - - | కి - - - - - - || -

||ఎట్టు||

**అవతారిక :**

అక్షర స్వరూపుడును, నాదమయుడును, సర్వాంతర్యామియు నగు హరిని శ్రీవేంకటేశ్వరుని కొనియాడుచు వినునవన్నియు నీనామములే, కనినవన్నియు నీరూపములే, సృష్టికి లోపలను వెలుపలను నిండియున్నావని వేదములు ఘోషించుచున్నవని అయ్యవారు వేంకటగిరినాథుని స్తుతించుచున్నారు.

**రాగ లక్షణము :**

లలిత ప్రాచీనములగు రాగములలో నొకటి. దీనిని 17వ మేళమగు సూర్యకాంతమునకు జన్యముగా పాడుట వాడుకలోనున్న పద్ధతి. ఒకేవిధమగు ఆరోహణావరోహణములు కలిగియుండుటవలన వసంత రాగమునుకూడ యీ 17వ మేళ జన్యముగానే చెప్పెడివారును కలరు. కాని శుద్ధధైవతముతో స్వతంత్రముగా ఒప్పుమండెడి వసంత చతుశ్రుతి ధైవతముతో ప్రత్యేకముగా కనబడుచున్న లలితరాగములను వేరువేరుగా పాడుకొని ఆనందించెడు యవకాశము పోగొట్టుకొనవలసిన యవుసరము కానరాదు. ఈ రెండింటికిని ప్రాచీనసంప్రదాయము లుండనే యున్నవి. లలితకు ఆరోహణావరోహణములు స గ మ ద ని స । స ని ద మ గ రి స ఇప్పుడు వాడుకయందుగల 72 మేళములలో 17వది యగు సూర్యకాంతమునకిది జన్యము. ఇట్లే స గ మ ద ని స । స ని ద మ గ రి స అను ఆరోహణావరోహణములు గలిగి 15 వ మేళమగు మాయామాళవజన్యముగా వసంతయు నేడు ప్రచారము నందున్నది. అన్నమయ్యవారి రచనలు 17 వమేళమగు సూర్యకాంతజన్యముగా నుండెడి లలితయందే స్వరపరుపబడినవి.

**లలిత — ఆది**

హరి నీమయమే అంతాను
అరసి నీకు శరణని యెదను ! ॥పల్లవి॥

యెదుట నెవ్వరిక నేమాటాడిన
అది నీ ఘన నామాంకితమే
అదివో సకలశబ్దాఖ్యుడవని నిన్ను
పొదలి చదువులు పొగిడీగాన ! ॥హరి॥

యెవ్వరి బొగడని యెక్కడనుండిన
నివ్వటిల్ల నది నీరూపే
నెవ్వదీర నిదెనిను విశ్వరూపు
డెవ్వల ననిశ్రుతులెంచీ గాన ! ॥హరి॥

భావన యిది నీ బ్రహ్మాత్మకమే
(శ్రీ) వేంకటేశ నాచింత యిదే
ఆవల నిను సర్వాంతర్యామని
దేవ శాస్త్రములు తెలిపి గాన ॥హరి॥

అ : 11 (1)–123

ప. - గ మా ద మా మ గ సా రి స | స ని ధా ధ సా ని | సా - - ||
- హ రి నీ - నా - - మ మె | అం - - తా - - | ను - - ||

- స మా గ మా ద మ ద ని | స రి స ని ద ని ద మ | గ మ గ రి సా ||
- అ ర సి నీ - కు శ ర | ణ - ని - యె - ద - | ను - - - - ||హరి||

చ. - దా - ద దా ద మ మ మ | మ గ సా రి స | మ గ మ మ ||
- భా - వ న యి ది నీ - | బ్ర - - హ్మా - | త్మ క మే (శ్రీ) ||

మ గ మా ధ మ ద ని ద మ | గ మ ద ని | సా - - ||
వేం - క టే - శ - నా - | చిం - త యి | దే - - ||

- స మా గ రి స ని సా | ద ని స రి సా - ని | ద ని ద మ ||
- ఆ - వ ల ని ను స | ర్వాం - - - త - - | ర్యా - మ ని ||

- సా - ని దా ని ద మ | గ మ ద ని స ని ధ మ | గ మ గ రి సా ||
- దే - వ శా స్త్ర ము లు | తె - లి - పి - - - | గా - - - న ||హరి||

**అవతారిక :**

ఇందు నూతన దంపతులవలె నొప్పుచున్న శ్రీవేంకటేశ్వరుని, అమ్మవారగు అలమేలు మంగను చూచి, ఆనందించుచున్న చెలిమికత్తెలు "ఓ దేవా ! చూపులతో కానుకలుబెట్టి, నవ్వులను తెరలువేసి, తరితీపుమాటలతో తలంబ్రాలుపోసి గొప్పవైన వలపులతో కొంగుముడులువేసి, కెమ్మోవితో బువ్వపువిందుబెట్టి అలమేలుమంగను ఆదరించితివి. మాచెలియు, నీవును శోభనములను పొందుదురుగాక !" అని పొగడుచున్నారు.

**లలిత — ఝంపె**

సోబాన బాడేము మేము సుదతులము
యీబుద్ధులు మీకు చెల్లు నిద్దరికి నయ్యా ! ॥పల్లవి॥

చూపులనే వుంకువలు సుదతికి బెట్టితివి
పూపనవ్వులు మించే కప్పురవిడేలు
యేపుమీరి నవ్వులనే యెదురుతెర వేసితి
వీ పొద్దే పెండ్లాయను మీకిద్దరికి నయ్యా ॥సోబా॥

తరితీపుమాటలనే తలబాలు వోసితి
గరిమ సరసములే కంకణాలు
గొరబైనవలవుల కొంగులు ముళ్ళువేసితి—
విరవాయ వేడుకలు ఇద్దరికి నయ్యా ! ॥సోబా॥

పొంచిన కెమ్మోవినే బువ్వపు విందు వెట్టితి
మంచముపై కాగిలే మంచిచవికె
అంచల శ్రీవేంకటేశ అలమేలుమంగ నీవు
యెంచి కూడితిరి తగు నిద్దరికినయ్యా ! ॥సోబా॥

శృం : 27—40

ప. స ని దా మ | గ మ గ గ రి || సా రి స ని | ధ ని సా ||
సో - బా న | బా - డే - ము || మే ము సు ద | తు ల ము ||

సా స మ గ | మ మ దా మ || దా ద స ని | స రి సా ||
యీ బు ద్ధు లు | మీ కు చె ల్లు || ఇ ద్ద రి కి | న - య్యా || ||సో బా||

చ. మ మ గా రి | స రి స స ని || స ధ ని స ని | స రి స స స ||
చూ పు ల నె | వుం - కు వ లు || సు ద తి కి - | వె - ట్టి తి వి ||

స స స మ గ | మా ద ద మ || ద ని సా ని | ద ద మా ||
పూ ప న వ్వు లు | మిం చే క - || ప్పు ర పు వి | డే - లు ||

గ మ దా మ | ద ని స స ని || స మ గ రి రి | స ని స సా ||
యే పు మీ ర | న - వ్వు ల నె || యె దు రు తె ర | వే - సి తి ||

స రి స నీ | ని స ని దా || మ ద మ గా | రీ సా - ||
వీ పొ ద్దె పెం | డ్లా యె ను మీ || కి ద్ద రి కి | న య్యా - || ||సో బా||

**అవతారిక :**

ఈ పదమునందు అమ్మవారగు అలమేలుమంగ ఖండితనాయికవలె నుండియు, శాంత స్వభావమును కనబరచుచు నాయకుడగు శ్రీవేంకటేశ్వరునితో 'నిన్నుగిలిగింతలువెట్టి నవ్వింప నేరని దానననుకొనుచుంటివా ? నీమాటలను తలపోసికొనుచు చెక్కునచేయిడుకొని యున్న దాననేగాని దగ్గరకువచ్చి మచ్చువలలు వేసి నిన్ను కైవసము చేసుకొనజాలని దానననుకొంటివా? నీకనులలో సారెసారెకు కానవచ్చుచున్న జాడలకు తారుకాణలవు దీయుటకు నాకు తడవుపట్టు ననుకొనుచున్నావా ? గౌరవముగల నీమోహమును కనుగొన గోరి వేచితిని గాని బీరములాడి నీతో పెనగుటకు చాలని దాన ననుకొంటివా ? నీచేతలకు నిండిన ఆశ్చర్యముతో నిలువబడియుంటిని గాని నీ కలపులు తెలిసికొన చాలని దాన ననుచుంటివా? అలమేరు మంగనగు నన్నుగూడితివి. చాలు చాలు శ్రీవేంకటేశ్వరా నేను నేరనిదానను గాను !' అని స్వామివారి వివరములన్నియు చెప్పి, దెప్పి తిరిగి లాలించి ఆనందించుచున్నదని అన్నమయ్యవారు చెప్పుచున్నారు.

లలిత — రూపకం

ఆయనాయ చాలు జాలు అంతసేయకు
నాయముల బెట్టి నిన్ను నవ్వించజాలనా ! ॥పల్లవి॥

సిగ్గున నూరక చెక్కు చేతితో నుంటిగాక
దగ్గరి మాటాడ నిన్ను దడవా నాకు
వెగ్గళించి నీమాట వేలుచుకొనుచుంటిగాక
యెగ్గులెంచి వొలవేయ నెంతకైనా నేరనా ! ॥ఆయ॥

సారె సారె గన్నుల నీ సరిత చూచితిగాక
తారుకాణలకు దియ్య దడవా నాకు
గారవపు నీమోహము కన్నదాకా నుంటిగాక
బీరమాడి నీతో నింత పెనగ నోపనా ! ॥ఆయ॥

నిలుచుండి నీచేతకు నివ్వెరగందితి గాక
తలపెల్ల దెలియగ దడవా నాకు
బలిమి శ్రీవేంకటేశ పాయకిట్టె కూడితివి
అలమేలు మంగను నేనంత నేరనా ! ॥ఆయ॥

ప. ద ని సా స ని ద ని ద మ || గ మ దా మ గ మ గ రి స ||
ఆ - - య - నా - - య || చా - - లు జా - - - లు ||

ని స గ రి సా స ని ధ ని || సా - - - - ||
అం - - - త సే - - య || కు - - - - - ||

గ మ ద ద ద మ మ || దా ని సా స ||
నా - - య ము ల ను || బె ట్టి ని న్ను ||

స గ మ గ రీ స ని ద ని || స రి స ని స ని ద ని ద మ ద మ ||
న - - - - వ్విం - - చ || జా - - - - - ల - నా - - - || ||ఆయ||

చ. - గ మ ద మ గా || మ గ రీ స ని ధా నీ ||
- సి - గ్గు న నూ || ర - క చె - - కు్క ||

స మ గ మ ద మ || ద ని సా స ని ద మ మ ||
చే - తి తో - - || నుం - - టి - గా - క ||

- మ మ మ మ గ రీ || స ని ధా ని సా స ||
- ద గ్గ రి మా - - || టా - - డ ని న్ను ||

ప మ గ మ ద మ ద ని స రి స రి || ద ని ద మ మా ||
ద - డ - - - వా - - - - - || నా - - - కు ||

- గ మ దా ని || స ని ద మ ద ని సా ||
- వె గ్గ ళిం చి || నీ - - - మా - ట ||

స మ గ మ గ రి || స ని దా ని సా స ||

స రి సా స ని || ద ని స రి స ని ద ని స రి స ని ||
యె గ్గు లెం చి - || వొ - ల - - - వే - - - య - ||

ద ని ధా మ గ మ గా రి || స మ గ మ ద ని సా ||
శెం - - త కై - - న || నే - - ర వా - - || ||అం

**అవతారిక :**

ఈ కీర్తనమునందు 'చలిమి బలిమి గలిగి జననీ జనకుడై మా పాలిట వెలసిన శ్రీవేంకటనాథుడు దేవదేవుడు, ఆదిపురుషుడు, కలిదోషములను హరించువాడు, నిజబంధువుడై అంతర్యామియై, నిగమమూర్తియై యున్నవాడు. ఈతని యీవి ఒరులకియ్యవశమా ? దాతయగు యీవేంకటనాథుని గాక యొరులను మేమడుగము' అని అయ్యవారు త్రికరణశుద్ధిగా స్వామి వారిని కీర్తించుచున్నారు.

**లలిత — ఆది**

ఇతరుల నడుగము యితడే మా దాత
యితని యీవి వొరులియ్యగ గలరా ! ॥పల్లవి॥

దేవదేవుడాదిమ పురుషుడు హరి
శ్రీవత్సాంకుడు చిన్మయుడు
యీవల నావల యిలువేలుపతడు
భావజగురుడు మా పాలిటివాడు ! ॥ఇతరుల॥

జగదేక గురుడు శాశ్వతుడచ్యుతు
డగజకు వరదుడు అనంతుడు
తగి మము నేలినదైవము యేలిక
నిగమమూర్తి మా నిజబంధువుడు ! ॥ఇతరుల॥

కలిదోష హరుడు కైవల్యవిభుడు
అలరిన శ్రీవేంకటాధిపుడు
చలిమి బలిమి మా జననియు జనకుడు
అలమి యితడు మాయంతర్యామి ! ॥ఇతరులకు॥

ప. - గ మా ద మా మ గ రి స స | - ని సా ని ధా | ధా స ని సా ||
- ఇ త రు ల న - డు గ ము | - యి త డే మా | దా - - త ||

- గ మా ద దా మ మ ద ని | స రి స ని ద ని ద మ | గ మ గ రి సా ||
- యి త ని యీ - వి వో రు | లి - - - య్యా - గ - | గ - ల - రా || ॥ఇత॥

చ. - సా - రి సా ని స మ గ మ | గ రి స మ | గ మ ద మ ||
- దే - వ దే వు డా - - - | ది మ వు రు | షు డు హా రి ||

- ద నీ స సా స రి స ని ద మ దా | ద సా ని స గ రీ | సా - - ||
- శ్రీ - వ - త్సాం - - - కు - డు | చి - - న్మ - యు | డు - - ||

- స రీ గ రీ సా - ని ద ని | గ మ ద ని | స రి సా ||
- యీ - వ ల నా - - వ ల | యి ల వే లు | ప త డు ||

- స గా రి సా ని రి స ని ద ని ద మ |
- భా - వ జ గు - రు - డు - మా - |

ద ని స రి స ని ద మ | గ మ గ రి సా ||
పా - - - లి - టి - | వా - - - డు || ॥ఇత॥

**అవతారిక :**

ఇందలి నాయిక రూపగర్విత, స్వాధీనపతిక, ప్రౌఢ. ఈమె నాధునితో "తెలిసిన పనులకు తెగనాడుకోరాదుగాని నిన్ను చూచి నవ్వుకోరాదా? నేను నీతో జగడాలు వద్దుగాని సగము చూపులతో చూచి జంకించరాదా. నేను, అనవసరపుమాటలతో నిన్ను నొప్పింపరాదు గాని యూరకుండరాదా నేను, నీవునాపై ప్రేమతో ఒట్లుపెట్టుకొనుటకు ప్రారంభింపగా అంతేసవొట్లు వద్దని అనరాదా నేను ? నీవు నన్ను కూడబోతే అడ్డుకొనగరాదుగాని నేనే నీపై మనసుతో పైకొనరాదా ! ఏమైననేమి సరసుడవగు నీవు నన్నేలితివి. ఇంకా తప్పులు పట్టుట ఏలనయ్యా, కూటములున్నచోట గుట్టుగా నుండుట తప్పుకాదుగదా'' అని లాలించి ఆనందించుచున్నది. ఇందలి ప్రణయకలహము అయ్యవారు మనోజ్ఞముగా తెలిపియున్నారు.

**రాగ లక్షణము :**

భైరవి రాగము అతి ప్రాచీనము. భాషాంగము. రక్తిరాగము. 'ప ద ని సా' అమనప్పుడు శుద్ధధైవతము పలుకును. ఇది సంపూర్ణసంపూర్ణము. వెంకటముఖి సంప్రదాయమున గల భైరవికిని, క్షేత్రజ్ఞుల వారి పదములలో గల భైరవికిని పెద్దతేడాలు లేవు. గంభీరప్రకృతిగల యీ రాగము, ప్రాచీనుల కాలమునుండి నేటి వరకు ఇంచుమించు ఒకేవిధముగా కనబడుచున్న రాగములలో నొకటి

**భైరవి — త్రిపుట**

ఏటికి నెగ్గులు వట్టే విందుకు నీవు
కూటము గలగుచోట గుట్టు మేలుగదా ! ॥పల్లవి॥

తెగనాడరాదు గాక తెలిసిన పనులకు
నగరాదా నిన్ను జూచి నాకు గొంతైనా
జగడించవద్దుగాక చనవు గలుగు చోట
సగముచూపులు చూచి సాదించరాదా ! ॥ఏటి॥

పదరగరాదు గాక పాయరాని చోటికి
వొదిగి నివ్వెరగుతో నుండగరాదా
అదలించవద్దుగాక ఆనలెల్ల బెట్టుకోగ
వధలక అంతేశాల వద్దనగరాదా ! ॥ఏటి॥

గుఱిసేయరాదుగాక కూడిన కూటములకు
చెఱగువట్టి బలిమిసేయగరాదా
యెఱిగి శ్రీవేంకటేశ యెనసితి విటు నన్ను
తఱి దూరవద్దు గాక తలపించరాదా ! ॥ఏటి॥

శృం : 27-171

ప. - - ద ని సా సా ॥ స స స ని రి స ని ని దా ॥
- - ఏ - టి కి ॥ నె గ్గు లు - వ - - - ట్టే ॥

పా ప స ని దా పా ॥ ద ప మ గ రీ సా - - ॥ రి గ మ ప
విం - దు - - కు ॥ నీ - - - - వు - - ॥ - - - -

2. - - ద ని సా రి స రీ గ రి ॥ స ని రి స గ రి రి స ని ని దా ॥
- - ఏ - టి - - కి - - ॥ నె - గ్గు - లు - వ - - - ట్టే ॥

పా ప స ని దా పా ॥ ప ప మ గ రీ సా - - ॥
విం - దు - - కు ॥ నీ - - - - వు - - ॥

సా స స ని ని ద నీ ॥ స రి స రి గ రి గ రీ ॥
- కూ ట - - - ము ॥ గ లు గు చో - - - ట ॥

రి స రి గ మ ప ద ని సా ॥ పా రి స ని ని దా పా ద మ పా ॥
- - గు - ట్టు - - - - - ॥ మే - - - - - లు గ - - దా ॥ ॥ఏటికి॥

చ. - - ని ని దా పా ॥ ప మ పా ద ప ప మ గ రీ ॥
- - తె గ నా డ ॥ రా - దు - - గా - - క ॥

సా రి గ మా పా ॥ ప మ ని ని దా దా పా ॥
- తెలి సి న ॥ వ - ను - - ల కు ॥

- - రి గ రీ సా ॥ సా సా రి స ని ధ నీ సా ॥
- - న గ రా దా ॥ ని న్ను - - - - జూ చి ॥

- - ప గ రి రి స సా ॥ రి గ మ ప దా పా - - ॥
- - నా కు - - - గొం ॥ తై - - - - నా - - ॥

- - ప ద పా పా ॥ ద నీ సా సా ॥
- - జ గ డిం చ ॥ వ ద్దు గా క ॥

- - ప ప గ రి రి స రీ ॥ గ రీ సా సా ॥
- - చ న వు - - - గ ॥ లు గు చో ట ॥

- - ద ని సా రీ ॥ రి గ మ రి గా సా సా ॥
- - స గ ము చూ ॥ పు - - లు - చూ చి ॥

- - ద ని సా రి స ని ని ద ప ॥ ద ప మ గ రీ సా - - ॥ రి గ మ ప
- - సా - దిం - - - - చ - ॥ రా - - - - దా - - ॥ - - - - ॥పల్లవి॥

**అవతారిక :**

ఈపదమునందలి నాయిక ముగ్ధ, బాల, ఈమెకు చెలులు "ఏమమ్మా నీమొగము చూచి అతడు గుర్తించునంచాక నీవు మొక్కులు మొక్కకుమీ నీపేరనతడు గోముగా పిలిచిన దాక నీవేమియు మాటలాడవలదు సుమీ! అతడు కేలుచాచి నిన్నుదగ్గరక తీసుకొనువరకు నీవు నవ్వులు ఒలికించుకుమీ తమకమున నతడు కూడిన రాక నీవు తొందరలు చూపకుమీ. నీకు సరసపు టాసలు, వీరపుతమకములు, నెయ్యపుటసురుసురులు ఉండవచ్చును. వానిని దాచుకొని నాధుని మన్ననలు పొందవలెను సుమీ" అని హెచ్చరించి నాధునికడ నడచుకొను విధములను నచ్చజెప్పు చున్నారు.

**భైరవి - రూపకం**

మామాట వినవె కొంత మన్నించి నీవు
నీమనసు కోరికల నేరుపులలోనా ! ॥పల్లవి॥

మొక్కకువె నిన్నతడు మొగము చూచినదాక
గుక్కుచు నింతుల పెద్దకొలువులోన
పెక్కుమాట లాడకువె పేర బిలిచినదాక
అక్కరైన సరసపుటాసలలోన ! ॥మామాట॥

కేరినవ్వకువె తానె కేలు పయిచాచినదాక
సారమైన వలపుల సందడిలోన
అరసి చూడకువె నిన్నాయము లంటినదాక
బీరపు తమకముల పెనగులలోన ! ॥మామాట॥

కొసరకువె యాతడు గొబ్బున గూడినదాక
మసగసల యాకతముల మీలోన
యెసగి శ్రీవేంకటేశు డిదివో నిన్ను గలసె
అసురుసురుగాకు నెయ్యములలోన ! ॥మామాట॥

ప. - రి సా సా || స స స ని రి స ని ధ ఫా ||
- మా మా ట || వి న వై - కొం - - - త ||

- ఫ ధ ని స రి గ రీ || రి స నీ సా - ||
- మ - న్నిం - - - చ || నీ - - వు - ||

- రి గ పా ప మ పా || ప ద ని స రి గ రి స స ||
- నీ - మ న - సు || కో - - - - - రి క ల ||

మ ప ద ని స ని ద ప మ || మ గ రీ సా - - ||
నే - - - - - రు పు ల || లో - - న - - || ||మామాట||

చ. - రి రి రి రీ || గ రి రి స రి గ రి స ||
- మొ క్క కు వె || ని - - - - న్న త డు ||

రి గ మ ప ద ప స ని ద ప మ గ || రి స గ రి ని సా ||
మొ - గ - ము - చూ - - - చి - || న - దా - - క ||

- రి స స రి స ని ధ || ని స రీ గ రి రి స ||
- గు క్కు చు నిం - - - || తు ల పె ద్ద - - - ||

స గ రి గ మ ప ద ప మ || ని ని దా పా - - ||
కొ లు వు తో - - - - - || - - - న - - ||

- ప ద పా ప మ || నీ ని ద పా ||
- పె క్కు మా ట - || ళా డ కు వే ||

- పా ప మ ని ద ని || సా - ని ని ద దా పా ||
- పే ర - పి లి చి || న - - దా - - క ||

- ప ద నీ సం || రిం రిం గం రిం రిం సం రీం ||
- అ క్క రై న || స ర స - - - పు ||

సం ని రిం సం గం రిం రి సం ని ద పా || మ గ ప మ ద ప మ గ రి స ||
టా - - - - - స - ల - - || లో - - - - - న - - - || ॥మామా

**అవతారిక :**

ఈ పదమునందలి నాయిక ముగ్ధ, బాల. ఈమె నాథునితో తనకు కలిగిన అనుభవములను చెలులకు చెప్పుకొనుచు "చెక్కుచేత నుంచుకొని సిగ్గుపడుచు కూర్చున్న నాపై చేతులు వేసెనే! ఇందరిలోను నా వద్దకువచ్చి ఎంతో ప్రియముగా వేడుకొని ఆదరించెనే! మగువలకు సహజమగు మౌనమున నేనుండగా నన్నానుకొని కూర్చుండి ఎప్పటెప్పటివో కథ లడుగసాగెనే! పానుపుపై మౌనముగా నేనుండగా ఎన్నెన్నో మేలములాడెనే! శ్రీ వేంకటేశ్వరునకు ఎంతో ప్రేమ పాత్రురాలనగు అలమేల్మంగనుగదా! నా యందు కరుణతో పలుకున్నాడమ్మా విభుడు!" అనుచు గోముగా చెప్పుచున్నది.

**రాగ లక్షణము :**

వసంతవరాళి ప్రాచీన రాగములలో నొకటి. ఇందు తాళ్ళపాకవారి రచనల తరువాత తిరిగి ఇతర వాగ్గేయకారులు రచనలు చేసినట్లు కనబడదు. ఇది యిప్పటి వాడుక ప్రకారము 20వ మేళమగు నటభైరవి జన్యము గనుక ఆరోహణమునందు చతుశ్శృతి ధైవతము, అవరోహణము నందు శుద్ధధైవతము కలిగి యిది భాషాంగముగా రూపొందుచున్నది.

ఆరోహణ : స రి మ ప ద స

అవరోహణ స ని ద ప గ రి స

ఇందు కొన్ని తాళ్ళపాకవారి రచనలు పాడి చూచి రాగస్వరూపమును గుర్తెరుగ వలసియుండును.

**వసంతవరాళి – రూపకం**

ఎంత వేగిరకాడమ్మ ఇదివో తాను
పొంత నావద్ద గూచుండి బోధించీ దాను ! ॥పల్లవి॥

సిగ్గువడి చెక్కుచేత చింతించుకుండగాను
వెగ్గళించి నాపై జేయివేసీ తాను
దగ్గరి ఇందరిలోన తలవంచుకుండగాను
అగ్గలము వేడుకొని అదరించీ తాను ! ॥ఎంత॥

మానాపతితనాన మాటలాడకుండగాను
అనుకొని యాడొకత లడిగీ దాను
పానుపుపై గూచుండి పంతముతో నుండగాను
మేను ముట్టి సారె సారె మేలమాడీతాను ! ॥ఎంత॥

ఇయ్యకొని తన కాగిలిచ్చగించి వుండగాను
పయ్యదంటుచును వొడబరచీ దాను
నెయ్యపు అలమేల్మంగ నేను తా శ్రీవేంకటేశు-
డియ్యెడ గరుణ గూడె ఇన్నిటా దాను ! ॥ఎంత॥

శ్రృం : 26-466

ప. రి మ ప ద మ ప || గ రి రి స రి సా ||
ఎం త వే - గి ర || కా - డ - - మ్మా ||

స ని ధా ధ ప ధా సా || స రి గ రి రి గ స సా ||
ఇ - ది వో - - తా || ను - - - - - - - ||

రి మ ప ద ని ద స స || రి స ని ద పా ప ద మ ప ||
పొం త నా - - - వ ద్ద || గూ - - - చుం - - - డి ||

గ రి స రి మా ప ద ప || గ రి సా - - ||
బో - - - - ధిం - చీ || దా - ను - - ||

చ. మా మ మ మా || ప ద ని ద రి స స ని ద ప ||
సి గ్గు వ డి || చె - - - - క్కు - చే - - త ||

గ రి స రి గ రి మా || రి మ ప ద నీ ని ద ద ప ||

- రి మ స ద ప || మ ప ద ప స ని దా పా ||
- వె గ్గ ళిం - చి || నా - పై - చే - - యి ||

గ రి స రి మా ప ద ప మ || పా - - - - ||
వే - - - సీ తా - - - || ను - - - - ||

- ప ద సా స ని ద || ద ప దా స రి గ రి రి గ స ||
- ద గ్గ రి ఇం - - || ద - రి లో - - - న - - ||

స రి గ రి రీ మ ప గ రి || రి స ని ద ప ద సా స ||
త - ల - వం - - చ - || కుం - - - డ - గా ను ||

- స ద గ రి సా || స ని దా ప ప ద పా ||
- అ - గ్గ ల ము || వే - - డు కో - ని ||

మ ప ద ప స ని ద ప ద ప || గ రి సా - - ||
ఆ - - - ద - రిం - చీ - || తా - ను - - || ॥ఎంత॥

**అవతారిక :**

ఇందలి నాయిక ముగ్ధ, మనోహారి, కోమలి. ఈమె నాథుని చేతలకు మారుసే ముడుచుకొని యున్నదట అది తెలిసి చెలికత్తె "ఏమమ్మా ఎవరికి తెలియవు యీ పను ఆతడు పరమపురుషుడు వాని భోగము పొందుటయే పరమార్థము. చనవులు నవ ంచు పంతములాడక, కాతాళింపక నీ స్వామిని అలరించుట నీకే ఆనందమును కలిగించునుగదే, యలుకల హద్దులు తెలుసుకోనవలదా" అని మందలించుచున్నది. ఇందు అయ్యవారు సుందరముగా పరమపురుషుని ఆధిక్యతను చెప్పుచు జీవాత్మలమగు మన మందరమును అనురాగమునకు పాత్రులము గావలెనేగాని, కాని బిగువులకు పోరాదని హెచ్చరించుచునా

**రాగ లక్షణము :**

హిందోళ వసంతం ఇప్పటి వాడుక ప్రకారము 20వ మేళమగు నటభైరవి జన్య ఇది ప్రాచీన ప్రసిద్ధములగు రక్తిరాగములలో నొకటి. ఇందు క్షేత్రజ్ఞులును, ఇటీవలి వా త్యాగరాజస్వామి, ముద్దుస్వామి దీక్షితులు మున్నగు వాగ్గేయకారులును రచనలను యున్నారు. ఇందు 'ద ని ద స,' 'మ ప ద ని స' అను ప్రయోగములును వచ్చుచుండుట క్షేత్రజ్ఞుని పదములయందు ఇట్టి ప్రయోగములు గలవు

ఆరోహణ : స. గ. మ. ప. ద. ని స ।
**అవరోహణ** : స ని ద మ ప మ గ స ।

**హిందోళవసంతం — త్రిపుట**

ఏమనేవే యీతగవులిందరూ నెఱగరా
కోమలపు మగవాడు కోలదు లెఱుగునా ! ॥పల్లవి॥

వరుసలంతా సరే వలపే యెక్కుడు గాని
గరిమెల నీవేల కాతాళించేవే
పురుషుడు నాతడే భోగించేవారి భాగ్యము
మరిగించి కలిసితే మఱి చలివాయదా ! ॥ఏమనేవే॥

సవతులంతా సరే చనవే యెక్కుడు గాని
వివరించుకొనకేలే వేగిరింపులు
కవగూడి వాడొకడే కలిస్తే వారి నేరుపు

కళలూనంతా సరే కరగే దెక్కుడు గాని
పలుమారు నీవేల పంతమాడేవే
అలమె (శ్రీ) వేంకటేశుడంటిన మావొడబాటు
తొలుత మీనవ్వులెల్లా దొంతులకు నెక్కవా ! ॥ఏమనేవే॥

శృం : 13–41

ప. - - గ మ పా మా ॥ గా - ప మ గా సా స ని ॥
- - ఏ - మ నే ॥ వే - యీ - - త గ - ॥

సా ని స ని ధ నీ ॥ స సా గా మా ॥
పు లిం - ద - రూ ॥ నె అ గ రా ॥

- - ప ద నీ ద ని స ని ॥ ద మా ప గ మా ॥
- - కో - మ ల - - - ॥ పు - మ గ వా ॥

మా గ మ ప ప ద మా ॥ గ మ గ గ స ని స ని ధ ని స గ గ ॥ మా
డు కో ల దు - - లె ॥ రు - - - - - గు - - - న - - - - ॥ - ఏమనే॥

చ. - - స గ మా గ మ ప ద ॥ మ ప మ గ స గ గ స ని ని ధ నీ ॥
- - వ రు స లం - - - ॥ తా - - - - - స - - - రే - - ॥

సా ధ ని సా సా గ స ని ధ ॥ ని సా మ గ మా ॥
- వ ల పే యె - - - - - ॥ క్కు డు గా - ని ॥

మా స గ మా మా - ॥ మా ప మ గా మా మా ॥
- గ రి మె ల - ॥ నీ - - - వే ల ॥

- - గ మ ప ద ని స ని ద నీ ॥ ద మా పా - - ॥

- - గ మ దా ద మ || పా గ మా - ద మ దా ||
- - పు రు షు డు - || నా - - - త - డే ||

- - ద ని సా సా || స గ స సా ని స ని ద ని - ||
- - భో - గిం చే || వా - - రి - భా - - గ్య - ||

పా ద ని స గ మా గా || గ మ గ గ ప మ గా సా స ని సా ||
ము మ రి గిం - - చి || క - లి - - - - సి - - తే ||

- - స స గ గ స ని స స ని ద || దా ని స ని ద మా ప ప మ గ ప గ |
- - మ టి చ - - - లి - - - || వా - - - - - య - - - దా - |

॥పఽ

**అవతారిక :**

ఈ పదమునందలి నాయిక విరహోత్కంఠిత. సౌందర్య రాశి యగు ఈమె విరహమును గని చెలులు జవ్వాది, దానిపై సంపెంగలు అలంకరించినారు. ఇవి యీమె తాపమును పెంచు చున్నవిగదే ! చల్లని గొజ్జంగి నీట కడిగి మెత్తని పనిటచెంగుతో తుడువరమ్మా ! అతివేడి వస్తు వగు మృగమదమును తలకు అంటుకొన్నదీమె. విరహ ప్రలాపము యింకను హెచ్చుగాదా ! తట్టు పునుగున యీమెతలనంటరమ్మా ! ఈమెకు విరహతాపము పైపైని పెరుగుచున్నది. ఈ లలి తాంగి యౌవనము, లావణ్యముల ప్రోవు, తిరువేంకటాధిపుని దయగలిగి ననేగాని ఈమెకు తాప ములు దీరి ఆనందములు కలుగవు" అని తమలోతాము ముచ్చటించుకొనుచున్నట్లు అయ్య వారు పాడుకొన్నారు.

హిందోళవసంతం – ఝంపె

లలితాంగి యౌవనము లావణ్యముల ప్రోవు
అలరి యిటువలె జేసెనమ్మా ! ॥పల్లవి॥

జవ్వాది మిగుల నుష్ణము మీద సంపంగి
పువ్వు గట్టినది గన పొదలె దాపంబు
నివ్వటిల్లు గొజ్జంగి నీట నొయ్యన కడిగి
దువ్వటపు బయ్యెదను దుడువరమ్మా ? ॥లలి॥

మృగమదము గడు వేడి మెలుత తలపట్టునకు
అగలు గూడగ వేద నగ్గలంబాయ
బిగువైన కస్తూరి బేట్లొయ్యనగోర
నగలించి తట్టుపును గంటరమ్మా ! ॥లలి॥

విరహతాపంబునకు వేరెండు గతిలేదు
పొరసి వేగించినా బోదు
తిరువేంకటా చలాధిపుని మన్నన గాని
అరిది మోహము దీరదమ్మా ! ॥లలి॥

ప. - గ మ ద ని సఁ ని ద మ || ప మ గ మ గ గ స ||
- ల లి తాం - - - గి - || యౌ - - - వ న ము ||

- గ స న్ఁ ధ ని స || మా ప మ గ మా మ ||
- లా - వ - - ణ్య || ము - - ల ప్రో వు ||

- ద ని సఁ సఁ సఁ || సఁ గఁ మా గ మ గ స ||
- అ ల రి యి టు || వ - లె జే - - సె ||

గఁ సఁ సఁ ని ద ని సా - ని || ద ని ద మ పా మ ||
న - - - - - - - - || మ్మా - - - - - ||

చ. - మ మా మ || గ మ ప మ మా ప మ గ స ||
- జ వ్వా ది || మి - గు ల ను - - - - ||

గ స న్ఁ ధ న్ఁ స గ స || గ మ ద మ దా ద ||
ష్ణ - ము - మీ - - ద || సం - - - పం గి ||

- ద ని సఁ సా - ని || ద ని స ని ద మ ప మ ||
- పు - వ్వు గ - - || ట్టి - న - ది - గా న ||

గ మ ద ని ద మ గ స || మ గ మ పా ప ||
పొ - ద - లె - తా - || పు - - ఋ - ||

- గ మ ద ని సఁ సఁ || సా గఁ స ని ద నీ స ||
- ని - వ్వ - టి లు || గొ - - - - జ్జుం గి ||

- స గ మ గ సా - ని || గ స ని ద ని స స ||
- నీ - ట - నో - - || య్యా - న - క డి గి ||

- స స గ గ స ని || స స ని ద ని ని ద మ ద ద ||
- దు వ్వ ట - పు - || వ - - - య్యా - ద - ను - ||

- గ మ ప మ మా ప మ || గ ప ద మ దా - ||
- దు - డు వ ర - - || మ్మా - - - - - || ॥౮౦॥

**అవతారిక :**

ఈ పదమునందు స్వాధీన పతికయు రూపగర్వితయు నగు స్వీయ నాయిక అలమేలుమంగా వేంకట నాథుల శృంగార లీలలను రాత్రియంతయు దర్శించి ఆనందించిన చెలులు తతాము: "అతడు గలగల నవ్వుచున్నాడు. ఆమె గుట్టుగా ముసుముసులాడుచున్నది. మొమాతని పాలు ముసిపెములీమె పాలు. అతడు చేతులు చాచగా ఈమె సిగ్గున నుండుచు మంతనములు, మాటలాడుటలు, పంతములు, పందెములు బాగున్నవి. అమ్మవారాకడ, అవారికడ ఇద్దరును జాణలేయని మేమనగలము" అని మధుర భక్తిభావముతో చెప్పచున్నారు.

**హిందోళ వసంతం – రూపకం**

అమ్మవారు నయ్యవారు నండనె కూచున్నవారు
యిమ్మల నిద్దరూ జాణ లే మందమే ! ॥పల్లవి॥

కొల్లున నవ్వీనతడు గుట్టున నున్నది యాకె
తెల్లవారు దాకా మాటదిద్దనె పట్టె
పల్లద మాతని వంక పంతము లీ చెలివంక
యిల్లిదె యిద్దరూసరె యేమందమే ! ॥అమ్మ॥

తొక్కుబాదము లతడు తొరలి పెనగు నీకె
చెక్కుల నొక్కి బుద్ధులు చెప్పనె పట్టె
మొక్కల మాతనిపాలు మురిపె మీ సతిపాలు
యెక్కెజల మిద్దరికి నేమందమే ! ॥అమ్మ॥

చేతులు చాచు నతడు సిగ్గు ననుండు నీకె
యీతల విడే లిద్దరి కియ్యనె పట్టె
ఆతడు శ్రీ వేంకటేశు డలమేలు మంగయింతి
యేతుల నిద్దరూ గూడి రేమందమే ! ॥అమ్మ॥

స గ మా పా మా || మ గ ప మ గా సా ||
అ - మ్మ వా రు || న - య్యా - వా రు ||

స ని సా స గ మా పా - మ || ద ని స ని ద మ పా ||
నం - - డ - నె కూ - - || చు - న్న - వా - రు ||

మ ద నీ సా || గ మ గ గ సా - ని సా ||
యి మ్ముల ని || ద్ద - రూ - జా - - ణ ||

ద ని సా - ని గ స ని ద మా || గ మ పా - మ ప మ గ స నీ ||
తే - - - - మం - - - ద || మే - - - - - - - - - - ||   ||అమ్మ||

ద ద దా ద ని సా || స ని ద ని ద మ ప మ గ ||
కొ ల్లు న న - - || వీ - - - - - - న త డు ||

స ని సా గా మా || గ మ పా ప మ గా సా ||
గు - ట్టు న ను || న్న - ది యా - - తె ||

ధ ని సా స ని ధ ని స || గ స గా మా ||
తె - ల్ల వా - - రు దా || - క మా ట ||

మ ని ద ని స ని ద మ || పా - - - - || స గ మ ద దా || ద మ ద ని సా స ||
ది ద్ద నె - - - ప - || ట్టి - - - - || ప ల్ల ద - మా || - - త ని వం క ||

ని స గ మ ప మ గా || ప మ గ మ గా సా ||
ఘం త ము - - - లీ || చె - లి - వం క ||

గ మ గ స నిస నిదని || సా స ని సా స స ||
యి - - ల్లి దె - - - - - || యి ద్ద - రూ స రె ||

ద ని సా - ని ద ని సా - ని || ద ని ద మ పా - - || స గ మా పా వ
యే - - - - మం - - - ద || మే - - - - - - || అ - మ్మ వా ర

**అవతారిక :**

ఈ పదమునందలి నాయిక స్వీయ ప్రేమోత్కంఠిత, ఈమె నాథునియ దు తనకు గల మక్కువను ఆతని సన్నిధియందు 'నా వలపు దెలిసి నన్ను నీ వేలుకొనవలెనే గాని పిలిపించుకొనుట నా వశమా! నీవు పెద్దదేవుడవు గదా, నా తలపులు దెలిసి నీవు చనవుగా మాటలాడవలెనే గాని నాచే పలికింపనేర్తువా. నీ పంతములు నాకు తెలుసును గదా! ఉన్నతుడవైన నీవు నా పొడబాటు నెఱిగి యేలుకొనవలె గాని నిన్నడుగుటకు నే నెంతటిదానను. నీకు సేవలు చేయునపుడు నాయందనుగ్రహము గలిగి సేసలువెట్టితివి. దేవుడవైన నీకు వావులు చెప్పుకొనగలిగి నంతటి దాననా! శ్రీ వేంకటేశ్వరుడా, నీవు నన్ను చేపట్టి పెండ్లాడితివి. నా యంతరము నే నెఱుగుదును నీతో పంతములాడుటకు చాలుదునా' అని అమ్మవారగు అలమేలుమంగాదేవి శ్రీ వేంకటేశ్వరునకు విన్నవించుకొనుచున్నది.

**రాగ లక్షణము :**

అతి ప్రాచీనమయిన ఆనందభైరవి రాగమున కాలక్రమమున కొన్ని మార్పులు వచ్చియుండవచ్చునని తోచుచున్నది. క్షేత్రజ్ఞుని పదములయందు సందర్భానుసారముగా రెండు గాంధారములు, రెండు ధైవతములు, రెండు నిషాదములు పలుకుచున్నవి వెంకటమఖి సంప్రదాయమున శుద్ధధైవతము, సాధారణ గాంధారము, కైశికినిషాదము మాత్రమే పలుకుచున్నట్లు చెప్పబడినను 'సంగీత సాంప్రదాయ ప్రదర్శిని' గ్రంథకర్త సుబ్బరామ దీక్షితులవారు అచ్చటచ్చట పంచశ్రుతి ధైవత ప్రయోగము కలదని వ్రాసినారు. క్షేత్రజ్ఞుని పదములలో గల అంతర గాంధార కాకలినిషాద ప్రయోగములను పరిహరించి పాడిచూచినచో భావశూన్యముగా, ఆనందభైరవి రాగము కనబడుచున్నది. గనుక నా పాఠమును యథాతథముగానే పొందుపరచియున్నాను. 'మ గ గ రి గా మ ప మా' అనునప్పుడు అంతర గాంధారమును, 'పా ద ప' అనునప్పుడు శుద్ధధైవతమును, 'స ని ని ద నీ స రి' అనునప్పుడు కాకలినిషాదమును, పలుకుట మా పద్ధతి. 'ప ద ని ద ని సా' అనునది విశేషప్రయోగము ఈ రాగమును ఇప్పటి వాడుకలో గల 20వ మేళమగు నటభైరవి జన్యముగా చెప్పుకొనవలెను. 'ప ని సా' అను ప్రయోగము కూడ తరచుగా కనబడుచున్నది.

ద్రావిడ భైరవి యని అయ్యవారి కాలమునందు వాడుకలో నుండిన ఒక రాగమునకు యిప్పుడు ఎచ్చటను ఆరోహణావరోహణములు గాని, ఇతర లక్షణములు గాని కానవచ్చుట లేదు. కనుక యిది ఆనందభైరవి కానవచ్చునేమో నని భావించి అందమగు యీ రాగములోని కొన్ని పదములు ఆనందభైరవి యందు స్వరపరచుట జరిగినది.

ఆరోహణ ; స గ రి గ మ ప ని ప సా

## ఆనందభైరవి (ద్రావిడభైరవి) – రూపకం

యేడకేడ నాగుణ మెఱగని వాడవా
యీడువెట్టుకొనే నంటే నెంతదాన నేను ! ||పల్లవి||

వలపెఱిగి నీవేవచ్చి నన్నేలుట గాక
పిలిపించగల నా పెనదొరవు
తలప దెలిసి మాట తగ నీ నాడుట గాక
పలికించ నోపుదునా పంతగాడవూ ! ||యేడ||

వొడబాటు దలచుక వొగి నన్నేలుదుగాక
వొడి వట్టవచ్చునా వున్నతుడవు
బడలిక జూచి నీవే పైకొని కూడుదుగాక
అడుగదగవా కాగి లప్పుడే నిన్నును ! ||యేడ||

సేయసేయగా జూచి సేసలు వెట్టేవుగాక
వాయి చెప్పుకో వసమా దేవుడవూ
శ్రీవేంకటేశ నీవే చేకొని పెండ్లాడితివి
భావించ నాకు దరమా పంతగాడవు ! ||యేడ||

శృం : 18–191

ప. ప ని సా సా ఠి స ని ద పా ॥ మా పా ని ప మా ప మ గ రి గ రి ॥
1. యే - డ కే - - - - - డ ॥ నా - - - - - - - - - - గుణ ॥

స ని సా మ గ రీ గా ॥ మ గ గ ప మ ప పా ॥
మె - జ గ - ని వా ॥ - - డ - వా - - ॥

2 ప ని సా స రి గ రి ని స ఠి స ని ద పా ॥ ప ద ని ప ని ప మ రి గ రి ॥
యే - డ కే - - - - - - - - - - డ ॥ నా - - - - - - - - - గుణ ॥

స ని సా మ గ రీ గా ॥ మ గ గ ప మ ప పా ॥
మె - జ గ - ని వా ॥ - - డ - వా - - ॥

స గ మా పా ని ప మ ప ॥ మ గ గ రి గా మా ॥
యీా - డు వె - - ట్టు కొ ॥ నే - - - నం చే ॥

గ మ పా ని ప మా ప మ గ రి సా ॥ సా - - గ రి గ మ ॥
నెం - త - - దా - - - - - న ॥ నే - - ను - - - ॥ ॥యేడ॥

చ. స గ రీ స స సా ॥ సా రి స ని సా - - ॥
వ - ల పె రి గి ॥ నీ - - - వే - - ॥

ఫ ని సా సా మా - ప ॥ మ గ రీ గా మా ॥
వ - చ్చి న న్నే - - ॥ లు - ట గా క ॥

ప స స స ని ద పా ॥ పా ని ప ప మ గ రి గ మ ॥
పి లి పిం - - - చ ॥ గ ల - నా - - - పెను ॥

ప ప మ మ గ రీ రి గా రి ॥ సా - - - - ॥
ధ్వా ర - వు - - - - - ॥ - - - - - ॥

ప ప పా ని ప మ ప ప ॥ పా సి ని సా సా ॥

త ల ప - - - దె లి ॥ సి - - మా ట ॥

ని స మా ప మ గ రి గా ॥ ప మ గ రి రి గ రి స సా ॥

త గ నీ - - - - వా ॥ డు - ట - గా - - - క ॥

పా ప ని స రి సా ॥ స ని ని ద ని ని సా ॥

ప లి - కిం - చ ॥ నో - - - పు డు నా ॥

ప స ని ద పా ని ప మా ॥ ప మ గ రి స ని స గ రి గ మ ॥

పం - త - గా - - - ॥ డ - - - - వు - - - - - ॥ ॥యేడ॥

**అవతారిక :**

ఈ పదమునందలి నాయిక ప్రేమోత్కంఠిత, మధ్య, స్వీయ. ఉత్తమనాయిక యగు యీమె నాధుని కడకు దూతికనుబంప నెంచినది. "ఆతడే గతియని నమ్మి తన దయనే కోరు చున్నానని చెప్పుము. ఆతనికి దగ్గరిదానను. మానవతిని, నాకు పతియగు వానిని ఎంతో సన్మానముతో ఎంచెడిదానను. ఇదియే నా విన్నపములని చెప్పుము. ఆతనిని మోహించి అనుక్షణము మ్రొక్కులిడుచున్నదానను. తన రూపును చింతించుచు చెక్కిట చేయిడుకొని యున్నదానను. ఎదురుచూచుటయందు నాయోరిమిని నేనే పరీక్షించుకొనుచున్నాను. అంతు లేని ఆశతో ఆతనినే నమ్మియున్నదాన. వేయేల ! యెడమాటలనెన్ని యాడించగలను? అని దూతికకు చెప్పుచుండగా స్వామియగు శ్రీ వేంకటనాథుడే స్వయముగా వచ్చి తన నాయిక యగు అలమేలుమంగాదేవికి స్వాధీనుడై యానందింపజేసెనని అయ్యవారు చెప్పుచున్నారు.

ఆనందభైరవి (ద్రావిడభైరవి) – త్రిపుట

యెడమాట లాడించే నెందాకాను
వుడివోని మచ్చికతో నున్నదాన ననవే ! ॥పల్లవి॥

తానేగతి యనేదాన దయ గోరుకున్నదాన
వీనుల దనకతలే వింటా నున్నదాన
మానరాని పొందుదాన మానాపతి దానను
నానావిధముల విన్నపమిదే యనవే ! ॥యెడ॥

మొక్కుతానే వున్నదాన మోహించి యున్నదాన
చెక్కుచేత దన రూపు చింతించేదాన
యిక్కువనే వున్నదాన యెదురు చూచేదానను
మిక్కిల యాసతోడ నమ్మి యున్నదాన ననవే ! ॥యెడ॥

తగుల మిగులదాన తమకించి యున్నదాన
మగటిమితో దన మన్నన దాన
బిగినింతలో దావచ్చి శ్రీ వేంకటేశుడు గూడె
జగములో దనకునే జనవరి ననవే ! ॥యెడ॥

రేకు : 18–245

ప. - ని స స గ రీ సా ॥ ని స మ గ రీ గా మా ॥
- యె డ మా - - ట ॥ లా - - - - డిం చే ॥

1. మా ప గ మా ని ప ప మ గ రి ॥ రి గ రీ - సా సా ॥
- నెం - దా - - - - కా - ॥ ను - - - - - - ॥

2. మా ప స స స ని ద ద ని ద ప ॥ పా ప మ గ రి గా ప మ గ రి సా ॥
- నెం - దా - - - - - - క - ॥ ను - - - - - - - - - - - ॥

3. మా ప ని స రీ స స స ని ద ॥ పా ప మ గ రి గా ప మ గ రి సా ॥
- నెం - దా - - - - - క - ॥ ను - - - - - - - - - - - ॥

- - ప ప ప మ గ రి సా ॥ ప సా స ని ద ని సా ॥
- - వు డి వో - - - ని ॥ మ చ్చి క - - - తో ॥

- - ప పా ద ని ద ని సా ॥ పా ని ప మా ప మ గ రి ప మ గ రి సా ॥
- - ను న్న - - - - - - ॥ దా - - - - - - న - న - న - వే ॥యెడ॥

చ. - - ప ద ని ద ని ప ప ప ॥ ప ని ప మ ప మ మ గ రి గ మా ॥
- - తా - నె - - - గ తి ॥ య - - నే - - దా - - - న ॥

మా ప స ని ద నీ పా ॥ ప ని ప మ మా మ గ రి గ మా ॥
- ద య గో - - రు ॥ కు - - న్న - దా - - - న ॥

- - గ మ పా ని ప ప మ గ రి ॥ ని స మ గ రీ గా మా ॥
- - పీ ను ల - - ద - న - ॥ క - - - - లే - ॥

గ రి గ మ పా ని ప ప మ గ రి ॥ ని స మ గ రీ రి గ రీ సా ॥
- - విం - టా - - ను - - - ॥ న్న - - - - దా - - న ॥

సా మ ప సా సా ṙ సం ని ॥ స మ గ ṙ గ ṙ సని ద ని సా ॥
- మా న రా ని - - - ॥ పొం - దు - - - దా న - - న ॥

సాం ప ని స ṙ సా ॥ స ని ని ద ని సా - - ॥
- మా నా ప - తి ॥ దా - - - న ను - - ॥

పా ప సా స స ॥ సా - ని ṙ స ని ద పా పా ॥
- నా నా వి ధ ॥ ము - - ల - - - వి న్న ॥

పా ద ని ద ని సా పా పా ॥ పా ని ప మా ప మ గ రి ప మ గ రి సా ॥
ప - - - - - మి దే ॥ య - - న - - - - వే - - - - ॥యెడ॥

**అవతారిక :**

ఈ పదము నందలి నాయిక స్వీయ, ప్రేమోత్కంఠిత, మధ్య. ఈమె తన నాథునీ ముక్కువకుల లలితముగా చిత్రించుచున్నది. "మన తొలినాటి కలయికలను తలచుకొనుచూ నీ రాకకై ఎదురు చూచుటయే మనసున కెంతయో యానందమును యిచ్చు చున్నది. నిన్ను చూచినప్పుడు నాయందలి తమకము వశము తప్పుచున్నది. మనసున నిన్ను తలచునప్పుడు మహదానందమగుచున్నది. తనువులు కలసినప్పుడు పరవశమై నా మనసు మఱపులను పెంచుచున్నది. నా ప్రియమైన దూతికలు నీ కడ కరుదెంచి యప్పటి నీ విషయములను తిరిగివచ్చి చెప్పునప్పుడు గలిగెడి యానందము వర్ణనాతీతము. ఓ శ్రీ వేంకటేశ్వరా! నీకు ప్రియమైన అలమేల్మంగను. నా యందు యిట్టి వలపులను ఎట్లు కలిగించితివో! ఏమియు నెఱుగనిదాననుసుమా నేను. ఇప్పుడు నా ప్రియము పట్టరానిదై యున్నది" అని శ్రీ వేంకటేశ్వరునికి చెప్పుకొనుచున్నది.

ఆనందభైరవి (ద్రావిడభైరవి) — త్రిపుట

ఎట్టు వలపించితివి యేమీ నెఱగని నన్ను
పట్టరాదు ప్రాయమిది పైపై నున్నదిరా! ॥పల్లవి॥

వినుకలి విరహమే వేడుక తోచెగాని
కనుగొంటే దమకము కడుబెట్టురా
మనసున దలచితే మంచిదయి వుండీగాని
తనువు గాగిలించితే తతిగొని మఱపు! ॥ఎట్టు॥

తెమ్మలై తొంటికూటమి దిష్టమై వుండీగాని
కమ్మిమీదటి కోరిక గాసిబెట్టీరా
చిమ్ముచు నీ కెదురు చూచినదే యింపాయగాని
కమ్మర నంటితే గోరు కడువాడిరా! ॥ఎట్టు॥

మంచి దూతికలయెడ మాటలే చవాయగాని
కంచము పొత్తిచ్చితేనే కళదాకెరా
అంచల శ్రీ వేంకటేశ అలమేలు మంగనేను
యెంచి కూడితివి యిన్ని నియ్యకోలే యికను! ॥ఎట్టు॥

ప. - - స గ రి గ మ || పా ని ప ప మ గ రి రి స ||
- - ఎ ట్టు - వ ల || పిం - - చి - తి - వి - ||

సా ని స గ రి సా స స || స ని ని ధ ని సా సా ||
- యే - మీ - - - నె ఱ || గ - ని - - - న న్ను ||

సా స గ రి గ మ || ప పా పా ని ప ప మ ప మ ||
- ప ట్ట - రా - || దు ప్రా య - - మి - - - ||

పా ప ని సా రి స ని ద పా || మ మా ప మ గ రి గా ప మ గ రి ||
ది పై - పై - - - - - ను || - న్న - - ది - రా - - - - - ||

రి స స గ రి గ మ ||
- - ఎ ట్టు - వ ల ||

చ. - - ప ప పా పా || ప ద ని ద ని ప ని ప ప మ మ గ గా ||
- - వి ను క లి || వి - ర - - - హా - - - మీ - ||

మా రి గ మా పా ని ప || ప మ గ రి గా ప మ గ రి రి గ రీ ||
- వే - డు క - - || లై - - - తో చె - - - గా - - ||

సా స ని ని ధ ని సా || స మా ప మ గ రి గా మా ||
ని క ను గొం - - చే || త మ - - - - క ము ||

మ గ రీ గ మ పా ప గ మా || పా - - - - - ||
- - - - క డు బె - - ట్టు || రా - - - - - ||

- - ప ప పా ని ప ప మ ప మ || ప సా సా రీ స ని సా ||
- - మ న సు - - న - - - || ద ల చు - - - చే ||

సా ని స గ రి గాం || ప మ గ రి గ రి సా సా ||
- మం - చి - దై || వుం - - - డీ - గా ని ||

- - స స స ప ప ని స రి || స సా స ని ని ద ద ని ద ప ||
- - త ను వు - గా - - - || గి లిం చి - - - తే - - - ||

పా ప స ని ద ని ప ని ప ప మ || గ మ పా ని ప మా ప మ మ గ రి రి గ రి స ||
- త తి గొ - - - నీ - - - || మ - - - - అ - - పు - - - - - - ||

సా స గ రి గ మ ||
- ఎ ట్టు - వ ల ||

**అవతారిక :**

ఇందు గల ఉపమానములన్నియు అతి సులభముగా తెలుసుకొనుటకు తగిన పదములను అన్నమయ్యవారు ప్రయోగించినారు. పోలికలు గమనించినచో మనము వ్యామోహపడు విషయముల విలువలు యెంతటివో తెలియనగును. 'కంచువంటిది మనసు' అనుటలో వారి చాతుర్యము తెలియుచున్నది. విరిగినచో అతుకుబెట్టుట అసాధ్యము. మంచువలె కరగి మాయమగు రతిభావమును అట్టిదే. పామరపు భోగములు ఆపదల వంటివి గాక వేరేమి యగును ? తిరువేంకటేశ్వరుని సేవించుట నిజమగు సౌఖ్యములకు గనివంటిది అని అయ్యవారనుచున్నారు.

**రాగ లక్షణము :**

శ్రీరాగము పూర్వ ప్రసిద్ధములగు ఘన రాగములలో నొకటి. దీనిని వెంకటమఖి సంప్రదాయమున 22వ మేళముగా చెప్పుచున్నారు. ఇప్పటి 22వ మేళమగు ఖరహరప్రియ జన్యముగా దీనిని చెప్పుకొనవలసియున్నది. 'ప ద నీ' అను ప్రయోగము అక్కడక్కడ వచ్చునని పూర్వాచార్యుల మతము.

**శ్రీ — త్రిపుట**

ఏమిగల దిందు నెంత గాలంబైన
పామరపు భోగ మాపదవంటి దరయ ॥పల్లవి॥

కొండవంటిది యాస గోడ వంటిది తగులు
బెండువంటిది లోని పెద్దతనము
పుండు వంటిది మేను పోలించినను మేడి
పండు వంటిది సరస భావమింతయును ! ॥ఏమి॥

కంచువంటిది మనసు కలిమి గల దింతయును
మంచువంటిది రతి భ్రమత వంటిది
మించువంటిది రూపు మేలింతయును ముట్టు
పెంచువంటిది దీని ప్రియమేమి బ్రాతి ! ॥ఏమి॥

ఆక వంటిదిజన్మ మడవి వంటిది చింత
పాకువంటిది కర్మ బంధమెల్ల
యేకటను దిరువేంకటేశు దలచిన కోర్కి
కాక సౌఖ్యములున్న గని వంటి దరయ ! ॥ఏమి॥

అ : 11(8)—46

ప. - - రి మ | పా పా || ప నీ | పా పా ||
- - ఏ - | మి గ || ల - | దిం దు ||

- - రి మ | పా ప మ || రి గా | రీ సా ||
- - ఎం - | త కా - || లం - | బై న ||

- - ఫ ని | స రి రీ || రి గ రి | రి స సా ||
- - పా - | మ ర పు || భో - - | గ - మా ||

రి మా | మా ప ని పా || ప ప మ | పా - - ||
ప ద | వం టి - - || ద ర - | య - - ||

చ: - - ప ని | సా రీ || రి రీ | రీ రీ ||
- - కొం - | డ వం || టి దీ | యా స ||

- - ని స | రీ రి మ || రి రి గ | రి రి సా ||
- - గో - | డ వం - || టి ది - | త గు ఖ ||

- - ప గ | రీ స ని || స ని రీ | స ని పా ప మ ||
- - బెం - | డు వం - || టి - ది | లో - - ని - ||

- - ప ప | నీ స ని || సా - | - - - - ||
- - పె - | ద్ద త న || ము - | - - - - ||

- - ప గ | రీ సా || స నీ | ని ప నీ ||
- - పుం - | డు వం || టి ది | మే - ను ||

- - ప ని | సా నీ || ప ప ని | పా మా ||
- - పో - | లిం చి || న ను - | మే డి ||

- - రి | మా మా || ప ని ని | ప ప మా ||
- - పం | డు వం || టి ది - | స ర ప ||

రీ గ | రీ సా || రి రి ని | సా - - ||
భా - | వ మిం || త యు - | ను - - || ॥ఏమి॥

**అవతారిక :**

ఈ పదమునందు విరహోత్కంఠితయగు నాయికను అయ్యవారు అతి మనోజ్ఞముగా చిత్రించియున్నారు. ఇందలి వర్ణనలు అతి మనోజ్ఞములై అయ్యవారు చెప్పుచున్న దృశ్యమును అట్లే కన్నులముందు నిలుపుచున్నవా యనునట్లున్నవి. ఈమె రాత్రియంతయు నాధుని రాకకై ఎదురు చూచినది. కనుకనే తన చెలితో 'ఉదయాద్రి తెలుపాయె, పుడురాజు కోలు వీడె, రాత్రి యంతయు నవ్వుల ఎవ్వతె పసల కలరున్నవాడో గదవే! వేడియైన నాయురముపై ముత్యాల సరములు చల్లినాయె గదవే! శుక పికముల రొదలు తుమ్మెదగముల తరుముటలు మొదలాయె, నా కన్నులు మూతలు పడుచున్నవి. అడుగో పన్నీటి జలకములాడి, పచ్చ కప్పురము వొడలిపైనలదుకొని, కొప్పున విరులు దురిమి శ్రీ వేంకటేశ్వరుడు వేంచేయుచున్నాడు. ఇంక నా కన్నులు, మనసు చల్లబడగలవు గదె' అని చెప్పుకొనుచున్నది.

పున్నమి చంద్రుడు పశ్చిమ దిశ యందును, ఉదయభానుడు తూర్పు దిశ యందును కానవచ్చుచుండగా అయ్యవారు వెంకటాద్రి యందు ఎచటనో తాను విరహోత్కంఠిత నాయికయై దర్శించిన దృశ్యమే యీ సంకీర్తనమునందు కావచ్చును. చంద్రుడు, నక్షత్రములు, శుక పికములు, తుమ్మెదగములు, ముకుళించుచున్న కలువలు, వికసించుచున్న వెన్నెల, వేసంగి మొగ్గలు యివి యన్నియు వెంకటాద్రి యందలి వైభవములు అయ్యవారికి కవితా వస్తువులు. శ్రీ వేంకటేశ్వరునికి సమర్పితములైన కైంకర్యములును దర్శించగలవారికి అన్నమయ్య కవితా సౌందర్యము దివ్యమైనది. దానిరుచి, మధుర మధురము!

శ్రీ – ఝంపె

ఉదయాద్రి తెలుపాయె నుడు రాజు కోలు వీడె
అద నెఱిగి రాడాయె నమ్మ నా విభుడు ! ॥పల్లవి॥

చన్నులపై ముత్యాల సరులెల్ల జల్లనాయె
కన్నులకు గప్పాదవె గాంత నా కిపుడు
కన్నె కలువల జాతి కనుమోడ్చినది మీద
వెన్నెల వేసంగి మొగ్గ వికసించె గదవె! ॥ఉద॥

పువ్వుల లోపలి కురులు బుగులు కొనగా నెఱసె
దవ్వుల దుమ్మెదగములు తరమి డాయగను
రవ్వసేయ శుక పికము రాయడి కోర్వగ రాదు
అవ్వలనెవ్వతె పసల కలరున్నవాడో! ॥ఉద॥

పన్నీట జలక మార్చి పచ్చకప్రము మెత్తి
చెన్ను గంగొప్పున విరులు చెరువందురిమి
ఎన్నంగల తిరువేంకటేశుం డిదె ననుంగూడె
కన్నుల మనసునుం దనియం గరుణించెం గదవే! ॥ఉద॥

శ్రృం : 4–147

ప. - రి మ పా ప ॥ ని ని ప మ పా ప ॥
- ఉ ద యా ద్రి ॥ తె - లు - పా యె ॥

- ప ని స రిం గా రిం ॥ సా స ని సా స ॥
- ను డు రా - - జు ॥ కొ లు - వీ డె ॥

1. - ప గ రి స స ॥ స ని ని రిం స ని పా ప మ ॥
- అ ద నె ఱి గి ॥ రా - - - డా - - యె - ॥

పా ద ని ప ॥ స ని ప మ రి గ రి ॥
న మ్మా - - ॥ నా - - - వి భు డు ॥

2. స ప గ రి స స ॥ స ని ఫా నీ స ॥ రి గ గ రి సా - ॥ స ని ప మ రి గ రి ॥ స
అ ధ - నె ఱి గి ॥ రా - - డా యె ॥ న - - - మ్మా - ॥ నా - - - వి భు డు ॥ -
॥ఉద॥

చ. - రి మాం ప || ని ని ప మ రి గ రి || - స రీ గ రి సా || స ని ఫా నీ స ||
- ప న్ని ట || జ ల క - మా - ర్చి || - ప చ్చ - - క || ప్ర - ము మె త్తి ||

- ఫ ని స రీ || గ రి రీ రి సా || - రి గ రి స రి మ || పా స ని ప మ పా ||
- చె -న్ను గం || గో - - ప్పు న || - వి రు లు - చె రు || వం దు - రి - మి ||

- ప ని స రి రి || రి రి రీ రి || స రి గా రి స స || స ని పా నీ స ||
- ఎ - న్నం గ ల || తి రు వేం క || ఛే - - ళుం డి దె || న - నుం గూ డె ||

- ప గ రి సా || స ని పా ని సా || ప ని స రి గ రి స ని పా ||
- క - న్ను లు || మ - న సు నుం || ద - ని - యం గ - - రు ||

ప మ రీ గ రి స || - రి మ పా ప ||
ణిం - చెం గ ద వే || - ఉ ద యా ద్రి ||

**అవతారిక :**

ఇందు జీవి రకరకములగు వేరు వేరు వర్ణములు, పొడవు, పొట్టి, సన్నము, లావు పరిమాణములు గలిగి వేర్వేరు విధములుగా వస్త్రములను కప్పుకొని సంచరించుచున్న దేగాని శ్రీ వేంకటేశ్వరుని ధ్యానించి తరించుటకు ప్రయత్నించక కర్మమును చేనుగా పుణ్యపాపములను జల్లుకొని ఫలమును అనుభవించుచు కామక్రోధము లనుచుట్టములకు దాస్యము చేయుచు తిరుగుటయందు గల బాధలను పోగొట్టుకొను తెలివిలేనిదై యున్నదని అన్నమయ్యావారు చెప్పుచున్నారు

శ్రీ — ఆది

ఎవ్వరి దలపడు ఎవ్వరి నొల్లడు
నవ్వుల తెరువులె నడచీ బ్రాణి ! ॥పల్లవి॥

కలుషము బుణ్యము కర్మపు జేనను
వెలయగ జీవుడు విత్తుచును
కలిగిన సుఖదుఃఖములను గాదెల
కొలుచులు నించుక కుడిచీ బ్రాణి ! ॥ఎవ్వరి॥

చెడని ప్రపంచము శాశెదిదిలో ?
నిడుపు గురుచలుగ నేసినది
వడి దేహములను వన్నెల వన్నెల
గడనల చీరలె కట్టీ బ్రాణి ! ॥ఎవ్వరి॥

కూరిమి గామ క్రోధాదులు మతి
చూరల గొనియెడి చుట్టములే
గారవముల వేంకటపతి గొలువక
చేరి కాపురము సేసీ బ్రాణి ! ॥ఎవ్వరి॥

ప. రీ మ మ ప ప ప మ | రి మ ప మ | మ రి గ రి ||
ఎ వ్వ రి త ల ప డు | ఎ - వ్వ రి | నొ - ల్లి డు ||

ని స రి గ రి రి స స | స ని ని ధ | నీ సా ||
న - వ్వు ల తె రు వు ల | న డ చీ - | ప్రా ణి || ॥ఎవ్వరి॥

2. రీ మ మ ప ని స ని ప ప | మ ప ని ప ప మ రీ | గ రి రి స ||
ఎ వ్వ రి త - ల - ప డు | ఎ - - - వ్వ - రి | నొ - ల్లి డు ||

ని స రి గ రి రి స స | స ని ని ధ | నీ సా ||
న - వ్వు ల తె రు వు ల | న డ చీ - | ప్రా ణి || ॥ఎవ్వరి॥

చ. మ మ ప ప ని ని ప ప | మ మ ప ప | ని ని ప మ ||
క లు ష ము పు - ణ్యా ము | క - ర్మ పు | చే - న ను ||

రి మ ప ని ప మ రి గ రి స | రి రి మ మ | పా - - ||
వె ల య - గ - జీ - వు డు | వి - త్తు చు | ను - - ||

ప ని సా రి గ రి రి స స | ని ని స ని | ని ప ప మ ||
క - లి గి న సు ఖ దుః - | ఖ ము ల ను | గా - దె ల ||

ప ప రి స స ని ప మ | ప మ రి గ | రి రి స స ||
కొ లు చు క నిం - చు క | కు డి చీ - | ప్రా - ణీ - || ॥ఎవ్వరి॥

**అవతారిక :**

"నీవు రసికుడవు. రచనలు చేయ నేర్చినవాడవు. నీకు ఉపమానములు చెప్పెడి యంతటివారమా! మా చెలి సోయగములు వర్ణించుటకు అర్హత కలవారమా! చిలుక పలుకులు, కోవిలపాటలు, జక్కవల బిగువులు, తుమ్మెదల గుంపులు, హంసల నడకలు, చాతకముల సొగసులు, ఇవి యన్నియు మా చెలియందు నిండియున్నవి. ఓ తిరువేంకటేశ్వరా! ఈ పరివారముతో ఆమె నీపైకి యుద్ధమునకు వచ్చునని భయపడకుము" అని చెలులు తమ నెచ్చెలి సౌందర్యమును స్వామికి వర్ణించి చెప్పుచున్నారు.

శ్రీ – ఆది

రచనల నిన్నిట రసికుడవు
యిచట విన్నపంబిదె సేసెదను ! ॥పల్లవి॥

పలుకుల చిలుకల పాట కోవిలల
పిలుచులుగా చెలి పెంచెనదే
[illegible]గకుమీ నీ వందుకు రమణుడ
కల సహజ[illegible] యిది కసరులు గావు ! ॥రచన॥

చనుజక్కవలను సతి నెరుల యలుల
ఘనముగ మూకలు గట్టించె
మొనలు చూపె మోపు గట్టెనని
ననిచి వేసరకు నాథుడవు ! ॥రచన॥

నడపుల హంసల నయన చాతకముల
పడతి శ్రీ వేంకటపతి పొదిగె
నిడువుల గూడుచు నిన్ను సోకించెనని
జడియకుమీ నీ చనవులె మెరసి ! ॥రచన॥

శ్రృం : 14–7

ప. పపగరీసానిప | మపనిని | సా - - ||
రచనల నిన్నిట | రసికుడ | వు - - ||

ప నిసస నిప పమ | పనిపమ | రిగరిస ||
యిచటవి - న్నవం - | బిదెసే - | సెద - ను || ॥రచన॥

చ. రిమమమపని పమ | రి మపనిపమరి | గరిరిస ||
పలుకుల చిలుకల | పా - - - ట - కో | - విలల ||

సనిధధనిస సరిగా రిస | రిమపమ | పా - - ||
పి - లుచు - లుగా - - చెలి | పెం - చెన | దే - - ||

మపనినిసా రిసని | సరిగరిస | రినిసస ||
అలుగకు మీనీ - - | వం - - దుకు | రమణుడ ||

పసనిపపని మప | రిమపనిపమరీ | గరిసా ||
కలసహాజమెయిది | క - స - రు - లు | గా - వు || ॥రచన॥

**అవతారిక :**

ఇందు మహారౌద్రము భయంకరమునగు నరసింహస్వామి రూపమును వర్ణించుచు, సౌందర్యమంతయు రూపుగా నిలచినదా యనునట్లున్న అమ్మవారిని ఆ స్వామి సన్నిధిని నిలిపి, యిరువురకును వేరు వేరు సామ్యములున్నను, విడ్డూరముగా నున్నవారి పొత్తును మహాభక్తు లగు అన్నమయ్య చూచి, రాక్షస సంహారము చేసి అట్లే వచ్చిన నీ భయంకర రూపమును, అప్పటి నీ యట్టహాసమును గని నా తల్లి బెదరినదో యేమో! లేక ఆమె మనసు నొప్పించు పలుకులేవైన నీ వాడితివో యేమోనని నృసింహుడగు వేంకటనాథుని అవతారమును కొని యాడుచున్నారు. ఈ రచనను మధ్యమకాలమున పాడిన అందముగా నుండును.

శ్రీ — ఆది

వెరపు దెలుపు నీ వేగిరమే నీ
వెఱిగియు నెఱుగక యే మంటివో ! ॥పల్లవి॥

గోరపు రుధిరము గురియు గోళ్ళ నీ
తోరమైన యా తొడ మీద
గోరంటగోళ్ల కోమలి నిలువగ
ఈ రసమందక యేమంటివో ! ॥వెరపు॥

నెత్తురు బెదవుల నీ మొక మలరగ
బిత్తరి వీడెపు బెదవులతో
మత్తకరి గమన మాటలాడగా
ఎత్తిన మదమున నేమంటివో ! ॥వెరపు॥

ఆనన రౌద్రము నట్ట హాసమున
పూనిన నిను గని బొమ ముడితో
తే నగవుల నదలించెడి సిరితో
హీనాధికముల నేమంటివో ! ॥వెరపు॥

పెద పెద యూర్పుల పేగుల జందెపు
టుదరముతో నీవుండుచును
చెదరిన పయ్యెద చెరగు జారుసతి
యెదురెదురను నీవేమంటివో ! ॥వెరపు॥

చింపి నెరుల నీ శిరసు నుడుచుకొని
కంపముడిగి వేంకటపతివై
లంపట మందుచు లక్ష్మి సతితో
ఇంపులు నెరపుచు నేమంటివో ! ॥వెరపు॥

అ : 11 (2)-2

ప. ప ప మ ప ప ని సా | ని స రి గ | రి రి సా ||
వె ర పు దె లు పు నీ | వే - గి ర | మే - నీ ||

ని ని స స ని ని ప మ | మ రి మా | - ని పా ||
వె టి గి యు నె అ గ క | ఏ - మం | - టి వో || ॥వెరపు॥

చ. మా ని ని ప ప ని ని | మ మ ప ని | ని ప ప మ ||
గో ర పు రు ధి ర ము | గు రి య గో | - ళ్ల నీ - ||

రి ప ప ప మ రి గ రి | రి స రి మ | పా - - ||
తో - ర మై - న యా - | తొ డ మీ - | ద - - ||

మా పా ని సా స | ని స రి గ | రి రి స స ||
గో రం ట గో ళ్ల | కో - మ లి | ని లు వ గ ||

ని ని స స ని ని ప ప | మ రి మా | - ని పా ||
యీ - ర స మం - ద క | నే - మం | - టి వో || ॥వెరపు॥

**అవతారిక :**

ఈ కీర్తనమునందు ఉదయాస్తమయములు వుడుగక జరుగుచున్నట్లే, నిద్రలు మేల్కొనుటలు మొదలగు దినచర్యలు కూడ జరుగుచున్నవి. భూమిపై సస్యములు అనునిత్యము పుట్టుచున్నట్లే దేహికి రోగములు పుట్టుచున్నవి. జీవులకు త్రిప్పటలతో గూడిన పనిపాట్లకు ఎట్లు అంతులేదో అట్లే ఆశలు, కోరికలు వీటికి కూడ అంతు లేకున్నది. వెలుపలను, ఆత్మలోపలను వెలుగుచున్న శ్రీ వేంకట విభుని శరణమును పొందిననే బ్రతుకులకు ఫలము, శాంతి, సుఖసంపదలు కలుగుచున్నవి. ఈ బ్రహ్మాండము నందంతటను గల జీవకోటి ఇది తెలుసుకొనుట యెన్నడో''- నని అయ్యవారు ఆర్తితో చెప్పుచున్నారు.

శ్రీ — ఆది

అది బ్రహ్మాండం బిది పిండాండం
బిదుటు జీవులము వున్నారమిదివో ! ॥పల్లవి॥

ఉదయాస్తమయము లొనరిన వలెనే
నిదురలు మేల్కను నియమములు
కదిసి త్రిసంధ్యా కాలంబులవలె
గుదిగొను దేహికి గుణత్రయములు ! ॥అది॥

పుడమి సస్యములు పొదలిన వలెనే
వొడలి రోగములున్నవివే
ఉడుగని వెలుపటి వుద్యోగమువలె
కొడిసాగెడి మితి కోరికలు ! ॥అది॥

వెలుపలగల శ్రీ వేంకటవిభుడే
కల డాతుమలో ఘను డితడే
చలమున నీతని శరణాగతియే
ఫలమును భాగ్యము బహుసంపదలు ! ॥అది॥

ప. మ మ ప మ రి గ రి స | ని స ని ధ | ని ని సా ||
అ ది బ్ర - హ్మాం - డం - | బి ది పిం - | డాం - డం ||

ధ ని స రి స రి రి రి | మా పా | మ ని ప ని ||
బు దు టు జీ - వు ల ము | వు న్నా | ర మి ది వో || ॥అది॥

చ. మ మ మా ప మ ప మ | రి మ ప మ | రి గ రి స ||
ఉ ద యా స్త మ య ము | లో న రి న | వ లె నే - ||

ని ధ ని స రి గ రి స | రి మ ప ని | పా - - ||
ని దు ర లు మే - ల్కా ను | ని య మ ము | లు - - ||

మ మ ప ప ని ప నీ | ని స రి గ | రి రి స స ||
క ది సి త్రి సం - ధ్యా | కా - లం - | బు ల వ లె ||

ని ని స స ని ని ప ప | ని ప మ రి | గ రి సా ||
గు ది గో ను దే - హి కి | గు ణ - త్ర | య ము లు || ॥అది॥

**అవతారిక :**

జీవులకు కోపమువచ్చి అణగిన వెనుకనే శాంతము కలుగుచున్నది. ఆహారము తినిన తరువాత రుచులయందు విముఖత, సురతాంతమునందు వైరాగ్యము, ధనమును వ్యయపరుప వలసినప్పుడు లోభత్వమును, వయసుమీరిన తరువాత వచ్చు విసుగు, సంసారమునందు బరువులు మోయుచున్నప్పుడు ఆశలు, పుట్టుచున్నవి. అన్నిటికి మూలమైన భగవంతుడగు శ్రీవేంకటేశ్వరుని యందు నమ్మిక కలిగియుండిన నాడు జీవుల కష్టములను భ్రమలను తొలగించి ఆతడే ఘన బ్రహ్మానందమగు ముక్తిని ప్రసాదించును గదా-యని అయ్యవారు చెప్పుచున్నారు.

**రాగ లక్షణము :**

కన్నడ గౌళ ప్రాచీనరాగము. ఇప్పటి వాడుకప్రకారము 22 వ మేళమగు ఖరహరప్రియజన్యము. మేళకర్తల పుట్టు పూర్వోత్తరమునకు ముందే ప్రచారమునకు వచ్చియున్న రక్తి రాగములలో కన్నడ గౌళ యొకటి. మేళకర్తలు యేర్పడిన పిదప ఇట్టి రాగములకు జనక రాగములు నిర్ణయింపబడినట్లు తోచుచున్నది. ఇటీవలి వాగ్గేయకారులు కూడ యీరాగమునందు రచనలు చేసియున్నారు.

**కన్నడగౌళ — రూపకం**

అప్పటప్పటి వేళల నన్నియు వివేకించి
తప్పకుండా దైవమునే తలంచవోయి జీవుండా ! ॥పల్లవి॥

తక్కిన యాహారము తరువాతనే నిద్ర
వచ్చు సురతాంతమున వైరాగ్యము
గచ్చుల కర్మాంతమున గానవచ్చు నలుపెల్ల
మెచ్చుల సత్యము కొనమించివుండు ధర్మము ! ॥అప్పటప్పటి॥

పసిడి వెచ్చించు నాడే పట్టును లోభములెల్ల
ముసలితనాన వచ్చు విసుగెల్లను
వెస సంసారపువేళనె యాసలు పుట్టు
పొసంగి యిట్టె జ్ఞానమును పొంతనుండు సుఖము ! ॥అప్పటప్పటి॥

కోపముదీరిన మీదకూడ వచ్చుశాంతము
చేపట్టి భక్తిగలిగి చేరు మోక్షము
యేప్రొద్దు శ్రీవేంకటేశు నెడయక శరణంటె
కాపాడి యతండె యిచ్చు ఘనబ్రహ్మానందము ! ॥అప్పటప్పటి

అ : 2–241

ప. స స పా మ గ ॥ రి గ మ గ మ గా ॥ సా రి గ మ ప మ ॥ గ సా రి గ
అ ప్ప ట ప్ప టి ॥ వే - ళ ల - - ॥ స న్ని యు - - వి ॥ వే - కిం -

రి గ మా పా ॥ ని ప ని ని సా ॥ ని ద ప మా గ ॥ రి గ మ గ గ సా
త ప్ప కుం డా ॥ దై - వ ము నే ॥ త లం చ వో యి ॥ జీ - - వు డా -
॥అప్పట

చ. ప ప పా మా ॥ గ స రి గ మా ॥ ని స రి గ మా ప మ ॥ గ స రి గ
కో ప ము దీ ॥ రి న మీ - ద ॥ కూ - డ వ చ్చు - - ॥ శాం - - త

స స సా ని ధ ॥ ని ధ ని ని సా ॥ సా రి గ మా పా ॥ ప ని స ని ద మ ప
చే ప ట్టి భ - ॥ క్తి క లి గి - ॥ చే రు - - మో ॥ - - - - - క్ష మ

ని ప ని ని సా ॥ ని స రి గ మా గ స ॥
యే - ప్రొ ద్దు శ్రీ ॥ వేం క టే - - - శు ॥

ని స రి గ మా గ స ॥ స ని ని ద ద ప ని సా ॥
నె డ య - క శ ర ॥ ణం - - - - - - టె ॥

ప ని స రి గా స ని ॥ స ని ద ప పా ॥
కా - పా - - డి య ॥ త డె యి - చ్చు ॥

ప ని స ని ని ద ద ప ప మ మ గ ॥ రి గ మా గ గ సా ॥
ఘ - న - బ్ర - - - హ్మా - - - ॥ నం - - - ద ము ॥ ॥అప్పట

సతారిక :

ఈ పదమునందలి నాయిక విరహోత్కంఠిత, ముగ్ధ! ఈమె తన విరహతాపంబును ంలకును చెప్పుకొనజాలనంతటి బేల. ఈమె యవస్థలను చూచి "ఈమెకు విరహతాపంబు 'వాగ్నివలె నధికముగానున్నది. జారుచున్న స్వేదబిందువులు ముత్యపుహారములవలె బరువు కే యున్నవి. మన కరపద్మములతో తుడిచి పుష్పబాణుని బాణములకు మనము మరికొంత హాదము చేయుచున్నామేమో! ఈమెకు విభునితోడి యనుభవపు జ్ఞాపకములను కొంత తెలియ ప్పిన నుల్లాసముగా నుండగలదో యేమో! నిట్టూర్పుల వేడిమిని చల్లార్చుటకు కలువపూవుల డలను కట్టరమ్మా. ఈ మగువను మేల్కొల్పి వేదనను హెచ్చించుటకన్న మగతనిదురలో ంచిననే మేలుగదా!" అని అలమేలు మంగాదేవికి పరిచర్యలు చేయుచు సఖులు తమలో తాము ప్పుకొనుచున్నారు.

కన్నడ గౌళ — ఝంపె

మఱపైన నొకకొంత మాటు గాదా
తెఱవ నూరక యేల తెలిపేరు సతులూ ! ॥పల్లవి॥

తరుణికిని విరహ సంతాపంబు దావాగ్ని
ధరియించ చెమటైన దండ గాదా
మరుని కార్ముక బాణమహిమ గడు నెఱిగించె
దుర దురన చేతులనె తుడిచేరు సతులు ! ॥మఱ॥

పొలతి కిపుడొక యింత పొద్దువోకలుసేయ
తలపోతయైన దరిదాపు గాదా
వెలలేని సోయగపు విభుని చల్లనిరూపు
పెలచ మాటలనే మరపించేరు సతులు ! ॥మఱ॥

అలివేణి మేని విరహాగ్ని లొయ్యన పూడ
నలరు నిట్టూర్పైన యాస గాదా
వలపెరిగి వేంకటేశ్వరుడు గరుణించెనిదె
కలువపూవుల బంతి గట్టేరు సతులు ! ॥మఱ॥

శృం : 4-171

ప. - ప ప పా ప మ । పా సఁ ని ని ద ద ప మా ॥
- మ అ పై - - । నొ క - క్రొం - - - త ॥

- రి గ మా గ మ గ గ । సా - - - ॥
- మా - టు గా - - - । దా - - - ॥

- ని ధ ఫా నీ । స స రి గ మ మ ॥
- తె అ వ నూ । ర క యే - - ల ॥

ప ని సఁ ని ని ద ద ప మ । గ మ గ గ సా - ॥
తె - లి - పే - - - రు । స - తు - లు - ॥ ॥మఅ॥

చ. - రి గ మ మ మ । గ మ ప మ గ స ॥
- త రు ణి కి ని । వి - ర హా సం - ॥

ని స రి గ మ గ స । ని ధ ఫా నీ స ॥
తా - - - పం - బు । దా - - వా గ్ని ॥

- రి గ మా మ । పా సఁ ని ని ద ద ప మ ॥
- ధ రి యిం చ । చె మ - లై - - - న ॥

రి గ మ ప మ గ స స । రి గ మా పా - ॥
దం - - - - - - డ । గా - - దా - ॥

- ని ద స మ ప ని । సఁ సఁ రిఁ గ మ గ సఁ ॥
- మ రు ని - కా - । ర్మ క బా - - - ణ ॥

ని స ఁరి గఁ మఁ । గఁ గఁ సా స ॥
మ హి మ గ డు । నె ఱు గిం చె ॥

- ఁరి గఁ మఁ పఁ మఁ గఁ సా । ని ద పా ని స స ॥
- దు ర దు - ర - న । జే - - తు ల నె ॥

స ని ని ద ద ప ప మ మ గ । రి గ మ గ గ సా ॥
తు - డి - చే - - - రు - । స - తు - లు - ॥ ॥మఱ॥

**అవతారిక :**

ఈ పదమునందలి నాయిక ఖండిత, స్వీయ! మానవతియగు ఈమె నాథుడగు శ్రీ వేంకటేశ్వరుని చేతలు తెలిసియు ఎంతో ఓరిమిని చూపుచు "స్వామీ! తమరు చేయుపనులు వారు, వీరు చెప్పుటలు వినుటగాక తమ చేతలను నేను మానుపగలనా! నా కన్నులతో చూచినవియైనను కాదని మిమ్మడుగగలనా! పచ్చిగా మీరు చేయుపనులు నచ్చినను నచ్చకున్నను మిమ్ము కనుబొమల జంకించగలనా! తమరు నా వద్ద చూపు నయగారములకు నేనేమనకొనినను మిమ్ములను మెచ్చకుండ నుండగలనా! తమరు దయతో నన్ను కౌగిలించి నప్పుడు ఆనందించుటగాక ఏమి చేయగలను?" అని అలమేలు మంగాదేవి శ్రీ వేంకటేశ్వరునకు విన్నవించుకొనుచున్నది.

**రాగ లక్షణము :**

ఈ రాగము 22వ మేళమగు ఖరహరప్రియజన్యము. ని స గ మ పా । దా ప మ గ రి స ని । అనునవి ఆరోహణావరోహణములు. స గ మ ప ని స । స ని ద ప మ గ రి స అను ఆరోహణావరోహణములతో అభేరియను రాగము వేరొకటికలదు. ఈ రాగస్వరముల యందలి కర్నాటక యానను మార్చి పాడినచో హిందుస్థానీ సంగీత పద్ధతి యందలి భీంప్లాసి యగుచున్నది.

కర్నాటక దేవగాంధారి – ఝంపె

అతి రాజసపు దొరవైన నిన్నును
సతమైన నేనిట్టె సాధించవచ్చునా! ॥పల్లవి॥

వెడగు నీ సుద్దులెల్ల వీనుల వినుటగాక
నొడిగి నిన్నవి నే మానుపవచ్చునా
కడగిన చేతలెల్ల కన్నుల జూచుటగాక
అడచి నీతో నౌ గా దనవచ్చునా! ॥అతి॥

పచ్చినీ గుణములకు పరిణామించుటగాక
కెచ్చురేగి బొమ్మల జంకించవచ్చునా
తచ్చిన నీ యెమ్మెలకు దలవంచుకొంటగాక
వొచ్చమని నిన్ను మెచ్చకుండ వచ్చునా! ॥అతి॥

దక్కిన నీ కాగిటను తనివి నొందుటగాక
చక్కని నిన్ను నే గొసరవచ్చునా
అక్కున శ్రీవేంకటేశ అలమేలు మంగనేను
యెక్కువ నీరతులివి యెంచవచ్చునా ! ॥అతి॥

శ్రృం : 15–15

ప - గ రి సా రి స | ని ధ ధా ని సా || - స గ రీ సా - ని | స గ మా - ||
- అ తి రా జ - | స - పు దొ ర || - వై - న ని - - | న్ను - ను - ||

- గ మ పా ప | ని ద ద ప మా మ || - గ మ పా మ | గ రి స నీ ||
- స త మై న | నే - - - ని ట్టై || - సా - దిం చ | వ - చ్చు నా || ॥అతి॥

చ. - మ మ మ మా | గ రి సా ని || - ని ధ ని స స | గ గ మా మ ||
- వె డ గు నీ | సు ద్దు లె ల్లి || - వీ -ను ల వి | ను లె గా క ||

- గ రి స నీ | స గ మా - || - ప ని సా స ని నీ | ని ద ద ప ప మ పా ||
- నొ డ గి ని | న్న వి నే - || - మా - ను ప - - | వ - - - చ్చు - నా ||

- ప ని స గా | మా మ గ గ రి రీ సా ||
- క డ గి న | చే త - లె - - ల్లి ||

- స ని సా గ రి రి స | స ని రి స ని ద దా ప ||
- క న్ను ల జూ - - - | చు - ట - గా - - క ||

- ప ని సా ని స రీ | ని స గ రి రి స స ని ని ద ||
- అ డ చి నీ - - | తో - - - నౌ - - - - - ||

ప ని సా స ని ని ద ద ప | ప మ మ గ మా గ రి రి స ||

**అవతారిక :**

ఈ కీర్తనమునందు "వెలుగునకు తగినంతే చీకటి కనబడుచున్నది. దేహధారులకు ఔషధములకు తగినంత యపథ్యములే కనబడుచున్నవి. చాకిరిచేసెడి జీవుల చాకిరులకు వారి జీతములకుసరి. కర్మములు వాని యనుభవములు. పుట్టుటలు గిట్టుటలు యివి యన్నియు నొక దానికొకటి సరిగానే యున్నవి. ఈ మాయా మోహములన్నియు ఓ అచ్యుతుడా! నీ కల్పితములు, ఇవి యెట్లు మాన్పుకొనవచ్చును. ఇలవైకుంఠమగు వెంకటగిరియందు వెలసిన శ్రీ వేంకటేశ్వరా, నీకృప గలిగిన మాకివియన్నియు నుండవుగదా!" అని అయ్యవారు శ్రీవేంకటరమణునితో ముచ్చటించుకొనుచున్నారు.

**కర్ణాటక దేవగాంధారి — ఆది**

మాయా మోహము మానదిది
శ్రీ యచ్యుత నీ చిత్తమే కలది ! ॥పల్లవి॥

యెంత వెలుగునకు నంతే చీకటి
యెంత సంపదకు నంతాపద
అంతటా నౌషధ మపథ్యమును సరి
వింతే మిగిలెను వేసటే కలది ! ॥మాయా॥

చేసిన కూలికి జీతమునకు సరి
పూసిన కర్మభోగము సరి
వాసుల జన్మము వడి మరణము సరి
ఆసల మిగిలిన దలపే కలది ! ॥మాయా॥

మొలచిన దేహము ముదియుటకును సరి
తలచిన దైవము తనలోను
యిలలో శ్రీవేంకటేశ నీ కరుణ
గలిగిన మాకెల్ల ఘనతే కలది ! ॥మాయా॥

అ : 9–277

ప. - గ మా పా - మ ని ప మ గ రి | ని స మ గ గ రి రీ | సా - - ||
- మా - యా - మో - - - హ ము | మా - - - న - ది | దీ - - ||

- ప నీ సా - రి స ని ద పా | స ని ని ద ద ప ప మ |
- శ్రీ - య - చ్యు - త - నీ | చి - - - త్త - మే - |

మ గ గ రి రి స స ని ||
క - ల - ది - - - || ॥మాయా॥

చ. - స సా స సా రి స ని ధ ఫ | - ప నీ స గా | గ మ పా మ మ ||
- ఎం త వె లు గు - న కు - | - నం - తే - | చీ - - క టి ||

- ప ప పా ప ప మ | ప ని స రి ని సా ని | ని ద దా పా ||
- యెం త సం ప ద కు | అం - - - తా - - | - - ప ద ||

- ప నీ స గా మా గ రి | ని సా రి స | ని ద పా ని స ||
- అం - త టా నౌ ష ధ | మ ప థ్య - | ము - ను స రి ||

- ని సా గ రీ రి స రి స స ని స ని |
- విం - తే - మి - గి - లె - ను - |

ని ద ని ద ద ప ద ప | ప మ ప మ మ గ గ రి ||
ఫే - - - స - శే - | క - ల - ది - - - || ॥మాయా॥

అవతారిక :

ఈ కీర్తనమునందు "కొండలవంటి పాపములను, సముద్రములవంటి జనన మరలను పోగొట్టి జీవులకు శాశ్వతానంద సౌఖ్యములను ప్రసాదించునది హరినామ స్మర కలియుగ వైకుంఠమగు తిరుమల యందు వెలసిన శ్రీ వేంకటనాథుని నమ్మినము. వ ధ్రువాదులు యీ హరిని నమ్మి మోక్షపద మందినారు సుమా" అని అయ్యవారు ఆత్మ చేసికొనుచు పాడుకొనుచున్నారు.

కర్ణాటక దేవగాంధారి — ఆది

ఇందుకు ధ్రువాదు లిటు సాక్షి
చెంది నమ్మవో జీవుడ నీవు ! ॥పల్లవి॥

కొండలవంటివి ఘోరపాపములు
ఖండించును హరి ఘన నామజపము
నిండించును మతి నిత్యానందము
పండించునపుడె పరమ పదంబు ! ॥ఇందు॥

జలధులవంటివి జనన బంధములు
తొలగించును హరితూరిన భక్తిది
వెలిగించును ఘన విజ్ఞానంబులు
చెలగించును బహు సిరిసంపదలు ! ॥ఇందు॥

తోవరాని బహు దుఃఖము లణచును
శ్రీ వేంకటపతి జేరిన శరణము
పావనంబుగా బచరించు గుణము
కైవసమగు లోకము లెల్లాను ! ॥ఇందు॥

ప మ ప ప ని దా ప | మ గ మా | పా - - ||
ఇం - దు కు ధృ వా దు | లి టు సా | తీ - - ||

మా గ గ రి రి రి స | స ని స స | గ గ మా ||
చెం ది న - మ్మ వో - | జీ - వు డ | నీ - వు || ॥ఇందు॥

ప మ ప ని ని ద ద ప | ప మ ప ప | ని ద ద ప ||
కొం - డ ల వం - టి వి | ఘో - ర పా | - ప ము లు ||

ప మ ప ప ని ని స స | ని స స గ | రి రి స స ||
ఖం - డిం - చు ను హ రి | ఘ న నా - | మ జ ప ము ||

స ని స స గ గ మ మ | మ గ మ గ | రి స స స ||
నిం - డిం - చు ను మ తి | ని - త్యా - | నం - ద ము ||

ని ని స ని ని ద ద ప | ప మ ప మ | మ గ మా ||
వం - డిం - చ న పు డె | ప ర మ ప | దం - బు || ॥ఇందు॥

**అవతారిక :**

ఇందు ఆయా స్థలములయందు సుగంధ పరిమళ భరితములైన పునుగు, జవ్వాది, కుంకుమ, కస్తూరి, కర్పూరము, పూవులు, పన్నీరు, గంధము మొదలగువానితో జలకములాడుచు దివ్యదంపతులగు శ్రీ వేంకటేశ్వరుడు అలమేలు మంగలు వసంతకాలమున నెట్లు క్రీడించుచున్నారో అయ్యవారు మనోజ్ఞముగా వర్ణించుచున్నారు.

**రాగ లక్షణము :**

హిందోళ ప్రాచీనరాగము. కావ్యప్రసిద్ధము. ఈ రాగమును చతుశ్శృతి ధైవతముతో పాడుట క్షేత్రజ్ఞుని పదమునందు గోచరించును. వెంకటమఖి సంప్రదాయమున దీనిని శుద్ధ ధైవతముతోనే చెప్పియున్నారు. కాని చతుశ్శృతి ధైవతముతో పాడెడి ప్రాచీన పద్ధతి ఇంకను అక్కడక్కడ వాడుక యందున్నది. ఇందుకు ఉదాహరణ శ్రీ త్యాగరాజస్వామివారి మనసులోని మర్మము అను కీర్తన. అన్నమయ్యవారి కీర్తనలను కూడ చతుశ్శృతి ధైవతముతో కూడిన హిందోళయందే స్వరపరచడమైనది. ఇది యిప్పటి వాడుక ప్రకారము 20వ మేళమగు భైరవి జన్యముగానున్నది. కాని కొందరు 22వ మేళమగు ఖరహార ప్రియజన్యముగా కూడ పాడుచుందురు.

ఆరోహణ : స గ మ ద ని స

అవరోహణ : స ని ద మ గ స ।

**హిందోళ – ఆది**

వనితకు బతికెదె వసంతము
దిన దినము నమరె తిరుమల మీద ! ॥పల్లవి॥

పుష్పాడి వసంతము పోసగె రమణునికి
కప్పుర వసంతము కాంతకును
కొప్పెరల నెదురుగ గుంకుమ పన్నీరు నించి
కుప్పెల జల్లు లాడేరు కోనేటికాడ ! ॥వనిత॥

జవ్వాది వసంతము చతురుడు గైకొనె
పువ్వుల వసంతము పొలతికిదె
రవ్వగా బండ్లపై రాసులు వోసుక
నవ్వుతా వేట్కులాడేరు నడిమిచింధ్దాడ ! ॥వనిత॥

గంధపు వసంతము గడు శ్రీ వేంకటపతి
అందె కస్తూరి వసంత మలమేల్మంగ
చిందుచు దట్టు పుణుగు చిమ్ముచు గూడాడేరు
సందడి సమరతుల సంపెంగ కాడ ! ॥వనిత॥

శ్లోం : 26–49

ప. స స ని ద ని ని ద మ | గ మా గ | సా - - ||
వ ని త కు ప తి కి దె | వ సం త | ము - - ||

ని స ని ధ ని స స ని | స మ గ మ | మ ని ద ని ||
ది న ది న ము న మ రె | తి రు మ ల | మీ - ద - || ॥వనిత॥

చ. దా ని ద మ మా మ | గా మ గ స గ | మా - - ||
పు ష్పా డి వ సం త | ము - - - - | - - - ||

గ మ ద గ మ గ సా | నీ స ని ధ ని | సా - - ||
పొ స గె ర మ ణు ని | కీ - - - - | - - - ||

ధా ని ధ ని సా ని | స గ స గ | మా - - ||
క ప్పు ర వ సం త | ము - - - | - - - ||

గ మ ద ని స ని ద మ | గ మ గ గ | సా - - ||
కాం - - త కు - - - | ను - - - | - - - ||

మ గ మ ద మ ద ని ద | ని స ని ద ని | సా - - ||
కొ - ప్పె ర ల నె దు రు | గా - - - - | - - - ||

స గ మ గ గా స ని | స గ మ గ | గా సా ||

స్ గ ం స నీ స ని | దా ని ద | మా - - ||
కు ప్పె ల జ ల్లు - | లా డే - | రు - - ||

గ మ గా - ప గా | మా - - | గ మ ద ని ||
కో - నే - టి కా | డా - - | - - - - ||

॥వనిత॥

**అవతారిక :**

"అల్పులగు ప్రాణులు నిన్నెఱుగక అటమటించుచున్నారు వీరికి నిను పొందెడి గతి బోధింపవే. వీరు కలలో పొందిన సుఖముల వంటివే యిలలో పొందుచున్నామని తెలివిలేక యున్నారు. తినుట, త్రాగుట, తిరుగుట యందలి మమకారముచే సత్యమును మఱచుచున్నారు. నిన్నటి ఆహారపురుచుల అనుభవముల తీపులుగాక నేటి ఆహారమునందును అనుభవమునందును క్రొత్తయేమి కలుగును ? అది తెలుసుకోనలేరు. ఇట్టి యీ జీవులకు తెలివి దెలిపి యుద్ధరింపవే" అని పరమాత్ముడగు శ్రీ వేంకటేశ్వరుని అన్నమయ్యవారు ప్రార్థించుచున్నారు.

**హిందోళ — ఆది**

కరుణించవె నిజగతి బోధించవె
హరినిన్ను గొలువక యలసీ ప్రాణి ! ॥పల్లవి॥

కలలో నింతులు గలసి నట్లనే
వెలిగాంతల తోడి వేడుకలు
లలి నిందుకుగా లంపటములబడి
పలుమారు నూరక బడలీ ప్రాణి ! ॥కరు॥

నిన్నటి యాహార నిజరుచి వలెనే
అన్నువ నిప్పటి యాహారము
యెన్న నిందుకే యిడుమల బొరలుచు
కన్న గతుల గడు గలగీ ప్రాణి ! ॥కరు॥

పరుసము సోకిన బంగారమువలె
పరమ భాగవత పట్టములు
అరయగ శ్రీ వేంకటాధిప నీకృప
యిరవుగ గని తుదకెక్కీ ప్రాణి ! ॥కరు॥

అ: 11 (1)–86

ప. ని ని సా ని ని ద ద | మ మ దా | మా మ గ ||
క రు ణిం చ వె ని జ | గ తి బో | ధిం చ వె ||

గ గ మ మ గ గ స ప | గ గ మా | ద మ దా ||
హ రి ని న్ను గొ లు వ క | య ల సీ | ప్రా - ణీ || ॥కరుణించవె॥

చ. ద ని నీ ని ద ద ద | మ మ ద మ | - గ మా ||
క ల లో నిం - తు ల | గ ల సి న | - ట్ల నే ||

గ గ మా గ గ ప ని | ని స గ గ | మా - - ||
వె లి గాం త ల తో - | వే - డు క | లు - - ||

మ గ మా ద ద మా | ద మ ద ద | ని ని స స ||
ల లి నిం దు కు గా | లం - ప ట | ము ల స డి ||

ని స గ స గా స స | ని ని ద ద | నీ సా ||
ప లు మా రు నూ ర క | బ డ లీ - | ప్రా ణి || ॥కరుణించవె॥

**అవతారిక :**

ఈ పదమునందు నాయిక ముగ్ధ. ఈమెకు చెలి "ఏమమ్మా, వివరించి చెప్పరాని వెన్నియో విషయములు సతీపతుల మధ్య నడచుచుండును. వీనిని రచ్చల కెక్కునట్లు రవ్వ చేసుకొందురా ? పలుకులాడుకొను చున్నచో ప్రియములు పుట్టును. వలపులున్నచోటనే యాసలు పుట్టును. నవ్వులలోనే సిగ్గులు నిలుచును. పిలుపులు కలిగిననే ప్రియములు నిండును. నీ కులుకులతో పతిని కొసరరాదు. చనవులున్నచోటనే సరసములు నిండియుండును. వయసుల లోనివే వింత సుఖములు, మనసులలోనే మచ్చికలు నిండియుండును. నమ్మికలు వున్ననే పొడ జాట్ల విధములు ఇంక పతిని యేల పొరపులు పెట్టేవే! నెమ్మదిని నీస్వామి నిన్నుగూడె. ఆతనిని గోళ్ళ చిమ్మకువే" అని బుజ్జగించి ఆమెకు బుద్ధులు చెప్పుచున్నది.

**రాగ లక్షణము :**

రీతిగౌళ ఒకప్పుడు 20వ మేళకర్తగా భావింపబడుచుండెడిది. కాని వక్ర సంపూర్ణమగు దీనిని తరువాతి కాలమున మేళముగా భావింపక 22వ మేళమగు ఖరహర ప్రియజన్యములలో నొకటిగా వాడుకయందు ప్రచారమునకు తెచ్చియున్నారు. ఘనరాగ ఉత్తర పంచకమునందు గల రాగములలోనిది యొకటి. ఇందు సకృత్తుగా శుద్ధ ధైవతమును పలికించెడి సంప్రదాయ మున్నదటగాని ఇప్పుడు వాడుక యందిది కనబడదు. తాళ్ళపాకవారే యీ రాగమునందు శృంగారపదములు చెప్పియున్నారు. తరువాతి పదకర్తలెవ్వరును యీ రాగమునందు పదములు చెప్పినట్లులేదు.

**ఆరోహణ** : స గ రి గ మ ని ని స

**అవరోహణ** : స ని ద ప ద ని ద మ గ రి స ।

**రీతిగౌళ — త్రిపుట**

విచ్చి చెప్పరాదు వింతలు యీ భావాలు
రచ్చల కెక్కను అంత రవ్వసేయ నేటికి ! ॥పల్లవి॥

వలపులలోనివే వడిగొన్న యాసలెల్ల
సెలవులలోనివే సిగ్గులెల్లాను
పిలుపులలోనివే ప్రియములు గలవెల్లా

చనవులలోనివే సరసములెల్లాను
ననుపులలోనివే నయములెల్లా
మనసులలోనివే మచ్చికలు గలవెల్లా
వొనర నింకా నేలే వొరసేవు పతిని! ॥విచ్చి॥

నమ్మికలలోనివే నానాటి వొడబాటు (ట్లు)
వుమ్మడి వయసులోనే వొద్దికలెల్లా
నెమ్మది గూడె నతడు నిన్ను నిట్టె బుజ్జగించి
చిమ్మకువే గోళ్ళను శ్రీవేంకటపతిని! ॥విచ్చి॥

రేకు : 27–103

ప. - - ప పా ని ద మ ॥ గ రీ సా సా ॥ - - ని సా రి స ని ధ పా ॥
1. - - వి చ్చి చె - - ॥ ప్ప - రా దు ॥ - - విం త - - లు - - ॥

నీ - సా గా ॥ మా
ఈ - భా వా ॥ లు

2. - - ద ని సా రి స ని ద మా ॥ గ మ ప మ మ గ రీ సా ॥
- - వి - చ్చి - - - - చె ॥ ప్ప - - - రా - - దు ॥

- - ని స గ రి సా ని ధ పా ॥
- - విం - త - - లు - - ॥

నీ - సా గా ॥ మా ని సా గా ॥ మా మ గ మా ప మ గ రి ॥
ఈ - భా వా ॥ లు ర చ్చ ల ॥ కె క్కె - ను అం - - - ॥

గా ద ని సా సా ॥
త ర - వ్వ సే ॥

సా రి స ని ద మా మా ప మ గ రి గా ॥ మా
య - - - - - నే - - - - - టి ॥ కి ॥విచ్చి॥

చ. - - స స సా సా ॥ ని ని ఫ నీ సా ॥ - - ని స గా మా ॥ మ గ రి గ రి సా ॥
- - వ ల పు ల ॥ లో - - ని వే ॥ - - వ డి గో న్న ॥ యా - స లె - ల్ల ॥

- - స స గ రి గా ॥ మ పా ప మ గ రి గా ॥
- - సె ల వు ల - ॥ లో - ని - - - వే ॥

- - గ మ ప మ గ రి ॥ సా స ని సా - - ॥
- - సి - గ్గు - లె - ॥ ల్లా - - ను - - ॥

- - ని ద ని ద మ మా ప మ గ రి ॥ ని స మ గ రి గా మా ॥
- - పి లు పు - - ల - - - - - ॥ లో - - - - ని వే ॥

- - ని ప నీ సా ॥
- - ప్రి య ము లు ॥

ని ద మా ప మ గ రి గ మ ని ని సా ॥ - - ని స గ రి గా ప మ ॥
గ - ల - - - - - వె - - - ల్లా ॥ - - కు లి కి - కు లి - ॥

గ రి గ రి సా సా ॥
కి - - - యే లే ॥

- - ద ని సా రి స ని ద మా ॥ గ రి ని స గ రి గా మా ॥
- - కొ స రే - - - - వు ॥ ప - తి - - - - ని ॥ ॥వి చ్చి॥

**అవతారిక :**

ఈ పదమునందలి నాయిక రూపగర్వితి స్వాధీనపతిక. ఈమె చేతలకు పొలయలుకలు నటించుచున్న నాయకుడగు శ్రీ వేంకటరమణునితో చెలులు "చంద్రునియందు మచ్చకలదు గాని వెన్నెలలయందు అది కానరాదుగదా, కొలని యందలి కలువల రేకులు కొనలుదేరి యుండును గాని తావులయందు కొనలు లేవుగదా. నారికేళపు కాయ పైన యెంత కఠినముగా నుండినను లోన నట్లుండదుగదా! అట్లే ప్రవహించుచున్న నీటిని రెండుగా దునుముటకు ఎవరి కైన వశమా. ఆశలమోమున కోపములు రేగిన మా చెలిని గొంకక పలుకోవయ్యా! ఆమెకు మనసునందు కోపములేదు. ఆమె చూపులు వాడిగానుండినను కలువల పరిమళమువలె చల్లనై నవ్వులు చిందుచున్నవిసుమా! మెత్తనిదగు మా చెలి గుణము కఠినము గాదుసుమా!" అని నచ్చచెప్పుచు లాలించు చున్నట్లు అయ్యవారు చెప్పుచున్నారు.

**రీతిగౌళ — త్రిపుట**

నీటి నడు మడచితే నేడు రెండౌనా
యేటికింక గొంకేవు యింతి జేకోవయ్యా! ॥పల్లవి॥

వాసుల జందురులోనె వడిగందు గద్దుగాక
కాసే వెన్నెలలోన గందు గలదా
ఆసల మోమున గోపమటు నీపై జల్లెగాక
యీ సతికి మతిగోప మింతయిన నున్నదా! ॥నీటి॥

కొలనిలో కలువల కొట్టగొన వాడివాక
అలరు బరిమళము లవియూ వాడె
సొలసి చూచిన యింతి చూపులె వాడిగాక
నలువంక గన్నులలో నవ్వులూ వాడా! ॥నీటి॥

అంది నారికేళపు గాయకు బైనె గట్టి గాక
కందువలోనూ నట్టె గట్టియయ్యీనా
పొందిన శ్రీ వేంకటేశ పొలతిపై గుట్టుగాక
గొందినె కూడిన యింతి గుణము కఠినమా! ॥నీటి॥

శ్రృం : 15–75

ప. - - ప ని సా ని ద || మ గ మా ప మ మ గ రీ సా ||
- - నీ - టి న డు || మ - డ - - చి - - తే ||

- - స గ రి గ మ || పా ని ప మా ప మ గ రి రి గ రీ సా ||
- - నే డు - రెం - || డా - - - - - - - న - - - ||

- - ని ఫ నీ సా || ని స గ రి గా మా ||
- - ఏ - టి కిం || క - - - గొం కే ||

మా ద ని సా రి స ని ద మా ప మ గ రి || సా రి స ని స గ రి గ మ || పా -
వు యిం - తి - - - - చే - - - - || కో - - - - వ - - - || య్యా -
॥నీటి॥

చః - - ప పా పా || ని స ని ద మా మా గ రి ||
- - వా సు ల || చం - దు - - రు లో - ||

గా ని స గ రి గా || గ మ పా ని ప మా ప మ మ గ రీ రి స ||
నె వ డి గం - దు || గ - ద్దు - - - - - గా - - క - ||

సా ని ఫ నీ సా || ని స గ రి గ గ మా ||
- కా - సే వె || న్నె - ల - లో - న ||

- - గ మ ద ని సా రి స ని ద ని ద || మా ప మ గ రి గ మ పా - - ||
- - కం - దు - - - - గ - - - || ల - - - - - - - దా - - ||

- - సః సః సః ని ద మా || ని పా నీ - సా సా ||

- - ని స గ ꠱ రి గా ‖ ప మ గ రి గ రి సా సా ‖
- - మ టు నీ - పై ‖ జ - ల్లె - - - - గా క ‖

- - ని స గ రి సా ‖ ని స ని ప ని ని సా ‖
- - యీ - స తి కి ‖ మ - తి - కో - వ ‖

- - ద ని సా రి స ని ద మా ప మ గ రి ‖ ని స గ రి గా మా ‖
- - మిం - త యి - - - న - - - - ‖ ను - న్న - దా - ‖ ‖నీటి‖

**అవతారిక :**

ఈ పదము నందలి నాయిక ప్రౌఢ, స్వాధీన పతిక. రూపగర్విత, ఈమె చేతలను చూచి 'నీ చింత లన్నియును తీరినవి. ఇంకను పంతపు మాటలాడి యాతనిని జడిపించెద వేల? ఇంత చనవు నాతనికి యిచ్చి యిప్పుడు కన్నులెఱ్ఱ జేసి చూచెదలేల? నీవు అన్నిటనతనికిలోనై యిప్పుడు అడ్డగింప జూచెదవేల? ఉసురు నిట్టూర్పులు విడువకుము. శ్రీ వేంకటేశ్వరుడు విడువక నిన్ను గూడినప్పుడు నీ జన్మ పావనమైనది. చాలునమ్మా! ఇట్టిపనులు కట్టిపెట్టి నిన్నేలిన వానిని ఆనందింప జేయుము. ఆతడు నీ యింటికి వచ్చియున్నాడు' అని చెలులు అమ్మ వారిని మందలించు చున్నట్లు అన్నమయ్య వారు చెప్పుచున్నారు. కనులతో మాట్లాడ గల్గిన కాంతయేమో యీామె!

రీతిగౌళ — ఆది

చాలునమ్మ యికనేమి సంగతి గాదు
యేలిన వాడిదె వచ్చి యిలటనున్న మీదను ! ॥పల్లవి॥

పంతపు నీ మాటలకు పని లేదు ఆతనితో
చింత దీర కడు వలచిన మీద
కొంత గొంత కన్నులనే కోపగించ బనిలేదు
ఇంతేసి చనవు నీవిచ్చి నందు మీదను ! ॥చాలు॥

కన్నుల దప్పక చూచి కాతాళించ బనిలేదు
అన్నిటా నాతనికి లోనైన మీద
సన్నల జంకిచాతని సాధించ బనిలేదు
యిన్నేసి నోములు నోమి ఇయ్యకొన్నమీదను ! ॥చాలు॥

వుడుకు నిట్టూరుపుల నుసురన బనిలేదు
బడి బడి నాతనితో బైకొన్న మీద
యెడయక శ్రీ వేంకటేశుడితడే కూడె
జడియగ బనిలేదు సతమైన మీదను ! ॥చాలు॥

శృం : 22—379

ప. - ప పా ని ద ద మ | మ గ గ రి | గా మా ||
1. - చా లు న - మ్మ - | యి - క - | నే మి ||

- గ మ పా మా గ రి | రి గా రి సా | గ రి గ మ ||
- సం - గ తి గా - | - - - డు | - - - - ||

- స సా సా సా | నీ ధా | నీ సా ||
- యే లి న వా | డి దె | వ చ్చి ||

- స ని సా గ రి గా | మా ప మ మ గ రి | గా మా ||
- యిం - ట ను - న్న | మీ - - - - - | ద ను || ||చాలు||

2. - ని ని సా ని ద ద మ | గ మ ప ని | దా మా ||
- చా - లు న - మ్మ - | యి - క - | నే మి ||

చ. - మ మ మా గ రి రి గా రి | స ని ని ధ | నీ సా ||
- వు డు కు ని - - - - | ట్టూ - - - | రు్వ ల ||

- ని సా సా గ రి స ని | సా గ రి | మా మా ||
- వు స్సు ర - - న - | బ ని - | లే దు ||

- ప ప పా ని ద ద మ గ మ | పా ప మ | గ రి రి స ||
- ప డి ప - - డి - నా - | త ని - | తో - - - ||

- ని సా గ రి గ మ | పా - - | - - - - ||
- పై కొ న్న - మీ - | ద - - | - - - - ||

- ప ని దా మా ని ని | సా ని ప | నీ సా ||
- ఎ ఢ్ఢ య క శ్రీ - | - వేం - | - క ||

- ని సా గ రి సా | ని పనీ | సా - - ||
- ఛే ళు డి త డే | కూ - - | డె - - ||

- స ని సా గ రి సా ని ని నీ | పా ని ని | సా - - ||
- జ డి య - - గ ప - - | ని తే - | దు - - ||

- స స ని ద ప ద ని ద | మా గ రి | గా మా ||
- స త మై - న - మీ - | ద ను - | - - || ॥చాలు॥

**అవతారిక :**

ఈ కీర్తనము నందు "కన్నులు, దృశ్యముల యందలి మంచి చెడ్డలను గమనించకయే చూచు చున్నవి. మనసు మంచి చెడ్డల నెఱుగకయే విషయ సుఖముల వెంట పరుగు లిడు చున్నది. కాయపు సుఖములు కలుగుచునే యున్నవి. చరా చరమయిన ప్రపంచ మంతయు నీవే యని నేజేయు సర్వ కర్మల శుభా శుభ ఫలంబులు నీకే యర్పితములను భావము నియ్యగదే! ఓహరీ, శ్రీ వేంకటనాథా!" అని అయ్యవారు స్వామికి విన్నవించు చున్నారు.

**రాగ లక్షణము :**

దేశి ఉత్తర భారతీయ సంగీతము నందు ఇప్పటికిని వాడుక యందు కలదు. ఇది దక్షిణ భారతీయ సంగీతము నందు లుప్తమైపోయినట్లు కనబడు చున్నది. హిందూస్తానీ పద్ధతి యందు దేశి, దేష్ అను రెండు రాగములు విభిన్న ప్రకృతులతో నేటికిని వాడుక యందున్నవి. ఇందు దేశి అనునది 22వ మేళమగు ఖరహర ప్రియ జన్యముగా చెప్పుకొన వలసి యున్నది.

ఆరోహణ : స రి మ ప ని మ ప స

అవరోహణ : స ని స మ ప గా రి స

ఇందు స్వరముల జార్పుతో స్వాభావికములైన స్థానముల యందే పలికించుచు పాడినచో రాగ స్వరూపము స్పష్టమగును. గమకములు కర్నాటక సంగీత పద్ధతి యందు వలె ప్రయోగించినచో రాగ స్వరూపము యేర్పడదు. ఇందు ఆరోహణావరోహణములు నామ మాత్రమే గాని రాగ సందర్భముల యందు స్వరముల కూర్పులు గమనించి పాడు కొనవలసి యుండును. ఇట్టి రాగములు కర్నాటక సంగీతము నందు అఠాణా, ఆహిరి వంటివి ప్రాచీన స్వరూపములతో మనకు కనబడుచునే యున్నవి.

దేశి – ఆది

హరి నీవే సర్వాత్మకుడవు
యిరవగు భావన యియ్యగదే! ||పల్లవి||

చూడక మానవు చూచేటి కన్నులు
యేడనేమైనా యితరములు
నీడల నింతా నీరూపము లని
యీడువడని తెలివియ్యగదే! ||హరి||

పారక మానదు పాపపు మనసిది
యీ రసములతో నెంతైనా
నీరజాక్ష యిది నీ మయమే యని
యీ రీతుల తెలపియ్య గదే! ॥హరి॥

కలుగక మానవు కాయపు సుఖములు
యిల లోపల గల వెన్నైనా
అలరిన శ్రీ వేంకటాధిప నీకే
యిలనర్పితమను యిహ మియ్య గదే! ॥హరి॥

అ : 11 (1)–146

స. స రి రి ప మ గ గా | రి స రి ని | స స స స ||
హ రి నీ - వే - - | స ర్వా - - | త్మ కు డ వు ||

మ ప స స స రి ని స | ప ద ప మ | మ గ మ గ రి ||
యి ర వ గు బా - వ న | యి - య్య గ | దే - - - - || ॥హరి॥

చ. పా ద ద ద మ ప మ | మ రి గ గ | రి స ని రి ||
చూ డ క మా - న వు | చూ - చే టి | క - న్ను లు ||

స రి మ ప ద మ పా | మ గ రి మ మ | పా ప ప ||
ఏ - డ నే - - వై | నా - - యి త | ర ము లు ||

మ ప స స స రి ని స | రి మ గ గ | రి రి స స ||
నీ - డ ల నిం - తా - | నీ - రూ - | ప ము ల ని ||

స రి ని స ప ద మ ప | ద ప మ ప ద ప మ గ | రి సా ||
ఘ్రూ - డు వ డ ని తె లి | వి - - - య్యా - గ - | దే - || ॥హరి॥

**అవతారిక :**

ఇందలి నాయిక ముగ్ధ. ఈమె తనయందు నాధుడు చూపుచున్న ప్రేమకలాప మంతయు నిజమో కాదో తెలుసుకొనలేనంత బేల. "నీవు చెప్పెడి పలుకులు నిజములో కాదో తెలియకున్నవి. నీవిచ్చెడి చనవులు నిజములని యెప్పటికిని నమ్మవచ్చునా. నాయిలవేల్పువగు శ్రీ వేంకటేశ్వరుడా, మురిపెముతో నీ వాడినవి చేసినవి నమ్మి నీకు మ్రొక్కుకొందునా!" యనుచున్నది

**దేశి — రూపకం**

ఆఁఅడి బెట్టక మాతో నానతీవయ్యా
మీఁఅరాదు ఇచ్చకపు మీవారమే నేము ! ॥పల్లవి॥

చుట్టరికము సేసుక సుద్దులెల్ల జెప్పేవు
నెట్టన నీరచనలు నిజమా యిది
చెట్టాపట్టాలు పట్టుక సిగ్గులు విడిపించేవు
నట్టనడుమ నివెల్లా నమ్మవచ్చునా ! ॥ఆఁఅడి॥

సారెసారె నియ్యరాని చనవులెల్లా నిచ్చేవు
కోరి యివెల్లా నియ్యకో లవునా
పేరడిగా ననుపులే పెనచేవు నాతోను
సారెకు నిటువలెనే సతములయ్యేవా ! ॥ఆఁఅడి॥

పరపుపై బవళించి బాసలెల్లా జేసేవు
అరసే నింకొక్కమాటు అవునా యిది
యిరవై శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
మురిపెముతోడుతను మొక్కుదునా యిందుకు ! ॥ఆఁఅడి॥

శ్లోం : 27—176

ప. రి మ ప ద మ ప గా ॥ గ రి మా పా ॥ ద మ ప సా రి ॥ ని స ప ద మ ప ॥
ఆ - - - అ డి బె ॥ ట్ట క మా తో ॥ నా - న తీ - ॥ వ - - - య్యా- ॥

- రి గ రి స రి ॥ నీ స స సా ॥
- మీ అ రా - దు ॥ ఇ చ్చ క పు ॥

ని స రి మ ప ద మ పా ॥ స రి ని స ప ద మ ప గ రి ॥
మీ - - - - - - - వా ॥ ర - మే - నే - - - ము - ॥ ॥ఆఅడి॥

చ. - ప ప ప ప ప ॥ ద మ ప గ రి ॥ - స రి నీ స ॥ రి మ ప గ రి ॥
- చు ట్ట రి క ము ॥ సే - - సు క ॥ - సు ద్దు లె ల్ల ॥ జె ప్పే - వు - ॥

- ని స రి మ ప ॥ ద మ పా సా ॥ స రి ని స ప ద మ ప ॥ గ రి సా - - ॥
- నె ట్ట న నీ - ॥ ర చ న లు ॥ ని - జ - మా - - - ॥ ఇ - ది - - ॥

- ప ద మ పా ॥ సా - ని సా స స ॥
- చె ట్టా ప ట్టా ॥ లు - - ప ట్టు క ॥

ని స రి మ ప మ గ రి స । రి ని సా సా ॥
సి - - - గ్గు - లు వి డి । పిం - చే వు ॥

- ప స స రి ని ॥ స ప ద మ పా ॥ ని స రి మ ప ద మ ప గ ॥ రీ సా - - ॥
- న ట్ట న ఢు మ్మ ॥ ని - వె - ల్లా ॥ న - - - మ్మ - వ - చ్చు ॥ నా - - - ॥
॥ఆఅడి॥

**అవతారిక :**

ఈ పదమునందు స్వాధీన పతిక రూపగర్వీత యగు అలమేలు మంగ నాయిక. ఆమె ప్రేమలీలలను దర్శించిన ద్రష్టలగు అయ్యవారు "అమ్మా! నీవు నాధుని చూచి నవ్వుచు ఏమేమో ముద్దు మాటలు చెలులమగు మాతో చెప్పుచున్నావు. ఆకుమడు పాతడు యిమ్మనగా వేచి వినయముతో అలవోకగా పవ్వళించి యుండియే యిచ్చుచున్నావు. నిడుద కన్నులతో కాటుక నీటుల దిద్దుకొనుచు ఘనుడగు వెంకటనాధునితో పలుకుచున్నావు. అతడు నల్లనివాడని కాబోలు నీఎకసెక్కెము. దోమతెర చాటుల మీ కలయికలోని యడియాలాలు మాకేల చెప్పెదవు. మీ యిద్దరిలో సమ్మతములు వుండినను నీవిట్లు చేయకూడదు సుమా! మీ యిరువురి యంతరముల తలపులు నీ వెలుగవలదా తల్లీ!" అని చెలిచేత చెప్పించుచున్నారు.

**రాగ లక్షణము :**

మధ్యమావతి ప్రాచీన రక్తి రాగములలో నొకటి. దీనిని భాషాంగమని కొందరు లక్షణ కారులు చెప్పుకొన్నారు. కాని భాషాంగ లక్షణము లిప్పుడీ రాగమున కానవచ్చుటలేదు. ఇది 22వ మేళజన్యముగా కనబచుచున్నది. 'స రి మ ప ని స । స ని ప మ రి స' అనునవి ఆరోహ ణావరోహణములు. ఇందు ప్రాచీన వాగ్గేయకారుల రచన లనేకములు గలవు. సుమారు మూడు నాలుగు వందల యేండ్ల క్రిందటివగు రచనల యందును ఈ రాగస్వరూపము ఇప్పు డున్నట్లే కనబడుచున్నది. దీనిని 'మధుమాతి సారంగ్' అని ఉత్తరాది సంగీతమునందు చెప్పుదురు.

**మధ్యమావతి – రూపకం**

అతని మన్ననే చూచే వప్పుడె నీవు
యితవై మీ యిద్దరిలో యెంత సమ్మతములో! ॥పల్లవి॥

చెలువుని మోము చూచి సెలవుల బారనవ్వి
చెలితో మాటలాడేవు చెల్లబో నీవు
అలవోక బవళించి యాకు మడి చిచ్చేవు
అలవెలగవు పతినౌనే నీవు! ॥అతని॥

కౌటుక దీరుచుకొంటూ ఘనునితో బలికేవు
నేటివలెనుండునటు నేరవు నీవు
నీటున నొయ్యారి బాగై నిలుచుండి మొక్కేవు
వోటలేదు దొరపిత్తా లోకరీతి నుండుసా! ॥అతని॥

తొడమీద దొడవేసి దొంగతన పేచూ పేవు
నడుమ (శ్రీ) వేంకటేశునంటున నీవు
జడికొని దోమతెరచాటున గూడి మాకు
నడియాలాలు చూపేవు అంతలో నీవు! ॥అతని॥

శృం : 26–235

ప. ప ని స ని పా ప మ ॥ రి మ ప మ రీ రి స ॥
1. అ - త - ని మ - ॥ న్న - నే - చూ చే - ॥

ని స రి మ రి స ని ధ నీ ॥ సా - - - - ।
వ - - - ప్పు - డె - నీ ॥ వు - - - - ॥

మ మ రి స రి మ పా ని ని పా ॥ ప ని సా రి మ రి మ స రి స ॥
యి - త - వై - - మీ - - ॥ యి - - ద్ద - రి - లో - - ॥

ని స రి స ని రి స ని పా ॥ ని ని ప మ రి మ రి సా ॥
యెం - - త స - - - మ్మ ॥ త - ము - - - - లో ॥ ॥అతని॥

2. రి మ ప ని సా - ని పా - మ ॥ రి మ ప మ రీ రి స ॥
అ - త - ని - - మ - - ॥ న్న - నే - చూ చే - ॥

చ. మ మ ప ని ప మ రీ ॥ ని స రి మ స రి సా ॥
చె లు వు - - - ని ॥ మో - ము - చూ - చి ॥

స న్ని న్ని ధ న్ని స రి గ రీ ॥ రి మ ప ని ప మ రి సా ॥
సె - ల - వు - - - ల ॥ జా - ర - న - - వ్వి ॥

న్ని స రి మ రి స ॥ రి మ పా ని ప ప మ ప మ ॥
చె లి తో - మా ట ॥ లా - డే - - వు - - - ॥

ప ప ని సా - ని పా - మ ॥ పా - - - - ॥
చె ల్ల - బో - - నీ - - ॥ వు - - - - ॥

ని ని స రి స ని ప ని ప మ ॥ రి మ పా నీ సా ॥
అ ల వో - - - క - - - ॥ ప - వ ళిం చి ॥

ప ని సా రి మ ప మ రీ - స ॥ రి స ని ప నీ సా ॥
ఆ - కు మ - డి - చి - - ॥ చ్చే - - - - వు ॥

ని స రి మ రి స ని రి స ని ప మ ॥ ప మ రి మ రి స రి మ ప ని స రి ॥
అ - ల - - - వె - అ - - - ॥ గ - వు - - - ప - తి - - - ॥

స ని ప ని సా - - ॥ స రి ప మ రి మ రి సా ॥
నా - - - నే - - ॥ నీ - - - - - - వు ॥ ॥అతని॥

**అవతారిక :**

ఈ పదమునందలి నాయిక ఖండిత. దక్షిణ నాయకుడగు శ్రీ వేంకటేశ్వరుని రాకను గమనించి చెలులతో "రమ్మనవే స్వామిని నా వద్దకు, యెదుటనే చెప్పవలసినవి చెప్పెదను. ఆతని మొగము చూడక నా ముచ్చట తీరదుగదా! చూడుమనవే కన్ను లెత్తి నా మొగమును కలిగినవన్నియు చెప్పి ఆతనికి మంచినే చేసెదను. ఆతనితో మాటాడుటకై దప్పికొనియున్నాను. అతని తప్పులు ఒప్పులుగనే తలచుకొందునులే" అనుచున్నారు.

**మధ్యమావతి — ఝంపె**

ఆ మాట మీ రెరగ రాతడె కాని
తామసించినాడ నుండె తనకేలె వెలుపు ! ||పల్లవి||

విచ్చేయుమనవె విభుని నిక్కడికె
యిచ్చటనె విన్నవించే నేమి గల్లాను
ముచ్చట దీరదు తన మొగము చూచినదాకా
తచ్చివేసి నేనుండగ తనకేలే వెలుపు ! ||ఆ మాట||

తప్పక చూడు మనవె తానిట్టె నా దిక్కు
యిప్పుడె మంచిది సేసే నేమి గల్లాను
దప్పివోదు నేడు నాకు తనతో మాటాడుదాకా
తప్పులెల్ల వొప్పులయ్యీ తనకేలె వెలుపు ! ||ఆ మాట||

తలచుకొమ్మనవె తనపొందు నా పొందు
యెలమి గాగిట దీర్చేనేమి గల్లాను
అలమె శ్రీ వేంకటేశు డందుకే మెచ్చినదాకా
తలవంచుకున్నాడు తనకేలె వెలుపు ! ||ఆ మాట||

శ్రుం : 15—150

ప. - రి మ పా ని ప ప మ | రి మ ప మ రి రి స ||
- ఆ - మా - - ట - | మీ - - - రె ర గ ||

ని స రి మ రి స ని ఫ | ని స రి మ రీ - ||
రా - - - త - డే - | గా - - - ని - ||

- ప ని సా స | ని రి స ని పా ప మ ||
- తా మ సిం చి | నా - డ - నుం డె - ||

- రి మ పా ని ని ప మ | రి మ ప ని స ని ప మ రి స ||
- త న కే - - లె - | వె - ర - పు - - - - - ||

॥ఆమాట॥

చ. - ప పా ప మ | రి మ ప మ రి రి స ||
- వి చ్చే యు - | మ - న - వె - - ||

- ని స రి మ రి స ని ఫ | ని స రి మ రీ - ||
- వి భు ని - ని - - - | క్క - డి - కె - ||

- మ మ మ మ | రి మ ప పా ||
- ఇ చ్చు ట నె | వి న్న విం చే ||

ని ని ప మ పా ప మ రి స | ని స రి మ పా - ||
నే - - - మి గ ల్లా - - | - - - - ను - ||

- ప ని స రి | రి స నీ స రి రి || - ని స రి రి మ | మ రి రీ సా స ||
- ము చ్చ ట - | తీ - ర దు త న || - మొ గ ము చూ - | చి - న దా క ||

- ప రి సా రి | ని స ని పా || రి మ ప ని ని | స ని ప ని ప మ రి మ రి స ||
- త చ్చి వే సి | నే నుం డ గా || త న కే - లె | వె - అ - - - పు - - - ||

॥ఆమాట॥

**అవతారిక :**

ఇందు నాయిక గడుసరి. జాణ, స్వాధీనపతిక. ఈమెకు మౌనమను మహా విద్య తెలుసునట. నాయకుడేమన్నను పెదవి విప్పి వినునట. ప్రేమతో అతడాడిన వన్నియు దీవెనలే నట. కోపమున రెచ్చి అతడేమి చేసినను మధ్య తనకు నవ్వు వచ్చునట. ఇష్టమైనవాడు ఎంత అలయించినా యింపే అగునట శ్రీ వేంకటేశ్వరుడగు నాయకుడు తన చేతిలోని వాడట. అతడు చెనకి యెంత మీరినా ఘాతలు కావట, ఘనమే యౌనట. ఇవి యన్నియు మొగ మాటము లేక అతనికే దెప్పుచున్న యీమె జాణ తనము. ఆహా! ఏమనవచ్చును! అయ్యవారు ఇందు చూపిన చమత్కారము వర్ణనాతీతము. ఊరకున్న ఊరోపదన్న సామెతను పల్లవిగా చేసి వారు పాడుకొన్న యీ పదము వేంకటేశ్వరునికే గిలిగింతలు పెట్టియుండును. మానవుల మనోభావములను మంచి అద్దము నందు ముఖమువలె చూపించుట మహానుభావులైన యీ మనీ షికే చెల్లినదేమో!

**రాగ లక్షణము :**

ఈ ముఖారి రాగము అతి ప్రాచీనము. భాషాంగము. ఇప్పటి వాడుక ప్రకారము 22వ మేళమగు ఖరహరప్రియ జన్యముగా చెప్పుకొనవచ్చును. ఆరోహణమున చతుశ్శృతి ధైవత మును అవరోహణమున శుద్ధధైవతమును వచ్చుట పరిపాటి. 'స ని ద మా'–'ప ని ద మా' అను సందర్భములలో అవరోహణమేయైనను చతుశ్శృతి ధైవతమే పలుకును. వెంకటమఖి సంప్రదాయ మున చెప్పిన ముఖారియు, క్షేత్రజ్ఞుని పదములయందలి ముఖారియు ఇంచుమించు ఒకటిగనే యున్నవి. భాషాంగ స్వరము చతుశ్శృతి ధైవతమైనచో నటభైరవి జన్యముగను, భాషాంగ స్వరము శుద్ధధైవతమైనచో ఖరహరప్రియ జన్యముగను చెప్పుకొనుటకవకాశము కలుగుచున్నది. వెంకటమఖి సంప్రదాయమున యీ రాగము నారీ రీతిగౌళ జన్యము. కొందరితర గ్రంథ కర్తల మతమునది ఖరహరప్రియ జన్యము. ఇటువంటి రాగములకు జనక రాగములు నిర్ణ యించుటకై పాటింపదగిన ఒక నియమము మా గురువుల వలన వినియుంటిని, సకృత్తుగావచ్చి, భాషాంగ స్వరూపమును నిర్ణయించుటకు మాత్రము తోడ్పడు స్వరమును వదలి అన్య స్వరము లను గమనించి, జనక రాగమును నిర్ణయించవలెను. ఈ నియమము చెప్పుటకు సులభముగానే యున్నది. కాని నిర్ణయము చేయుటకు దిగినప్పుడు మాత్రము కష్టముగనేయున్నది. కారణము ముఖారి రాగము నందలి రెండు ధైవతములును ప్రత్యేకములైన బరువులు, ఒదుగులు కలిగి రాగ స్వరూపమును నిర్ణయించునవిగాను, ఇది ఎక్కువ, ఇది తక్కువ అని చెప్పుటకు వీలులే కుండగనుండుట వలన వెంకటమఖియు, ఆధునికులును కూడ సరిగానే చెప్పినారనక తప్పదు. కాని ఇంకొక సంప్రదాయమున్నది. ఇటువంటివేగాక ఔడవ, షాడవములైన కొన్ని రాగము లకు జనక నిర్ణయము చేయునప్పుడు 72 మేళకర్తలలో ఒకటినుండి ప్రారంభించి ముందుగా యే మేళకర్తకు యీ రాగము అన్వయించుటకు వీలుగలదో ఆ మేళకర్తజన్యమని చెప్పవచ్చు నన్నది యీ మతము. ఏది యెట్లున్నను ముఖారి చతుశ్శృతి ధైవతముతో ఎక్కువ రాగ స్వరూపమును వ్యక్తము చేయుచున్నది.

**ముఖారి — ఆది**

ఊరకున్నవారి తోడ నూరోప దన్నమాట
నేరుచుకొంటి నేను నీవేమి సేసేవే! ॥పల్లవి॥

చుట్టములయిన వారు సొలసి సొలసి యంత
తిట్టినా యెగ్గులౌనా తేజమే గాక
వొట్టి నీవు కోపగించి వూరకే యేమనినాను
నట్ట నడుమను నాకు నవ్వు వచ్చీనే! ॥ఊరకున్న॥

చేతికి లోనైనవారు చెనకి యంత మీరినా
ఘాతలను హీన మౌనా ఘనతే కాక
పోతరించి నీవు నన్ను పూచి యేమి సేసినాను
జాతి నా మనసన్నిటా సమ్మతించీనే! ॥ఊరకున్న॥

కాగిట గూడిన వారు కడు దమకించినాను
మూగివేసట పుట్టునా మదమే కాక
యేగివచ్చి శ్రీ వేంకటేశుడ కూడితి నన్ను
వీగని నీ రతులెల్ల విందు లయ్యీనే! ॥ఊరకున్న॥

శృం : 17–229

ప. - ప పా మా ప మ గ రి | రి స రీ | ప మ గ రి రీ గ స ||
- ఊ ర కు - - న్న - | వా - రి | తో - - - డ - - ||

- స సా ని ధ ఫ ధ | సా రీ | మా మా ||
- వూ రు వో - ప - | ద న్న | మా ట ||

- రి మా పా స ని ద మ | పా స ని ని ద దా | సా - - ||
- నే రు చు - - కొం - | టి - - నే - - | ను - - ||

- ప ద స రి గ రి స ని ద ప | మా పా ద ప | మా గ రి || స
- నీ - వే - - - - - మి - | సే - - - | సే వే - || - ॥ఊరకున్న॥

చ. - ద దా ని ద దా ని ద దా ని ద | స ని ద రి సా - ద | ని ద పా ||
- చు ట్టు - - ము - - లై - - | న - - - - - - - | వా - రు ||

- ప ద పా ప మ ప మ గ రి | రి స రీ | మా పా ||
- సొ ల సి సొ - - - ల - | సి - - | యం త ||

- ద దా ని ద దా ని ద దా ని ద | స ని ద రి సా - ద | ని ద పా ||
- తి ట్టి - - నా - - - - - | యె - - - గ్గు - - | లా - నా ||

- ప ద పా ప మ ప మ గ రి | రి స రీ | మా పా ||
- తే - జ మే - - - గా - | - - - | కా - ||

- ని ద సా రీ రీ | రి స రీ | ప మ గ రి రి స ||
- వొ - ట్టి నీ వు | కో - ప | గిం - - - చి - ||

- ప ద సా రీ గ రి సా | ని ద మా పా స ని | ని ద దా సా ||
- ఊ - ర కే - - యే | మ - - ని - - | నా - - ను ||

- ద సా స ని ద రి సా - ని | ని ద పా | ప ద మా పా ||
- న ట్ట న - డు - మ - - | ను - - | నా - - కు ||

- రి మ పా స ని ద పా | మ ప ద ప స ని ద ప | మ గ రీ సా ||
- న - వ్వు వ - - చ్చి | ని - - - - - - - - | - - - - || ॥ఊరకున్న॥

**అవతారిక :**

చరాచరమయమగు సృష్టియందు పరమాత్ముడగు శ్రీ వెంకటేశ్వరుడు నిండి యున్నాడనియు, అతనిని దక్కవేసేదియు కనగోరము, వినగోరము అనుచు ఎచటనుండి జీవులు శరీరములను పొందుచున్నవి, వేరువేరు విధములగు జీవిత నాటకములను ఆడుచు ఎచటికి పరమ పదించుచున్నవి యనెడి చింతయు, దైవభేదములును, మాకక్కరలేదని తిరువేంకటేశ్వరునిపై భారముంచిన అయ్యవారు చెప్పుచున్నారు.

**ముఖారి — ఆది**

ఎందు బోడమితిమో యెఱగము – మా
కందువ శ్రీహరి కరుణే కాక ! ॥పల్లవి॥

ఏటి జన్మమో యెఱగము - పర
మేటిదో నే మెఱగము
గాటపు కమలజుగాంచిన యీ
నాటకుడే మానమ్మిన విభుడు ! ॥ఎందు॥

ఎవ్వారు వేల్పులో యెఱగము - సుర
లెవ్వరో నే మెఱగము
రవ్వగు శ్రీసతి రమణుడు మా
కవ్వన జోదరుడంతరి యామి ! ॥ఎందు॥

ఇంకా నేటిదో యెఱగము - యీ
యంకెల బాముల నలయము
జంకెల దనుజుల జదిపిన తిరు
వేంకటేశుడు మా విడవని విభుడు ! ॥ఎందు॥

ప. రీ రి గ రి స స స | ని ద ద మ | పా - - ||
ఎం దు బో డ మి తి మొ | ఎ఼ అ గ ము | మా - - ||

మా ప ప ప స ని ని ద ద | స రి గ రి రీ గ స | సా సా ||
కం దు వ (శ్రీ) - - హ - రి | క - రు - ణే - - | కా క || ॥ఎందు॥

చ. పా ప ప ప ప ద ప | మ మ ప మ | గ రి గ స ||
యిం కా - నే - టి దో | యెఱ అ గ ము | యీా - - - ||

సా రి మ గ రి రి స | స స స స | సా - - ||
అం కె ల బా - ము ల | న ల య - | ము - - ||

రి మ ప ప ప ద ని ద | ప ద స ద | సా సా ||
జం - కె ల ద ను జు ల | జ ది పి న | తి రు ||

స రి గ రి రి స సా | ని ద మ మ | ప ద సా ||
వేం క టే - శు డు మా | వి డు వ ని | వి భు డు || ॥ఎందు॥

**అవతారిక :**

ఈ పదమునందలి నాయిక ముగ్ధ. స్వాధీనపతిక. తన పంతములు చెల్లి తన కడకు స్వామి రాగా సిగ్గుల భరిణెయగు యీామె చేసెడి పనులను గమనించిన చెలులు "ఏమమ్మా ! నీ కాంతుడు వచ్చి కన్నులెదుటనుండగా యింకను చింతించుచున్నట్లున్నావు. ఏకాంతముగా నాకు చేరికనున్న స్వామితో నీవు పలుకులాడుకొనవలదా ? ఇంకను వంతులు వాసులు ఎంచుకొనవచ్చునా! నీపై మక్కువతో మనసిచ్చిన స్వామి సన్నిధిని ఈ మౌనములేలనమ్మా! లక్కవలె కరిగిన యాతనికి నీ లాగులెల్ల జూపి యానందింపజేయవలదా ? శ్రీ వేంకటేశ్వరుడగు స్వామియే నీ యందు వావి వరుసలను కలుపుకొని నిన్ను కూడియుండగా యింకను తలవంచుకొనెదవేలనమ్మా? ఈ కథలన్నిటిని కట్టిపెట్టి విభుడైనవాని కృపకు పాత్రురాలవై సంతోషమున నుండవే. నీ విధము చూడ కప్పురము తిన్న నోటికి కారమువలె నున్నది". అని వ్యంగ్యముగా అమ్మవారగు అలమేలు మంగకు సిగ్గులుడుపుచున్నారని అయ్యవారు చెప్పుచున్నారు.

**ముఖారి — ఆది**

కప్పురము దిన్ననోట గార మేలే
యిప్పుడే కంటిమి వేసాలిక నేలే ! ॥పల్లవి॥

కాంతుడు వద్దికి వచ్చి కన్నులెదుట నున్నాడు
చింతలెల్ల దీరినాను సిగ్గులేలే
మంతనాన మాటాడగా మరగులే పెట్టేవు
వంతువరుసలు వచ్చె వాసులేలే ! ॥కప్పు॥

మక్కువ చల్లి యాతడు మనసెల్ల నిచ్చినాడు
మొక్కలము దీరినాను మోనమేలే
లక్కవలె గరగీ నీలాగులెల్లా జూచి చూచి
చక్కనాయ బనులెల్లా జాగులేలే ! ॥కప్పు॥

శ్రీ వేంకటేశ్వరుడు చేరి నిన్ను గూడినాను
వావులు గలసె తలవంచ నేలే
వేవేలు వచ్చె నీకు విభుడాతడైనాడు
కైవశమైన మీద కతలేలే ! ॥కప్పు॥

శృం : 22—154

ప. - ప పా మా గ రి | రి స రీ గ రి | స స సా ||
- క ప్పు ర ము - | ది - న్న - - | నో - ట ||

- ని ధ సా రీ మా | పా - - | ప మ గ రి ||
- కా - ర మే లే | - - - | - - - - ||

- ప దా సా ఠీ గ ఠి | సా ని ద | ద మా - ||
- యి ప్పు డే కం - - | టి మి - | - - - ||

ప పా ద ప మా ప మ గ రి | రి స స ని ధా | సా - రి మా ||
వే సా - - ళి - - క - | నే - - - - | లే - - - ||

చ. - రి మ పా ద ప ప మ | గ రి రి స | రి ప మ గ రి సా ||
- శ్రీ - వేం - క శే - | శ్వ రు డు - | ని - - - - న్ను ||

- ని ద సా రీ మా | ప మ గ రి స రి | మా పా ||
- చే - రి ని న్ను | కూ - - - డి - | నా ను ||

- ప ద సా రీ గ రి సా | స స ని ద ద మ | పా ని ద ద ప ||
- వా - వు లు - - గ | ల - - - సె - | త - - ల - ||

- మ పా ద ప ప మ ప మ గ రి | స రి గ రి ప మ గ రి | సా - - ||
- వం చ - - నే - - - - - | - - - - - - - - - | లే - - ||

- ప ద సా రి స రీ | మ ప మ గ రి సా | సా - - ||
- వే - వే లు - వ | చ్చె - - - - ని | కు - - ||

- స స సా - ని ని ద ద మ | ప స ని ని ద దా | సా - - ||
- వి భు డా - - త - డై - | - - - నా - - | డు - - ||

- ప ద పా రి గ రి సా | స స ని ద ద ప | పా ని ద ద ప ||
- కై - వ శ - - మై | న - - - మీ - | ద - - - - ||

- మ పా ద ప ప మ ప మ గ రి | రి రి గ రి ప మ గ రి | సా - - ||
- క త - - - - - - తే - | తే - - - - - - - | - - - ||

**అవతారిక :**

ఈ పదమునందలి నాయిక సామాన్య. ఈమె నాధుడగు శ్రీ వేంకటేశ్వరుని "స్వామీ ! మీపరాకులుమాని నేను పిలచినప్పుడైన నాతో పలుకులాడరాదా ! పిలిచి పిలిచి యలసిన నాపెదవులు బెండువారినవి. నిలువున నివ్వెరగై యున్న నన్ను నీ చేతులతో చేరదీసి సంతోషింప చేయరాదా ! ననొక్కసారి చలముమాని చక్కగ జూడరాదా ! నీకు మ్రొక్కి మ్రొక్కి నాచేతులు మొనలు వారుచున్నవి మక్కువతో నొకపరి న మాటలువిని మన్నన లీయరాదా ! నీ వెంట వెంట తిరుగుచు వేసట పడుచుంటినే, నాయింటికి రారాదా!" అని కరుణ రసము చిప్పిలునట్లు ప్రార్థించుచున్నది

**రాగ లక్షణము :**

వేళావళి ప్రాచీనరక్తి రాగములలో నొకటి. ఇప్పటి వాడుకప్రకారము 23 వ మేళమగు గౌరీ మనోహరి జన్యము.

**ఆరోహణ** : స రి గ మ ప ద స
**అవరోహణ** : స ని ద ప మ గ రి స

ఇందు ప్రాచీన వాగ్గేయకారుల రచనలు అచ్చటచ్చట కనబడుచున్నవి.

**వేళావళి — రూపకం**

ఎందాకా నీ చలమేమి గట్టు కొంటివి
యిందు వంకనే దొర విన్నిటా నీవైతివి ! ॥పల్లవి॥

పలుకరాదా కొంత పరాకు మానరాదా
పిలిచి పిలిచి పెదవులెల్లా బెండుపడెను
సెలవుల నవ్వరాదా చేతలదగ్గరరాదా
నిలువు నివ్వెరగాయ నీకు గానే ప్రేమను ! ॥ఎందా॥

చక్కగా జూడగ రాదా చలము మానగరాదా
మొక్కి మొక్కి చేతులెల్లా మొనలాయను
మక్కువతో వినరాదా మన్ననలియ్యగరాదా

యింటికిట్టై రారాదా యిటునన్ను గూడరాదా
వెంట వెంట దిరిగాడి వేసటాయను
అంటి ముట్టి శ్రీ వేంకటాధీశ యేలితివి
నటున నీ తోడి రతి నాభాగ్యమాయను ! ॥ఎంచా॥

శృం : 26-119

ప. ధా ని స రి గ రీ || గ మ పా - మ గ రి స ||
ఎం దా - - - క || నీ - - - - చ - ల ||

రి గ మా ప ద ని సా స ని || ద ప మ పా - మ గ రి స ||
మే - - మి గ - - ట్టు - || కొం - - - - టి - వి - ||

రి గ మా పా ద ప ప మ || పా - - ప ద నీ ||
యిం - దు వ క - - - || నే - - డొ - ర ||

సా స ని ద ని స ని ద ప || ద ప ప మ గ రి గ రి రి స స ని ||
వి న్ని - టా - - - నీ - || వై - - - - - - తి - - - వి - || ||ఎందా||

చ. రి గ మా రి మ గ రీ || - - - - రి గ మా ||
పలు క రా - - దా || - - - - కొం - త ||

ప ద ని స ని ద పా మ గ రి || గ రి రి సా - - ||
వ - రా - - - కు మా - న || రా - - దా - - ||

గ రి స ని ధ ని స రీ || రి గ మా పా మా ||
పి లి చి - పి - లి చి || పె ద వు లె ల్ల ||

ప ద ని స దా మ || పా - - - - ||
ఛెం - ధు వ డ - || ను - - - - ||

ద ని సా రీ గ రి రి స || రి గ మా రి మ గా రీ ||
సె ల వు ల న - - - || వ్వా - - రా - - దా ||

ద ని సా రి గ మ ప మ గ రీ || గ రి స ని స ద ని సా ||
చే - త ల - - - ద - - || గ్గ - ర - రా - - దా ||

ద ని స రి గ రి స ని ద ని స రి || గ రి స ని ద ని స సి ద ప ||
ని లు వు - ని - - - వ్వో - ర - || గా - - - - - - - య - ||

ని స ని ద ద ని ద ప ద ద ప మ || గ మ ప ద ప మ గ రి సా ||
నీ - కు - గా - - - నే - - - || ప్రే - - - మ - - - ను || ||ఎందా||

**అవతారిక :**

ఇందలి నాయిక ఖండిత. ఈమె నాయకుని చేతలను మొగ మెదుటనే ఖండించును. "నీవు నిజమగు ప్రవర్తన కలవాడవని నమ్మితిని. తెగువరులగు భామలను నీవు కలయుచునే యుంటివి. పుక్కిట విడెముతో ఒక భామకు నీవాడనని చెప్పుచున్నది నేవింటిని. నిలువ చెమటలతో వేరొక భామను వలితివి, నేనెరుగుదును వనితల పొందే వలదని నీవనుటయు నేనెరుగుదును. ఇప్పుడు వచ్చి నన్ను చేపట్టితివి. ఇంత వడి నేను భ్రమసియున్నాను గాని నిజ మెరుగని దాననా !" అని చెప్పుచు తనకోపమును తెలియ జేయుచున్నది.

**వేళావళి — రూపకం**

నిజమరివి నీవని నేనుండుదును
గజరులు చెలి యదే కదిసీ నిన్నును ! ||పల్లవి||

పగటుల నడుపుల బకపక నగుచును
మగువ నీ యెదుటను మలసీని
తగులు గలుగబోలు ; తరుణుల నొల్లనని
పొగరుల నాతో బొంకుదువు ! ||నిజ||

పుక్కిటి విడెముతో బోరి గన్నులార్చుచు
చక్కని మగువ నిన్ను జరసీని
వొక్కటి నీతో గాబోలు ; వొగినీ వాడనేయంటా
చక్కగ నేడలేని బాసలు సేతువు ! ||నిజ||

నిలువు జెమటగార నీతో సరసమాడీని
కలికి నీకు నసలు గాబోలును
యెలమి శ్రీవేంకటేశ ఋట్టె నన్నుగూడితివి
యిలగొంతవడి భ్రమయించనేల నీవు ! ||నిజ||

శృం : 26—56

ప. స స ని ద ద పా || మ ప ప మ గ రి ||
నిజ - మరిది || సి - వ - - ని ||

రి గ రి స ని స గ రి గ మ ప || ప మ గ రి గ మ ప ద నీ ||
నే - - - - - నుం - - - డుదు || ను - - - - - - - - ||

స ని ద ని స రి స || రి గ మా రి గ రి స ||
గ - జ రు లు - - || చె - లి య దే - - ||

ద ని స రి స ని దా పా || ప మ గ రి గ మ ప ద నీ ||
క - ద - సీ - - ని || న్ను - - ను - - - - - || ||నిజ||

చ. రి గ మ పా ద ప ప మ || రి గ మ మా ప మ గ రి ||
ప గ టు ల - - - - - || న డ పు ల - - - - ||

స ని స స రి స రి గ || ప మ గ రి సా - ||
ప క ప క - - - - || న - గు ము ను - ||

ధ ని స రి గ రి రి స || రి గ మ రి మ గ రి ||
మ గు వ నీ - - - - || యె దు ట ను - - - ||

గ మ పా - మ పా || - - - - - - ||
మ ల సీ - - ని || - - - - - - ||

ద ని స రి గ రి రి స || రి గ మ మా ప మ గ రి ||

స ని̣ స గ రి గా || గ రి స ని̣ స ధ̣ నీ̣ సా ||
త రు ణు - - ల || నో - - - ల్లి - న నీ ||

ద ని స రి̇ స ని ద ప || మ ప ప ప మ గ రీ ||
పొ గ రు - ల - నా - || తో - - - - - - ||

రీ గ రి స ని̣ సా గ రి గా || గ రి స రి గ మ ప ద నీ ||
బొం - - - - కు దు - వు || - - - - - - - - - ||

||నిజ||

**అవతారిక :**

ఇందలి నాయిక స్వాధీనపతిక. ఈమె కల్లలాడ నేరదట. నాధునికి కూర్చెడి సతులనేకులు కలరు గనుక వారిచే సేవలు చేయించుకొన రాదా యనుచున్నది 'వాక్చతురుడవగునీతో మాటలు కలుపుటకు తగుదునా, నీవు నేరిచిన చేతలు తిరిగి నేర్చుటకు నావశమా' నిన్ను జంకించి నీకౌగిళుల యందు అమరెకుదాననా, నీకు వంకలు వెట్ట నేర్తునా నేను. పొంకముగా నన్ను కలసి ఆనందించితివి ఓ వేంకటేశ్వరుడా నేను నీయలమేలు మంగను సుమా" అని గోముగా స్వామికి చెప్పుకొనుచున్నది.

**రాగ లక్షణము :**

నట్టనారాయణి ప్రాచీనరాగము ఇప్పటి వాడుకప్రకారము 28వ మేళమగు హరి కాంభోజి జన్యము. ఐనను దీనికి వెంకటమఖి సంప్రదాయమునగల ఆరోహణావరోహణములు ఇతరగ్రంధకర్తలు చెప్పిన వాటికి వేరుగానుండి భిన్నప్రకృతులు గల రెండు రాగ స్వరూపములు కనబడుచున్నవి. వెంకటమఖి సంప్రదాయమున 'స రి గ స రి మ ద స । స ద ప మ గ రి స' అనియు, ఇతరుల సంప్రదాయమున 'స రి గ మ ద ని ద స ! స ని ద ప మ గ రి స' అనియు ఉండుటవలన ఇందు రెండవ సంప్రదాయమునే స్వీకరించి స్వరపరచడమైనది. మొదటి రాగస్వరూపము చాలావరకు సామ మొదలగు కొన్ని రాగముల ఛాయ లెక్కువగా నుండి యీ రాగము యొక్క ప్రత్యేకత స్పష్టముగా నేర్పడదను భావమున విడువ బడినది.

**నట్టనారాయణి — రూపకం**

ఏల సాకిరి గోరేవు యింతలో నన్ను
అలరి సతులకు నీ కమరుగాక ! ॥పల్లవి॥

నిగ్గులమాట లాడ నీతోనే నేరుతునా
సిగ్గువడి యుండేటి చెలి నేను
కగ్గి నీవలెనే నేను కల్లలాడ నేరుతునా
మొగ్గులేని యటువంటి ముద్దరాల నేను ! ॥ఏల॥

నీవు నేరని చేతలు నే నేరుపగలనా
వావితో లోనుండే రాణివాసమనేను
వోవరిలో నీ సుద్దులు వూకొన నే గలనా

జంకించి కౌగిట గూడే చలమరి దానా
వంకలాడ నేరిచిన వనిత నేను
అంకేల (శ్రీ) వేంకటేశ అలమేలు మంగనేను
పొంకమై కలసితివి పొందనేర్తు నేను ! ॥ఏల॥

శ్రు : 27—43

ప. గ మ ద ని పా ప మ ॥ గ మ రీ సా ॥
ఏ ల సా - - కి రి ॥ గో - రే వు ॥

స ని ధా సా రి గ మా ॥ రీ సా - - ॥
ఇం - త లో న - - ॥ - న్న - - ॥

2. గ మ ద స స ని ద ని ॥ ప మ గ మ రీ సా ॥
ఏ ల సా - కి - రి - ॥ గో - - - రే వు ॥

స ని ధా స రి గ మ దా ॥ స ని ని ధ ధ ప ప మ మ గ మా ॥
ఇం - త లో - - - - ॥ న - - - - - - - - న్న - - ॥

గ మ ద ని ప మ ॥ గ మ ద ని ద సా ॥
అ - ల రి స తు ॥ ల - కు - నీ - ॥

స ని ద ని పా ప మ గ మ ॥ రీ సా - - ॥
క - మ - రు గా - - - ॥ - క - - ॥ ॥ఏల॥

చ. ద ని ద పా ప ॥ ప మ గ మ రీ - - ॥
సి గ్గు ల మా ట ॥ లా - - - డ - - ॥

గ మ పా ప మ గ మ ॥ రీ రి స సా ॥
నీ - తో నే - - - ॥ నే రు తు నా ॥

స ని̣ ఢా ని̣ ధ̣ సా ॥ స రి గ మ దా ॥
సి - - గ్గు వ డి ॥ యుం - డే - టి ॥

స ని దా దా ద ని పా ॥ గ మ ద ని పా ప మ గ మ ॥
చె - లి నే - - ను ॥ క గ్గి నీ - - వ - లె - ॥

ద ని దా సా సా ॥ ద సఀ రిఀ గఀ మాఀ గఀ మ రీఀ ॥
నే - - నే ను ॥ క ల్ల లా - - డ - - ॥

సఀ రిఀ గఀ మ రిఀ రిఀ సాఀ ॥ ద సఀ సఀ రిఀ గఀ మ రీఀ ॥
నే - - - రు తు నా ॥ మొ గ్గు లే - - - ని ॥

సఀ సఀ సఀ ని ద ని పా ॥ సఀ ని ద ప ప మ గ మ రీ ॥
య టు వం - - - టి ॥ ము - ద్ద - రా - - - ల ॥

ప మ గ మ రీ స ని̣ ని̣ ధ̣ సా ॥
నే - - - - ను - - - - ॥ ॥పల॥

**అవతారిక :**

జీవులకు సుఖ దుఃఖములు రెండును ఒకదాని వెంటనొకటి వచ్చుచుండును. తమ అంతులేని దొంతరల పరిభ్రమణములు తెలియజేయుచునే యుండును. ఐనను జీవులు సుఖముల యందలి యాశలనే సతతములనుకొని దుఃఖములకు వ్యథ చెందుచుందురు. ఈ విషయమును స్పష్టముగా చెప్పుటకు అయ్యవారు ఇందుకొన్ని యుపమానములను చెప్పియున్నారు. లోక వ్యవహారము తెలిసినవారికి యీ ఉపమానములయందలి లోతులు అనుభవములే యగును, దేవు డొక్కడేయని నమ్ముటయందలి యానందమును, సుజ్ఞానమునందలి సౌఖ్యమును తెలిసికొని శ్రీ వేంకటేశ్వరుని కృపకు పాత్రులుకావలెనని కోరుటయే నిజములగు ఆనంద సౌఖ్యములనియు అయ్యవారు యీ కీర్తనమునందు చెప్పుచున్నారు.

**రాగ లక్షణము :**

నారాయణి ప్రాచీనరాగములలోనొకటి. కాని గ్రంథకర్తలు వేరువేరు విధములుగా లక్షణములను చెప్పియున్నారు. ఐనను సుమారు వంద సంవత్సరములనుండి యీ రాగము 28 వ మేళమగు హరికాంభోజి జన్యముగను

స రి మ ప ద స

స ని ద ప మ రి స అను ఆరోహణావరోహణములతోను గానము చేయబడుచున్నది. కనుక యిందే స్వరపరచడమైనది. నారణి అనుపేరుగల ఇంకొక రాగము తాళ్ళపాకవారి రచనలయందు కనబడుచున్నది. అదిబహుశ 29 వ మేళమగు శంకరాభరణ జన్యమై యుండ వచ్చును.

**నారాయణి — ఝంపె**

ఏణి నయనల చూపులెంతసొబగై యుండు
ప్రాణ సంకటములగు పనులు నట్లుండు ! ॥పల్లవి॥

ఎడలేని సంతాప మేరీతి దానుండు
అడియాస కోరికెలు నటువలెనె యుండు
కడలేని దుఃఖ సంగతి యెట్లుదానుండు
అడరు సంసారంబు నట్లనేవుండు ! ॥ఏణి॥

చింతాపరంపరల చిత్తమది యెట్లుండు
వంత దొలగని మోహావశము నట్లుండు
మంతనపు బనులపై మనసు మరి యెట్లుండు
కంతుశర మార్గముల గతియెట్లుండు ! ॥ఏణి॥

దేవుడొక్కడె యనెడి తెలివిదన కెట్లుండు
శ్రీవేంకటేశు కృపచేతలట్లుండు
భావగోచరమైన పరిణతది యెట్లుండు
కైవల్య సంగతులు నట్లుండు ! ॥ఏణి॥

అ : 2–౮౮

ప. మ రి మ ప ద | ని ద పా మ || రి మ ప మ రి స | స ని ధా సా స ||
ఏ - ణి న య | న ల చూ పు || లెం - త - సొ బ | గై - - యుం డు ||

రి మ ప ద స | రి మ రి స స || రి స ని ద ప మ | రీ రి సా ||
ప్రా - ణ సం - | క ట ము ల గు || వ - ను లు ని - | ట్లుం - డు || ||ఏణి||

చ. రి మ పా మ | ప ద ని ద ప || మ మ రి రి మ | రి రి సా స ||
ఎ డ తే ని | ప రి తా - ప || మే - రీ - తి | తా - నుం డు ||

స ని ద సా స | స రి రి స రి || రి మ ప ప ద | ని ద పా - ||
అ - డి యా స | కో - రి కె లు || న టు వ లె నె | యుం - డు - ||

స ని దా సా స | స రి రి రీ || రి మ రీ స | స ని దా సా స ||
క - డు లే ని | దుః - ఖ సం || గ తి యె ట్లు | తా - - నుం డు ||

ప ద స ని ద | ప ద పా మ || రి మ రి స | స ని ధా సా స ||
అ డ రు సం - | సా - రం బు || న ట్ల నే - | వుం - - డు - || ||ఏణి||

**అవతారిక :**

ఈ పదము నందలి నాయిక సామాన్య. ఈమె చేష్టలను నాయకుడగు శ్రీవేంకటేశ్వరునికి చెలి చెప్పుచున్నది. "నిక్కి నిక్కి చూచుచు నవ్వులు నీపై మా చెలి విసరు చున్నది. చెక్కుల యందు మెరుపులు లక్కరసము వలె నీపై జల్లు చున్నది నీలో ఆనందమును పెంపొందించు మాటలు పదే పదే చెప్పుచున్నది నిన్ను తన కౌగిలియందు బిగించుకొని వయస్సు నందలి సొగసులు చిందించుచున్నది. ఓ శ్రీవేంకటేశ్వరుడా నీతో గూడి చలములు కూరుములు చల్లుచున్నది. ఈమె చేయు చేతలు చూపెడి చూపులు వలపులు నీవు తుడుచుకొన్నను పోవుసుమా' అని హెచ్చరించు చున్నది.

**నారాయణి – త్రిపుట**

తుడుచుకొంటే బోదు తొడరి నీవె(వెం)త్తైనా
వడిఁ బుంచీ మొక్కులనె వలపు నీ మీద ! ॥పల్లవి॥

నిక్కిచూచి చెలి నీపై నిండా నవ్వులు నవ్వి
చిక్కని వెన్నెల తేట చిందీనదె
చెక్కులను కొనగోళ్ళ జెనకి కాంతులమించ
లక్కరసనులు చల్లీ లావుగా నీమీద ! ॥తుడుచు॥

వొరసి వొరసి నీతో వూరగల మాట లాడి
సిరుల గమ్మదేనెలు చిందీనదె
సరిగా సేవలు సేసి చన్నుల మెఱుగులను
సరుగ బంగారుపొడి చల్లీ నీమీద ! ॥తుడుచు॥

బలిమి గాగిట బట్టి భావములనే కరగి
చెలగి వయోమదము చిందీనదె
యెలమి శ్రీవేంకటేశ ఇంతి నిన్నిటా గూడి
ఛలముల గూరిములు చల్లీ నీమీద ! ॥తుడుచు॥

ప.　- - ప ద సా స ని దా || ద ప ద ప ప మ రి సా ||
- - తు డు చు కొం - - || జే - - - పో - - దు ||

- - ఫ ధ సా స ని ధా || ఫ ధ ఫ ధా సా రి మ ||
- - తొ డ రి నీ - - || వెం - - తై నా - - ||

పా ని ద పా పా || ప ద ప మ రీ స ని ధా సా ||
- వ డి యిం చే || ము - క్క - - ల - - నె ||

సా రి మ ప ద సా రీ స స ని దా || ప ద ని ద ప మ రి స రి మ రి మ || పా
- వ ల పు - - - - నీ - - || మీ - - - - - - - ద - - - || -
||తుడుచు||

2　- - ప ద స రి మ రి స ని ద స || రి స ని ద పా ని ద ద ప ప మ రీ ||
- - తు డు చు - - - కొం - - - || జే - - - - పో - - - - - - ||

సా
డు - - - - - - - -

3.　,,　,,　,,　,,

- - ప ద స రి మా ప మ రి స || రి మ ప ద స ద రి స ని ద పా ||
- - తొ డ రి - - నీ - - - || వెం - - - - - తై - - - నా || - - - -

చ.　- - మ ప ద ని ద మ ప ద ప || ని ద ద ప ప మ రీ సా ||
- - ని క్కి - - - చూ - - - || చి - చె - లి - నీ పై ||

- - ద స మ రి మా రి స || స రి స ని ధా ధ ఫ దా సా ||
- - నిం - డా - - న - || వ్వు - - లు - న - - వ్వి ||

- - ఫ ధ సా రి గ రి మ ప మ రి స || రి మ పా ద ని ద ని ద ప మ రి మా ||
- - చి - క్క - - - - - - ని - || వె - న్నె - - - - ల - - - తే ||

పా ప ద సా సా రి స ని ద ప ద || పా రి మ ప ద సా ||
ట చిం - దీ - - - న - - - || దే చె - క్కు ల ను ||

సా రి . ని ద ప ద సా సా ||
కో - - న - - - గో ళ్ల ||

- - ప ద సా రి మ రి మ ప మ రి స || స మ రి రి సా రి స ని ద సా సా ||
- - బె న కి - - - - - - కాం - || తు - - ల - మిం - - - - చు ||

- - ద స రి మా రి స ||
- - ల క్క - - ర స ||

దా రి స ని ద ద మ పా || - - రి మ ప ద సా రి స ని ద పా ||
ము - - లు - చ - ల్లి || - - లా - వు - - - - గా - - ||

ని ద ద ప మ రి రి స ని ద స రి మా ||
ని - - - - - మీ - - - ద - - ||

||తుడుచు||

**అవతారిక :**

ఈ పదమునందలి నాయిక జాణ, ప్రౌఢ, ధీర. ఈమెను గురించి నాయకుడగు శ్రీవేంకటేశ్వరునితో చెలియనుచున్నది. "ఏమయ్యా నీవే జాణతనములు తెలిసిన ఘనుడవని అనుకొనుచు మాచెలి కడ నీయెమ్మెలు చూపుచున్నావు. నీకు అన్నిటియందును అప్పణముగా ఆమె వుండవలెనను కొనుచున్నావా ? నిన్ను చూచి తలవంచు కొన్నది. అది చాలదా? నిన్ను దాచుకొని తిరుగవలెనా ? పెదవులెండి పోవునట్లు నిన్ను తిట్టగలదు. కాని మాటాడ కూరకున్నది. మాకప్పురగంధి నిను గసరనైనలేదు. నీ యెమ్మెలకును ఆమె ఊరకున్నది. నీపై కోపమును పెంచుకొనలేదు ప్రీతితో శ్రీవేంకటేశ్వరా మాతరుణి నిన్నుకూడినది, ఈమె మ్రొక్కులు గైకొనవయ్యా. ఈమె ప్రేమను వినయమును చులకన చేయకుము నిన్ను నిముషములో క్రిందు చేయగలిగిన ధీమంతురాలు మాచెలి" అని ఝంకించుచున్నది.

**నారాయణి – రూపకం**

ఎంతైనా నెఱగవు యెమ్మెలు చూపేవు నీవు
అంతటా నీకె యాకె అప్పణియ్యవలెనా ! ॥పల్లవి॥

తప్పక చూచీ నీతో తలవంచే చాలదా
వుప్పటించి నిన్ను వేరె వొరయగవలెనా
పిప్పిగట్ట బెదవుల చేర తిట్టవలెనా
కప్పురపు గంది నిన్ను గసరగ వలెనా ! ॥ఎంతై॥

వూరకుండే జాలదా వువిద నీతో నిప్పుడు
గోరపెట్టి సారె సారె గోపగించవలెనా
నీరాక దెలిసియు నిద్దరించె జాలదా
బీరమాడి నిన్ను రతి బెండు సేయవలెనా ! ॥ఎంతై॥

చేతమొక్కె జాలదా చేకొని నిన్నిక వేరే
రాతిరి బగలు గడురాపు సేయవలెనా
నీతితో శ్రీవేంకటేశ నిన్ను గూడె జాలదా
యీతరుణి నేడే నీయింటికి రావలెనా ! ॥ఎంతై॥

5 స రి మా రి రి సా || ధ స రి స ని ధ సా ||
ఎం - - - తై నా || నె - అ - గ వు యె ||

రి మ పా ప ద ని ద సా || స ని ద ప మా ప మ రి స ||
మ్మె - లు చూ - - - - || పే - - - వు నీ - వు - ||

రి మ పా ధా | సా స ని దా సా ||
అం త ట నీ | కేయా - - కె ||

ప ద ని ద రి స ని ద ప ప || మ ప ద స ని ద ప మ రి మ రి స ||
అ - - - ప్ప - ణి - య్యా - || వ - లె - - - నా - - - - - || ||ఎంతైనా||

౫. - రి రి రి రీ || స రి మా రి రి సా || స ని ధా ధ ఫ దా ||
- త ప్ప క చుం || చీ - - నీ - తో || త - ల వం - పే ||

స రి మ రి మా రీ ||
చా - - - ల దా ||

- రి మ పా ద || ప ద ని ద సా ని ద ప ద ప ||
- వు ప్ప ణిం చి || ని - - - న్ను వే - - - రె ||

రి మ ప ద ని ద ప మ రి రి || సా - - - ||
వొ - ర - య - - గ వ లె || నా - - - ||

- రి మ పా ద ప ద || స స రి స ని ద సా ||
- పి - ప్పి గ - ట్ట || పె ద వు - - - ల ||

స రి మ రి ప మ రి రి స || రి స ని ధ పా - - ||
జే - - - ర - తి - ట్ట || వ - లె - నా - - ||

- ప ద సఁ రిఁ మఁ రీఁ || సా రిఁ సఁ ని ద పా ||
- క ప్పు ర గం - - || ది ని - - - న్న ||

ప ద సఁ రిఁ మఁ రిఁ సా ని ద ప మ || రి మ ప ద ని ద ప మ రి స ||
గ - స - ర - గ వ - లె - || నా - - - - - - - - - - || ||ఎంతైనా||

**అవతారిక :**

ఈ పదము నందలి నాయిక ప్రేమగర్వితా, ప్రౌఢ, లావణ్యవతియగు నీమె తన నాయకుని యందు కోపగించి ఆతనిని దూరము చేసుకొని విరహార్తయై చెలులపై ఆగ్రహము నొలకబోయుచు స్వామికడకు వారిని పంపినదట వారు "తన తగవులన్నియు నీయందే చెప్పు కొనుచున్నది గనుక మా నాయిక చెలులతో ముచ్చటలాడుట మానినది. ఇందుకు కారణమును తెలిసికొన లేక మేము వగచెందుచుంటిమి. నీవచ్చటికి వచ్చినచో నీ యగడుతీరును. తన ప్రాయమును నీకు పంచియిచ్చిన అభిమానవతి గావున తన గుట్టు బయలు పెట్టక మాపై కసరు కొనుచున్నదయ్యా ! ఈ విషయమును యింతవరకు చూచాయగానైన తెలియక మే మట మటించుచున్నాము నీవు వచ్చినచో చిక్కులెల్ల బోవును. రావయ్యా ! నీకు ఇందు క్రొత్తవారెవ్వరును లేరు. నీవువచ్చి మాచెలిని యేలుకొని, తప్పునీదే గనుక ఆమెకు కప్పురపువిడెమిచ్చి కౌగిట నాదరించుమయ్యా !" అని శ్రీవేంకటేశ్వరునితో విన్నవించు కొనుచున్నారు.

**నారాయణి — రూపకం**

ఎరవుల వారెవ్వరు యిందులో నీకు
విరివికాడవు నీవు విచ్చేయవయ్యా ! ॥పల్లవి॥

తగవెల్ల నీయందె తగిలించినదిగాన
మగువలతో జెలి మాటాడదు
వగయెఱగ కిందాకా వలల బడుండితిమి
అగడు నీవల్లదీరు నాడకు రావయ్యా ! ॥ఎరవు॥

పాయమెల్లా నీకే పాలు పెట్టినది గాన
వేయైన తన గుట్టు వెళ్ళవేయదు
చాయ దెలియ కిందాకా సరితలు చూచితిమి
నీ యందే చిక్కులు వాసీ నిక్కిమాడవయ్యా ! ॥ఎరవు॥

వొరసి కాగిలినీకే వొప్పగించినదిగాన
సొరిది నెవ్వరి బుద్ధి చొరనియ్యదు
యిరవై శ్రీవేంకటేశ యీపెనిట్టె కూడితివి
వెరపు నీ వల్ల నుంది విడె మియ్యవయ్యా ! ॥ఎరవు॥

శ్లో : 26—565

ప - ప ని ద పా మా || ప మ రీం సా - ||
1. - ఎ ర వు ల వా || రె - - వ్వ రు - ||

రి స ని ధ ఫ ధ సా - || రీ - మా - ||
యిం - - - దు - లో - || నీ - క - ||

2. - ప దా స రి స ని ద ప ని || ద ప మ రి రి సా - ||
- ఎ ర వు ల - వా - - - || రె - - - వ్వ రు - ||

రి స ని ధ ఫ ధ స రి మ రి మా || ప ద ని ద రి స ని ద ప మ రి మ ||
యిం - - - దు - లో - - - - || నీ - - - - - కు - - - - - ||

1. - ప దా స రీ రి || స రి మ రి మ రి మా రి స ||
- వి రి వి కా డ || వు - - - నీ వు - - - ||

- ప ద సా రి స ని ద ప ప || ని ద ద ప ప మ మ రి రి స రి మ || ప
- వి - చ్చే - - - - - య || వ - - - - - - - - య్యా - - - || -

2. - ప దా స రీ రి || ని స రి మ ప మ రీ స ||
- వి రి వి కా డ || వు - - - నీ - - వు ||

మ రి స ని ద రి స ని ద ప || ని ద ద ప ప మ మ రి రి స రి మ || ప
వి - - - - చ్చే - - - య || వ - - - - - - - - య్యా - - - || -

చ. - రి మ పా దా || ప ద ని ద సా ని ద ప మ || -
- త గ వె ల్ల || నీ - - - - యం - - దె ||

- రి మ ప ద ని ద ప మ || రి మ ప మ రీ సా ||

- రి మ రి స స స - || రి స ని ధ ధ ఫ ధా స స ||
- మ గు వ ల తో - - || - - - - - - - చె లి ||

- రి మా ప ద ని ని || పా - - - - ||
- మా - టా - - డ || దు - - - - ||

- ని దా ప దా సఁ సఁ || సఁ రిఁ మఁ రిఁ రిఁ మఁ రీఁ ||
- వ గ యె ఆ గ కిం || - - - - దా - క ||

- స రిఁ మఁ రిఁ మఁ రిఁ సఁ || రిఁ సఁ ని ధ ప ద సా ||
- వ ల ల - - - బ || డుం - - - డి తి మి ||

- ప దా స రీఁ రిఁ || ని స రిఁ మ పఁ మఁ రీఁ స ||
- అ గ డు నీ - || వ - - - ల్లి - దీ రు ||

మఁ రిఁ సఁ ని ద రిఁ సఁ ని ద ప || ని ద ద ప ప మ మ రి ని స రి మ ||
నా - - - డ కు - - - కు || వ - - - య్యా - - - - - - - - || ||ఎరవు||

**అవతారిక :**

ఈ కీర్తనమునందు అన్నమయ్యవారు వైష్ణవ సంప్రదాయములందు గల తనభక్తిని చెప్పుచు వైష్ణవులై సత్యము, ధర్మము, శరణాగతి పాటించుచు భగవంతుడగు శ్రీవేంకటేశ్వరుని ఆరాధించి స్వామి అనుగ్రహమును పొందిన భక్తాగ్రేసరులను నుతించి, కొలిచి వారిదయకు పాత్రులై తద్వారా స్వామి కృపను సంపాదించుకొని తరించుడని చెప్పుచు తమ కాలమునందలి వైష్ణవ భక్తులెట్లుండిరో అను విషయమును చాటి చెప్పుచున్నారు

**రాగ లక్షణము :**

మాళవి ప్రసిద్ధములగు ప్రాచీన రక్తిరాగములలో నొకటి. ఇది యిప్పటి వాడుక ప్రకారము 28వ మేళమగు హరికాంభోజి జన్యము ఇందు త్యాగరాజస్వామివారి రచనయొక్కటి తప్ప ప్రాచీనుల రచనలు కానవచ్చుటలేదు. శృంగార పదములు అసలున్నట్లు తెలియవచ్చుట లేదు.

ఆరోహణ : స రి గ మ ప ద ని స
అవరోహణ : స ని ద ని ప మ గ మ రి స

మాళవి — ఆది

నిత్యులు ముక్తులు నిర్మల చిత్తులు నిగమాంతవిదులు వైష్ణవులు
సత్యము వీరల శరణని బ్రదుకరో సాటికి బెనగక జడులాల ! ॥పల్లవి॥

సకలోపాయ శూన్యులు సమ్యజ్ జ్ఞాన పూర్ణులు
అకలంకులు శంఖచక్రలాంఛనులన్నిట బూజ్యులు వైష్ణవులు
వొకటి గోరరు వొరుల గొలువరు వొల్లరు బ్రహ్మాది పట్టములు
అకటా వీరలసరి యన బాపం బాలుమతంబుల పుంతకోకలగ ! ॥నిత్యు॥

మంత్రాంతర సాధనాంతరంబులు మానిన పుణ్యులు విరక్తులు
యంత్రపుమాయల బొరలు పరులకు యెంతైనా మొక్కరు వైష్ణవులు
తంత్రపు కామక్రోధ విదూరులు తమనిజ ధర్మము వదలరు
జంత్రపు సంసారులతో వీరల సరియని యెంచగ బాపమయ్యా ! ॥నిత్యు॥

తప్పరు తమపట్టినవ్రతమెప్పుడు దైవమొక్కడే గతియనుచు
వొప్పగు తమ పాతివ్రత్యంబున నుందురు సుఖమున వైష్ణవులు
కప్పిన శ్రీవేంకటపతిదాసులు కర్మవిదూరులు సాత్వికులు
చెప్పకు డితరుల సరిగా వీరికి సేవించగనే ధన్యుడనైతి ! ॥నిత్యు॥

అ : 5–289

ప. - మ దా ని సా సా స స | స ని ద ని ప ప | ప మ గ మ రి రి ||
- ని - త్యు లు ము క్తు లు | ని - - - ర్మ ల | చి - - - త్తు లు ||

- రి గా మ పా ప మ గ మ రి రి | సా స ని ధ ని | సా - - ||
- ని గ మాం - త - వి - దు లు | వై ష్ణ - వు - | లు - - ||

- రి గా మ పా ప మ దా ద ని సా | స రి గా గ మ రి | స ని ద ని ప ప ||
- స - త్య ము వీ - - ర - ల | శ - ర ణ - ని | బ్ర - దు - క రో ||

- సాం - స రి స ని ద ని ప ప | ప మ గ మ రి | స రి గ మ పా ||
- సా - టి కి జె - న - గ క | జ - డు - లా | ల - - - - || ॥నిత్యులు॥

చ. - రి - రి రి రి రి రి గ | మ ప రి గ | మ ప ప ప ||
- త - ప్ప రు త మ ప - | ట్టి న వ్ర త | మె - ప్పు డు ||

- మ ద ద ని సా సా - రి | స ని ద ని ప ప | ప మ గ మ రి స ||
- దై - వ - మొ క్క - - | డే - - - గ తి | య - ను - చు - ||

- రి గా మ పా ప ప ప రి | రి గ మ ప | ప మ దా రి స ||
- వొ - ప్ప గు త మ పా - | తి - వ్ర - | త్యం - - బు న ||

స రి గా గ మ రి స స స రి | స ని ద ని ప ప | ప మ గ మ రి స ||
నుం - - దు - రు సు ఖ ము న | వై - - - ష్ణ వు | లు - - - - - ||

- రి రీ రి రీ రీ రి గ | మ ప రి గ | మ ప ప ప ||
- క - ప్పి న శ్రీ వేం - | క ట ప తి | దా - సు లు ||

- మ ద ద ని సా సా స ని | స ని ద ని ప ప | ప మ గ మ రి స ||
- క ర్మ వి - దూ రు లు - | సా - - - త్వి కు | లు - - - - - ||

- రి గ మ ప ప ప రి | రి గ మ ప | ప మ దా ని స ||
- చె ప్పు కు డి త రు ల | స రి గా - | వీ - - రి కి ||

స రి గా గ మ రి స స సా - రి | స ని ద ని ప ప | ప మ గ మ రి స ||
సే - - విం - - చ గ నే - - | ధ - - - న్యు డ | నై - - - తి - ||

॥నిత్యులు॥

**అవతారిక :**

"హరిని యితర దేవతలతో పోల్చుకొనుట వెట్టి. అనగా తెలివిలేనిపని. దేవతలు, మానవులు మొదలగు వారందరును ఈ పురుషోత్తముని యందే లయమగు చున్నారు. హరి వరముననే అందరును బ్రతుకుచున్నారు. ఇతరుల వలన వరములు పొందిన యసురులు చెడుచున్నారు. సమస్త జీవులయందును అంతరాత్మయైన పరమాత్ముడగు శ్రీవేంకటేశ్వరుడు వెలుగుచున్నాడు. ఈ స్వామికి దాసులై కొలిచెడి వారికి వేవేల సిరుల నీతడే యిచ్చును గదా!" అని అయ్యవారు సర్వం బ్రహ్మమయం అను ఋషుల వాక్కుల యందలి పరమ సత్యమును పాడుకొన్నారు,

**మాళవి – ఆది**

తెలుపగ రాదిది దేవుని మాయలు
ఫలమెఱుగరు యీ పట్టిన వెట్టి! ॥పల్లవి॥

పుట్టిరి దివిజులు పురుషోత్తమునం
దట్టే యణగిరి యతనందు
యిట్టె యీతని యిందరితో సరి
వెట్టి కొలుచుటే పెను వెట్టి! ॥తెలుప॥

హరివరముననే యందరు బదికిరి
పరుల వరములు గని బడలిరి యసురులు
యిరవెటి గీతని నిందరి లోపల
సరిగా మొక్కుట సహజపు వెట్టి! ॥తెలుప॥

జీవాంతరాత్ముడు శ్రీ వేంకటేశుడు
యేవల శ్రీ లక్ష్మి యీతని దేవులు
వేవేలు సిరులు వీరే యొసగిరని
భావించు వారికి బట్టదు వెట్టి! ॥తెలుప॥

ప. - ద నీ స సా స ని ద ని ప ప | పా ప మ గ మ | రి రి స స ||
1. - తె లు ప గ రా - - - ది ది | దే వు - ని - | మా - య లు ||

- ధ స్నీ స రి రి రి రీ | ధ ని సా రి రి | రి గ మా పా ||
- ఫ ల మె అ గ రు యీా | ప - - ట్టి న | వె - - జ్జీ ||

2. - ద నీ స రీ గ మ రీ స స | స ని ద ని ప ప | ప మ గ మ రి స ||
- తె లు ప గ రా - - ది ది | దే - - - వు ని | మా - - - య లు || - - - -

చ - రి రి రి గ మ ప ప | మ ద పా ప మ గ మ | రి రి సా ||
- పు ట్టి న ది వి జు లు | పు - రు షో - - - | త్త ము నం ||

- స సా స ని ధ ని ఫ ఫ | మ ధ ధ ని | సా - - ||
- ద ట్టే య - ణ - గి రి | య త నం - | దు - - ||

- మ దా ద ని సా స ని ద ని | ప మ ద ని | సా స స ||
- యి ట్టె యీా - - త - ని - | యిం - ద రి | తో స రి ||

ద ని సా స రి గా గ మ రీ సా | స ని ద ని పా | ప మ గ మ రి స ||
వె - - ట్టి - కొ లు - చు చే | వె - ను - వె | - - - - జ్జీ - ||

- ద నీ స సా స ని ధ ని ప ప |
- తె లు ప గ రా - - - ది ది |

**అవతారిక :**

శ్రీ అలమేలు మంగతో కల్యాణ సామ్రాజ్యము నేలుచున్న శ్రీ వేంకటేశ్వరుడు భూ మండలము నందలి అన్ని రాజ్యములను జయించెనని ఆమె సౌందర్యమును వర్ణించుచు కుంతలము, కుంభకోణము, మధ్యదేశము, కాశ్మీర మండలము, గోలకొండ మొదలగునవన్నియు అమ్మవారి అంగముల యందే వర్ణించుకొన్న పదమిది.

**రాగ లక్షణము :**

కేదార గౌళ ప్రాచీన ప్రసిద్ధ రాగములలో నొకటి. ఇది యిప్పటి వాడుక ప్రకారము 28వ మేళమగు హరికాంభోజి జన్యము

ఆరోహణ : స రి మ ప ద ని స

అవరోహణము : స ని ద ప మ గ రి స.

కొందరు లక్షణ కారులు హరి కేదార గౌళ యను పేరుతో దీనిని 28వ మేళముగా చెప్పుకొనియున్నారు. కాని మేళకర్తలు సంపూర్ణ సంపూర్ణములుగా నుండవలెనను భావముతో కాబోలు తరువాతి లక్షణకర్తలు హరి కాంభోజిని 28వ మేళముగా జెప్పియున్నారు. కేదార గౌళను దాని జన్యముగా చేర్చినారు. నిజమునకు మేళకర్తల ఆవిర్భావమునకు పూర్వమే కేదార గౌళ మంచి ప్రచారములో నున్నదని వివిధ వాగ్గేయకారుల రచనల వలన తెలియు చున్నది.

కేదారగౌళ – ఝంపె

ఎటువంటి రాజీకమే చెలియ నేడు
కట కటా యెంతైన కంటిరా మీరు ! ॥పల్లవి॥

గోరంట సీమ పెనుకూటంబు మూకచే
భారంబు దుగముల పట్టుపడెను
సారె సారెకు మధ్య దేశంబు బయలాయె
చేరి మయూరాపురము చూరలటు బోయెఁ ! ॥ఎటు॥

కదసి యట్టిట్టాయె కాశ్మీర మండలము
నెరిచిక్కు బడెను కుంతలా రాజ్యము
వరుస చీకాకాయె నెరి కుంభ కోణము
రుతువు గాయల గోల కొండ లోనాయెను ! ॥ఎటు॥

వింత పూర్వుల పూర్వులిడ దండు విడచిన
కొండ తామర కొలన కొలుపాయె
నంత శ్రీ వేంకటేశు డలమేలు మంగ జేరి
సంతతము కళ్యాణ సామ్రాజ్యమేలెన్ ! ॥ఎటు॥

ప. - ప స స స ని ద ని । పా ద ప మ గ గ రి సా ॥
- ఎ టు వం - - - టి । రా - - జీ - - - క ॥

రీ మ రి మ ప ప । పా రి స నీ సా - ॥
మే - - చె లి య । నే - - - డు - ॥

- ప ని స రీ । రి గ మ గ గా మ రి రి ॥
- క ట క టా । యెం - - - దై - - న ॥

- స రీ గ రి ని సా రి స । గ రి రి స ని ద ద ప మా ॥
- కం టి - - రా - - - । మీ - - - రు - - - - ॥ ॥ఎటు॥

చ. - రి మ మా । ప స ని ద ద ని ప ప ॥
- విం త పూ । ర్వు - ల - పూ - - ర్వు ॥

మ ప ని ద ద ప మ గ । గ రి రి మ రీ సా ॥
లి డ దం - - - డు - । వి - డ - చి న ॥

- ప ని సా రీ । రి మ గ గ రి స స ॥ రీ మ ప ప మ । పా - - - ॥
- కొం - డ తా । మ ర - కొ - ల న ॥ కొ లు పా - - । యె - - - ॥

- రి మ గ స | రి మ పా ప మ || ప ప ని సా స ని | రి స ని ద ద ని ప ప ||
- నం త (శ్రీ) - | వెం క టే శు - || డ ల - మే లు - | మం - గ - జే - రి - ||

- ప ని స రిం రిం | రిం గం మ గ గం మ రిం రిం ||
- సం - త త ము | క - - - ల్యా - - ణ ||

స రిం గం రిం ని సా రిం స గం రిం || రిం స ని ద ద ప మా ||
సా - - - ప్రా - - - జ్య - || మే - - - లె - ను || ||ఎటు||

**అవతారిక :**

ఈ పదమునందలి నాయిక స్వాధీనపతిక. నాయకుని కడకు చని తిరిగివచ్చిన దూతికలు "అమ్మా నీమొగము పున్నమి చంద్రునివంటిది. ఆచందురుని వెన్నెలలు నీముఖ చంద్రుని వెన్నెలలముందు తీసికట్టు. పచ్చి తేనె కులుకుల వంటివి నీ పలుకులు. నీ పొందులు శ్రీవేంకటేశ్వరునకు చెప్పరాని విందులు. అతడు నిన్ను రమెక్కించుకొని రాతిరులు నీకు మ్రొక్కి నిన్ను ప్రసన్నురాలినిగా చేసుకొన్నవాడుగదా ! ఇంకను అక్కడి సుద్దులు మమ్మేమి అడిగేవు, ఆతనికి నీవే మేలుదానవు" అని అమ్మవారగు అలమేలుమంగ దేవికి చెప్పుచున్నట్లు అయ్యవారు పాడుకొన్నారు.

కేదారగౌళ — రూపకం

అందుమీద మేలుదాన వాతనికి నీవు దొల్లె
కందువె చూతువుగాక గరిసించ నేటికే ! ॥పల్లవి॥

చిక్కని వెన్నెలతేట చెలియ నీమొగమోట
అక్కజపు పతి నింకే మనగలవే
నిక్కియాతడన్ని జేసె నీపై వలపు వేసె
మక్కువనాడ సుద్దులు మమ్మేమడిగేవే ! ॥అందు॥

పచ్చితేనె కులుకులు పడతి నీ పలుకులు
యిచ్చట నాతని నింకా నే మనేవే
రచ్చలకు నాడె యెక్కె రాతిరి నీకు మొక్కె
ముచ్చట కిందేమి మా మోములు చూచేవే ! ॥అందు॥

చెప్పరాని విందులు సేసెటి నీ పొందులు
యిప్పుడు శ్రీవేంకటేశు నేమి సేసేవే
తప్పకితడె కలసె తమకములు వలసె
వొప్పుగా మమ్ము మెచ్చితి వోరయ నేమిటికే! ॥అందు॥

ప. పా ని ద ద ప మ గ గా మ రి ॥ రీ మ గ గ రి స ని సా ॥
అ ం దు - మీ - - - ద - ॥ మే లు - దా - - - న ॥

స ని రి స స స ని ధ ధ ని ఫా ॥ ఫ ని సా రి గా రి కీ ॥
నా - త - ని - - - కి - - ॥ నీ - వు దో - - ల్లె ॥

రి మ పా నీ సా ॥ స ని రి స స స ని ద ద ని పా ॥
కం - దు వె జూ ॥ తు - వు - గా - - - క - - ॥

రి మ పా ని ద ద ప ద ప మ గ ॥ రి మ రీ సా - - ॥
గ - రి సిం - - - చ - - - ॥ నే - టి కే - - ॥ ॥అందు॥

చ. రి రి రీ రీ ॥ రి ప మ గ రి మ గ రి సా ॥
చిక్కని వె ॥ న్నె - ల - తే - - - ట ॥

ప ని సా రీ మ గ గ రి సా ॥ రి స ని ధ ఫ ని సా ॥
చె లి య నీ - - మొ - గ ॥ మో - - - - - - ట ॥

రి మ మ గ గ స రీ ॥ రి మ పా ని ద ద ప ప మ ॥
అ క్క జ - - - పు ॥ వ తి నిం - - - - - - - ॥

ప ని సా స స ని ద ద ని పా ॥ పా - - - - ॥
కే - - మ - న - గ - ల ॥ వే - - - - ॥

ప ని సా రీ ॥ రీ మ గ గ రి స ని సా ॥ స రి మ గ గ రి సా ని ని ॥
నిక్కి యా త ॥ డ స్నీ - చే - - - సె ॥ నీ - - - పై - - వ ల ॥

రి స ని ద దా ని ప పా ॥ ప ని సా రీ - గ సా ॥ సా - ని రి స ని ద ద ని పా ॥
పు - - - వే - - సె ॥ మ - క్కు వ - - నా ॥ ద - - సు - - - ద్దు - లు ॥

ప మ పా సా రి స ని ద ద ని పా ॥ ని ద ద ప మ గ రి మ రీ స ॥
మ - - మ్మే - - - - మ - - ॥ డి - - - - - గే - - వే ॥ ॥అందు॥

**అవతారిక :**

ప్రకృత పదమునందలి నాయిక విరహోత్కంఠిత నాధుని రాకకై తాను ఎట్లు వేచి యున్నదియో ఎన్ని ఆరాటములను పొందినదియో చెలులకు "లోకములోని వారి కాపురముల వంటిది కాదు నా కాపురము. ప్రాయము పైపైని చిగురించుచున్నది. కాయము కాకలు బాయ కున్నది కనుచూపులు ఎదురు చూచుచున్నవి చెక్కిళుల యందలి చింతలు చేతులలోనే యున్నవి. విరహము నాకు కోపమును తెప్పించినను పెదవులు నన్ను నవ్వించుచునే యున్నవి. ఇట్లున్న నన్ను శ్రీవేంకటేశ్వరుడగు నాధుడు కలియగా నా మోము కళలు విరిసినవి లే" అని అమ్మవారగు అలిమేలు మంగ చెప్పుకొనుచున్నది.

**రాగ లక్షణము :**

కాంభోజి అతిప్రాచీనమైన రక్తిరాగములలో నొకటి. ఇది భాషాంగము. 'స ని ప ద సా' అను సందర్భమున పలుకు కాకలి నిషాదస్వరమే యిందలి భాషాంగ స్వరము. ఈ రాగము యిప్పటి 28 వ మేళమగు హరికాంభోజి జన్యము నిజమునకు హరికాంభోజి కన్న ఎంతో ప్రాచీనమైనది కాంభోజి వెంకటమఖి సంప్రదాయమున చెప్పిన కాంభోజియు క్షేత్రజ్ఞుని పదములయందలి కాంభోజియు ఒకే విధముగనున్నవి. తెనుగున గలకొన్ని కావ్యములలో యీ రాగప్రశస్తి కలదు.

16 వ శతాబ్దపు, సంగీత సాహిత్య భరత శాస్త్రకోవిదుడును మహాకవియు శ్రీకృష్ణ దేవరాయలవారి అష్టదిగ్గజములలో నొకడును నగు రామరాజ భూషణుడు తన వసు చరిత్రయను మహాప్రబంధమునందలి ఒక పద్యమున—

ఆ జాబిల్లి వెలుగు వెల్లికల డాయన్ లేక రాకానిశా
రాజశ్రీ నఖమైన మోమున పటాగ్రంబెత్తి యెగ్గెత్తియా
రాజీవానన యేచ్చె, కిన్నెర వధూ రాజత్ కరాంభోజ కాం
భోజీ మేళ విపంచి కా రవ సుధాపూరంబు తోరంబుగన్

అని కాంభోజి రాగమును, కరుణ, విరహ భావములను వ్యక్తము చేయుటకు చక్కగా ఉపయోగించునని తన యభిప్రాయమును చెప్పియున్నాడు.

**కాంభోజి — త్రిపుట**

ఏమి సేతు నమ్మలాల యిదివో నా కాపిరము
కామించి వలపు పతి కాగిలే కోరీని ! ॥పల్లవి॥

కాయమే కాకల బొందీ గాసీ రమణుని బాసి
పాయమే చిగురించీ పైపైనే
చేయి చెక్కిటి మీద జీతలు రేచీగానీ
యేయెడ గను చూపులు యెదురే చూచీని ! ||ఏమి||

పని పూని పయ్యదే పైపై జారీగానీ
ఘనమైన చన్నులైతే గట్టులయ్యీని
గొనకొన్న విరహము కోపము పుట్టించీగానీ
ననుపుల సెలవులు నవ్వింపించీని ! ||ఏమి||

గారవపు నాకాగిలి కారాలు పుట్టించీగానీ
వూరేటి మోవి తేనెలు వుట్టిపడీని
యీరీతి శ్రీవేంకటేశు డింతలో నన్ను గలసె
తేరేటి మోము కళలు తెలివిసేసీని ! ||ఏమి||

శృం : 27—184

ప. ప ద స స ని ని ద ద ప || పా ని ద ప మ గ మా పా ||
ఏ - మి సే - - - తు - || న - - - - - మ్మ లా ల ||

ప ద ప దా సా || దా రి స ని ద పా - మ పా ||
యి ది వో నా - || కా - - - పి ర - - ము ||

ప మ గా - రి ప మ గ రి సా || స రి గ మ పా - మ పా ||
కా - - - - మిం - - - చి || వ - ల పు ప - - తి ||

గ మ రి గ పా దా సా - ప || దా రి ని ద దా ని ప పా ||
కా - - - గి తే కో - - || రీ - - - - ని - - - || ||

చ. - - స రి గ మ రి గ సా || సా స ని ధా ధా సా - ||

సా స రి గ స రి రి || గా మ గ రి గ సా సా ||
దీ క్షా - నీ - ర మ || ణు - - ని - జా సి ||

- - ధ స రీ - గ సా || స సా - ధ రి స ని ధ ద ప ||
- - పా - య - - మే || చి గు - - రిం - - - చి - ||

ప ధ ప ధా గా మ గ రి || సా - - - - - ||
పై - - పై - - - - || నే - - - - - ||

- - స రి గ మ పా || ప ని ద ప మ గా మా పా ||
- - చే - యి - చే || క్కి - - టి - - మీ ద ||

- - గ మ ప ద సా స స ని ద || ద ప ద ని దా పా పా ||
- - చిం - త - - లు - - - || రే - - చీ - గా నీ ||

- - ప ద స రి గ మ గ రి గా || స గ రి ప గ మ రి గ సా సా ||
- - యే - యె - - - డ - - || క - ను - - - చూ - - పు ||

సా ద స రీ - గ సా || ప ద సా రి గ రి స స ని దా దా ని ప || మా

**అవతారిక :**

ఈ పదము నందలి నాయిక ఖండిత. ఈమె నాథునితో "నాతో నీవుండినను నీ మనసు ఎట్లున్నదో నాకు తెలుసును. నీ మాటలలో గల భావములను నేను తెలుసు కొంటిని. నా వలపుల యందలి వంకలు నాకు తెలిసినవి. ఇంతటి వాడవై యుండియు నా గుణములు గొప్పగా నేల చెప్పుకొందువు! నీ విద్య లన్నియు విచారించి తెలుసు కొంటిని. నీ వలె నుండవలెనని భావించితిని నీతో నవ్వుచు సంతోషముగా నుండుట యందలి ఓరుపును తెలుసుకొంటి. ఇంకను విడువక నీ నేర్పులు నాకేల చెప్పుకొన జూచేవు. ఐనను నేను నీతో కలిసి ఆనందముగా నుంటిని. నీకు అదియే గురుతు ఓ వేంకటేశ్వరుడా. ఇంకను ఇచ్చకములేల? నీ వన్నిటా ఘనుడవు నేనెరుగనా" అని నాథుని యందు తనకు గల ప్రేమను వెలి బుచ్చుచు ఆతని నడతలను తానెట్లు సహించు కొనుచున్నదో చెప్పుచున్నది.

**కాంభోజి — రూపకం**

నీ విన్నిటా ఘనుడవు నేనెఱుగనా
యీ వల నావల సుద్దులెల్ల నాకు జెప్పేవు! ॥పల్లవి॥

మంతనాన నేను నీ మనసెల్ల నను గొంటి
వింతలై నీ మాటలెల్ల వేలుచు కొంటి
వంతులు వెట్టుక నీ వలపెల్ల దెలిసితి
యెంత కెంత నీ గుణము యేల మాకు జెప్పేవు! ॥నీవి॥

కడల నీ విద్యలు ఇక్కడనే విచారించితి
బడి నుండి నీలాగు భావించితి
వుడుగక నీతో నవ్వి వోరుపు విచారించితి
యెడలేక నీ నేరుపు తేల నాకు జెప్పేవు! ॥నీవి॥

నిన్ను గాగిటనే కూడి నెయ్యమెల్లా జేకొంటి
చన్నుల నొత్తి నీమోవి చవిగొంటిని
యిన్నిటా శ్రీ వేంకటేశ ఇచ్చకములు మెచ్చితి
యెన్నటి కిది గురుతు యేల నాకు జెప్పేవు! ॥నీవి॥

శ్రృం : 27–186

ప. సరిగమగరిగాసస || సని ఫా ధా సా ||
నీ - - - వి - న్ని - ట || ఘ - ను డ వు ||

పదసా - దరిసనిద || పా సమగరిసా ||
1. నే - - - - నె - రగ || నా - - - - - - ||

2. సరిగమపదసరిసనిదా || పానిదదపపమగరి ||
నే - - - - - నె - ర - గ || నా - - - - - - - - - ||

3. పదసరిగమరిగపానిద || మపదారిసనిదపామగగరి ||
నే - - - - - నె - రగ - || నా - - - - - - - - - - - ||

మగమపదదా || నిదదపదసనీదా ||
యీ - - వల నా || వ - ల సు - - ద్దు ||

పదసరిసనిదప || నిదదప పమగరిసా ||
తె - ల్ల - నా - - కు || చె - - - ప్పే - - - వు || ||నీవి||

చ. ప ప పపమగమా || గమపాదపదా ||
మంతనా - - - న || నే - - ను - నీ ||

పదసా - రిసనిదా || మపదానిద దపమగమా ||
మన సె - - ల్ల - - || క - ను - - గొం - - - టి ||

నిసరిగమరిగసా || సని ఫా ధా సా ||
వింత - లై - - - నీ || మా - ట తె ల్ల ||

నిపపపమగ మపదా | పదసా సనినిదదప ||
వే - లు - చు - కొం - - | - - - - - - - - టి - ||

ద ప దా సా | స రి గ మ గ రి గా సా ||
వం తు లు వె | ట్టు - క - నీ - - - ||

ప ద గా మ గ రి సా || స ని పా దా సా ||
వ ల పె - - - ల్ల || దె - లి సి తి ||

ద స రీ గ రి రి స సా రి సి ని ద || ద మ పా దా ని ద పా పా ద ప మ గ ||
ఎం త కెం - - - - త - - - - - || నీ - - గు - - ణ ము - - - - ||

ప ద సా స ని దా ని ద పా || ని ద ద ప ప మ గ రి సా ||
యే - ల మా - - కు - - || చె - - - ప్పే - - - వు || ||నివి||

**అవతారిక :**

శ్రీ కీర్తనము నందు హరి కల్పితమగు మాయ యందు దేహము నెత్తిన తాను అంగనలకు జిక్కి, బంగారమునకు జిక్కి, బంధు జనులకు జిక్కి వావి వరుసలకు జిక్కి భోగములకు జిక్కి ఎట్లు పాట్లు పడుచున్నదియు ముంగిట క్షేత్రముల యందు జిక్కియెట్లు వెట్టి చాకిరి చేయు చున్నదియు చదువులు చదివి మతముల భ్రమల యందు ఎట్లు అల్లాడినదియు చెప్పు కొనుచు చిత్తములో నీ పాదములను గని, నీ శరణు జొచ్చితినయ్యా అని అయ్యవారు జీవుల మాయామయగు బంధముల యందు ఎట్లు తన్నుకొనుచున్నారో శ్రీ వేంకటేశ్వరునకు విన్న వించుకొను చున్నారు.

**కాంభోజి – రూపకం**

ఇన్నాళ్ళు నందు నందు నేమి గంటిని
అన్నిటా శరణు చొచ్చి హరి నిను గంటిని ! ॥పల్లవి॥

అంగ నలపస జిక్కి అలయికలే కంటి
బంగారు వెంట దగిలి భ్రమ గంటిని
ముంగిటి క్షేత్రా లంటి ముందివెట్టి సేయ గంటి
అంగపు నన్నే చూచి అంతరాత్మ గంటి ! ॥ఇన్నా॥

చుట్టాల జేరి చూచి సుద్దుల వావులు గంటి
మట్టులేని వయసుతో మదము గంటి
వట్టి కామములు సేసి వరుస మాయలు గంటి
పట్టి నారాయణా యని భక్తి నిన్ను గంటిని ! ॥ఇన్నా॥

వింత చదువుల వల్ల వేవేలు మతాలు గంటి
సంత కర్మముల వల్ల సాము గంటిని
యింతట శ్రీ వెంకటేశ యిటు నా జీవ భావము
చింతించి అందులోన నీ శ్రీపాదాలు గంటి ! ॥ఇన్నా॥

అ : 7–22

ప. మ గ ప ద సా ॥ ని ద ప మ గ రి ॥ స ని ఫ ధా - ॥ సా రి గ మ పా ॥
ఇ - న్నా - ళ్లు ॥ నం - దు నం - దు ॥ నే - మి గం - ॥ టి ని - - - ॥

2. మ గ ప ద స రి గ మ రి గ ॥ స రి గ సా - ని ద ప మ గ రి ॥
ఇ - న్నా - - - ళ్లు - - - ॥ నం - - దు - నం - - - దు - ॥

స రి గ మ రి గ రి స ని ఫ ధా ॥ స రి గ మ పా ॥
నే - - - మి - గం - - - - ॥ టి - ని - - ॥

స ప ద సా - ॥ స రి గ స రి రి ॥
అ - న్ని టా - ॥ శ ర ణు జొ - చ్చు ॥

స రి గ మ రి గ స స స ని దా ॥ ద ప మ గ మా పా ॥
హ - రి - ని - ను - గం - - ॥ టి - - - ని - ॥ ॥ఇన్నాళ్లు॥

చ. గ మ పా ద ప మ గా ॥ గ రి సా స రి రీ ॥
అం - గ - - న ల ॥ ప - స జి - క్కి ॥

స గ రి ప గ మ రి గ సా ॥ స ని ఫా ధా సా ॥
అ - ల - యి - క - లే ॥ కం - - - టి ॥

ప ద స రి గ స ॥ స రి గ మ ప ద ని ద ప ॥
బం - గా - రు - ॥ వెం - - - ట - త గి లి ॥

మ ప దా రి స నీ - ద ద ॥ పా - - - - ॥
భ్ర మ గం - - - - - టి ॥ ని - - - - ॥

ప మ గా ప ప ద ప ॥ దా సా సా ॥
ముం - - గి టి షే ॥ త్రా లం టి ॥

ద స రిం గం సా స ॥ దా రిం స నీ ద ద ప ప ॥
ముం - చి - వె ట్టి ॥ సే - - - య గం - టి ॥

ద ప ద ద సా ॥ స రిం గం స రీం ॥
అం - గ పు న ॥ న్నే - చూ - చీ ॥

స రిం గం మ రిం గం సా స ని దా ॥ ద ప మ గ మా పా ॥
అం - - - త - రా - - త్మ ॥ గం - - - టి - ॥ ॥ఇన్నాళ్లు॥

**అవతారిక :**

ఈ పదము నందలి నాయిక కలహాంతరిత. ప్రేమ గర్విత ఈమెకు నాధుని యందు గల ప్రేమాతిశయములు తెలిసినదగు చెలి "ఏమమ్మా! మంచి ప్రాయములో నున్న దానవు పతితో యీ విధముగా పెనుగులాడ వచ్చునా? చనవులు చూపు కొనవలె, కైవశమైన వేడుకల కానందించవలె, నెఱవైన నేలుపుతో గూడ వలె, గాని వలచిన వారితో వాదులు వేసుకొన వచ్చునా? ప్రియుడు చెప్పినట్లెల్ల చేయవలదా? అప్పుడే గదా విరిసిన పూవులవంటి నీ కోర్కెలు దీరును. సిగ్గు పడవచ్చునా సేసవెట్టిన మగని వద్ద. ఆతడు నిన్ను రంతుచేసి పిలచు చున్నాడు, రావమ్మా! నీ నాధుడగు శ్రీ వేంకటేశ్వరుని అలరించి యానందింప జేయుటయే నీ పరమావధి" అని నాయికయగు అమ్మవారిని లాలించి బుజ్జగించి సతీపతులకు సంధి చేయుచున్నది.

**కాంభోజి – రూపకం**

రావే అతడు నిన్ను రంతు సేసి పిలిచీని
తావులనే లోగుటే తగు నేరుపు! ॥పల్లవి॥

బలిమి బెనగరాదు పాయపు వారికెల్ల
వలనైన చనవు చూపవలెగాని
కలిగిన వేడుకలు కైవ్రాల కుండాను
నెలవున గూడుటే నెరవైన నేరపు! ॥రావే॥

వాదులకువగరాదు వలచిన వారికెల్ల
సేదదేరి చెప్పినట్లు చేసుటే కాని
పోదిగొన్న కోరికలు పోది విచ్చకుండాను
సాదు వలె లోనౌటె చక్కని నేరుపు! ॥రావే॥

సిగ్గులు వడగరాదు సేసపాల వారికెల్ల
నిగ్గుల గాగిట గూడి నిక్కుటే కాని
అగ్గమై శ్రీ వేంకటేశుడరసి నిన్ను గలసె
కగ్గులేక సుఖించుటే కడు నేరుపు! ॥రావే॥

శృం : 26–544

ప. పా ప ప మ గ మా ॥ గ రి ప మ గ రి గ రి గ రి సా ॥
రా వే - - - - ॥ అ - త - డు - ని - - - న్ను ॥

ప ద స రి స ని ద ప ॥ ద ప మ గ మా పా ॥
రం - తు - సే - సి - ॥ పి - లి - చీ ని ॥

ధ ఫ ధ స సా ॥ రి స రి గ స రి ॥
తా - వు ల నే ॥ లో - గు టే - - ॥

ప మ గ రి సా రి ని ధ ఫా ॥ ద ప మ గ మా పా ॥
త - గు - - నే - - రు ॥ పు - - - - - ॥ ౹౹౨

చ. గా గ మ గ గ గ రి గ రి ॥ ప మ గ రి సా - - ॥
ఖ లి - మి పె న - గ - ॥ రా - - - దు - - ॥

ఫ ధ సా రి గ సా ॥ స ని ధా ధ స సా ॥
పా - య - - పు ॥ వా - - రి కె ల్ల ॥

స రి గా గా మ గ మా ॥ గ మ ప ద ని ద ద ప దా ॥
వ - ల నై - - న ॥ చ - న వు చూ - - - ప ॥

స రి స ని దా ని ద దా ॥ పా - - - - ॥
వ - లె - గా - - - ॥ ని - - - - ॥

ప ద స సా - ॥ స ని పా ద ద సా ॥
క లి గి న - ॥ వే - - డు క లు ॥

స రి గ స రీ రి ॥ ఫ మ గా మ గ రీ సా ॥

ప ద ఝ గ రీ గ రి సా ॥ రి స నీ ద ప దా ॥
నె ల వు - - న - - ॥ గూ - - డు - ఉే ॥

గ మ ప ద సా - రి స ని దా ॥ ప మ గ రి సా స రి గ మ పా ॥
నె - ర - వై - - న - - ॥ నే - - - - రు - - - పు ॥

పా ప ప మ గ మా ॥ గ రి ప మ గ రి గ రి గ రి స ॥
రా వే - - - - ॥ అ - త - డు - ని - - - న్న ॥

**అవతారిక :**

ఈ పదము నందలి నాయిక ప్రేమోత్కంఠితయగు ముగ్ధ. ఈమె నాయకుడగు శ్రీ వేంకటేశ్వరునిపై తనకు గల మక్కువలు తెలియజేయు చేతలనన్నియు గుట్టుగా గుంభనగా చేసి తన చెలులతో "ఆతనితో మాటలాడితిని, నా మొగమును ఆతడు ప్రియముతో చూచు వరకు నేను మౌనముగా నుండ నేరనైతిని, వాని కడకు పోయినదానను కొసరులు లేక సమ్మతితో నుంటిని మొగ మాటమున చెనకకయుంటిని. నన్నాతడాదరించి నప్పుడు బాస లిమ్మని పట్టి యడుగ నేరనైతిని, సమ్మతితో మైమరచి యుంటి నదేనా నేరము తన్నేమి చేసితినే ఓయమ్మా!" అని తన బేలతనమునకు వాపోవుచు చెప్పు కొనుచున్నది.

**రాగ లక్షణము :**

యదుకుల కాంభోజి ప్రాచీన రాగములలో నొకటి. స రి మ ప ద స | స ని ద ప మ గ రి స | అనునవి ఆరోహణావరోహణములు ఇది భాషాంగము. "స ని ప ధ సా" 'స ని సా' అను నప్పుడు కాకలి నిషాదము పలుకును. పూర్వా చార్యుల రచన లెన్నియో యీ రాగము నందు గలవు. ఇది యిప్పటి వాడుక ప్రకారము 28వ మేళమగు హరి కాంభోజి జన్యము.

**యదుకుల కాంభోజి (తెలుగు కాంబోది) – త్రిపుట**

తను నేమి సేసితినే తానేల తమకించీనే
యెనయగా నూరకున్నదిదే నా నేరమా ॥పల్లవి॥

తగుల నాడిన దాన దల వంచు కుండ నైతి
నగితి నింతేపో నా నేరమీ
మొగము చూచిన దాన మోనము గైకొన నైతి
అగపడి లోనైన దదే నా నేరమీ! ॥తను॥

యింటికి వచ్చిన దాన నే మైనా గొసరనైతి
నంటున నే నుంటి నది నా నేరమీ
అంటిన దాన నేనట్టె చెనక నైతి
వొంటి మొగ మోటల నేనున్నదే నా నేరమీ! ॥తను॥

సెమ్మది గూడిన దాన నిజబా నడుగ నైతి
నమ్మితి నేనిదియె కా నా నేరమీ
వుమ్మడి శ్రీ వెంకటేశు డొగి నిట్టె నన్ను గూడె
సొమ్ముల మైమఱచి నే జొక్కినదే నేరమీ ! ||తను||

శృం: 17–528

ప. - - ప ద సా సా || సా సా రి గ రి స స స ని ద ద ని పా ||
- - త ను నే మి || చే - - - - - - సి - తి - నే - - ||

మా రి మ ప ద సా ద ప || ప మ ద ప మ గ గా మ రి రి మ రీ ||
- తా - నే - - ల - || త - - మ - - కిం - - చీ - - ||

సా స స స ని పా ధా || స రి గ. స రీ రీ ||
నే యె న య - - గా || నూ - ర - కు న్న ||

- - స రి మ ప దా పా || ప ప మ గ గ రి రి మ రీ సా ||
- - ది దె నా - - నే || ర - - - మా - - - - - - || ||తను||

చ. - - ప ప పా పా || ప ద స ద పా ప ప మ గ గా మ గ ||
- - త గు ల నా || డి - - న - దా - - - న - - ||

రీ స రి సా సా || స ని ధ ధా - స రి గ స రీ ||
- త ల వం చు || కుం - - డ - నై - - - తి ||

- - రి మ పా ద స ద రి స స పా || ప ప మ గ మ రి రీ - - ||
- - న గి తి - - - - - - - నిం || తే - - - - - పో - - ||

- - స స ని ఫా దా || సా - - - - - ||
- - నా నే - - ర || ము - - - - - ||

- - స రి మా మా || గ మ ప దా ప పా ద ప మా ||
- - మొ గ ము చూ || చి - న - - దా న - - ||

పా రి మ ప ద సా || సా - సా - స ని పా దా ||
- ష్మో - న - ము || గై - కొ - న - - నై ||

సా ద ని సా స ద || ద ని సా రి స ద రి స స ని ద ద ప ||
తి అ గ ప డి - || లో - - - - - - నై - - - న - ||

పా రి మ పా ద స ద రి స స ద ప || ప ప మ గ మ రి రి మ రీ సా ||
- ద దే నా - - - - - - - - - || నే - - - - - ర - - మీ || ||తను||

**అవతారిక :**

ఈ పదము నందలి నాయిక ప్రౌఢ, ధీర, స్వాధీన పతిక. ఈమె తన చేతలను ఎంతో చమత్కారముగా చెప్పుచు యువిదల స్వభావము లిట్లుండునని నాయకుడగు శ్రీ వేంకటేశ్వరునికి విన్నవించుచు "మేము కూరిములు చల్లుచు కొసరు చుందుము. మించిన సరసములలో విరసము లను గూడ మేము చేయు చుందును. చనువిచ్చి కూడుచున్నప్పుడు జంకించే గుణమును మా కున్నది. ఇట్టి మా గుణములను నీ వేల యనుకరింప జూచెదవు స్వామీ! నీ చనవులకు ఇరవునైన అలమేలు మంగను నేను నీ జాణ తనములు చాలించి వ్యంగ్యపు నవ్వులు మాని నీ ప్రక్కన నన్నుండనీ" అని తన భావములను అతి మనోజ్ఞముగా వెల్లడించుచున్నది.

**రాగ లక్షణము :**

బలహంస మేళకర్తల ఆవిర్భావమునకు ముందు నుండియు వాడుక యందుగల రక్తి రాగములలో నొకటి. ఇది యిప్పటి వాడుక ప్రకారము 28వ మేళమగు హరికాంభోజి జన్యము. తాళ్లపాక వారి రచనల తరువాత ఇందు త్యాగరాజ స్వామివారు, దీక్షితులవారు మొదలగు ఇటీవలి వాగ్గేయ కారుల రచనలు మాత్రము కనబడుచున్నవి. 'మ రి మ గ స' అను ప్రయోగ మును వీరి రచనల యందు ప్రస్ఫుటముగా కనబడుచున్నది.

ఆరోహణ : స రి మ గ రి మ ప ద స

**అవరోహణ :** స ని ద ప మ రి మ గ స

**బలహంస — రూపకం**

మిక్కిలి జాణవు నీవు మే మేమి జాతి
పక్కన నీవన్నిటాను బదికితే జాలదా ! ॥పల్లవి॥

కూరిములు చల్లుతానె కొసరే గుణము మాది
నేరుపు మాకున్నదా నేరమే కాకా
మేరతోడి మమ్మేల మేకులు సేసేవు రతి

నించే సరసములోనె నిండు విరసము మాది
మంచితనమున్నదా మాటలేకాకా
యెంచనేల మమ్ము నీవు యిల జాణలలోనెల్ల
అంచె నూడి పడ్డ వాడవంత మాతోవలెనా ! ॥మిక్కిలి॥

చనవున గూడుతానె జంకించేగుణము మాది
తనివి మాకున్నదా తమియే కాకా
అనుగు (శ్రీ) వెంకటేశ అలమేలుమంగ నేను
పెనగి కూడితి వింక బెట్టి నవ్వవలెనా ! ॥మిక్కిలి॥

శృం : 17–510

ప పా మ గ స రి గా || స రి సా ని ధ ఫా || ధ స రి మ గ స || రి మ పా - - ||
మి క్కి లి జా - - || ణ వు నీ వు - - || మే - మే - మి - || బా - తి - - ||

2 ప ద సా ని ద పా ద ప మ గ || స రి గా సా రి స ని ధ ఫా ||
మి - - క్కి - లి జా - - - || ణ - వు నీ - - వు - - ||

ద స రి మ గ స || రి మ పా - - ||
మే - మే - మి - || బా - తి - - ||

3. ప ద స రి గ స రి స ని ద || పా మ గ స రి గా సా ||
మి - - - క్కి లి జా - - - || ణ వు - నీ - - వు || ,, ,,

4. ప ద సా స ని దా పా || మ గ స రి గా స రి స ||
ప - - క్క - న నీ || వ - - - న్ని టా - ను ||

సా రి స ని ధ ఫ ధా || స రి మ పా - ||
బ తి - కి - తే - || చా - ల దా - ||

చ. ప ప ద ప మ గ రీ || మ గ సా రి స సా ||
కూ రి ము - - - - లు || చ - ల్లు తా - ను ||

ధ స సా స స || రి స ని ధ ధ ఫ ధా సా ||
కొ స రే గు ణ || ము - - - మా - - డి ||

ఫ ధ సా రీ || మ గ స రీ - || రి మ ప ద సా ని ద ద ప దా || పా - - - - ||
నే రు పు మా || కు - న్న దా - || నే - - - ర మే - కా - - || క - - - - ||

ద స రి మ గా || స రి గా స రి సా || స రి మ గ గ రి గా సా ||
మే ర తో - డి || మ - - మ్మె - ల || మే - కు - లు - - సే ||

రి స ని ద ద ప దా స స || ప ద సా రి స ని ద || ద ప దా పా - - ||
సే - - - వు - - ర తి || ధీ రు డ వు - - - || నీ - వు మా - - ||

రి మ పా ద సా - || ద ప మ గ స రి గా సా || ప ప ద ప మ గ రి స ||
తె - రు వు రా - || వ - లె - - - నా - || కూ రి ము - - - లు - ||

అవతారిక :

ఈ పదము నందలి నాయిక చతుర. ఈమె చేతలను నాయకుడు తప్పు పట్టు చున్నాడో యేమోనని భావించిన చెలి "వలపుల వాడుకలు గలచోట ఒకరి నొకరు వ్యంగ్యము లగు మాటల ననుకొనుట, వూడిగములు చేయునప్పుడు హెచ్చుతగ్గుల నెంచక మేనుకు సోకించుట, సరసములాడు నప్పటి చనవులు మందె మేళము లందు చూపకుండుట, విడెమిచ్చెటి వేళల యందు చేతులు సోకించుట, నాయకుడు తనను కలయు నప్పుడు గర్వములు చూపుట మొదలగు నవి కాంతలందరకును సహజము. ఇందుకు ఎవరైన ఎగ్గులు పట్టుదురా, మా చెలినేల సాధించే వయ్యా, శ్రీ వేంకటేశ్వరుడా !" అని నాయకునికి చెప్పుచున్నది.

రాగ లక్షణము :

ఆందోళి ప్రాచీనరాగము. ఇప్పుడు దీనిని ఆందోళిక అనుచున్నారు. ఇది యిప్పటి వాడుక ప్రకారము 28 వ మేళమగు హరికాంభోజి జన్యముగా ప్రచారమునందున్నది. ఇందు త్యాగరాజస్వామివారి రచన ఒక్కటి మాత్రమే కనబడుచున్నది. ఇతర వాగ్గేయకారుల రచన లున్నవేమో తెలియుటలేదు.

ఆరోహణ : స రి మ ప ని స

అవరోహణ: స ని ద మ ప రి స

ఇంకను ఆంధాళి అను పేరున వేరొక రాగము దీక్షితుల వారి సంప్రదాయమున వాడుక యందున్నది కాని అది భిన్నమగు లక్షణములుగల రాగము.

ఆందోళిక — రూపకం

ఇందుగాక నెవ్వరు యెగ్గులెంచరు
నందు కొని ఆపెనేల సాధించేవు నీవు ! ॥పల్లవి॥

వాడికగల చోటను వలచి వొకరొకరు
ఆడరాని మాటలైనా నాడుచుందురు
వూడిగము సేసేవారు వూసి వాసులెంచరు
జోడై తమ మేనులు సోకింతురు ! ॥ఇందు॥

సరస మాడే వేళ సమ్మతించి తమలోన
సరుగ మందె మేళాన జంకింతురు
వరుస విడె మిచ్చేవారు వింతసేయరు
అరిది దమచేతుల నంటింతురు ! ॥ఇందు॥

రతి గలసే యప్పుడు రాజసము విడువరు
తతి గూడ దమలోన దమకింతురు
యితవై శ్రీవేంకటేశ ఇంతి నీవూ గూడితిరి
చతురులైన వారు సతమే చింతింతురు ! ॥ఇందు॥

శృం : 27–౬01

ప. రి మ ప ని ద మ ॥ పా ని స స ॥ స ని ని ద మ ప ని ద ॥
ఇం - దు గా - క ॥ నె వ రు ను ॥ యె - - - గ్గు లెం - చ ॥

మా ప మ రి రి సా ॥
రు - - - - - ॥

ని స రి మ రి స రి మా ॥ ప ని స రి మా రి స ని ద ద మ ॥
నం - - - దు - కో ని ॥ ఆ - - - పె నే - - - ల - ॥

ప ని సా సా రి స ని ద మా ॥ మ ప ని ద మా ప మ రి స ॥
సా - - దిం - - - - - ॥ చే - - - వు ని - - వు ॥ ॥ఇందు॥

చ. పా ప మ ప ని ద మా ॥ ప మ రి స రి మ మ ॥ రి స ని ధ ధ ఝ ఫ ని స ॥
వా డి క - - - - ॥ గ - ల - చో ట ను ॥ ప - ల - చి - - వొ క ॥

స రి మ రి మా ॥ - మ రి మ ప ని స ॥ సా రి స ని ద మా మ ॥
దొ - క - రు ॥ - త్రి - డ రా - ని ॥ మా - - - ట లై న ॥

రి మ ప ని ధా మా ప మ రి || సా - - - - ||
నా - - - డు మం - - దు || రు - - - - ||

- ప ని ద మా || ప మ రి స రి మ ప ||
- వూ డి గ ము || సే - సే - వా - రు ||

- రి మ ప ప ని ద మ || పా ని సా - ||
- వూ - సి వా - - సు || లెం చ రు - ||

- ప ని సా రి స || స రి మా రి సా || ని స రి మా - రి స ని ద మా ||
- జో - డై త మ || మే - ను - లు || సో - - - - కిం - - - తు ||

ప ని స రీ స ని ద మ రి సా ||
- - - - - రు - - - - ||

॥ఇందు॥

**అవతారిక :**

వేంకటాచలపతికి తెరకట్టి సేవలు చేయుచుందురు. ఇట్టివి వైష్ణవ దేవాలయము యందలి అభ్యంతర సేవా విధానములనుచు చమత్కారములగు మాటలతో అయ్యవారు చెప్పి యున్నారు.

**రాగ లక్షణము :**

శంకరాభరణము ప్రాచీన మేళము. సర్వగమక వరికాదులతో నొప్పుచు అత్యంత మనోహరముగా నుండెడి రక్తిరాగములలో నొకటి ఇది సంపూర్ణ-సంపూర్ణము వెంకటమఖి సంప్రదాయముననను యిదే విధముగ చెప్పియున్నారు. మేళకర్తల ఆవిర్భావమునకు పూర్వమునుండియే ప్రసిద్ధములగు రాగములలోనిది యొకటి. ప్రస్తుతము వాడుక ప్రకారము 29 వ మేళకర్త.

**శంకరాభరణం — చాపు**

దిష్టి తాకీనని మాయయ్యకు తెరవెయ్యరే
దిష్టించి యెవరినైనా తేరిచూడ నీకురే ! ॥పల్లవి॥

చప్పుడు సేయక యవసరామని చెప్పరే
అప్పుడు మజ్జనమ్మాడేనని చెప్పరే
కప్పురంపు సురటులా విసరే ననరే
అప్పుడు సతులు తాను ఆరగించే ననరే ! ॥దిష్టి॥

దంతపు చవికెతో యేకాంత మాడే ననరే
అంతరంగమున నృత్తమాడే ననరే
దొంతి వేడుక పూలతోటలో నున్నాడనరే
చెంతల కేళాకూళి చెంతనున్నాడనరే ! ॥దిష్టి॥

పట్టంపు రాణియు తాను పవ్వళించుచున్నాడనరే
రట్టుగా నెవ్వరినైన రాకుమనరే
అట్ట యలమేల్మంగాధిపతి వేంకటేశ్వరు
నిట్టె ఒకరినొకరిని సేవించుమనరే ! ॥దిష్టి॥

అ :

ప. సా ని । సా గ రి ॥ స స ని । ద ప పా ॥ ప ప మ । గా రి ॥
ది ష్టి । తా కీ - ॥ న నీ - । మా - య ॥ య్యా కు - । తె ర ॥

గా మ । పా - - ॥ పా - । స ని ద ప ॥ ప ప మ । గ రి గా ॥
వె య్య । రే - - ॥ ది - । ష్టిం - చి - ॥ యె వ రి । నై - నా ॥

గా మ । ద ప ప మ ॥ గా రి । సా - - ॥
తే రి । చూ - డ - ॥ నీ కు । రే - - ॥ ॥దిష్టి॥

చ. మ గ మ । పా పా ॥ ద పా । పా పా ॥ ప స ని । ద ప పా ॥
చ - - । ప్పు డు ॥ సే - । య క ॥ య వ - । స - ర ॥

మ గ రి । గా మా ॥ పా - । - - - - ॥
మ ని - । చె ప్ప ॥ రే - । - - - - ॥

గా మ । పా దా ॥ ని స ని । సా రీ ॥ సా ని । ద ప ప మ ॥
అ - । ప్పు డు ॥ మ - - । జ్జ న ॥ మా - । డీ - న ని ॥

గా మ । పా ద ని ॥
చె ప్ప । రే - - ॥

మ గ మ । పా ద ప ॥ ద నీ । స ని సా ॥
క - ప్పు । రం పు - ॥ సు ర । టు - లా ॥

రి గా । మ గ రి స ॥ స ద ని । సా - - ॥
వి స । రే - న - ॥ న - - । రే - - ॥

సా ని । సా గ రి ॥ సా ని । దా పా ॥
అ ప్పు । డు స తు ॥ లు - । తా సు ॥

గ ను ప । ప మ గ గ రి స ॥ రి గా । మ ప ద ని ॥
ఆ - ర । గిం - - చె - - ॥ న న । రే - - - ॥ ॥దిష్టి॥

**అవతారిక :**

ఈ కీర్తనమువందు ధనకనక వాంఛలచే తిరుగాడెడి ప్రాణుల నుద్దేశించి కాంతా కనకములు క్షణ భంగురములనియు, వాని యందలి వాంఛలు అతి చంచలములనియు, ఇట్టివి పరమయోగులగు వారు విడుతురనియు, అట్లు విడిచినసే వారికి పరమాత్ముడగు శ్రీవేంకటేశ్వరుని కృప కలుగుననియు అయ్యవారు వక్కాణించుచున్నారు.

**శంకరాభరణం – ఝంపె**

పనిలేని ధనవాంఛ బడి పొరలిన నిట్టి
కనుమాయలే కాక కడనేమి గలదు ! ॥పల్లవి॥

కనుచూపు కాకల గలయుటు వెడయాస
లనుభవింపుట గాక యందేమిగలదు
తనువల్లి సోకులు దగులుట మమతల
నెనయ గోరుట గాక యిందేమి గలదు ! ॥పని॥

యెలమిన ధర మాను పెఱిగి యెంగిలి నోర
నలము కొనుట గాక యందేమి గలదు
పలు లంపటములచే బడుట దుఃఖంబులు
తలజుట్టుచే కాక తనకేమిగలదు ! ॥పని॥

శ్రీవేంకటాద్రీశు జేరని పనులెల్ల
నేవగింతలె కాక యుందేమి గలదు
ఆవల సురత భోగ మనుభవింప బోయి
రావలయుట గాక రచనేమి గలదు ! ॥పని॥

అ : 5–92

ప. పపమ మగగరిసా || రిగమగగ రిసా సని ||
పని - తే - - - ని || ధ - న - వాం - - ఛ - ||

పదని సరి || గమపమ మగగరిగమ ||
బడిచౌరలి || న - - - ని - - - ట్టి - ||

మపదనిస || దదపా పమ || గా గరిసరిగ మదప || గరిసా - ||
కనుమా - య || తే - గా క - || క డ - నే - - - మి - || గలదు - ||

||పని||

చ. మగసా సని || సరిగసరీ || మగమా దపా || గా మప గమరిస ||
కనుచూపు - || కా - - కల || గ - లయుట || వెడ - యా - - స ||

నపప ప పమగ || గపమగ గా మరిరి ||
లనుభవిం - - - || పు - ట - గా - - క ||

రిగ మపదప || పదనీ సా - ||
- యం - దే - మి || గ - లదు - ||

నిసరిసరి || గా మ గా || గమగరీ || రీ గమ గరి సా ||
తనువ - ల్లి || సో కు ల || దగులుట || మమ - త - ల ||

పద ని సా || సగరీ స నిదప ||
నెనయగో || రు - టగా - - క ||

మ పదనిసరిసనిదప || సనిదపపమగరిస ||
యిం - - - దే - - - మి - || గ - ల - దు - - - - ||

||పని||

**అవతారిక :**

ఈ పదమునందలి నాయిక ఖండిత. తనయందు ప్రియములు చూపుచు అనునయించి కలియుటకు వచ్చిన నాయకుని చూచి "నీ చిత్తము నందు గల తప్పులు బాపుకొనక నీవెన్ని యో వినయయలు నటించినను, నీపై గల గోళ్ళనొక్కులు అట్లేయుండగా నాకు నీకౌగిలి, సుఖము లిచ్చునా, నీ నవ్వులయందలి నలుసులు తెలియుచునే యున్నవి. కప్పిపుచ్చుకొను చేతలకు పని యేమి కలదు. నీవలపులలో గల వాసులు తెలియుచుండగా నాపై బలిమిచేయుట బాగగునా. ఓ శ్రీవేంకటేశ్వరుడా నన్ను విడువక పట్టుచున్నావు. ఆనందమునకు అంతులు చూడగలమా'' అని ఆతని దుడుకు పనులను వివరించి వానిని చూచిన తనకు ఆనందమెట్లు కలుగునని పలుకు చున్నది.

శంకరాభరణం — ఆది

పెనగే వూరకే ప్రియపడి నాతో
ననుపు నటించక నయమౌనా ! ॥పల్లవి॥

చిత్తము లోపలి సిలుగులు వాయక
బత్తులు సేయగ బనిగలదా
వొత్తినగోళ్ళు వొళ్ళనే వుండగ
హత్తిన కౌగిలి అనువౌనా ! ॥పెనగే॥

నగవులలోపలి నలుసులు దియ్యక
పగటులు సేయగ పనిగలదా
తగిలిన దండలు తతిమెడ నుండగ
వెగటుగ బెనగగ వేడుకలౌనా ! ॥పెనగే॥

వలపుల లోపలి వాసులు దోయక
బలుములు చూపగ బనిగలదా
యెలమిని శ్రీవేంకటేశ కూడితివి
కలసిన రతులకు గడమలునౌనా ! ॥పెనగే॥

శృం : 27—321

ప. - స సఀ సా స ద సఀ ని ద ప | - ద పా మ గా | మా పా ||
- పెన గే వూ - - - ర కే | - ప్రియ ప డి | నా తో ||

- స పా మ గా రి మ గ రి సా స ని | 
- న ను పు న టిం - - - చ క - |

సా స రి గా గ మ | పా మ గ మ ప || ద ని
న య - మౌ - - | నా - - - - || - -
॥పెనగే॥

చ. - పా - ప పా పా ప మ గా | ప మ మ ద పా ప మ | గ మ రి స స ||
- చి - త్త ము లో ప - లి | సి - లు - గు లు - | పా - - య క ||

- సా - స నీ స గ రీ సా స ని | ధ ఫ ఫ ధ నీ | సా - - ||
- బ - త్తు లు సే - - య గ - | ప ని గ - ల | దా - - ||

- సా - ప మా గ ప మ గ గా మ రి | మ గ మా ప ప | ప ద నీ సఀ సఀ ||
- వా - త్తి న గో - - - - ళ్లు - | హో - - ళ్ళ నే | పుం - - డ గ ||

- సా - గఀ రీ సా - ని ద ప | సఀ ని ద ప ప మ గ రి | సా రి గ మ ప || ద ని
- హా - త్తి న కా - - గి లి | అ - - - ను - - - | వౌ నా - - - || - -

**అవతారిక :**

ముగ్ధమనోహారియు, స్వాధీనపతికయు, సౌందర్యరాశియునగు నాయిక భావములను వివరింపుచు ఆమె చెలి "ఆమె నగవులలోను, నయనములలోను నీపై గల ప్రియములు తెలియుచునే యున్నవి కాదా. ఆమె తెగువతనమును దినదినమును చూచుచున్నావు కదా ! మాటాడ సిగ్గుపడుచున్నది. చిలిపిగా గ్రుచ్చి గ్రుచ్చి యేమి అడుగుచున్నావయ్యా ! నిన్ను పిలచుటలు, నీతో పెనగుటలు యివి యన్నియు నీపై గల ప్రేమకు తార్కాణములు గావా ! గుట్టుతోనున్న మాచెలిని యేల సాధించేవయ్యా ! మానినులకు మౌనము భూషణము. అదియే నీపై గల మరులకు తార్కాణము. నిన్ను మనసార మరగిన మా అలమేలుమంగను ఓ శ్రీ వేంకటేశ్వరుడా ఇంకను ఏల సాధించేవయ్యా'' అని శ్రీనివాసునితో చెప్పుచున్నది.

**శంకరాభరణం — త్రిపుట**

ఇంగిత మెఱుగ లేవా యింత జాణవు
వుంగిటిగా నాపెనేల వొరసేవు నీవు ! ॥పల్లవి॥

నగవె ననుపు నయమె ప్రియము
తెగువే తెలివి దిన దినమూ
మగువను జూడరాడా మాటాడ సిగ్గువడీని
అగడునేసి యేల అడిగేవు నీవు ! ॥ఇంగి॥

పిలుపే నిలుపు పెనగులే తగులు
చలిమే బలిమి సారె సారెకూ
కలదు యీ చెలియందే ; గక్కన గుట్టుతోనుంటే
సొలసి యాపెతో నేల సోదించేవు నీవు ! ॥ఇంగి॥

మరులే మచ్చికలూ మనమే మోనము
కరగులే యితవులు కలకాలమూ
మరలి నిన్నలమేల్మంగ శ్రీ వేంకటేశుడ
యిరవై సొలసె నీవింకా నేల సొలసేవు ! ॥ఇంగి॥

శృం : 27—263

ప. - - ప ప ప మ గ గా ప మ పా రి ॥ రి మ గ మ పా ద మ పా ॥
- - ఇం గి - - - త - - - - - ॥ మె - అ గ తే - - వా ॥

- - మ ప ద ని సా సా - ని ॥ ద ప మ ద ప మ గ మ ప మ ప మ గ రి ॥
- - ఇం - త - జా - - - ॥ ణ - - - - - వు - - - - - - - - ॥

రీ మ గ స స సా ॥ స ని స ధ ని ఫ ఫ ధ నీ సా ॥
- పుం - గి టి గా ॥ నా - పె - - - నే - - ల ॥

- - స రి గ మ ద ప గ రి ॥ సా ధ ధ నీ సా - - ॥
- - వొ ర సే - - - వు - ॥ నీ - - - వు - - ॥ ॥ఇంగి॥

చ. - - గ మ పా - మ ॥ గ రీ మ గ రి సా సా ॥
- - న గ వె - న ॥ ను - - - - పు - ॥

సా గ రి సా - స ॥ స ని స ధ నీ సా - - ॥
- న య మె - ప్రి ॥ య - - - - ము - - ॥

- - స ప ప ప మ గ గ ప మ గ ॥ మ గ మ గ మ రి రీ రీ ॥
- - తె గు వే - - - తె - - - ॥ లి - - - - - వి - ॥

- - మ గ మా పా - మ ॥ మ ప ద ప పా - - ॥
- - ది న ది న - - ॥ - - - - ము - - ॥

- - మ గ మా పా ॥ మ ప ద ప ప ద నీ సా ॥
- - మ గు వ ను ॥ చూ - డ - రా - - దా ॥

- - స ని స ꠱రి గ స రీ ॥ గ మ ప గ రీ సా సా ॥
- - మా - టా - - - డ ॥ సి - - గ్గు - వ డీ ॥

సా మ ప ద ని స రి గ మ గ రి ॥ సా స ద దా పా ॥
ని అ గ డు - - - నే - - - ॥ సి యే - - ల ॥

- - గ మ పా ద ని ద ని స ని ద ప ॥ రి గ మా ద ప గ రి సా - రి గా - మ ॥ పా
- - అ డి గే - - - - వు - - - ॥ నీ - - - - - - వు - - - - - ॥ -

॥ఇంగి॥

**అవతారిక :**

విరహోర్తయగు నాయికను ఓదార్చుటకు చెలులు చేయు ఉపచారములను చెప్పుచు "కప్పురపు కలపమలదుట, పన్నీరు పూయుట – మొదలగునవి చేసి ఆమె విరహమును సన్నపు రాళ్ళపై నీళ్ళు జల్లినట్లు, వేసిళ్ళకోర్వని వారిపై నిప్పులు జల్లినట్లు, దొరకని దైవముతో మాట్లాడుటకు శపథము చేసినట్లు బాధల నినుమడింప జేయునవిగా నున్నవేగాని ఉపశమించునవి గావే" వని అన్నమాచార్యులవారు చక్కటి ఉపమానములతో చెప్పుచున్నారు.

**శంకరాభరణం – ఆది**

కుటిలాలేటికి కోమలి యెడ నే
డిటువలె జేయగ నింపౌనా ! ॥పల్లవి॥

పుప్పొడి చల్లిన బొక్కటి దేహము
కప్పుగ మేటికి గలపేరే
ఒప్పుగ వేసిళ్ళోర్వని దేహము
నిప్పులు చల్లగ నిలిచీనా ! ॥కుటి॥

వెన్నెల బాయట వేగెటిమేనికి
పన్నీరేటికి బామేలే
సున్నపు రాతికి జొబ్బిలి నుదకము
నున్నతి జల్లగ నోర్చీనా ! ॥కుటి॥

తిరువేంకటపతి తెప్పలదేలగ
తరుణికి నేటికి దాపములూ
దొరకని దైవముతో మాటలాడగ
శరికెలు వెట్టగ బాడౌనా ! ॥కుటి॥

ప. - ప మా గ రీ సా స స | - ని సా రి సా | స ని ధ ని పా ||
- కు టి లా - లే టి కి | - కో - మ లి | యె - డ - నే ||

- ఫ ధా ని సా రి స ని సా | రి గా | మ పా మ గ రి స రి ||
- డి టు వ లె జే య - గ | నిం పౌ | నా - - - - - - - || ॥కుటి॥

2 గ మ ప మా గ రి స రి గ మ రి గ సా |
- - కు టి లా - లే - - - టి - కి |

స ని సా గ రి స ని | ధ రి స ని ధ ఫ ||
కో - - మ - లి - | యె - డ - నే - ||

- ఫ ధా ని సా రి స ని సా | రి గ మ ప ద ని స రి |
- డి టు వ లె జే య - గ | నిం - - - పౌ - - - |

స ని ద ప ప మ గ రి ||
నా - - - - - - - - || ॥కుటి॥

3 గ మ ప మా గ రి ప మ గ రి స ని సా |
- - కు టి లా - లే - - - టి - కి |

స రి గ మ గ రి గ రి | స స ధ రి స ని ధ ఫ ||
కో - - - మ - లి - | యె - డ - నే - - - ||

- ఫ ధా ని సా రి గ మ ప ద ని స రి |
- డి టు వ లె సే - - - య - గ - |

గ మ గ రి స ని ద రి | స ని ద ప ప మ గ రి || గ మ
నిం - - - పౌ - - - | నా - - - - - - - - || - - ॥కుటి॥

చ. - గ మ గ గ రి మ రి స స | - ని̣ సా రి సా | స ధ̣ ని̣ స స ||

- పు ప్పా డి చ - - - ల్లి న | - బో - క్కె టి | దే - - హా ము ||

- స మా గ మా గ ప మ గ మ రి | గా గ మ పా - మ | పా - - ||

- క - ప్పు ర మే - - - టి కి | గ ల - పే - - | రే - - ||

- పా - మ గా మా ప ప | ప ద ద ప | ద ప మ గ మ ప ||

- ఒ - ప్పు గ వే ని - | శ్లో - ల్ల ని | దే - - - హా ము ||

- ని సా రి̇ సా స̇ ని ద ని స̇ స̇ | గ̇ రి̇ స̇ ని రి̇ స̇ ని ద |

- ని - ప్పు లు చ - - - ల్ల గ | ని - ఖి - చీ - - - |

స̇ ని ద ప ప మ గ రి || గ మ

నా - - - - - - - || - - ॥కుటి॥

**అవతారిక :**

ఇందు నాయిక ముగ్ధ నాయకుని చేతలకు పరవశించి తాను ఓడినట్లు భావిం
గురిగా నవ్వినది. "నన్ను ఉడికించకుము. గాలములవంటివగు నీనవ్వులు నీకెట్లున్నను నాకు గుండె
యందు అమ్ములవలె నాటుకొనుచున్నవి. నే నేమరపాటున నుండగా నన్ను లాలించి కవ్విం
పలుకుచుంటివే" అని శ్రీవేంకటేశ్వరునితో చెప్పుచున్నది.

శంకరాభరణం – రూపకం

ఊరకుండనీరా మమ్ము నుడికించకా
గారవించే నీ నవ్వు గాలమువో నాకు ! ॥పల్లవి॥

చిఱుతనవ్వు నవ్వగా చెక్కునొక్కి యెత్తి నన్ను
కఱచేవు మరికొంత కారింపే కాదా
తఱి నీ మనసునను దలచినట్లుండు
గుఱిగా నదివో నాకు గుండెలోని అమ్ము ! ॥ఊరకుండ॥

మంచముపై నుండగాను మచ్చిక నావొద్ద బండి
ముంచి చేయివేసే వది మోపేకాదా
యెంచి నీకు జూడనది యిచ్చకమైనట్లుండు
తెంచరాని పొద్దు వొద్దు దిగులువో నాకు ! ॥ఊరకుండ॥

భ్రమసి నేనుండగాను పట్టి నన్ను గాగిలించి
తమకించే విది గొంత తగులే కాదా
అమర శ్రీవేంకటేశ ఆదరించి కూడితివి
చెమటలు నీకు గాన్ని సేసలువో నాకు ! ॥ఊరకుండ॥

శృం : 17–247

ప. - ప ప ప ప మ గ మ || పా పా ద ప || మ ప ద ని స ని || సా - - - - ||
- ఊ ర కుం - - - డ || నీ రా మ మ్ము || ఉ డి గిం - - చ || క - - - - ||

- స ని స రి స ని || స రి గ స రి ||
- గా - ర విం - చే || నీ - న - వ్వు ||

గా మ గ గ రి గ రి సా || గ రి స ని ద ని స రి స ని ద ప ||
గా - - ల - ము - వో || నా - - - - - - - - - కు - - - ||     ||ఊర||

చ. - గ మ ప పా ద || ద మ ద ప ప ప మ గ మా ||
- చి రు త న వ్వు || న - వ్వ - గ - - - - ||

- గ మ పా ద స ద ప మా - గ | రి మ గ రి స స ధ నీ స ||
- చె క్కు నొ - - - - క్కి - - | యె - - - త్తి న - - న్న ||

- ప ధ ని స రి || గ స రి గా ||
- క ర చే - వు || మ రి కొం త ||

మ ప ద ని స ని ద ప || గ మ రి సా - - ||
కా - రిం - - - పే - || కా - - దా - - ||

- ప ప ప ప మ గ గ మ రి || మ గ మ మ పా ||
- త టి నీ - - - - - - || మ న సు న ను ||

- మ గ మ ప ద ప || ప ద నీ సా - - ||
- త ల చి న - - || ట్లుం - - డు - - ||

- సఁ ని సఁ రిఁ సఁ ని || సఁ రిఁ గఁ సఁ రిఁ ||
- గు ఱి గ న ది వో || నా - - - కు ||

- గఁ మ గా రిఁ గఁ రిఁ సఁ ని || గఁ రిఁ సఁ ని ద ని సఁ రిఁ సఁ ని ద ప ||
- గుం ం డె లో - - ని - || అ - - - - - - - - - మ్మ - - - || ||ఊర||

**అవతారిక :**

చెలులు నాయకుడగు శ్రీవేంకటేశ్వరునితో అలమేలుమంగను పెండ్లాడమని ఆమె అనురాగమును వర్ణించుచు గోముగా విన్నవించుచున్నారు ఇందు ముగ్ధయగు అలమేలుమంగ చేతలును చెలులు చెప్పుచున్న చేతలును అత్యంత మనోహరములై శృంగార రసమునకు మధురమగు రూపమును తీర్చిదిద్దుచున్నవి.

**శంకరాభరణం — ఆది**

అలివేణిని బెండ్లాడవయా
చెలుల విన్నపను చేకొనవయ్యా ! ॥పల్లవి॥

పొలపుల దొలి తొలి చూపులు
కొలదిమీర నుంకువలాయ
చెలగి చేతులను సేసిన సన్నలు
తలపగ నలుగడ దలబాలాయ ! ॥అలి॥

ననుపున సెలవుల నవ్విన నవ్వులు
గొనకొనగ బాలకూళ్ళాయ
అనువుగ ప్రియమున నాడిన మాటలు
మనసిజ తంత్రపు మంత్రములాయ ! ॥అలి॥

వేడుక కౌగిటి వినయపు సేతలు
కూడిన కూటపు గురులాయ
యీడనె శ్రీవేంకటేశ యేలితివి
తో డలమేల్మంగ దోమట్లాయ ! ॥అలి॥

శృం : 25—18

ప. - స ని ద ప ప మ గ రి | గా - మ ప మ | పా - - ||
- అ లి వే - ణి ని పెం - | డ్లా - - డ వ | యా - - ||

- గ మా ప ప ద ని స ని | మ ప ద ని స ని ద ప | ప మ గ రి సా ||
- చె లు ల వి - న్న ప ము | చే - - - కొ - న - | వ - - - య్యా || అలి ||

చ. - మ దా ప మా గ ప మ గ | రి మ గ రి | స ధ నీ స స ||
- సొ ల పు ల దొ లి తొ లి | చూ - చి న | చూ - - పు లు ||

- స సా ప ప ప మ గ మా రీ | మ గ మ ప దా | పా - - ||
- కొ ల ది మీ - ర - - నుం | కు వ లా - - | య - - ||

- ప సా ని సా రి రి రి స | స రి గ మ గ రి సా | స ద నీ స స ||
- చె లగి చే - తు ల ను | సే - - - సి - న | స - - న్న లు ||

- ప సా ద నీ సా స ని ద ప | మ ప గ మ రి గ స రి | ప మ గ ర సా ||
- త ల ప గా న లు - గ డ | ద - ల - ఛా - - - | లా - - - యె ||

- స ని ద ప ప మ గ రి |
- అ లి వే - ణి ని పెం - |

వఠారిక :

ఈ కీర్తనమునందు పరమాత్ముడు, "అనాది పురుషుడు అయిన హరి-సురలకు, నరు
ు సులభుడగు ఆరాధ్యదైవము. ఈతని కోపముతో నెవ్వరి వరములును సరికావు.
దముల పొగడెడి విష్ణువే రామ, కృష్ణాద్యవతారములనెత్తిన వాడు. ఇట్టి హరి కృప
'గమటకు తరమా ! సామాన్యులైనవారిని పొగడి సంపాదించుకొనెడి కొండలవంటి పుణ్య
ులు వారిని తిట్టినను వచ్చిన పుణ్యమునకు సరికావు. ఇందిరా రమణుడగు శ్రీవేంకటేశ్వరుడే
ి చుటకు శిక్షించుటకు సమర్థుడు. ఈ విషయమును దనుజులు తెలిసికొనినట్లున్నారు. నిజము
ు వూర దైవములు ఈతనికి సాటియా ?" అని శ్రీవేంకటనాథుని కటాక్ష వైభవములను
న్నమయ్యవారు కొనియాడుచున్నారు.

శంకరాభరణం — ఆది

దనుజులు గనిరి తత్వమిది
వనజాక్షుని కృప వసించనేలా ! ॥పల్లవి॥

హరి పరమాత్మ డనాది పురుషుడు
సురలకు నరులకు సులభుడు
హరి కోపముతో నన్యుల వరములు
సరిగా వెంచగ జగములలోన ! ॥దను॥

వేదాంత విదుడు విష్ణుడు కృష్ణుడు
శ్రీదేవికి బతి శేఖరుడు
పోది బరస్తుతి పుణ్యముకంటే
పాదుగ హరి దిట్టే పాపము మేలు ! ॥దను॥

నారాయణు డున్నతు డచ్యుతు డుప
కారుడు శ్రీవెంకటవిభుడు
చేరి యీతడే శిక్షించ రక్షించ
వూరదయివములు వొగి నితని సరా ! ॥దను॥

అ : 9—240

ప. - స నీ ద పా ద ని సా | మ ప ద ని స ని ద ప | మ గ మ ప ద ని స రి ||
- ద ను జు లు గ ని రి | త - - - త్వా - మి - | ది - - - - - - - ||

స స నీ ద పా పా ప మ గా గ రి | స పా మ | గ రి గ మ ప ద నీ ||
- వ న జా - క్షు ని - కృ ప - | వ సిం చ | నే - - - లా - - || ||దను||

2. స స గ రి స స ని ద ప మ ప ద ని సా |
- ద ను - జు లు - గ - ని - రి - - |

చ. - ద దా ద దా ప ద న స ద ప | ప మ దా పా ప మ | గ మ పా ||
- హ రి ప ర మా - - - త్ము డు | నా - - ది పు - | రు షు డు ||

- రి గా మ పా ప ని దా పా ప మ | గా గ రి ప మ గ రి | సా - - ||
- సు ర ల కు న రు - ల కు - | సు ల - భు - - - | డు - - ||

- రి గా మ పా ప ద నీ సా - - | స రి గ మ గా గ రి | ప మ గ రి స స ||
- హ రి కో - ప - ము తో - - | న - న్యు ల వ ర - | ము - - - - లు ||

- స రీ గ సా స గ రీ సా స ని | ద ప ప మ గా | రి గ మ ప ద ని స రి ||
- స రి గా - నెం - - చ గ - | జ గ ము - ల | లో - - - న - - - ||

- స నీ ద పా ద ని సా |
- ద ను జు లు గ ని రి |

**అవతారిక :**

ఈ పదమునందలి నాయిక ముగ్ధ– బాల. ఈమె చేష్టలను గమనించి చెలి "నటనలు చేయుచున్నావు. వింత వింత చేష్టలను చేయుచున్నావు. ఆర్తితో కరగుచున్నావు. అంతలో సిగ్గులు పడుచున్నావు. కురులన్నియు చెదరి యున్నవి. ఇటువంటి చేష్టలన్నియు నీకేలనమ్మా ! నీస్వామియగు శ్రీవేంకటేశ్వరుడు నీకు దక్కెనుగదా ! ఇకనైనను నీవు వాడిన పూవువలెనుండి నీడలు చూచుకొనుట మానవే, ఓయమ్మా !" అనుచు తన చెలిని వూరడించుచున్నది

**శంకరాభరణం – ఆది**

నీడల చూపులు నీకేలే యీ
వాడక వాడెడి వడ నీకేలె ! ॥పల్లవి॥

నిలువుల నటనలు నీకేలే యీ
నిలుగుల నడపులు నీకేలే
నెలవుల కరగులు నీకేలే యీ
కులికెటి నునుసిగ్గులు నీకేలే ! ॥నీడల॥

నెఱుల చెదరులివి నీకేలే యీ
నెఱవగు చదురులు నీకేలే
నెఱతనపు సరులు నీకేలే యిదె
చెఱగున మూసెదు చెలి నీకేలే ! ॥నీడల॥

నిక్కపు బోకులు నీకేలే యిదె
నిక్కలగంటివి నీకేలే
నిక్కటి వొరపుల నీకేలే యిదె
దక్కె వేంకటోత్తముడు నీకేలే ! ॥నీడల॥

శృం: 4–66

ప. గ మ ప మ గ మ గ రి । గ మ ప మ । పా పా ॥
నీ - డ ల చూ - పులు । నీ - కే - । తే - ॥

ద ని స రి సి ని ద ప । మ ద ప మ । గ రి స రి ॥
వా - డ క వా - డె డి । వ డ నీ - । కే - లె - ॥

ద ని స రి గ మ్మ గ రి సి ని దా ప । మ ప ద ని స ని ద ప ।
వా - డ - క - వా - డె - - డి । వ - డ - నీ - - - ।

మ ద ప మ గ రి స రి ॥
కే - - - లె - - - ॥ ॥నీడల॥

చ. స ప ప మ గా రి మ గ రి స స । గ రి స ని స ధ నీ । స రి రి స ॥
నిలువు - ల న - ట - నలు । నీ - - - కే - - । తే - యీా - ॥

స రి గ మ ప ద ద ప । మా ద ప మ గ మా । పా - మ పా ॥
నిలుగుల న డ పులు । నీ - - - - కే । తే - - - ॥

ప ద నీ సా స రి స రి రి స । స రి గ మ గ రి మ గ । సా సా ॥
నె - ల వు - ల క ర గులు । నీ - - - కే - - - । తే యీా ॥

గ మ పా ప ద నీ స గ రీ సా - ని । ద ప ప మ మ ద । పా - మ గా మ రి ॥
కు - లి కె - టి ను - ను ని - - । గ్గులు నీ - - - । కే - - తే - - ॥
॥నీడల॥

**అవతారిక :**

ఈ కీర్తనమునందు "పట్టపుదేవివైయైన అలమేలు మంగాధిపా ! నీ భావములను తెలుసుకొనుట నావశమా, పలుకు పలుకులాడు నీ నోటిని నీపలుకులకే అంకితముచేయుట, పలువిషయములను చూచు కన్నులను, నీ రూపు చూచుటకే నియమించుకొనుట, వీనులవిందగు నీ కథలను వినుటకే చోటిచ్చుట, దేహమును నీపనులకై నియమించుట మొదలగునవి చేయగలిగినచో చాలదా! నేనెంతటివాడను? ఇట్టి భావములను నాయందు ప్రేరేపించుటకు నీదే భారము. అదియే నాభాగ్యము." అని అయ్యవారు మనోవాక్కాయ కర్మలచే పరమాత్ముడగు శ్రీవేంకటేశ్వరుని, పద్మావతీరమణుని, తాము ఎట్లు కొలుచుకొనుచున్నారో చెప్పుకొనుచున్నారు.

**శంకరాభరణం - రూపకం**

నీ చిత్తము నాభాగ్యము నేనెంతటి వాడను
యేచినీవు రక్షించేదే యెక్కుడు పుణ్యమింతే ! ॥పల్లవి॥

పాటించి నీ భావము పట్టవశమా తలచి
మేటి నామనసు నీకు మీదెత్తుటింతే
నూటికైన నీనామము నుడుగగ వశమా
మాటలు నీసెలవుగా మట్టు పెట్టుటింతే ! ॥నీచి॥

వేవేలైన నీకథలు వినగ నాతరమా
సోవగా వీనులు తావు చూపుట యింతే
దేవ నీ సాకారము దృష్టించ నావశమా
పావనముగా నందులో బని గొను టింతే ! ॥నీచి॥

గట్టిగా నిన్ను బూజించ గమ్మటి నావశమా
నెట్టన నామేను నీకు నేమించు టింతే
పట్టపలమేల్మంగపతివి శ్రీవెంకటేశ
జట్టిగొను కొరకు నీశరణను టింతే ! ॥నీచి॥

ప. సా - ని ద ప ప మ || మ ద పా ప మ గా గ మ రీ ||
నీ - - చి - త్త ము || నా - - భా - - గ్య - ము ||

సా స రి గా గ మ ప ప || ప మ పా ప ద నీ సా ||
నే - - నెం - - త టి || వా - - - - డ ను || ॥నీ చిత్తము॥

2\. స రి గ మ గ రి స ని ద ప || మ ప ద ని స ని ద ప ప మ గ రి ||
నీ - - - చి - - - త్త ము || నా - - - భా - - - గ్య - ము - ||

స రి గ మ పా గ మా రి గా || ప మ పా ప ద నీ సా ||
నే - - - - నెం - త టి || వా - - - - డ ను ||

స ని సా రీ రి || స రి గ మ రి గ సా స ||
ఏ - చి నీ వు || ర - క్షిం - - - చే దే ||

స రి నీ ని స దా ద ని పా || ద ప మ గ మ ప ద ని ||
యె - - క్కు - డు పు - - || ణ్య - ము - గా - క - ||

చ. - స సా సా || స ధ నీ స రి రి రి || - స రీ గ మ || పా - గ మ రి స ||
- పా టిం చి || నీ - - భా - వ ము || - ప ట్ట వ శ || మా - త - ల చి ||

- స పా ప ప మ గ || గ ప మ గ మ రీ గ ||
- మే టి నా - - - || మ - న - సు నీ కు ||

- మ గ మా పా || ద ప మా పా - - ||
- మీ - దె త్తు || టిం - - తే - - ||

- మ గ మా పా ప || ద ప మ గ మ ప ప ద నీ ||
- నూ - టి కై న || నీ - - - నా - మ - ము ||

సా గ రి సా స ని స ద నీ || సా - - - ||
ను డు - వ గ - వ - శ || మా - - - ||

- స ని స రి రి || స రి గ మ రి గ సా స ||
- మా - ట లు నీ || సె - ల - పు - గా క ||

స రి ని ని స దా ద ని పా || ద ప మ గ మ ప ద ని ||
మ - - ట్టు - పె - - ట్టు || టిం - - - తే - - - || ॥నీ చిత్తము॥

**అవతారిక :**

మనోవాక్కాయ కర్మములచే ఎవ్వరు తమ్ము తాము నీకు సమర్పించు కొను చున్నారో వారికి గాక యెవరికి ముక్తి యలవడునని ప్రశ్నించుచు మానవ జన్మకు సాఫల్యము లగు జ్ఞానము, దానము, దయ, శాంతము, ప్రియవాక్కులు, భగవత్ చింతన. ధర్మపరాయణత్వము కలిగి నిన్ను దర్శించుట యను ఫలమును పొందుట తప్ప వేరేమియున్నవి ? ఇట్లు జీవులు సాధించుటకును నీదయాదృష్టియే కారణముగదా!" అని అన్నమయ్యవారు యీకీర్తన మున ఆధ్యాత్మిక చింతనము చేయుచున్నారు.

**రాగ లక్షణము :**

ప్రాచీన రాగములకు ఆరోహణావరోహణములు అంతనిర్దుష్టముగా కనబడవు. అట్టి రాగములలో శుద్ధవసంతమొకటి. దీనిని యిప్పటి వాడుక యందుగల మేళకర్తలలో 29 వ దగు శంకరాభరణ జన్యముగా చెప్పియున్నారు. కాని శంకరాభరణమునుండి దీనిని వేరు చేయుట కొంచెము కష్టసాధ్యమే ! ఇతరుల రచనలు యీరాగమున కానవచ్చుటలేదు. బహుశః శంకరాభరణము నుండి దీనిని విడదీయుట అనావశ్యము, అసాధ్యము అని యితర వాగ్గేయకారులు తలచి యుండవచ్చునని తోచుచున్నది. వక్రములగు కొన్ని దాటు స్వరప్రయోగములను గమనించి రాగ భావమును పోషించుకొనవలెను.

ఆరోహణ : స రి గ మ ప ద ని స

అవరోహణ : స ని ద మ ప మ గ రి స ।

శుద్ధవసంతం — ఝంపె

అంతరంగమెల్లా శ్రీహరి కొప్పించ కుండితే
వింతవింత విధముల వీడునా బంధములు ! ॥పల్లవి॥

మనుజుడై ఫలమేది మఱి జ్ఞానియౌదాకా
తనువెత్తి ఫలమేది దయ గలుగుదాకా
ధనికుడై ఫలమేది ధర్మము సేయుదాకా
పనిమాలి ముదిసితే పాసేనా భవము ! ॥అంత॥

చదివియు ఫలమేది శాంతము గలుగుదాకా
పెదవెత్తి ఫలమేది ప్రియ మాడుదాకను
మదిగల్గి ఫలమేది మాధవు దలచుదాకా
యెదుటతా రాజైతే నేలేనా పరము ! ॥అంత॥

పావనుడై ఫలము భక్తి గలిగినదాకా
జీవించేటి ఫలమేది చింత దీరు దాకను
వేవేల ఫలమేది శ్రీ వేంకటేశు గన్నదాకా
భావించి తా దేవుడైతే ప్రత్యక్షమవునా ! ॥అంత॥

అ : 5–262

ప. గ మ ప పా । ద ని సా స ॥ స గ రి స ని । ద మ పా మ ॥
అం - త రం । గ - మె ల్ల ॥ శ్రీ - హ రి - । కొ - ప్పిం చ ॥

గా రి గా । మ గ రి స రీ - ॥ గా మ పా । ద ద మ గ రి ॥
కుం డి తే । - - - - - - ॥ విం త విం । త వి ధ ము ల ॥

గ మ ద మ ప । గ మ రి సా ॥
బం - ధ ము లు । వీ - డు నా ॥ ॥అంత॥

చ. రి గ మ గ రి । స ని సా స ॥ రి గ మ ప ద । మ గ మ ప ప ॥
మ ను జు డై - । ఫ ల మే ది ॥ మ రి జ్ఞా - ని । యౌ - దా - క ॥

గ మ పా ప । ద ద దా ద ॥ ప ద ని స ని । ద మ పా ప ॥
త ను వె త్తి । ఫ ల మే ది ॥ ద య క లు గు । దా - కా - ॥

ద ని స రీ । గ రి స స ని ॥ స రి గ మ గ । రి రి సా స ॥
ధ ని కు డై । ఫ ల మే - ది ॥ ధ - ర్మం - బు । సే యు దా క ॥

ప ద ద ద ద । ప ద ని స ని ॥ ద మ పా మ । గ రి సా - ॥
ఘ ని ఘ్రా - ణి । ఘు ద్ది సి తే - ॥ పా - సే న । భ వ ము - ॥ ॥అంత॥

**అవతారిక :**

ఇందు నాయిక సౌందర్యమును సౌకుమార్యమును ఆమెతోడి పొందులయందలి ఆనందమును శ్రీ వేంకటేశ్వరునకు చెప్పుచున్నారు. "ఆమె కొప్పునుండి విరులు వ్రాలుట వసంతమనియు ఆమె తనువల్లరియందలి తావులవలన కలుగు వేడి వేసవియనియు, ఆమె కౌగిళులయందు నీపై వ్రాలెడి స్వేదబిందువులు తొలకరి జల్లులనియు, ఆమె చూపుల జల్లులు శరత్కాలపు వెన్నెలలనియు, ఆమెరతులయందు నింపెడి పులకలే హేమంతకాలమనియు, ఆమె వలపుల వంపులే శిశిరకాలమనియు" సఖి తన చెలియందు నిండియున్న ఋతు సంపదలను చెప్పుచు ఆతనికి ఆమెపై మోహాము రెట్టించునట్లు చేయుచున్నది.

ఇందు అయ్యవారు ఉపమానములను చెప్పుటయందు తమకుగల నైపుణ్యమును అతి సున్నితముగా కనబరచుచున్నారేమో ననిపించుచున్నది.

**శుద్ధవసంతం — ఆది**

కాలములారును గలిగె నీకు నిదె
బాలకి యందే పైపై నీకు ! ॥పల్లవి॥

సతి కొప్పు విరులు జల జల రాలిన
లతల వసంతకాలము నీకు
కతగా దన మైకాకలు చూపిన
అతి వేసవికాల మప్పుడేనీకు ! ॥కాలము॥

కాగిటి చెమటల కడునిను దడిపిన
కాగల తొలకరి కాలమది
వీగని చూపుల వెన్నెల చల్లిన
రాగిన మతికి శరత్కాలంబు ! ॥కాలము॥

లంచపు బులకల లలన నీరతుల
కంచపు హేమంత కాలమది
యెంచగ శ్రీ వేంకటేశ వలపుసతి
పంచ శిశిరకాల వైభవ మాయ ! ॥కాలము॥

శ్లో : 26—88

ప. స̇ ని ద మ ప మ గ రి । స గ రి స । ని̣ స ధ ని̣ ॥
కా - ల ము లా - రు ను । క లి గె నీ । - కు ని దె ॥

స రి గ మ గ రి గా । మ ప ద ని । స̇ ని సా ॥
బా - ల కి యం - దే । పై - పై - । నీ - కు ॥ ॥కాలము॥

చ. స̇ స̇ ద మ ప గ మ రి । ప మ గ రి । స ని̣ స స ॥
స తి కొ - ప్పు వి రు లు । జ ల జ ల । రా - లి న ॥

ద ని̣ స రి స ని̣ స ధ । ని̣ స రి స । రి మ గా ॥
ల త ల వ సం - - త । కా - ల ము । నీ - కు ॥

గ మ పా ద మ పా । మ ప ద ని । స̇ ని స̇ స̇ ॥
క త గా ద న మై । కా - క లు । చూ - పి న ॥

స̇ గ̇ రి̇ గ̇ గ̇ రి̇ సా̇ । ని ద మ ప । ద ని సా̇ ॥
అ తి వే - స వి కా । ల మ ప్పు డే । నీ - కు ॥ ॥కాలము॥

**అవతారిక :**

ఇందలి నాయిక స్వాధీనపతిక. ఈమె తన నాధునితో ప్రణయకలహములాడగా వారు ఇరువురు యెడమొగము పెడమొగములు కాగా అది చూచిన సఖులు "ఈమెయు నాతడును నవ్వుకొనుటలు, వారి సిగ్గులకే మూలములు, వారి కలికితనములు కాయపు కాకలను పెంపొందించుటకే మూలము'' అనుచున్నారు.

**రాగ లక్షణము :**

పూర్వగౌళ ప్రాచీనరాగములలో నొకటి. కాని శంకరాభరణ జన్యమైనను, సంచార సందర్భములలో ఇతర రాగములలో కలసి పోవుచుండుట వలననేమో ఇది ప్రచారమునుండి తొలగిపోయినదని తోచుచున్నది. ఇట్లే ప్రాచీనరాగములయందు రసవంతములగు రచనలు రాగ స్వరూపమును కనబరచుటకును లేకుండుట వలన ఆరాగములిప్పుడు వాడుకయందు లేకుండ పోయినవి. ఇది యిప్పటి వాడుక ప్రకారము 29 వ మేళమగు శంకరాభరణ జన్యము.

ఆరోహణ : స గ రి గ స రి మ ప ద ని స

అవరోహణ : స ని ధ ప మ గ రి స

**పూర్వగౌళ — రూపకం**

ఇద్దరూ నెదిరించిరి ఇన్నిటికి మూలము
పొద్దు వొద్దుకు మనము బుద్ధి చెప్పనేటికే ! ॥పల్లవి॥

నెలవి నవ్విన నవ్వు సిగ్గులకు మూలము
కలికి తనము కాకల మూలము
పలుకులు లోలోనె పై కొనుటకు మూలము
వెలసె నన్నిపనులు వేగిరించనేటికే ! ॥ఇద్దరూ॥

కొనగోరి చెనకులు కోరికలకు మూలము
పెనగులాటలు కడు ప్రియమూలము
తనివోని కొసరులు తమకముల మూలము
యెనసె దనంతటానె యెచ్చరించ నేటికే ! ॥ఇద్దరూ॥

మొగమొగాలు చూచుట మొక్కులకు మూలము
తగవులు కూటమికి దానెమూలము
నిగిడి శ్రీ వేంకటాద్రి నిలయుడు సతినేలె
పగటున నిక వేరే బాసడుగ నేటికే ! ||ఇద్దరూ||

శ్రృం : 27–375

ప. - స రి మ గ ప ప || ప మ గ గ రి రీ సా ||
- ఇ - ద్ద రూ నె ది || రిం - - - - - చి రి ||

ప మ గా ప ద ప ద ని స || రి స ని ద పా ప మ గ రి సా ||
ఇ - - న్ని టి కి - - - || మూ - - - - - ల - - - - ము ||

- గ ప పా ప || ద ప మ గ మ రి గ పా ||
- పొ ద్దు వొ ద్దు || కు - - - మ - న ము ||

- ద ద ప ద ని స ని ద || పా - గ మ పా - ||
- బు ద్ధి చె - - - ప్ప - || నే - - టి కే - || ||ఇద్దరూ||

చ. - ప ద ని స రీ ని స రీ || స రి మ గ గ మ రీ సా ||
- సె ల వి - - - న - || వ్వి - న - న - - వ్వు ||

- ని రి స ని స ద స ని ద ప || ద ప మ గ ప ద నీ సా ||
- సి - గ్గు - ల - కు - - - || మూ - - - - - - ల ము ||

- ని స రి స రీ || రి మ గా గ మ రీ రి గ సా ||
- క లి కి - త || - - - న - - ము - - ||

స రి ప మ గ రి మ గ సా || నీ రి స ని స స ద నీ సా ||
కా - - - క - ల - కు || మూ - - - - - - - - ల ము ||

- స స స సా - || ని స గ రి స ని ద ని సా ||
- ప లు కు లు - || లో - - - లో - - - నె ||

- స రి ని స ద ని || ప ద ని స రి స ని ద పా ||
- పై - కొ ను ట కు || మూ - - - - - ల - ము ||

- ప ద ని ప ద ప || ప గ మా ప ద మ ప గ మ రి గ ||
- వె ల సె - న - || న్ని - - ప - ను - లు - - - ||

స రి రి రి మ గ మ || ప ద ని స ని ద ప మ గ రి సా ||
వే - గి రిం - - చ || నే - - - - - టి - కే - - || ||ఇద్దరూ||

**అవతారిక :**

ఈ పదమునందలి నాయిక స్వాధీనపతిక, ప్రౌఢ. నాయకుడగు శ్రీ వేంకటేశ్వరుని కృపాకటాక్షమునకు మురిసిపోవుచు "నీ సోయగము, నీమోవితీపులు, నీగోటి మదనరేఖలు, నీ చెట్టాపట్టాలు, నీచేసేటి సేతలు, ఎడమెరుగని నీ కౌగిళులు, నీ మోహాములు, నీ సరసములు, నామనసునకు తనువునకు పరవశమును కలిగించుచున్నవి. నీవు నాతో నాడిన మాటలు గురిగా నెల్లప్పుడును తలచుకొనుట తప్ప నాకేమియు వలదు." అని ప్రియునికి చెప్పుకొనుచు అమ్మవారగు అలమేలుమంగాదేవి ఆనందించుచున్నది.

**రాగ లక్షణము :**

నీలాంబరి ప్రాచీనరక్తిరాగములలో నొకటి. ఇది యిప్పటి వాడుకప్రకారము ఇరవై తొమ్మిదవ మేళమగు ధీరశంకరాభరణజన్యము. 'ప ని ద ని ప' అను ప్రయోగమున కైశికి నిషాదము పలుకుచున్నది. అదియే భాషాంగస్వరము. కొందరు లక్షణకారులు దీనిని 28వ మేళమగు హరికాంభోజి జన్యమనియూ, చెప్పియున్నారు. ఇదిన్యాయముకాదు. ఇందుకాకలి నిషాద ప్రయోగము ప్రధానముగానుండి సకృత్తుగా కైశికి నిషాదము పలుకుచుండుట వలన ఇది 29 వ మేళకర్త జన్యమనుటయే యుచితముగా తోచుచున్నది. విలంబకాలమున దీర్ఘములగు స్వరములను వొదుగులతో పలికించుకొనుచు ప్రస్తరించునప్పుడే యీ రాగచ్ఛాయలు ఒప్పి నిండుదనము నిచ్చును.

ఆరోహణ : స రి గ మ ప ద ప ని స

అవరోహణ : స ని ద ని ప మ గ రి గ స ।

కొన్ని ప్రాచీనరాగములు ఆరోహణావరోహణములపైనను, జనకరాగములపైనను అంతగా ఆధారపడక కొన్నిస్వతంత్రములగు సంచార సందర్భములు గలిగి శోభించు చుండుట కర్నాటక సంగీతమునందు పరిపాటి. బేగడ, నీలాంబరి, ఆనందభైరవి, అఠాణా, దేవగాంధారి, మొదలగు రాగములిటువంటి కోవకు చెందినవి.

**నీలాంబరి — రూపకం**

ఉన్నవేమి గుఱిగావు వొద్దనుండి నీవునాతో
అన్నమాటలే గుఱుతు అప్పటికప్పటికి ! ॥పల్లవి॥

చూపులకు గుఱుతు నీసోయగమైన మేను
తీపులకు గురి నీ తేనెమోవి
కోపములకు గుఱి నీగోరి మదన రేకలే
చేపట్లకు గుఱి నీ చెట్టాపట్టాలే ! ||ఉన్న||

చిత్తమునకు గుఱుతు సేసేటి నీచేతలే
హత్తి నాయాసకు గురి అంటుగాగిలి
మొత్తపు నవ్వుకు గురి ముంచిన నీసుద్దులే
గుత్తపు వలపులకు గురి నీమోహములు ! ||ఉన్న||

పంతముల కెల్లా గురి పరచిన పానుపే
సంత సములకు గురి సరసములే
ఇంతలో (శ్రీ) వేంకటేశ ఇట్టె నన్ను గూడితివి
మంతనాల కెల్లా గురి మతి పరవశమే ! ||ఉన్న||

శృం: 26–302

ప. సాం స ని ద ని స ని పా || ని ప ప మ మ గ రి ప మా ||
ఉ న్న - వే - - - మి || గు - ఱి - గా - - - వు ||

గ రి గా మ ప ద ప మ గ || రి గ మ ప మ గ గ రి గ స ||
వొ - ద్ద నుం - డి - - - || నీ - వు - నా - - - తో - ||

స ప ప ప మ గ మ మ || రి గ మ ప మ గ మ గ మా ||
అన్న మా - - - ట లే || గు - ఱు - తు - - - - ||

మ గ మా పా స ని సా రి గ || గ స సా - - ||
అ - ప్ప టి క - ప్ప టి - || కి - - - - || ||ఉన్న||

చ. ప ప పా ని ప ప ప మ గ || రి ప ప గ మా - - ||
చూ పు ల - - కు - - - || గు ఱు తు - నీ - - ||

రి గ మ ప ని ని̣ ద ప మ గ రి గ || మ ప మ గ సా - - ||
సో - య - గ - - - మై - న - || మే - - - ను - - ||

స స స ని̣ ధ ని̣ సా || స ప ప ప మ గ మా ||
తీ పు ల - - - కు || గు రి నీ - - - - ||

మ గ రి గ మ ప మ గ రి గ మ ప || మ గ గ రి గా సా ||
తే - - - నె - - - - - - - - || మో - - - - వి ||

మ గ మా ప ప ద ప మా || ప స̇ స̇ ని ద ని పా ||
కో - ప ము ల కు - - || గు జి నీ - - - - ||

స ని సా రి̇ రి̇ గ̇ స̇ || స̇ ని ద ని స̇ రి̇ స̇ ని పా ||
గో - రి మ ద న - || రే - - - క - - - తే ||

మ గ మా పా ద ని ద ని స̇ ద || ప ప ప ప మ గ మా ||
చే - - ప - - - - ట్లకు || గు జి నీ - - - - ||

రి గ మ ప ద ప రి గ మ ప ద ప || మ గ గ రి గా సా ||
చె - ట్టా - - - ప - ట్టా - - - || తే - - - - - || ||ఉన్న||

**అవతారిక :**

పద్మావతీ దేవిని తలచుకొనుచు విరహార్తుడైన శ్రీనివాసుడు ఆమె సౌందర్యమును ఊహించుకొనుచు తన చేతలయందు ఆమెకు వెగటు కలిగినదాయనియు, తన్ను విడచి యిప్పుడేడనున్నదో, యెట్లున్నదో యనియు పరితపించు చున్నాడని అయ్యవారు యీ పదము నందు నాయకుని విరహమును వర్ణించుచున్నారు.

**రాగ లక్షణము :**

దేశాక్షి ప్రాచీనములగు ప్రసిద్ధరాగములలో నొకటి. ఇప్పటి వాడుక ప్రకారముగా ఇది 29 వ మేళమగు శంకరాభరణ జన్యము.

ఆరోహణ : స రి గ ప ద స

అవరోహణ : స ని ద ప మ గ రి స ।

ప్రాచీనరాగములలో కొన్ని కాలక్రమమున మరుగునపడి వాటికి సన్నిహితములుగా నుండిన కొన్ని యితరరాగములు ప్రచారమునకు ఎక్కువగా వచ్చుట జరుగుచున్న ఒక సత్యము. ఉదాహరణకు స ని ద ని ద ప అను నప్పుడు కైశికి నిషాద ప్రయోగము గలిగి బిలహరి యను పేరుతో భాషాంగముగా నుండిన రాగము దేశాక్షిని ప్రక్కకు నెట్టినది. ఇట్లే సామంతమును కేదారము, యీ కేదారమును నీలాంబరి ప్రక్కకు నెట్టివేయుట జరిగినది. ఇటువంటిరాగములు కర్నాటక సంగీతమునందెన్నియో గలవు. ఇప్పటికిని దేశాక్షి రాగస్వరూపమును తెలియజేయుటకు మహానుభావులైన పురందరదాసులవారి గీతమొకటి ఆధారముగానున్నది. ఇంకను కొన్ని గ్రంథములయందు శైలదేశాక్షి నారాయణదేశాక్షి మొదలగు రాగములు కనబడుచున్నవి. కాని దేశాక్షికిని, వీటికిని అంతగా సంబంధము కనబడుటలేదు.

**దేశాక్షి — ఆది**

యేడనున్నదో యీతరుణి
చూడక చూచిన చూపులలోన ! ॥పల్లవి॥

మేతల మరిగిన మీల పిల్లలకు
నింతలు నేరిపె యీతరుణి
కాంతాళించిన కన్నులనీళ్ళ
చెంతల నిండిన చెరువులలోన ! ॥యేడ॥

ముత్తెపు నవ్వుల మురిపెంబువ్వుల
యెత్తులేకట్టె యీతరుణి
లత్తిక మోవికి లంచముగాపై
మెత్తిన దంతపు మెరుగులలోన ! ||యేడ||

పసని చీకట్ల పలుమరుం ద్రవ్వి
యిసుక పాతరలె యీతరుణి
కసిగాట్ల వేంకటపతి కౌంగిట
రసములొలుక నేరము లెన్నుచును ! ||యేడ||

శ్ర్యం : 3–560

```
ప.  సా రి గా ప మ గ | రి స రి గ | పా - - ||
    యే డ ను న్న గో - | యీ - త రు | ణి - - ||

    పా ద రీ స ని ద ప | ప ద ద ప | మ గ రి స ||
    చూ డ క చూం - చి న | చూ - పు ల | లో - న - ||   ||యేడ||

చ.  ద రీ స ని ద ద ద ప | ద రీ స ని | ద ద ద ప ||
    మే - త ల మ ర గి న | మీ - ల పి | - ల్ల ల కు ||

    ద రీ స ని దా ద ప | దా స స | సా - - ||
    నిం - త లు నే రి పె | యీ త రు | ణి - - ||

    ప ద స రీ గ మ గ రీ | సా గ రీ | స ని ద ప ||
    కా - తా - ళిం - చి న | క న్ను ల | నీ - - ళ్ల ||

    ప ద ద రీ స ని ద ప | ప ప ద ప | మ గ రి స ||
    చెం - త ల నిం - డి న | చె రు వు ల | లో - న - ||   ||యేడ||
```

**అవతారిక :**

ఈ కీర్తనమునందు "అనేక జన్మముల నెత్తిన జీవునకు యీ దేహమెంతో ప్రియమగుచున్నది ! వాని వరుసల నెన్నుకొనుచు భోగముల ననుభవింపుచు ఆశలకు లోనగుచు, తిరువేంకటనాథుని కృపను గెలువక పంచేంద్రియములను గెలుచుట అసాధ్యమని యీదేహి తెలియకున్నాడు" అని అయ్యవారు చెప్పుచున్నారు.

**దేశాక్షి — ఆది**

ఎవ్వరివాడో ఈ దేహి
యివ్వల నవ్వల నీ దేహి ! ||పల్లవి||

కామించు నూరకే కలవియు లేనివి
యేమిగట్టుకొనె నీదేహి
వాములాయ నిరువదియొక వావులు
యేమని తెలిసెనో యీదేహి ! ||ఎవ్వరి||

కందువ నిజములు గల్లలునడపి
యెందుకు నెక్కెనో యీదేహి
ముందర నున్నవి మొగిదనపాట్లు
యిందె భ్రమసీ నీదేహి ! ||ఎవ్వరి||

పంచేంద్రియముల పాలాయ జన్మము
యించుక యెఱగడు యీదేహి
అంచెల శ్రీవేంకటాధీశ నీకృప
వంచగ గెలిచెను వడి నీ దేహి ! ||ఎవ్వరి||

అ : 5–244

ప. దా సఁ ని దా పా । మ గ ప ద । సా - - ॥
ఎ వ్వ రి వా డో । యీా - డే - । హి - - ॥

దా గఁ రిఁ సఁ ని ద ప । ద ప మ గ । రి గ పా ॥
య వ్వ ల న - వ్వ ల । నీ - దే - । హి - - ॥ ॥ఎవ్వరి॥

చ. గ ప ద ద ద ప మ గ గ రి । స రి గ ప మ గ మ రి । గ స రి గ పా ॥
కా - మిం చు నూ - - - ర కే । క - ల - వి - యు - । తే - - ని వి ॥

- గ పా ద సా సఁ ని ద ప । ప మ గా ప ద । సా - - ॥
- యే - మి గ ట్టు - కొ నె । నీ - - దే - । హి - - ॥

- స రి గ ప మ గ గ రి సఁ ని ద ప । ద ప మ గ గ రి గా । ప ద స ని ద ప ॥
- వా - ము - లా - - - య - ని రు । వ - ది - యొ - క । వా - - - వు లు ॥

- గ పా ద రిఁ సా సఁ ని ద ప । ద ప మ గ రి స రి గ । పా - - ॥
- యే - మ ని తె లి - సె నొ । యీా - - - దే - - - । హి - - ॥ ఎవ్వరి॥

**అవతారిక :**

జీవుడు వేరు వేరు జన్మముల నెత్తుచు ఆయాజన్మలయందు తనచుట్టునుండెడి ఇతరులతో తనయునిగా, తల్లిగా, తండ్రిగా, భార్యగా నుండుచు వేర్వేరు భాషలను మాట్లాడుచు అస్వతంత్రుడై యుండియు స్వతంత్రునివలె సంచరించుచు ఆపదలను పైనవేసికొని యెప్పటికో అప్పటికి కొండలరాయడగు తిరువేంకటనాథుని సన్నిధికి చేరవలెనని తన పుణ్యవశమున భావించుచున్నాడని అయ్యవారు గానము చేయుచున్నారు.

**రాగ లక్షణము :**

దేవగాంధారి ప్రాచీనరక్తిరాగము. భాషాంగము. ఈ రాగమునందు ని సా ని అనునప్పుడు కాకలి నిషాదము, ద నీ ద అనునప్పుడు కైశికి నిషాదమును పలుకు చుండుటచేనిది 28వ మేళజన్యమా ? 29 వ మేళజన్యమా ? అను సందేహము లక్షణకారులకు కలుగుచునే యున్నది. ఇందు తరచుగా కాకలి నిషాదనే పలుకుచుండుటవలన ధీరశంకరాభరణ జన్యముగా చెప్పి కైశికి నిషాదమును భాషాంగస్వరముగా నిర్ణయించుట న్యాయము. వెంకటమఖి సంప్రదాయమునను ఈ విధముగనే చెప్పియున్నారు.

ఆరోహణ : స రి గ రి మ ప ద ని స

అవరోహణ : స ని ద నీ ద ప మ గ రి స

**దేవగాంధారి – ఝంపె**

ఈ జీవునకు నేది గడపల తనకు
నేజాతియును లేక యిట్లున్నవాడు ! ||పల్లవి||

బహుదేహ కవచముల బారవేసినవాడు
బహుస్వతంత్రముల నాపదనొందినాడు
బహుకాలముల మింగి పరవశంబైనాడు
బహు యోనికూపములబడి వెడలినాడు ! ||ఈ జీవునకు||

పెక్కుబాసలు నేర్చి పెంపుమిగిలినవాడు
పెక్కునామములచే బిలువబడినాడు
పెక్కుకాంతలతోడ పెక్కుపురుషులతోడ
పెక్కులాగుల బెనగి చెండుపడినాడు ! ||ఈ జీవునకు||

ఉండనెన్నడు దనకు ఊరకొన్నడులేక
యెండలను నీడలకు యెడతాకినాడు
కొం డ(ల)లో నెలకొన్న కోనేటిరాయని
యండ జేరెదననుచు నాసపడినాడు ! ||ఈజీవునకు||

అ : 11(2)–56

ప. ని ద పా ప || మ గ రీ రి || రి స రి రి మ || గ రి రీ – ||
ఈ – జీ వు || న కు నే ది || గ డ ప ల – || త న కు – ||

మ ప దా ని || స ని దా ద || ని ద పా మ గ || రి మ పా – ||
నే – జా తి || యు ను లే క || ని – ట్లు న్న – || వా – డు – || ||ఈ జీవు||

చ. రి రి రి రి రి || రి మ గ రి రి || రి స రి గ స || రి స సా స ||
బ హు దే – హా || క వ చ ము లు || బా – ర వే – || సి న వా డు ||

స ని ధ ధ ధ || ని స రి రి రి || రి స రి మ మ || గ రి రీ రి ||
బ హు స్వ తం – || త్ర ము ల నా – || ప ద నొం – – || ది న నా డు ||

మ గ రీ రి || మ ప ద ద ద || మ ప ద స స || స ని ద ద ధ ||
బ హు కా ల || ము ల మిం – గి || ప ర వ శం – || బై – నా – డు ||

ని స ని స రి || రి మ గ రి రి || రి స స రి గ ||
బ హు యో – ని || కూ – ప ము ల || బ డి వె డ లి ||

సా రి గ రి గ రి స సా ||
నా – – – – డు – – || ||ఈ జీవు||

**అవతారిక :**

ఇందు గురువుల ఆజ్ఞమేరకు నడువుమని, తత్వజ్ఞానము మరువవలదని. శాంతగుణము వీడవలదని, వైరాగ్యంబున నుండుమని, తపస్సుచేయమని, గోవిందునితప్ప వేరొకరిని భజింపవల దని, దుర్జన సాంగత్యము చేయవలదని, తమ మనస్సునే అన్నమయ్యవారు వేడుకొను చున్నారు.

సంప్రదాయసిద్ధమైన యిట్టి భావములు తాళ్ళపాకవారికి పూర్వులు యెవరైన గేయ రూపమున చెప్పినారో లేదోగాని అన్నమయ్యవారి యిట్టి రచనలు చూచినచో ద్రష్టలు తప్ప వేరొకరు చెప్పజాలరని తోచుచున్నది.

**దేవగాంధారి – ఆది**

నమ్మితి జుమ్మీ వో మనసా నాకే హితవయి మెలంగుమీ
ముమ్మాటికి నేజెప్పితి జుమ్మీ మురహరు నామమె జపించుమీ ! ॥పల్లవి॥

తలచకుమీ యితర ధర్మములు తత్త్వజ్ఞానము మఱవకుమీ
కలగకుమీ యేపనికైనను కడు శాంతంబున నుండుమీ
వలవకుమీ వనితల కెప్పుడు వైరాగ్యంబున నుండుమీ
కొలువకుమీ యితర దైవముల గోవిందునినే భజించుమీ ! ॥నమ్మి॥

కోరకుమీ దేహభోగములు గొనకొని తపమే చేకొనుమీ
మీరకుమీ గురువుల యానతి మెఱయ బురాణములే వినుమీ
చేరకుమీ దుర్జన సంగతి జితేంద్రియుడవై నిలువుమీ
దూరకుమీ కర్మ ఫలంబును ధ్రువవరదునినే నుతించుమీ ! ॥నమ్మి॥

వెఱవకుమీ పుట్టుగులకు మరి వివేకించి ధీరుడవగుమీ
మఱవకుమీ యలమేల్మంగకు మగడగు శ్రీ వేంకటపతిని
కెఱలకుమీ మాయారతులను కేవల సాత్వికుడవు గమ్మీ
తొఱలకుమీ నేరములను సింధు రక్షకునినె సేవించుమీ ! ॥నమ్మి॥

అ : 11 (1)–192

ప. రీ రి రి రీ రి స | రీ మ గ | గ రి రీ ||
నమ్మితి జూమ్మి - | ఓ మ న | సా - - ||

రి మ పా ద ని స ని | ద ద ని ద | ద ప పా ||
నా - కే హి త వ యి | మె లం - గు | మీ - - ||

దా ని సా ని ద ద ద ప | పా - మ పా ద ప | మ గ గ రి ||
ము మ్మా - - టి కి నే - | చె - - ప్పి తి - | జూ - మ్మి - ||

రి రి రి స రి మ గ రి | రి సా రి గ | రి స సా - ||
ము ర హా రి నా - మ మె | జ పిం చు - | మీ - - - || ||నమ్మితి||

చ. రి రి రి రి గ మ గ రి | రి స రి గ | స రి స స ||
త ల చ కు మీ - - - | యి త ర ధ | - ర్మ ము లు ||

స ని ధ ధ ని స రి స | రి రి రి రి | గ మ గ రి ||
త - త్త్వ - జ్ఞా - న ము | మ ఱ వ కు | మీ - - - ||

మ గ గ రి మ ప దా | మ ప ద ద | ద నీ ద ప ప ||
క ల గ కు మీ - - | యే - ప ని | కై - - న ను ||

మ గ గ రి రి స రి రి | గ మ గ రి | రీ - - ||
క డు శాం - తం - బు న | నుం - - డు | మీ - - ||

మ గ ద ద ని స ద ని | ని స రి స | రి రి రి రి ||
వ ల వ కు మీ - - - | వ ని త ల | కె - ప్పు డు ||

రి స రి రి గ మ గ రి | స రి గా స రి | సా - - ||
వై - రా - గ్యం - బు న | నుం - - - డు | మీ - - ||

ద ని స స స ని ధా ని ద పా | మ ప ప మ | మ గ రి రి ||
కొ లు వ కు మీ - - - - - | యి త ర దై | - వ ము ల ||

రి స రి రి రి రి గ మ | గ గ గ రి | సా - - ||
గో - విం - ధు ని నే - | భ జిం - చు | మీ - - || ||నమ్మితి||

**అవతారిక :**

అనుభవములు, ఆలోచనలు, పుట్టుటలు, గిట్టుటలు, చదువుటలు, మొదలగునవన్నియు పరమాత్ముఁడగు శ్రీ వేంకటేశ్వరుని చేరుటకొరకు, తెలియుటకొరకు జీవులుచేయు ప్రయత్నములే నని అయ్యవారు ఈకీర్తనమునందు చెప్పుచున్నారు.

**దేవగాంధారి — త్రిపుట**

తలచినవన్నియుఁ దనకొరకే వెలిఁ
దెలియుట దనలోఁ దెలియుట కొరకే ! ॥పల్లవి॥

ఉదయ మందుట భయముడుగుట కొరకే
చదువుట మేలు విచారించుట కొరకే
బ్రతుకుట పురుషార్థ పరుండౌట కొరకే
యెదిరింగనుట తన్నెరుంగుట కొరకే ! ॥తలచిన॥

తగులుట విడివడి దలంచుట కొరకే
నొగులుట కర్మమనుభవించుటకొరకే
చిగురౌట కొమ్మయి చెలంగుటకొరకే
బెగడుట దురితంబెడబాయుట కొరకే ! ॥తలచిన॥

యీవలంజేరుట ఆవలికొరకే
ఆవలినుండుట యీవలికొరకే
ఈవలనావల నెనయందిరుగుచెల్ల
శ్రీ వేంకటేశ్వరుం జేరుటకొరకే ! ॥తలచిన॥

ఆ : 2–71

ప. ప పా | దా ని ద పా || మ మ గ | గ రి రీ || రి రి స | రి మ గ రి ||
త ల | చి - - న || వ - - | న్ని - యు || త న - | కో - ర - ||

రీ - | రీ సా || స స ని | ధా ధా || ని సా | రి స రీ ||
కే - | వెలిం || తెలి - | యు ట || త న | లో - - ||

రి రి మ | గ రి రి స || రి రి మ | పా - - ||
తెలి - | యు - ట - || కో ర - | కే - - || ||తలచిన||

చ. ప ప మ | దా దా || ని సా | స ని దా దా ||
ఉ ద - | య మం || దు ట | భ - - య ||

ద ని సా | రి స రీ || రి మ గ | గ రి రీ ||
ము - డు | గు - ట || కో ర - | కే - - ||

ద ద ని | సా స ని || ద ని ద | ద ప ప ప ||
చ దు - | వు ట - || మే - - | లు - వి - ||

పా ద ప | మ గ రి స || రి మ గ | రి రీ ||
చా - - | రిం - మ ట || కో ర - | కే - ||

స స స ని | దా దా || ని సా | రి స రీ ||
బ్రతు - - | కు ట || పు రు | పా - ర్థ ||

రి మ పా | దా ని ద పా || మ మ గ | గ రి రీ ||
ప - రుం | డౌ - - ట || కో ర - | కే - - ||

ద దా | గ రి స స || స సా - ని | ద ని ద పా ||
యె ది | రిం - గ ను || ట - - - | త - - - ||

ప ద ని ద | పా మ గ || రి రి స | రీ - మ పా ||
న్నె రుం - - | గు ట - || కో ర - | కే - - - || ||తలచిన||

**అవతారిక :**

జీవునికి జన్మసార్థకతను కలిగించునవి యేవి? బరువగు తనువును మోయుచు, ఉ గల చైతన్యమును తెలిసికొనుట, "అయ్యో! జీవితమంతయు వృథాయైనదే"యని విలపించక పరమాత్మని యెరుంగుట యొక ఫలము. తిరువేంకటనాథుడు దేవదేవోత్తముడని తెలుసు ఆదేవుని ఆరాధించుట యొకఫలమని సులభశైలిలో అన్నమయ్యవారు ఈ కీర్తన చెప్పుచున్నారు.

**దేవగాంధారి — ఆది**

కలిగి(న)మతి వృథాగాకుండా
అలరుటె పుణ్యంబగుఫలము ! ॥పల్లవి॥

ఒనరిన ఈ భవ మును రనకుండ
ఘనుడే జీవుడు గల ఫ(లము)
తనువుమోచి చైతన్యాత్మని మతి
గనుటే వివేకముగల ఫలము ! ॥కలిగి॥

చేసిన పుణ్యము చెడిపోకుండ
(శ్రీ) సంపద మెరసిన ఫలము
ఈసుల రేసుల యితర దూషణల
బాసుటె అపురూపపు ఫలము ! ॥కలిగి॥

హరి గొలిచియు మిథ్యగాకుండ
విరసముడిచి చదివిన ఫలము
తిరువేంకటగిరి దేవుని సరిగా
ధరుల గొలువనిదె బహుఫలము ! ॥కలిగి॥

అ : 11(2)–71

ప. మ ప ద ని సఁ సఁ సఁ ని | దా ద నీ ద | పా - - ||
క లి గి న మ తి వృ థా | గా కుం - - | డ - - ||

మ గ రి రి రి స రి రి | గ స రి స | సా - - ||
అ ల రు శె వు - ణ్యం - | బ గు ఫ ల | ము - - || ||కలిగిన||

చ. సఁ ని ద ద ని సఁ రిఁ సఁ | రిఁ మఁ గఁ రిఁ | రీఁ రీఁ ||
ఒ న రి న యీా - భ వ | ము సు ర న | కుం డ ||

రిఁ సఁ రిఁ గఁ సఁ రిఁ సఁ ని | ద ద స ని | సా - - ||
ఘ ను డీ - జీ - వు డు | గ ల ఫ ల | ము - - ||

ద ని స ని ద ని ద ప | ప మ పా | మ గ గ రి ||
త ను వు మో - చి చై - | త - న్యా | త్మ ని మి తి ||

రి రి రి రి గ మ గ రి | స రి గ స | రి స సా ||
గ ను శె వి వే - క ము | గ ల ఫ ల | ము - - || ||కలిగిన||

**అవతారిక :**

ఈ కీర్తనమునందు చరాచర ప్రపంచము నందలి పరమాత్మునిలీలలు అయ్యవారు ద్రష్టలు గనుక తాము దర్శించినది చెప్పుచున్నారు. "పాపములుకొన్ని, పుణ్యములుకొన్ని యని చెప్పుచున్నారు. ఇవి స్వర్గనరకములయందు జీవులకు కష్టసుఖములనిచ్చునట. దేహముల నెత్తుచున్న జీవుడు సుఖములకు పోతరించి కష్టములకు అంగలార్చుచు పొరలాడు చున్నాడుకదా! జీవులను కొందరిని స్త్రీలుగను కొందరిని పురుషులుగను సృష్టించి చీకటి వెలుగులయందు వారికి అనుభవములను ఏర్పరచుచున్నావు. ఘనమగు సంసారపు టిరకాటములలో బడి కలవరించుటలు కొంత. జీవులకు యిట్టి సుఖ దుఃఖములలో పొరలాడుటకే పట్టుచున్నదిగదా సమయము. జ్ఞానము, కర్మము అనునవి యింకను విచిత్రముగా నున్నవి నీకు శరణని మ్రొక్కి నీ దాసులై వెలసిన వారికి యీ పొరలాటము లేవియును ఉండవట. పట్టిచూచితే ఒక్కటియు నిజముగాదు జీవులు మాయామయములగు బ్రతుకులయందు పొరలుచున్నారు అను పరమసత్యములను అన్నమయ్య చిన్నచిన్న మాటలతో సామాన్యులకు సహితము అర్థమగు రీతిని చెప్పుచున్నారు.

**దేవగాంధారి_ఝంపె**

ఒరసి చూడబోతే నొకటీ నిజము లేదు
పొరల మేను ధరించి పొరలగ బట్టెను ! ॥పల్లవి॥

పాతకములటకొన్ని బలు పుణ్యాలట కొన్ని
యీతల స్వర్గనరకాలిచ్చేనట
ఘాతుల నందుగొన్నాళ్ళు యిందు గొన్నాళ్ళు దేహికి
పోతరించి కాతరించి పొరలనే పట్టెను ! ॥ఒరసి॥

పొలతులట కొందరు పురుషులట కొందరు
వెలుగును జీకట్లు విహారమట
కలవరింతలుగొంత ఘన సంసారము గొంత
పొలసి జీవులు రెంటా బొరలగ బట్టెను ! ॥ఒరసి॥

ఒక్కవంక జ్ఞానమట వొక్కవంక గర్మమట
మొక్కి యిహపరాలకు మూల మిదట
తక్కక శ్రీవెంకటేశు దాసులై గెలిచిరట
పుక్కిట నిన్నాళ్ళు రెంటా బొరలగ బట్టెను ! ॥ఒరసి॥

అ : 8_106

ప. - ద ని సా స ని దా | ని ద పా ద ప మ గ రి ||
- ఒ ర సి చూ - - | డ - - బో - - - - తె ||

- స ని ధా ని స రి స | రి మ ప ద ప ద ||
- ఒ క టి ని - జ - | ము శే - - - దు ||

- స ని దా ని స రి స | రి రి గ మ గ రి రి ||
- పొ ర ల మే - - - | ను ధ రిం - - - చి ||

రి స రి గా సా రి గ రి గ || రి స సా స ని ద ని ద ప ||
- పొ ర ల గ - - - - - || బ - - ట్టె - ను - - - || ||ఒరసి||

చ. - ప ప పా ప | ద ప మ గ రి రి రి ||
- ఒ క్క వం క | జ్ఞా - - - న మ ట ||

- మ ప ద ని ద ప పా | ద ప మ గ రి రి స ||
- ఒ క్క వం - - - క | క - - - ర్మ మ ట ||

- సా స ని ధ ధ | ని స రి స రి రి || - స రి గా స రి | సా - - - ||
- మొ క్కి - యి హ | ప - రా - ల కు || - మూ - ల మి ద | ట - - - ||

ప ప ప పా | ద ప మ గ రి రి || రి మ ప దా ని ద ప మ | ద ద ని స స ||
త క్క క శ్రీ | వెం - క - టే శు || దా - సు లై - - - - | గె లి చి ర ట ||

రి రి రి రి గ మ | గ రి రి రి రి || స రి గ స రి స | స ని ద ద ని ద ప ||
పు క్కి ట ని - | న్నా ళ్లు రెం - టా || బొ - ర ల గా - | బ - - ట్టె ను - - ||
||ఒరసి||

**అవతారిక :**

ఈ పదమునందలి నాయిక స్వీయ. నాయకుడగు శ్రీ వేంకటేశ్వరుని కృప తనపై కలుగగా "స్వామి! నేను నీ పాదములే నమ్మియున్నదానను. ఎక్కువ తక్కువ మాటలాడెడు దాననుగాను. నీవు చెప్పినట్లు ఎల్లప్పుడును చేసెడిదానను. నా కడ దాపరికములు నీ కేలా! నీ కౌగిటియందు అనవరతము అమరియున్న దానను. ఇంకను జాగులేల చేసెదవు? చెక్కులు నొక్కిన పరవశించెడి దానను. నీ సన్నలలో మసలెడి దానను. చిత్తగించి నాపై దయ యుంచుము. నా యందు ప్రేమగలవాడవు. యింత పచ్చి సేయనేలా?" అని అతనితో విన్నవించు కొనుచున్నది,

### దేవగాంధారి_రూపకం

చిత్తగించి మాపై దయసేతువుగాక
బత్తిగలవాడవింత పచ్చిసేయనేల ! ॥పల్లవి॥

మక్కువ నీ పాదాలు మరిగిన దాన నేను
యెక్కువ తక్కువ మాట లికనేలా
చెక్కులు నీవు నొక్కగా సేద దేరినట్టిదాన
పక్కన నంతేసి వేరే పరాకులేలా ! ॥చిత్త॥

చేరి నీకు నే పొద్దు చెప్పినట్టు సేసేదాన
కూరిమినీలో వట్టి గుట్టేలా
మేరతో నీ సన్నలతో మెలగేటి యట్టిదాన
గారవించితివి నన్ను కడమ మరేలా ! ॥చిత్త॥

కందువ నీ కౌగిటికి గలిగిన యట్టిదాన
చందాలు సేసుక వట్టి జాగులేలా
యిందుకే శ్రీ వేంకటేశ యిట్టె నన్ను గూడితివి
చెందెను నీ దయ నాపై చింత లికనేలా ! ॥చిత్త॥

శృం : 26_337

ప. - ప ని సా స || స ని ని ద ద ప ప మ మ మ ||
- చి త్త గిం చి || మా - - - పై - - - ద య ||

గ మ పా ని ద ద ప ప మ మ గ || గ రి రీ సా - - || - ని స ని ధ పా ||
సే - - తు - - - వు - - - || గా - - క - - || - బ త్తి గ - ల ||

నీ స గా మ || ప ని సా స స ని ని ద ద ప || ప మ మ గ గ రి రి సా ||
వా డ విం త || ప - - చ్చి సే - - - య - || నే - - - - - - - ల || చి త్త||

చ. - స స స సా || ని స మ గ గ రి రి స నీ || ని ధ పా ని సా - ||
- మ క్కు వ నీ || పా - - - దా - - - లు || మ - రి గి న - ||

స ని సా గ మా ప || - మ గ మా ప పా || ని ద ద ప ప మ మ గ గ రి రి స ||
దా - - న నే ను || - ఎ - క్కు వ శ || క్కు - వ - మా - - - ట - - - ||

గ మ ప ని సా ని ద ద ప ప మ || పా - - - - - || - ప ని స సా ||
లి - క - - నే - - - - - - || లా - - - - - || - చె క్కు లు ని ||

ని స మ గ గ రి రి సా || - ని స సా రి స స ని నీ || ని ద ద ద పా ప ||
వు - న్నొ - - - క్క గా || - సే ద దే - - - - - రి || న - - ట్టి దా న ||

- ని స గా మ || మ గ గా గా గ రి రీ స ||
- వ క్క న నం || తే - - సి వే - - రే ||

- ప ని స రి ని స ని || ని ద ద ప ప మ మ గ మా ||
- ప - రా - - - కు || లే - - - - - - - - లా || || చి త్త||

అవతారిక :

ఈ కీర్తనమునందు "చక్రాయుధుడవగు నీవు మాకు కలవు. ఈరసపు పగలు లేవు. మాకెదురునూ లేదు. నీనామము మానాలుకలయందు నిలిచియున్నది. పరులను వేడుటకు యిక చోటేది ? నీభక్తిగల మాయాత్మలయందు ఇహపరములు రెండింటికిని మమ్ముల నతీతులజేయగల తిరు మంత్రము మాకడనే యున్నదిగదా! మాకు కలిమిగాక గడములెట్లు కలుగును? ఓ తిరు వేంకటనాథా ! నీశరణాగతులమగు మాకు విచ్చిన విరివంటిదిగాక వేరువిధమగు భవమెట్లు గలుగును?" అని అయ్యవారు హరి సంకీర్తనామహత్మ్యమును గానముచేయుచున్నారు.

దేవగాంధారి — ఝంపె

కలదు తిరుమంత్రము కలదిహము బరము
కలిమి గలుగు మాకు గడమే లేదు ! ॥పల్లవి॥

కమలాక్ష నీవు మాకు గలిగియుండగ భూమి
నమరలేని దొకటి నవ్వులలేదు
నెమకి నాలుకమీద నీనామము మెలగగ
తమితో బరుల వేడ దా జోటులేదు ! ॥కలదు॥

శౌరి నీ చక్రము నాభుజము మీదనుండగాను
యీరసపు బగ లేదు యెదురూ లేదు
చేరువ నీ సేవ నాచేతులపై నుండగాను
తీరని కర్మపు వెట్టిదినమూ లేదు ! ॥కలదు॥

అచ్చుత నీపై భక్తియాతుమలో నుండగాను
రచ్చల బుట్టిన యపరాధిమూ లేదు
నిచ్చలు శ్రీ వెంకటేశ నీశరణాగతుండగా
విచ్చిన విడే కాని విచారమే లేదు ! ॥కలదు॥

ప. దరిససని | దా ద పా || మపదసదపమగ | రిరిసా - ||
కలదుతిరు | మంత్రము || కలది-హా-ము- | పరము - ||

సనిధధరిస | రీ గ మగరిరి ||
క-లిమిగలు | గుమా - - - కు ||

మపదనిదప | దపమగరీమపదా ||
గడమే - - - | తే - - - - దు - - || ||కలదు||

2. నిసరిగగరిసాసని | దాద పా ||
క-ల-దు-తి రు- | మంత్రము ||

మపదరిసనిదపమగ | రిరి సా - ||
క-ల-ది-హా-ము- | పరము - ||

చ -మగ రీ రి | రినిదపాప || -పమపాపా దప | మగ రీ రి ||
-కమలాక్షు | నీ-వుమాకు || -గలిగియుం-- | డగభూమి ||

-సరిగాసరి | సాసనిధధ || ధనిసారీ- | గమగరి రీ - ||
-నమరలే- | నిదొ-కటి || న-వ్వల- | తే - - - దు - ||

-దనిదాపా | పదనిదమపదపమగ || రిమప దప | దనిససా ||
-నెమకినా | లు-క-మీ - - - ద - || నీ-నామము | మెలగగ ||

రిరి రీరి | గమగరిరి || సరిగాసరిస | సనిదపమగరిమపద ||
తమితోప | రులవే-డ || తా- -చో-టు | తే - - - - - - దు - - - ||

దరిసస ని | దా ద పా ||
కలదుతిరు | మంత్రము ||

**అవతారిక :**

సంధ్యావందనములు జరుపుకొనుచు, యజ్ఞయాగాదులను చేసికొనుచు, డాంబికులైన బహిరాననులు అయ్యవారిని "నియమరహితులై శ్రీ వేంకటేశ్వరునిపై పాటలు పాడుకొనుచు తిరుగుచున్నారు. బ్రాహ్మణ్యమును చెడగొట్టినారు'' అని విమర్శించిరో యేమో, వైష్ణవాచార్యులను సేవించుట, విష్ణుభక్తులను పూజించుట. వారితో సహవాసములనుండుట, సర్వకాల సర్వావస్థలయందును తిరుమంత్రమును జపించుట, కంతుగురుడగు వేంకటనాథుని సంతర్పణల యందు కాలముగడపుట, మొదలగు పనులే మాకు నిత్యవిధులు. రామానుజగురువుల మతమే యిది'' యని అయ్యవారు ఈకీర్తనమునందు నిజమగు వైష్ణవులు నడచుకొను విధమును స్పష్టముగా వివరించియున్నారు.

ఇంతవరకు దొరకిన అన్నమాచార్యులవారి రచనలయందు కేదార రాగము కనబడుట లేదు. తాళ్ళపాకవారి కాలమునకు కేదారము కూడా బహుళ ప్రచారమున నుండి యుండవలెను. ఏలననగా ఘనరాగ పూర్వపంచకమునందుగల నాట, ఆరభి, వరాళి, శ్రీరాగములను అతివిస్తృతముగా వీరు ఉపయోగించియున్నారు. ఇందు ఆరభి, గౌళ, కొంచెము సకృత్తుగా కనబడుచున్నను వాని యందు అధ్యాత్మ, శృంగార రచనలు కనబడుచున్నవి. అట్లే ఘనరాగ ఉత్తర పంచకమునగల సాళంగనాట, రీతిగౌళ, మేచబౌళి, నారాయణగౌళ, కేదార యీ రాగముల యందును రచనలుండియుండును. ఇందు సాళంగనాట, మేచబౌళి, రీతిగౌళల యందు రచన లెక్కువగానున్నను నారాయణగౌళ యందు మాత్రము పూర్వపంచకమునందలి ఆరభి వలెనే సకృత్తుగానున్నవి. కేదార దొరకనేలేదు. కనుక యీ కీర్తనమును కేదారయందు స్వరపరచు ప్రయత్నము జరిగినది. ఇంకను వెలుగు చూడవలసిన తాళ్ళపాకవారి రచనల యందెచటనైనను యీరాగముండునేమో వేచి చూడవలసియున్నది.

**రాగ లక్షణము :**

ఇది ఘనరాగ ఉత్తరపంచకమునందలి రాగము.

**ఆరోహణ** : స మ గ మ ప ని స

**అవరోహణ** : స ని ప మ గ రి స ।

ఇది యిప్పటి వాడుకప్రకారము 29వ మేళమగు శంకరాభరణ జన్యము. గ మ ద ప మ గ రి స అనుప్రయోగము పూర్వాచార్యుల రచనలయందక్కడక్కడ కనబడుచున్నది. దీనిని నిజమునకు

సామంతమునుండి వేరు చేయుట కొంత కష్టమే. సామంతమునందుగల షట్శ్రుతిధైవతము కైశికి నిషాదముగా పరిణమించి నీలాంబరి అవతరించినది. ఈ రెండురాగములకు బహుసన్నిహితముగా నుండెడి కేదార తాళ్ళపాకవారి కాలమునకే లుప్తమైపోయినదా యను సందేహము కలుగుచున్నది. కాని త్యాగరాజస్వామి మొదలగు తరువాతి వాగ్గేయకారులు కేదారయందు రచనలు చెప్పియుండుట వలన రాగస్వరూపము నేటికిని మనకు నిలిచియున్నది.

### కేదార — ఆది

సహజ వైష్ణవాచార వర్తనుల
సహవాసమె మా సంధ్య ! ॥పల్లవి॥

అతిశయమగు శ్రీహరి సంకీర్తన
సతతంబును మా సంధ్య
మతి రామానుజ మతమే మాకును
చతురత మెఱసెన సంధ్య ! ॥సహజ॥

పరమ భాగవత పదసేవనమే
సరవి నెన్న మా సంధ్య
సిరివరు మహిమలు చెలువొందగ వే
సరక వినుటె మా సంధ్య ! ॥సహజ॥

మంతుకెక్క తిరుమంత్ర పఠనమే
సంతతమును మా సంధ్య
కంతుగురుడు వేంకటగిరి రాయని
సంతర్పణమే మా సంధ్య ! ॥సహజ॥

అ : 5-10

ప. స స ని సా ప ప మ । గా గ రి । స స స ని ॥
స హ జ వై ష్ణ వా - । చా ర వ । - ర్త ను ల ॥

స మ గ రి స రి రి గ । గ స సా । - - - - ॥
స హ వా - స మె మా - । సం - ధ్యా । - - - - ॥ ॥సహజ॥

చ. గ మ ప మ గ రి సా । ని స ని ధ । నీ స స ॥
అ తి శ య మ గు శ్రీ । హ రి సం - । కీ ర్త న ॥

స మ గ మ ప ని స ని । ప మ పా । - - - - ॥
స త తం - బు ను మా - । సం - ధ్యా । - - - - ॥

ప మ గ మ ప స స ని । స మ గ రి । స ని స స ॥
మ తి రా - మా - ను జ । మ త మే - । నా - కు ను ॥

ప స స ని ప ప ప మ । గ రి స ని । సా - - ॥
చ తు ర త మె అ సి న । సం - - । ధ్యా - - ॥ ॥సహజ॥

**అవతారిక :**

ఈ రచనయందు అయ్యవారు అహోబలేశ్వరుని కీర్తించుచు "ఏమయ్యా పరస్పరము విరుద్ధముగా నున్నవి కదా నీచర్యలు ! హిరణ్యకశిపుని యురము చీల్చెడి వేళ ప్రహ్లాదుడెదుటనే యున్నాడుగదా ! తనువిచ్చిన తండ్రికన్న జగత్పితవు నీవే తన కెక్కువని అపరమభక్తుడు భావించినాడా ! దేవతలందరికి పూజనీయుడగు రుద్రునితో యుద్ధముచేసి జయించితివి. తమ దేవునిపై శత్రుత్వమునుచూపిన నిన్ను ఆదేవతలెట్లు కొలుచుచున్నారో కదా ! ఇట్లే నీవు ఏనుగునకు శత్రువైన సింహము రూపము ధరించితివి. ఆ ర్తియందున్న గజరాజునురక్షించితివి. ఇది యెట్లు పొసగినదయ్యా! మనుజులు నివసించెడి గృహములంయదుడెండి స్తంభమునుండి ఆవిర్భవించి ఇందు గలడందు లేడను సందేహమువలదు అను వాక్యమును రూఢిచేసితివి. పూజాగృహములందు నిన్ను పూజించి దూరముగా తొలగి నీదృష్టికి చాటుగానున్నామని దుష్కృత్యములు చేయు మానవులకు అంతటను నీవున్నావను భీతిని కలిగించిన నిన్నెవరుపూజింతురు? వెంకటగిరియందు వెలసి శృంగారమూర్తివై అమ్మవారగు ఆదిలక్ష్మిని అహోబలేశ్వరమున వెలసిన వోనరసింహ అమ్మవారగు శ్రీమహాలక్ష్మిని తొడపై కూర్చుండబెట్టుకొని యున్నావు. చిత్రముగానున్నవి సుమా నీ లీలలు'' అని కొనియాడుచున్నారు.

**రాగ లక్షణము :**

అహిరినాట 29వ మేళమగు ధీర శంకరాభరణ జన్యము. వక్రషాడవము. ఇందు పూర్వుల రచనలు కానవచ్చుటలేదు. తాళ్ళపాకవారి కాలమున ప్రసిద్ధమై యుండవచ్చును.

ఆరోహణ : స మ గ మ ప ద ని స

అవరోహణ : స ని ప ద ని ప మ గ స

ఇందు స్వరములు సందర్భములు ఆరోహణావరోహణములను దృష్టియందుచుకొని ప్రస్తరించుకొనినచో, ఇదియు సొంపగు శంకరాభరణ జన్యరాగములలో నొకటిగా చేరును.

**ఆహిరినాట — ఆది**

అదు దరుదిగతి యహోబలేశ్వర
పొర్రిచొర్రి ధాసులు పొగడుట యెట్లు ! ॥పల్లవి॥

యెదుట జింతించితివి హిరణ్యకశిపుని
అదె ప్రహ్లాదుడు బంటగుటెట్లు
కదిసిన రుద్రుని గర్వమడచితివి
గుదిగొని దివిజులు కొలుచుట యెట్లు ! ॥అరు॥

ఘనసింహాకృతి గైకొని వుంటివి
యెనయగ గరి గాచినదెట్లు
పవివడి కంబము పగుల వెడలితివి
మనుజులు పూజించి మరుగుట యెట్లు ! ॥అరు॥

సరవితో వీర రసమున మించితివి
అరయగ శృంగారి వౌటెట్టు
సిరివుర మెక్కెను శ్రీ వెంకటాద్రిని
యిరవుగ నీ తొడ యెక్కుట యెట్టు ! ॥అరు॥

అ: 8_236

ప. స మ గ మ ప మ గ మ | ప ప స ని | ప మ గ మ ||
అ రు ద రు దీ - గ తి | అ హో - బ | లే - శ్వ ర ||

ప ద ని స స ని ప మ | గ మ ప మ | గ మ గ స ||
పొ రి బొ రి దా - సు లు | పొ గ డు ట | యె - ట్టు - || ||అరు||

చ. ప ద ని పా ద ప మ | ప ప స ని | ద ని స స ||
యె దు ట చిం చి తి వి | హి ర - ణ్య | క శి పు ని ||

స మ గ మ ప మ గ మ | ప ద ని ని | ని ప పా ||
అ దె ప్ర - హ్లా - దు డు | బం - ట గు | టె - ట్లు ||

మ గ మ ప స ని స స | స మ గ మ | గ గ స స ||
క ద సి న రు - ద్రు ని | గ - ర్వ మ | డ చి తి వి ||

స స స ని ద ని స ని | ప ద ని ప | ద ప మ గ ||
గు ది గొ ని ది వి జు లు | కొ లు చు ట | యె - ట్లు - || ||అరు||

**అవతారిక :**

ఈ పదమునందలి నాయిక జాణ, ప్రౌఢ. ఈమె తన చిడిముడులు చెలిమిక త్తెలకు చెప్పుకొనగా వారిలో ఒకతె " ఏమయ్యా ! సతీపతుల నడుమ పొలయలుకలు కలుగవా ? మచ్చికలు చల్లుచు యాపె నీతో మాటాడలేదా? అటువంటి యాపెను నీవిట్లనవచ్చునా ? నీకు వీడెమిచ్చి నీతో వేడుకలు నెరపలేదా ? ఆపెనే తిట్టవలెనా ? నీకౌగిళ్ళయందు కరగిన యాచెలిని యింత ఆగడముచేసి యిప్పుడు మాకే వంకలు దిద్దుచున్నావా? ఓ శ్రీవేంకటేశ్వరుడా ! మా యింతిని కాదనక యేలుకొనుమయ్యా!" అని స్వామికి మనవిచేయుచున్నది.

**అహిరినాట — రూపకం**

నీవేల లేదనేవు నీ సతితోను
కావరించి పడుగాక కాదనకు మికను ! ॥పల్లవి॥

మచ్చికలు చల్లుచు నీతో మాటలాడి నీకు నేడు
ఇచ్చకము నెరపదా ఇందాకను
అచ్చమైన ఆపెనే పో అన్న సుద్దులెల్లా నేను
ముచ్చటగా మరియేల మూసి దాచే విపుడు ! ॥నీవేల॥

వీడెమిచ్చి నీతోను వేసాలు వేసుకొంటా
యీడ నిట్టే వుండదా యిందాకను
యేడనైనా గాని యాపె నిన్నిటా నే దిట్టితిబో
ఆడని (నీ) వాదు లేటికి అణచేవు యిపుడు ! ॥నీవేల॥

సరి నిన్ను గాగిలించి సరసములాడు కొంటా
యిరవుకొని వుండదా ఇందాకను
అరిది శ్రీవేంకటేశ ఆపెనే పో కొసరితి
గరిమ మమ్మేల వొక్కటిసేసే విపుడు ! ॥నీవేల॥

రేకు : 26–501

ప. సా స ని నీ పా || గ మ ప ద ప ప మ గ మా ||
నీ వే - - ల || లే - ద - నే - - - వు ||

గ మ పా - మ గ గ స || స ని స మ గ మ ప మ గ మ పా ||
నీ - - - - - స తి || తో - - - - - - - - - - - ను ||

మ గ మా ప ద నీ పా || ప స నీ స మ గా సా ||
కా - వ రిం - - చి || ప - డు గా - - క ||

స ని ప ద నీ ప పా ప మ || ప మ మ గ గ స స మ గ మ పా ||
కా - - - ద న కు - - || మి - - - క - - - - - ను || ||నీవేల||

చ. ప మ మ గ గా గ స || స నీ ప ధ నీ ప నీ ||
మ చ్చి క - లు - చ || ల్లు - చు - సి - తో ||

స ని సా స మ గా || గ మ ప మ మ గ గా సా ||
మా - ట లా - డి || నీ - కు - నే - - డు ||

స ప ప ప మ గ మా || గ మ ప ద ని ప ||
ఇ చ్చ క - - - ము || నె ర ప దా - - ||

ప స స ని నీ పా - మ || పా - - - - ||
ఇం - దా - - క - - || ను - - - - ||

గ మ పా పా స ని సా || స మ గ మ ప మ మ గ గ స ||
ఆ - చ్చ మై - - న || ఆ - పె - నే - - - పో - ||

స మ గా గా గ స || స ని ప ద ని పా ప ||
ఆ - న్న సు - ద్దు || లె - ల్లా - - నే న్ను ||

ప సఁ సాఁ సాఁ || ని సఁ నీ ప ద నీ పా ||
ము చ్చ ట గా || మ - రి యే - - ల ||

మ గ మా పా ద ప ప మ మా || మ గ స మ గ మ పా - ||
మూ - సి దా - - చే - - || వి - పు - - - డు - ||

సాఁ స ని నీ పా || గ మ ప ద ప ప మ గ మా ||
నీ వే - - ల || లే - ద - నే - - - వు ||

**అవతారిక :**

'వేద వేదాంతములు నిన్ను విశ్వమున కధిపతివని చెప్పుచుండగా, క్షుద్ర దేవతలతో పాటు నిన్నూహించి కొలుచుట తెలివి లేని తనము కాదా! ఎందు చూచినను నీ చందము విశ్వాతీతమని, అవాఙ్మానసగోచరమని వినబడుచునే యున్నది. అట్టి నిన్నెరుంగక యుండెడి తెలివి యేటి తెలివి ? ఇది యెట్లున్నదనగా బంధమోక్షములను ఒక కాడికి కట్టి జూచెడి బుద్ధిహీనుని తలపువలె నున్నది. పాడైన యెరుకగాక యిదియేమి ?" అని అన్నయ్యవారు శ్రీ వేంకటగిరినాథునితో చెప్పుకొనుచున్నారు.

**రాగ లక్షణము :**

అతిప్రాచీనరాగములలో సామంతం ఒకటి. ఇప్పటి వాడుక ప్రకారము ఇది30వ మేళమగు నాగాభరణ జన్యము.

ఆరోహణ : స రి గ మ ప ని స

అవరోహణ : స ని ద ని ప మ గ రి స ।

ఐనను 'ప ద ని స' అను ప్రయోగము అచ్చటచ్చట కానవచ్చుచున్నది. షట్ శ్రుతి ధైవతమును చతుశ్శృతి ధైవతమునందు అదిమిపట్టి పలుకుట వైణికుల సంప్రదాయము. నీలాంబరి రాగము నుండి దీనిని వేరుచేయుట కొంతకష్టమే. రచనయందలి సంచారములు గమనించి రాగస్వరూపమును తెలుసుకొనవలసి యున్నది. ఈసామంతము, కొండమలహారి, గుమ్మకాంభోజి, దేశాళ మొదలగు కొన్ని రాగములతోపాటు 16వ శతాబ్ది తరువాత మరుగు పడిపోయినట్లే తోచుచున్నది. పదకవితా పితామహులు తాళ్ళపాక అన్నమయ్యవారి రచనలు యీ రాగమున దెన్నియో కలవు.

**సామంతం — ఝంపె**

పాడైన యెరుకతో బంధమోక్షములొక్క
గాడి గట్టుట తెలివి గానకే కాదా ! ॥పల్లవి॥

భావించి నిను బరబ్రహ్మమని వేదములు
వేవేలు విధుల మొరవెట్టగాను
కేవలపు నిన్ను దక్కిన దైవములగూర్చి
సేవింపుటిది తప్పుసేయుటే కాదా ! ॥పాడైన॥

సరిలేని నిను నుపనిషద్వాక్యము లెపరా
త్పరుడవని నలుగడల బలుకగాను
వరుసతో బెక్కుదైవములు సంగడినిన్ను
తొరల గొలుచుట మహాద్రోహమే కాదా ! ||పాడైన||

ఎందుజూచిన పురాణేతి హాసములు నీ
చందమే యధికమని చాటగాను
కందర్పజనక వేంకటగిరి స్వామి నీ
కందువెఱుగనిది యజ్ఞానమే కాదా ! ||పాడైన||

11 (2)–16

ప. గ మ పా మ | ప స ని పా || గా మ ప ద ప | మ గ గ రి స ||
పా - డై న | యె రు క తో || బం ధ మో - - | ఘ ము లో - క్క ||

ధ స ని సా | ప మ గ గ రి || గా మ ప మ | మ ద పా - ||
గా - డి గొ | ట్టు ట తె లి వి || గా న కే - | కా - దా - || ||పాడైన||

చ. గ మ పా మ | గ గ రి సా || సా ని స ప | ప మ గ మ రి రి ||
భా - విం చి | ని ను ప ర || బ్ర హ్మ మ ని | వే - - ద ము లు ||

గ మ పా మ | ప స ని ద ని || సా ని ద ని | సా - - - ||
వే - వే లు | వి ధు ల మొ ర || వె ట్ట గా - | ను - - - ||

స ని స రి గ | మ గ రి సా || స ని సా ని | ద ని సా స ||
కే - వ ల పు | ని - న్న ద || క్కి న దై వ | ము ల గూ ర్చి ||

ప స సా ని | ద ని ని ప ప || పా మ గ రి | మ గ రి గ గ సా ||
సే - విం పు | టి ది త - ప్పు || సే యు టే - | కా - - - దా - ||పాడైన||

**అవతారిక :**

ఈ కీర్తనమునందు అన్నమయ్యవారు భగవంతుడగు శ్రీ వేంకటేశ్వరుని కొని యాడుచు "నీవు ఇందుగలవు, అందులేవు అని సందేహామే లేదు. అన్నిటియందును, అందరి యందును నిన్ను కనుగొనెడి వారికి వారి ఆత్మలయందే నీవున్నావని తెలుసుకొనగలిగిన జ్ఞాన మును నీవొసగి జీవులను నడిపించుచున్నావు. ఇట్టివారే నిన్ను తెలుసుకొని అనుసరించి నీ యందు తాదాత్మ్యతను పొందగలుగుచున్నారు," అని జ్ఞానహీనులై తిరుగు జనుల నుద్బోధించు చున్నారు.

**సామంతం — ఝంపె**

నీవనగ నొక చోట నిలిచి వుండుట లేదు
నీవనుచు గనుగొన్న నిజమెల్ల నీవే ! ॥పల్లవి॥

తనయాత్మవలెనె భూతముల యాతుమ లెల్ల
ననయంబు గనుగొన్న యతడే నీవు
తనుగన్న తల్లిగా తగ నితర కాంతలను
అనఘుడై మది జూచు నతడే నీవు ! ॥నీవనగ॥

సతత సత్యవ్రతాచార సంపన్నుడై
అతిశయంబుగ మెలగునతడే నీవు
ధృతి దూలి ద్రవ్యంబు తృణముగా భావించు
హతకాముకుడైన యతడే నీవు ! ॥నీవనగ॥

మోదమున సుఖదుఃఖములు నొక్కరీతిగా
నాదరింపుచు నున్న యతడే నీవు
వేదోక్తమతియైన వేంకటాచలనాథ
ఆదియును నంత్యంబునంతయును నీవే ! ॥నీవనగ॥

అ : 5–135

ప. - ద ద ప ప మ | గ మ ప మ గ మ మ ||
- నీ - న న గ | నో - క - చో - ట ||

- రి గ మ పా | ని ప ప మ మ గ గ రి స ||
- ని లి చి వుం | డు - ట - లే - - - దు ||

- గ మ ప ద ప | ప ద నీ సా స ||
- నీ - వ ను చు | క - ను గొ న్న ||

స ని ద ని స ని పా ప మ | మ గ రి గ గా మ గ మ ||
ని - జ - మె - ల్లి - - | నీ - - - వే - - - || ||నీవనగ||

చ. - స స స స ని | స ధ నీ సా స || స ప ప ప మ గ మా | రీ గ మా ||
- మో ద ము న - | సు - ఖ దుః ఖ || ము లు నొ - - - క్క | రీ తి గా ||

- రి గ మ పా | ద ద పా ద ద ప ప || ని స ని ప ద | పా - - - ||
- నా - ద రిం | పు - చు ను - - న్న || య త దే నీ - | వు - - - ||

- గ మ ప ద ప | స ని ద ని సా స || - స ని సా రి గ | మ గ గ రి స ||
- వే - దో - క్త | మ - తి - యై న || - వెం - క టా - | చ ల నా - ధ ||

- స స స స ని | ద ని స రి స ని ని ప ||
- ఆ ది యు ను - | అం - - - త్యం - - బు ||

- మ గ మా పా ద ప | ప ప మ గ రి గ మ ప మ గ || మ
- నం - త యు ను - | నీ - - - వే - - - - - || - ||నీవనగ||

**అవతారిక :**

స్వాధీన పతిక యగు ప్రౌఢ నాయిక, అలమేలు మంగను స్వామి పలిన విధమును వర్ణింపుచు దంపతుల నెయ్యపుకయ్యపు విధములు, ఒకరి పై కొనునప్పటి యావేశపు టానవాళ్లు అన్నమయ్య యీ రచన యందు వర్ణించు చున్నారు.

**సామంతం – ఆది**

పొదలిన వీడెపుం బుక్కిళ్లో తమ
చొదుకుల చెమటల చొక్కిళ్లో ! ॥పల్లవి॥

ఆముకొనిన యధరామృత వేళల
మోముల మోముల మొక్కిళ్లో
కామినుల మకరికా పత్రమ్ముల
చిమక దొంతరల చెక్కిళ్లో ! ॥పొదలిన॥

కయ్యపు గౌగిట కలికి రచనలను
నెయ్యపు బులకల నిక్కిళ్లో
ముయ్యని మోహపు ముచ్చట మురిపెపు
తొయ్యలి పాదపు దొక్కిళ్లో ! ॥పొదలిన॥

మొలక లే నగవు మోముల గోళ్ల
సులిమెటి వదనపు నుక్కిళ్లో
అలమేల్ మంగకు నా వేంకటపతి
తలపు లొసంగిన దక్కిళ్లో ! ॥పొదలిన॥

రేకు : 3–31

ప. గ మ ప ని స ని ప మ | గ మ ప మ | గ రి స ని ||
పొ ద లి న పీ - డె పు | బు - క్కి - | శ్లో - త మ ||

స రి గ మ ప మ గ రి | స ని ధ ని | సా - - ||
చో దు కు ల చె మ ట ల | చె - క్కి - | శ్లో - - ||  ||పొదలిన||

చ. గ మ ప పా ద ప మ గ మ | ప స స ని | ద ద ని ప ||
మొ ల క లే - - న గ వు | మో - ము ల | గో - - ళ్ల ||

గ మ ప ప ప స స ని | ద ని స ని | సా - - ||
ను లి మె టి వ ద న పు | ను - క్కి - | శ్లో - - ||

స ని స రి గ మ గ రి | సా ని ద | ని ని ప ప ||
అ ల మే - ల్మం - గ కు | ఆ వేం - | క ట ప తి ||

గ మ ప ప పా స ని ప మ | గ రి స ని | సా - - ||
త ల పు లో సం - - గి న | ద - క్కి - | శ్లో - - ||  ||పొదలిన||

**అవతారిక :**

నాయిక విరహోత్కంఠిత, ఈమెకు అగ్నియందు నీళ్ళు జనియించి నట్లు, విరహపు వేడిగల మేన చెమటలు పుట్టుచున్నవట. అనలమునకు తోడు గాలి యుండునట్లు ఈమెకు విరహాగ్నితో పాటు నిట్టూర్పులు యెక్కువైనవి. ఎండ నీడలు కూడినట్లు వేంకట విభుని కూడిన యీామె సొబగు నేమన వచ్చునని చెలులు చెప్పుకొను చున్నారు.

ఇచ్చట నల్లని వాడగు స్వామియు, బంగారు కాంతిగల అమ్మవారును కలిసినప్పుడు ఎండ నీడల నుపమానములుగా చెప్పుటలో అన్నయమ్య వారి సౌందర్యోపాసన యందలి ఔన్నత్యము 'ఆహా !' అనిపించుచున్నది.

సామంతం — ఝంపె

ఎరవు గదు నత మాయె నిదియె కదవె
అరవీదులే సొబగు లాయె దుడుమునకు ! ॥పల్లవి॥

నిక్కముగ ననలమున నీరు జనియించె నను
టెక్కడనె పొడగంటి మిదియు గదవె
పొక్కుచును విరహాగ్ని బొరలగా జెలి మేన
జక్కబైపై బొడమె జవ్వాది చెమట ! ॥ఎరవు॥

కలుగు ననలంబు కడ గాలి యనగా నదియ
నెలమి నిచ్చట కలిగె నిదియె కదవె
చెలగేటి చెలిమేన జిత్త జాగ్నికి దోడు
నిలువ నియ్యక కలిగె నిట్టూర్పు గాలి ! ॥ఎరవు॥

నీడలు నెండలును నెయ్యమలరగ గూడు
టీడనే పొడగంటి మిదియు గదవె
వేడు కలరంగ దిరు వేంకటేశ్వరు గూడి
వాడు దేరగ గలిగె వనిత పరవశము ! ॥ఎరవు॥

శృం : 14-77

ప. - సపమగరి | సస రి గ స || - సస నీ ఫ ధ నీ | సా - - - ||
- ఎ ర వు గ డు | స త మా - యె || - ని ది యె క - ద | వే - - - ||

- గ మ పా ప మ | ప సని స స స || ద ని స ని ప మ గ | రి గ గ సా ||
- అ ర వీ డు - | చే - - సొ బ గు || లా - - - యె దు రు | ము న కు - ||
||ఎరవు||

చ. - ప ప ప మ గ | రి గ మ ప మ గ గ రి గా ||
- ని క్క ము గ - | న - న - ల - ము - న ||

స స స స స ని | స ధ నీ స స స ||
- నీ రు జ ని - | యిం - - చె న ను ||

- స స సా స ని | స ప ప ప మ గ మా ||
- టి క్క డ నె - | పొ డ గం - - - టి ||

గ రి గ మ ప మ | పా - - - || - ప ని ప మ గ మా | ప ప ని సా స ||
మి ది యు గ ద - | వే - - - || - పొ క్కు - చు - ను | వి ర - హా గ్ని ||

- స ని స రీ | గ స సా స | - ప స స ని ద ని | స రి స ని ప ప మ ||
- పొ ర ల గా | చె లి మే న | - జ క్క పై - - - | పై - - - పొ డ మె ||

గ మ ప ద ద ప పా ప మ | గ రి గా గ సా ||
జ - - - వ్వా - - ది - | చె - మ ట - || ||ఎరవు||

**అవతారిక :**

ఇందు చెలికత్తె నాథునిపై నేరములు చెప్పుకొనుచున్న నాయికతో "వెన్నచేత పట్టుకొని నేయికై పోవువారి వలెనున్నావు. నాయకుడు నీకనుసన్నల మెలగువాడై యుండగా అతనిని గంప బోర్లించి కుక్కుటములు పట్టినట్టు పట్టక యేమేమో చెప్పుచున్నావేలనమ్మా! నీ యురమునందలి హారమువలెనుండగా నాతని చేయి పట్టుకొని బాసలడిగెవిదెక్కడి వెఱ్ఱితనమమ్మా! అని ముగ్ధయగు ఆమెకు బుద్ధులు చెప్పుచున్నది.

**సామంతం – రూపకం**

వెన్నచేత బట్టుకొని వెడనేలే నేతికి
కన్నుచూపులనతని గంతగమ్మనేరవా ! ॥పల్లవి॥

చేరి చేయిచేత బట్టి సిగ్గున బాసడిగేవు
పోరచి నీవిభుడెందు వోయీనేయింక
సారెకు నీపయ్యెదలో చన్నులు దాచినట్లు
తారసిల్లి రమణుని దాచనేరవా ! ॥వెన్న॥

వొంటి జిక్కించుక నీవు వొట్టుపెట్టుకొమ్మనేవు
వెంటనై వేరొకతెను తగిలీనట్టే
గంటువేసి పోకముడి గట్టిగా గట్టినయట్టు
వొంటిగాకుండా నాతని వొడిగట్టనేరవా ! ॥వెన్న॥

మొక్కలాన గాగిలించి మోవిముద్రలు వెట్టేవు
వెక్కసా శ్రీవేంకటగోవిందుడు నీకు
వొక్కమాటే కంఠహార మురమున గట్టినట్టు
చక్కని నీ మేని తోడ జంటసేయనేరవా ! ॥వెన్న॥

శృం : 14–97

ప. రి మ గ సా స || స ని స ధ నీ || స రి గ మ పా || ద ద ప మ గ మ ||
వె - న్న చేత || బ - ట్టు కొ ని || వేడ నే - లే || నే - తి కి - - ||

మ గ మ పా ప || స ని ద ని సా || ప స ని ప ద ప || మ ప మ గ రి గ ||
క - న్ను చూ పు || ల - న త ని || గం - ప గ - మ్మ || నే - ర వా - - ||

||వెన్న||

చ. ప ప పా ద ప మా || గ రి గా మా ||
మొ క్క లా - - న || కౌ గి లిం చి ||

రి గ మా పా ద ప || మ గ గ రి సా ||
మో వి ము ద్ర లు - || వె - ట్టే - వు ||

స స స ని ధా || ధ ధ స ని సా || స రి గ మ ప మ || పా - - - ||
వె క్క సా - (శ్రీ) || వేం - క ట గో || విం - దు డు నీ - || కు - - - ||

ప ప పా ద ప మా || గ రి గ మ ప ప ||
వొ క్క మా - - చే || కం ఠ హా - ర ము ||

గ మ ప ప ద ప || స ని సా సా ||
ఉ ర ము న గ - || ట్టి న ట్టు - ||

స ని స రి గ మ గ || రి రి గ ప మ గ సా ||
చ క్క ని - - నీ - || మే ని తో - - - డ ||

స ని పా ద ప మా || ప మ మ గ గ రి సా ||
జం ట చే - - య || నే ర వా - - - - ||

||వెన్న||

**అవతారిక :**

ఈ పదమునందలి నాయిక సౌందర్యాతిశయమును వర్ణించుచు "యీమె వక్షములు తామర మొగ్గలవలెనున్నవి. అదివిచ్చి కమలములగునోయను భయముచేత నఖచంద్రికలుంచెను. ఈమె పున్నమచంద్రునివంటి వదనము వినువీధికి ఎగురునను భయమున నొత్తగుధమ్మిల్లమను రాహువును అమర్చియుంచెను. ఈమె తనులత వలపులవేడికి వాడునోయను భయమున ఘనుడగు శ్రీ వేంకటపతి కౌగిటియందుంచెను. ఇట్టి సౌభాగ్యము వలదనుటకు ఒరులకు వశమా? ఈమె తలచినట్లే దైవ మమర్చెను గదవే!" అని అమ్మవారి చెలికత్తె ముచ్చట లాడుచున్నట్లు అన్నమయ్యవారు వర్ణించుచున్నారు.

**సామంతం — ఆది**

వలదన నొరులకు వసమటవే
తలచినట్ల నిది దైవమె చేసె ! ॥పల్లవి॥

తరుణి కుచములను తామర మొగుడలు
విరిసెనోయని వెరపునను
సరగున బతి నఖచంద్ర శకలములు
దరులగలుగ నివి దైవమె చేసె ! ॥వల॥

పొలితి వదనమును పున్నమ చంద్రుడు
బలిమి నెగయునని భయమునను
మెలుత చికుర ధమ్మిల్లపు రాహువు
తల జెదరగనిది దైవమెసేసె ! ॥వల॥

వనితకు వాడునొ వలపు తాపమున
తనులతికయనుచు దమకమున
ఘన వేంకటపతి కౌగిట చెమటల
దనివి దీర్చనిది దైవమె సేసె ! ॥వల॥

శ్లో : 4–17

ప. - స రీ గ మా గ రి ప మ గ రి సా | - స నీ ధ నీ | సా స రి గ మ ||
- వ ల ద న నొ - రు - ల - కు | - వ స మ ట | వే - - - - ||

ప స సా ని సా రి రి స | స రి గ మ గ రి స ని | ద ని స ని ప మ మ గ ||
- త ల చి న ట్ల ని ది | దై - - - వ - ము - | చే - - - సె - - - ||
||వల||

చ. - గ మా ప దా ద ప ప మ | - గ మా ప ప | ద ప ప మ ||
- వ ని త కు వా - డు నొ | - వ ల పు తా | - ప ము న ||

- గ రి గ మా పా ద ప ప మ మ గ | రి గ మ ప మ గ గ రి | గా సా ||
- త ను ల తి క య - ను - చు - | త - మ - క - ము - | న - ||

- గ మా ప ద ప పా స ని స స | స రి గ మ గ రి సా | స ద నీ స స ||
- ఘ న వేం - - క ట - ప తి | కా - - - గి - ట | చె - మ ట ల ||

- స సా ని స రి రి రి స | స రి గ మ గ రి స ని | ద ని స ని ప మ మ గ ||
- త ని వి దీ - ర్చ ని ది | దై - - - వ - మె - | సే - - - సె - - - ||
||వల||

**అవతారిక :**

ఈ పదము నందలి నాయికస్వీయ ప్రౌఢ, చతుర. ఈమెకు తన నాధుడు దక్షిణ నాయకుడని తెలుసు తనయందు ఆతనికి గల మక్కువను యినుమడింప జేసికొనుటకు ఆతనితో "యౌవన వతులు మురిపెములను నేర్చినవారు. అంగన లెందరో నీ చుట్టు నుండిన నేమాయె? యుప్పాలికి యినుమడాయినట్లును, పాలునీరేకమైనట్లును, చిగురు తంగేటి జున్ను చేరినట్లును మన యిద్దరి అనురాగమును, ఆనందమును, పెంపొందుచున్నది. ఇది యెట్లున్నదనగా తీయనిదగు చెఱకునకు పంట పండినట్లున్నది." అని తననాధునితో చెప్పుకొని ఆనందించుచున్నది.

**సామంతం — రూపకం**

ఇన్నిటా జాణవైతే నేమాయను
పన్ని చెఱకున బండు వండి నట్టె ఆయను ! ॥పల్లవి॥

అందరును మనవారె అంగనలు నీకు నేడు
యెందరు చుట్టాల ఇన నేమాయను
అందుకుగా నిజాలేల అమర జెప్పగ నేల
ఇందులోనే వుప్పాలికి ఇనుమడి అయను ! ॥ఇన్నిటా॥

పనికి వచ్చిన వారె పాయపు వారెల్ల నీకు
యెనతురు గాక అందు కేమాయను
వెనక ముందెంచనేల వెఱపులు మరియేల
ఘనముగ బాలు నీరు గలసి నట్టాయను ! ॥ఇన్నిటా॥

తగినట్టి మేన వారే దండనున్న వారెల్ల
యెగ సక్కె లిందుకేల యేమాయను
నగుతా శ్రీ వేంకటేశ నన్ను గూడితి విప్పుడు
చిగురు తంగేటి జున్ను చేరినట్టె ఆయను ! ॥ఇన్నిటా॥

రేకు : 26–561

ప. పా ప మ మా గ గ ర స రి గా మ గ || స స స ని ధ ని సా ||
ఇ న్ని - టా - - - జా - - - - - || ఱ - వై - - - తే ||

స రి గ స రీ రి || గ మ పా మ ప దా పా ||
నే - - - మా యె || ను - - - - - - - ||

సా స ని ద ని స రి స ని ద స || ి రి స స ద ని స స ప ప ||
ప న్ని - చె - అ - కు - - - || న - - - - - - - - పం డు ||

ద ప ప ప మ గ ప మ మ మ గ రి || మ గ గ ర స ని స ర గ మ పా ||
వం - డి - - - న - ట్టా - - - || యె - - - - - - ను - - - - ||ఇన్ని టా|

చ ప ప ద ని స ని ప ప || ద ప ప మ మ గ రి గ మ గ మా ||
అం ద రు - ను - మ న || వా - - - - - - రె - - - - ||

ప ప ద ని స ని పా || ద ప ప మ మ గ రి గ మ గ మా ||
అం గ న - - - లు || నీ - కు - - - నే - - - డు ||

రి గ మా రి గ మ గ మా || రి గ మా రి గ మ గ మా ||
ఎం - ద రు - - - చు || ట్టా - - ల - యి - న ||

రి గ మ ప ద ప ప మ మ గ గ రి || గ సా - - ||
నే - - - మా - - - య - - - || ను - - - ||

స స స ని ద ని సా || స స స ని ద ని సా ||
అం దు కు - - - గా || ని జా తే - - - ల ||

స మ గా గ రి గ రి స స || స ని ద ని సా - - ||
అ ఘ ర జె - - - ప్పగ || నే - - - ల - - ||

సా సని ద ని స రి స ని ద ని || స రి స ని ద ని స ని ని ప ||
ఇం - దు లో - - - నే - - - || వు - - - పొ్వ - ళి - కి - ||

ద ప ప మ మ గ ప మ మ మ గ ర || మ గ గ రి స ని స రి గ మ పా ||
ఇ - ను - - - మ - డి - ఆ - || య - - - - - - ను - - - - ||

పా ప మ మ గ గ రి స రి గా మ గ || స
ఇ న్ని - టా - - - జా - - - - || ణ

**అవతారిక :**

"మనసులో మనకు ఇష్టములు కలిగితే మన చేతలన్నియును ఇంపుగానే యుండును. తాళిమి గలిగితే తమకములు హెచ్చి కూటములు తనువుల కింపు సేయును. ఒకరికొకరు ఎడ మొగము పెడమొగము పెట్టుకొన్నచో తగవులు హెచ్చునే కాని తగ్గవు గదా! కనుక నాయకుడగు (శ్రీ) వెంకటేశ్వరునకు ఈ తార్కాణములు తెలియవా, రానీవే అతడు వచ్చినచో అన్నియు చక్కబడును." అని నాయిక చెలికత్తెతో చెప్పుచున్నది.

**రాగ లక్షణము :**

భోగచ్ఛాయానాట అనునది ప్రాచీన రాగము. దీనిని ఛాయానాట అనుటయు కలదు. ఇది షాడవ వక్ర సంపూర్ణము. ఇప్పటి వాడుక ప్రకారము 34వ మేళమగు వాగధీశ్వరి జన్యము.

ఆరోహణ : స రి గ మ ప ని స

**అవరోహణ :** స ని ద ని ప మ రి స

'ప స ని ప' అనునది విశేష ప్రయోగము. ఈ రాగమునందు ఒకటి రెండు త్యాగరాజస్వామివారి రచనలు తప్ప మరి యెవ్వరి రచనలు కానవచ్చుట లేదు నిజమునకు చాలా రాగములకు చిన్న చిన్న మార్పులతో క్రొత్తక్రొత్త స్వరూపములేర్పడి అంతకు ముందున్న రాగములు నామావశిష్టములై పోయినవేమోనని యనిపించుచున్నది. నీలాంబరి, సామంతు, కేదారగౌళ యీ మూడింటి యందును గల వ్యత్యాసమును వ్రాతయందు చూపుట అంత సులభము కాదు అట్లే దేశాక్షి బిలహరియును, రక్తి భాగమును పరిశీలించినచో రాగమునందు విహరించుట తెలియకనో యేమో మనకు కొన్ని రాగములు రక్తినివ్వవు. అంత మాత్రమున ఒకప్పుడెంతో ప్రచారములో నుండిన ఆ రాగములు రక్తిహీనము లనజాలముగదా!

**ఛాయానట — రూపకం**

తానెరగడటవే యీ తారుకాణలెల్లాను
రానీవే కాదనేనా రమణుని నీడకు ! ॥పల్లవి॥

తలపు సమ్మతించితే తనువు సమ్మతించును
వలపు గలిగితేనే వాడికె గలుగును
చలము విడువకున్న సాదించవచ్చు బనులు
ఫలుకులు మంచివైతే పంతమును మంచిదే ! ॥తానె॥

తగులు తప్పకుండితే తమకము తప్పదు
తెగువలు పుట్టితేను తెరకువా బుట్టును
నగవులు నిండితేను నయము దోడన నిండు
తగవులు నిలిపితే తాలిములు నిలుచు ! ॥తానె॥

చెనకలు మొనపితే సిగ్గులును మొనపును
ననుపులు మిగిలితే నమ్మికలు మిగులును
యెనసి (శ్రీ) వేంకటేశుడీడకే తావిచ్చేసీ
చనవు సతమై తేనే సరసమూ సతము ! ॥తానె॥

శృం : 19—59

ప. - సా సం ని ద ని పా ॥ మా మ రి ప మ రీ సా ॥
- తా నె - ర - గ ॥ డ ట - వే - - యీ ॥

- గ మ పా ని ప ప మ గ మ ॥ ప మ రి స రి గ మా ప ని ॥
- తా - రు - - కా - - - ॥ నా - - - లె - - ల్లా - ॥

ప సా సం ని ద ని పా ॥ ని స రీ గా ॥
ను రా నీ - - - వే ॥ కా ద నే నా ॥

మ మ మ రి రీ రి స ॥ సా - ని ద ని పా ॥ ని సా సం ని ద ని పా ॥
ర మ ణు - - ని - ॥ నీ - - - డ కు ॥ - తా నె - రు - గ ॥

చ. - గ మ ప పా మ ॥ రీ ప మ రి స ॥ - స స స స ని ధ ని ॥ ధా ని సా - ॥
- త ల పు స మ్మ ॥ తిం చి - తే - ॥ - త ను వు స - - మ్మ ॥ తిం చు ను - ॥

- ధ ని స రి రి స ॥ ని స రి స రీ గా ॥ - గ మ ప ప ని స ని ద ని ॥
- వ ల పు గ లి గి ॥ తే - - - నే - ॥ - వా - డి కె - - - - - ॥

ప ప ప మ పా - ॥
గ ల్లు గు - ను - ॥

. గ మ ప ప ని ప || స ని ద ని ప ని సా || స ని స రి రి స ||
- చ ల ము వి డు వ || కు - - న్న - - - || సా - దిం - చ - ||

సి స ని స ద నీ సా ||
వ చ్చు - ప - ను లు ||

- ప ని స స రీ || రి స రీ గా || మా మ రి రి రి స || సా - ని ద ని పా ||
- ప లు కు లు మం || చి - వై తే || పం త - ము ను - || మం - - చి - దే ||

ని సా స ని ద ని పా ||
- తా నె - ర - గ ||

**అవతారిక :**

"వెనుకటి జన్మములయందు ఎందరికి యెన్ని విధములగు చుట్టరికములతో గడిపినదో యీ జీవుడు - కొందరికి తోబుట్టువుగను, మరి కొందరికి సతీసుతులుగను, సుఖదుఃఖములు కలిగించు అశాశ్వతములగు రకరకముల దేహములను మోయుచు తిరిగిన యీజీవుడు ఎచటనుండి ఇచటికి వచ్చెనో, ఇచ్చట నుండి ఎచటకు పోవునో తిరువేంకటేశ్వరుని మాయలలో దగిలిన వీనికి పదవులు కలుగుచునే యుండును గదా" అని శ్రీ వెంకటేశ్వరుని సన్నిధిని అయ్యవారు చెప్పు కొను చున్నారు.

**రాగ లక్షణము :**

నాట రాగము ప్రాచీనము. ఇప్పటి వాడుక ప్రకారము 36వ మేళకర్త ఆదినాట అంత్యసురటి 'యనులోకోక్తి యెప్పటి నుండి వాడుకయైనదో తెలియదుగాని ప్రాచీనమగు యీ రాగామునందు రచనలు, ఈ రాగప్రశంస 5,6 శతాబ్దములనుండియు కానవచ్చు చున్నది.

పెద్దనామత్యుని మను చరిత్ర యందు నాట, దేశాక్షి రాగముల ప్రసక్తి కనబడు చున్నది. ఇట్లే ఘనరాగములలో నొకటియగు నాట అన్నమాచార్యుల వారి కాలమున గూడ ఇప్పుడు వాడుక యందున్నట్లే యుండి యుండవచ్చునని భావించ వచ్చును, అంతర గాంధార కాకలినిషాదములు, షట్శ్రుతిరిషభ ధైవతములు కలిగి ప్రతి స్వరమునకు సర్వ సందర్భముల ఆవర్తి కలిగి గంభీర ప్రకృతితో శోభించు రక్తి రాగములలో ఇది యొకటి.

**నాట — ఝంపె**

యెవ్వరెవ్వరి వాడో యీ జీవుండుచూడ
నెవ్వరికి నేమౌనో యీజీవుండు ! ॥పల్లవి॥

ఎందరికిం గొడుకుగా దీజీవుండు వెను
కెందరికి దోబుట్టుండీ జీవుండు
యెందరిని భ్రమయించండీ జీవుండు దుఃఖ
మెందరికి గావింపండీ జీవుండు ! ॥ఎవ్వ॥

యెక్కడెక్కడ దిరుగండీ జీవుండు వెను
కెక్కడో తన జన్మమీ జీవుండు
యెక్కడి చుట్టము దనకు నీజీవుండు యెప్పు
డెక్కడికి నేగునో యీ జీవుండు ! ॥ఎవ్వ॥

యెన్నడునుం జేటులేని జీవుండు వెను
కెన్నిదనువులు మోవండీ జీవుండు
యెన్నంగల తిరువేంకటేశు మాయలం దగిలి
యెన్నిపదములంబొోందండీ జీవుండు ! ॥ఎవ్వ॥

ఆ : 2–97

ప. గా మ పా | ప ప పా మ || గ మ పా మ | రీ సా స ||
యె వ్వ రె | వ్వ రి వా డో || యీ - జీ వుం | డు చూ డ ||

నీ స స స | రీ సా స || ని స రీ రి | సా - - - ||
ఎ వ్వ రి కి | ఏ మౌ నో || ఈ - జీ వుం | డు - - - || ||ఎవ్వ||

చ. మా మ మ మ | రి రి స సా || సా రీ గ | మా మ మ మ ||
ఎం ద రి కి | కొ డు కు గా || దీ జీ వుం | డు వె ను క ||

గా మ మ మ | పా పా ప || మా మ ద ద | పా - - - ||
నెం ద రి క | తో బు ట్టు || డీ జీ - వుం | డు - - - ||

నీ స స స | రి రి సా స || నీ సా స | రీ స స స ||
ఎం ద రి ని | భ్ర మ యిం చం || డీ జీ వుం | డు దుః - ఖ ||

నీ స స ని | దా పా మ || గ మ పా మ | రీ సా స ||

**అవతారిక :**

ఈకీర్తనము నందు "హరిని నమ్మని వారు అసురులై చెడుచున్నారు. తొల్లి నరకాసురుడు తానే దైవమనుకొని చెడినాడు. అట్లే హరి నామస్మరణమే పాపమన తప్పని తానే దైవమనని యనుకొని విర్రవీగిన హిరణ్యాకశిపుడు చెడినాడు. సురలు, శుకుడాది గాగల మునులు వైష్ణవోత్తములై శ్రీ వెంకటగిరి యందు నెలసిన శ్రీనివాసుని కొలిచి, అతని కరుణ వలన కైవల్యము నందుచున్నారు. చిత్ర మేమనగా యిప్పటికిని హరినామము నొల్లని యసురులు కొందరు ఇంకను కనబడుచునే యున్నారు." అని అయ్యవారు హరి యవతారమగు శ్రీ వెంకట నాథుని కొనియాడుచు అతని మహిమలను పొగడుచు, హరికి శత్రువులైన యసురులను తలచి జాలి నొందు చున్నారు.

**నాట — ఝంపె**

దాసోహమను బుద్ధి దలచరు దానవులు
యీసులకే పెనగేరు యిప్పుడూ గొందరు ! ॥పల్లవి॥

హరి చక్రము దూషించే యట్టివారే యసురలు
అరయదామె దైవమన్న వారు నసురలే
ధర నరకాసురుడు తానే దైవమని చెడె
యిరవై యిది మానరు యిప్పుడూ గొందరు ! ॥దాసో॥

పురుషోత్తముని పూజ పొంత బోరు అసురలు
సరవి విష్ణుని జపించని వారు నసురలే
హిరణ్యకశిపుడు యీతని నొల్లక చెడె
యిరవై యీతని నొల్లరిప్పుడూ గొందరు ! ॥దాసో॥

సురలును మునులును శుకాది యోగులును
పరమము శ్రీ వెంకటపతి యనుచు
శరణని బ్రదికేరు సరినేడు వైష్ణవులు
యెర పరికాన బొయ్యేరిప్పుడూ గొందరు ! ॥దాసో॥

ప. గ మ పా మ । రి రి సా స ॥ ని స ని ధా । ధ ని సా స ॥
దా - సో హ । మ ను బు ద్ధి ॥ ద ల చ రు । దా న వు లు ॥

గ మ ప ద ప । స ని పా మ ॥ గ మ ప ద ప ప మ । గ మ ప మ రీ సా ॥
1. యీ - సు ల కే । పె న గే రు ॥ యి - ప్పు డు - - - । గో౦ - - - ద రు ॥

2. ,, ,, ॥ గ మ పా ద ప ప మ । గ మ గ మ రి రి స ॥
॥ యి - ప్పు డు - - - । గో౦ - - - ద రు - ॥
॥దా సో॥

చ. మ మ మ మ రి । రి స సా స ॥ స ని ధా ధ । స ని సా స ॥
హ రి చ క్ర ము । దూ - షిం చే ॥ య ట్టి వా రే । య సు ర లు ॥

రి గ మ రి గ । మా గా మ ॥ గ మ పా ద ప । మ రి రి సా ॥
అ ర య దా - । మె దై వ ॥ మ న్న వా రు - । న సు ర లే ॥

ద ప మ గ మ । ప ని స రి స ॥ గ మ రీ రి । స స ని సా ॥
ధ ర న క - । కా - సు రు డు ॥ తా నె దై వ । మ ని చె డే ॥

ప ని స స స । స ని ప ప ప మ ॥ గ మ ప ద ప ప మ । గ మ ప మ రి స ॥
యి ర వై యి ది । మా - న రూ - - ॥ యి - ప్పు డు - - - । గో౦ - ద - రు - ॥
॥దా సో॥

అవతారిక :

ఈ పదము నందలి నాయిక ప్రేమ గర్విత, రూప గర్విత, స్వాధీన పతిక. ఈమె తనకు నాథుని యందుగల చనవుచే అలుగుటలు, జంకించుటలు, చెలులపై కసరులు విసరులు బోవుటలు చేయుచున్నది ఈమెకు అత్యంత సన్నిహితురాలగు చెలి "నీవు పంతములకుపోయి వంతులకుపోయి వాదులు పెంచుకొను చుంటివి, నవ్వులాడుచు మొగము ముడుచు కొనుచు ఎగదిగి పోతలకు పోవుచుంటివి. సిగ్గులు పోయెదవు. నీ స్వామిని కూడెదవు ఎక్కువ తక్కువ మాటలు మాతో నాడెదవు, స్వాధీనుడైన పతికి నీ సర్వసమూ సమర్పించుకొని సుఖమున నుండ వలె గాని యిట్టి వేషములు వేసి మా ప్రాణములు తీయుట తగునా! నేనేమి చేతునోయమ్మా!" అని అమ్మవారగు అలమేలు మంగా దేవికి బుద్ధులు చెప్పుచున్నదని అన్నమయ్యవారు పాడుచున్నారు.

నాట — రూపకం

అందుకే పోనీ చేత నగడైతిమి
యిందరిని మొఱగేవు యేడ చొచ్చేదే ! ॥పల్లవి॥

పంతమే కావలె నొండె పతితో నిప్పటి వేళ
సంతమే కావలె గాక సటలేటిదే
వంతులకు బెనగేవు వాదూలకు వచ్చేవు
యింతలో రెడ్డూనైతే యేడ చొచ్చేదే ! ॥అందు॥

నగవే కావలె నొండె నడుమ నీతని తోడి
తెగువ గావలెగాక తిట్టులేటిదే
మొగమును జూచేవు మోనాన తలవంచేవు
యెగదిగ పోతలైతే నేడ చొచ్చేదే ! ॥అందు॥

సిగ్గులే కావలె నొండె శ్రీ వేంకటేశు నిట్టె
దగ్గరి కూడుటే కాక తచ్చ నేటిదే
అగ్గమై కూడితివి అన్నిమాట లాడితివి
యెగ్గులు నెమ్మెలునైతే నేడ చొచ్చేదే ! ॥అందు॥

శ్రృం : 26—271

ప. స గ మా పా ద ప ప మ మా || గ మ పా - మ రి రి స ||
అం - దు కే - - పో - . || నీ - - - - చే - త ||

గ మ పా ద ప స ని సా || స ని ప మ గ మ ప మ రి - స ||
న - గ - - దై - - || తి - - - - - - - - మి - - ||

ప ని స రీ - || గ మ ప ద ప ప మ గ మా ||
యిం ద రి ని - || మొ - అ - గే - - - వు ||

గ మ ప ద పా ద ని సా || స ని ప మ గ మ ప మ రి రి సా ||
యే - - - డ చో - - || చ్చే - - - - - - - - దే - - || ||అందు||

చ. మా మ గ మా పా || ద ద ప మ ప ప మ గ మా ||
పం త - మే కా || వ - లె - నొం - - - డె ||

మ గ మా పా ద ప ప మ ప మ || మ గ రి గ మా రి స ||
ప - తి తో - - ని - - - || ప్ప - టి - - వే ళ ||

స ప ప ప మ గ మా || గ మ పా ద ప ప మ రి రి స ||
సం త మే - - - కా || వ - లె - - గా - - క - ||

స ని పా ని స రి స రి రి || రి స సా - - ||
స - ట తే - - - - టి || దే - - - - ||

పా ద ప ప ప మ గ మా || గ మ ప ద పా ద ని స స ||
వం తు - ల - - - కు || పె - న - - గే - - వు ||

ప ని సా రీ గా || గ మ ప మ గ మ రీ సా
వా - దు ల కు || వ - - - - - - చ్చే వు ||

ప ని సా రీ ఠి స || స ని ద ని స ని ప ద ప ||
ఋం - - లో రెం - || డూ - - - - - - నై - తే ||

గ మ ప ని స ఠి ని సా ని పా || ద పా మ గ మ రీ సా ||
యే - డ - - - చో - - - || చ్చే - - - - దే - || ||అందు||

**అవతారిక :**

వేంకటాచలపతియగు శ్రీనివాసుని దిగువ తిరుపతి యందలి గోవింద రాజస్వామిని చూచి వారి వైభవములను, అలంకారములను కొనియాడుచు "మీరిద్దరు ఒకటియా లేక వేరు వేరా చెప్పుడు'' అని అయ్యవారు భక్తి పారవశ్యముతో ప్రార్థించుచున్నారు. ఇందు వరద రాజ స్వామి సవ్వళించి యుండుటయు, వెంకటాచలపతి నిలువబడి యుండుటయు, వారి వారి ఆభరణములను అయ్యవారు వర్ణించుటయు గమనార్హము.

**రాగ లక్షణం :**

వరాళి రాగము ప్రాచీనము ఘనరాగము. ఇప్పటి వాడుకలోగల మేళకర్తలయందు 39వ మేళముగా చెప్పియున్నారు. ఇందలి సర్వసంచారములు గమనించిచో ఇది ప్రాచీన కాలము వనుండిన ఒక భాషాంగ రాగమని తోచుచున్నది. ఏలననగా 'స గ రి గ మ ప' అనునప్పుడు చతుశ్రుతిరిషభము పలుకుచున్నది తిరిగి అవరోహణము నందు 'ప మ గా రి స' అనునప్పుడు శుద్ధగాంధారముగా చతుశ్రుతిఋషభ స్థానమునందు కంపితముతో సాధారణ గాంధారమును స్పృశించుచు దిగుచున్నది అనుభవజ్ఞులైన చాలమంది పెద్దలకిది తెలియజేసినప్పుడు వారును ఇటువలెనే అభిప్రాయపడినారు. వెంకటమఖి సంప్రదాయమున చెప్పిన ధాలివరాళి రాగలక్షణములలో 'స గ రి గ మ పా', 'ప మ గా రి స'–అను ప్రయోగములు ముఖ్యములని చెప్పియున్నారు.

ఆరోహణ : స గ రి గ మ ప ద ని స

అవరోహణ : స ని ద ప మ గా రి స

**వరాళి – ఆది**

వేంకటగిరి గోవిందుడా
యింకా నొకరో యిద్దరో మీరు ! ॥పల్లవి॥

పచ్చలు దాచిన బాహుపురులతో
అచ్చపు గరముల అందముతో
అచ్చలు నిచ్చలు నలను(రు)దురిదివో
నిచ్చలు నీవో నీవో కానీ ! ॥వేంకట॥

నిలుచుండుటయును నెరి బవళింపుచు
నలరుటయును మీరటునిటును
జలజాతములు దొడ చరచగ నొరపుల
వెలయగ నిద్రో విభవమిదో ! ॥వేంకట॥

తిరువేంకటగిరి దిగువ తిరుపతిని
పరమానందపు బహుసిరులు
అరుదుగ బొందుచు అధికము అందుచు
ఉరగశయనుడవో వొడయడవో ! ॥వేంకట॥

అ : 11(2)–28

ప. ప మ ని ని ద ద ప మ | గా – రి | సా – – ||
వెం – క ట గి రి గో – | విం – దు | డా – – ||

స ని స గ రి గ మ ప | ప ద ని స | రి స ని ద ప మ ||
యిం – కా – నొ క రో – | యి – ద్ద రో | మీ – – – రు – || ||వెంకట||

చ. గ రి స గ మా మ మ || మ ద ప మ | మ ప గ మ ||
ప – చ్చ లు దా చి న || బా – హు పు | రు ల తో – ||

గా మ మ ని ని ద ద | పా మ గ | మా – – ||
అ చ్చ పు క ర ము ల | అం ద ము | తో – – ||

ని ని ద ద ని ని ద ద | ప ప మ గ | మ మ గా ||
ఆ – చ్చ లు ని – చ్చ లు | న ల రు దు | రి ది వో ||

స గ రి గ మా ని ద పా | ద ప మ గ మా | గ గ రి స గా ||
ని – చ్చ లు వీ – – వో | నీ – – – వో | కా – – – నీ || ||వెంకట||

**అవతారిక :**

ఇంద్రియముల యొక్క గుణములను తెలుసుకొని భగవంతుని యందు మనసును లగ్నము చేసి, అన్యవ్యాపారముల యందు చరించుట నిలువవలెను. అటుల ఆపుకొనని జీవుడు నీరు ప్రవహించిన వెనుక అడ్డకట్ట కట్టిన తీరున చింతించ వలసి యుండును. నిప్పును చూచినచో మిడతలు తమకు పని లేకున్నను దగ్గరకు పోయి అందు పడి భస్మమగు చున్నట్లే బలవత్తరమగు మాయ క్రమ్ముటవలన స్త్రీ పురుషులు ఒకరి యందొకరు లగ్నములగు మనసులను పొందు చున్నారు. స్త్రీలను, ధనములను, భోగములను దూరముగా నుంచుకొని తనను తాను రక్షించు కొనవలెనే గాని, దగ్గరగా జరిగినచో అట్టివి త్యజించుట యింకను కష్టము గనుక హరిదాసులను సేవించి వారితో కలిసి యుండుట వలన శ్రీ వేంకటేశ్వరుని కృపా కటాక్షములను పొంది జీవులు సుఖింతురు" అని అయ్యవారు చెప్పుచున్నారు.

ఇది యెట్లున్నదనగా ముత్యపు చిప్పల యందు సామాన్యమగు నీటి బిందువు పడినను, అది వెలగల ముత్యముగా కూరుట మనము గమనించుచునే యున్నాముగదా !

**రాగ లక్షణము :**

రామక్రియ ప్రాచీనములగు రక్తిరాగములలో నొకటి. మేళకర్తల యవతరణకు పూర్వము నుండి ప్రసిద్ధముగా నుండిన యీ రామక్రియను లాక్షణికులు 51వ మేళమునకు జన్యముగాను, కొందరు కాశి రామక్రియ అను పేరుతో 51వ మేళముగను చెప్పియున్నారు. సంపూర్ణమగు కామవర్ధని మేళమునకు జన్యముగా అప్పుడు దీనిని గుర్తించి వక్రసంపూర్ణముగా పాడుట ప్రచారములో నున్నది. 'స గ రి గ మ ప ద ని స | స ని ద ని ద ప మ గ రి స' అని ఆరోహణావరోహణము లిట్లున్నను, దీనియందు సంపూర్ణ సంచారములు వచ్చుటయు కలదని కొందరు పెద్దల మతము. దీనిని కాశిరామక్రియ యని 51వ మేళముగా చెప్పియున్నను ఇందు గల వక్రసంచార దాటుస్వర ప్రయోగములను విశేషప్రయోగములుగాను రక్తిగల స్వర సందర్భములుగాను చెప్పియుండుట వలన ప్రాచీన రాగమగు రామక్రియనే కాశిరామక్రియగా చెప్పుకొన్నారేమోనని తోచుచున్నది. దీనినే కామవర్ధని, పంతువరాళి అను పేర్లతో పిలుచుటయు కలదు.

**రామక్రియ — ఏక**

ముందే తొలగవలె మోసపోక సంగమెల్ల
కందువ బోయిన నీళ్లు కట్టగట్ట వచ్చునా ! ॥పల్లవి॥

అనలము బొడగంటే నందనున్న మిడుతలు
పనిలేకున్నా నందు బడ కుండీనా
పొనిగి చెలుల గంటే పురుషుల చూపులెల్లా
ననిళము నందు మీద నంట జారకుండునా ! ॥ముందే॥

గాలపు వెట్టిల గంటే కమ్మి నీటిలో మీలు
జాలి నా పసల జిక్కి చావకుండీనా
అలరి బంగారు గంటే నందరి మనసులూను
పోలిమి నాపస జిక్కి పుంగుడుగా కుండునా! ॥ముందే॥

చేరి ముత్యపు జిప్పల చినుకులు నిలిచితే
మేర తేట ముత్యములై మించకుండీనా
ధారుణి శ్రీ వెంకటేశ దాసుల సంగతి నుంటే
పోరచి నే జీవులైన బుణ్యులు గాకుందురా! ॥ముందే॥

అ : 10–66

ప దదసా – – | ని నిదదపా || పా గపామ | పాదపామ ||
ముం – దే – – | తొ లగవ లె || మో సపో క | సంగమెల్ల ||

పమగా మపదా | దనిసాసా || సారిసాని | దాప నిదప ||
కం – – దువపో | యిననీళ్ళు || కట్టగట్ట | వచ్చునా – – ||ముందే||

చ. గమపాపమగ రి | గాగాగా || గమపపాపమ | గరిగగా – ||
అనలము – పొడ | గంటే – || అం – డనున్న – | మిడతలు – ||

గపపాదని | సా నిదపా || గప ప దనిసనిద | పా – – – – ||
పని లేకు – | న్నా నం – దు || పడకుం – డీ – – – | నా – – – – ||

పదపదని స | సరిసరిగగగరి ||
పొనిగిచెలుల | కం – – – చే – – – ||

సరిగమపమగ రి | సనిససస స ||
పురుషు – ల – చూ – | పు – లె – ల్ల – ||

దపద ని సా | సనిదని దా ప ||
ననిళ ము నం | దు – మీ – – ద ||

పమగమప దప | నిదపమగరిగమపా ||
నం – ట – భా – ర | కుం – – – డు – – – నా || ||ముందే||

**అవతారిక :**

ఈ పదమునందలి నాయిక స్వీయ, ముగ్ధ అనన్య సామాన్య. రూపలావణ్యవతియగు అలమేలుమంగాదేవి నాయకుడగు శ్రీవేంకటేశ్వరునకు అమ్మవారి చెలిమికత్తెలు "మాచెలి నీపై కటాక్ష వీక్షణములను బరపుచున్నప్పుడు చూచితివేని ఆమెను దేవకన్యయని అనుకొందువు. నీ యందలి ప్రేమాతిశయము తలపులలో అతిగాఢముగా మెలగెడి వేళ ఆమె కలకంఠమున పాడు కొనెడి పాటలు వినినచో నీవామెను గంధర్వకన్య యనుకొందువు. జలకేళియందు ఆమెను దర్శించెడి భాగ్యము నీకిచ్చినచో ఆమె నాగకన్య యనుకొందువు. విరహతాప మగ్గలమైనపుడు చలువ శిలావేదికలపై ఆమె పవళించిన సొగసు చూచినచో నీవామెను చంద్రకన్య యనుకొందువు. ఓ వేంకటేశ్వరుడా ! నీ వామెను కౌగిళులయందు కలసినచో ఆమెను ఆదిలక్ష్మియనుకొందువు. నీ యురమున మోయు హారములమధ్య ఆమె అలమేలుమంగయై యొప్పుచుండును సుమా. ఇటువంటిదగు మానాయికను, విచ్చేసి నీవు గూడినచో నీజాణతనమును కొనియాడవచ్చును." అని నాయకుడగు తిరుమల నాథునితో విన్నవించుచున్నారని అయ్యవారు చెప్పుచున్నారు.

**రామక్రియ — రూపకం**

ఇంతట నిట్టె విచ్చేసి యింతి గూడితే గనక
వంతుకు నిన్ను జాణదేవర వనవచ్చును !                ॥పల్లవి॥

తనలోనె తలపోసి తప్పక చూచేవేళ
వనితను దేవగన్య యనవచ్చును
పనివి నిన్ను దలచి పాటలు పాడేవేళ
అనుగు గంధర్వకాంత యనవచ్చును !                ॥ఇంత॥

చలపట్టి విరహాన జలకేళి సేయువేళ
అలివేణి నాగకన్య యనవచ్చును
చలువకు చంద్రకాంత శిలపై బొరలువేళ
అలరిన చంద్రకన్య యనవచ్చును !                ॥ఇంత॥

శ్రీవెంకటేశ నీవు చెలియ గూడినవేళ
ఆవటించి నిజలక్ష్మి యనవచ్చును
వోవల నీ సొమ్ములలో వురమున మోచువేళ
దేవియలమేలుమంగ దిష్టమన వచ్చును !                ॥ఇంత॥

ప. పా ప మ గ మ ప మ గ రి || సా రి స నీ స రి స రి గా ||
ఇం త - ట - - - - ని ట్లై || పి - - - చ్చే - - - సి ||

గ మ పా ద ప ద ని || స ని ద ని ని ం పా - ||
ఇం త గూ - - డి తే || గ - న - - - క - ||

ప గ మా పా ద ప ద ని సా || స గ రీ సా సా స ని ||
వం - తు కు - - ని - ను || జా - ణ దే వ ర - ||

ద రి స ని ద ని పా ద || ప మ గ మ మ రి గ మ పా ||
వ - న - - - వ - || చ్చు - - - - - - ను - - || ||ఇంత||

చ. పా ప మ గ మ గ రి సా || సా స ని స రి గ రి గా ||
త న - లో - - - నె || త ల - పో - - - సి ||

స రి గ మ ప మ గ రి || ప మ గ మ గ రి సా స ||
త ప్పి క - - - చూ - || చే - - - - - వే ళ ||

స ని ప ద ప ద || నీ స రి గా ||
వ ని త ను దే వ || క న్య య న ||

మ ప ద ని సా - ని ద ద || పా - - - - ||
వ - - - - - - - - చ్చు || ను - - - - ||

స ని దా ని స రి స రీ || స రి గ మ ప మ గ రి సా ||
ఘ ని ఘి ని - - న్న || త - ల - - - - - - చి ||

ద ని స రి గ రి రి స ని || స రి గ రి స రి గాం గ ||
పా ట లు - - - పా - - || డే - - - - - వే శ ||

స రి సా స ని దా నీ || సా స ని దా పా ||
అ ను గు గం - - ధ || ర్వ కాం - - త ||

ప ద ని స రి స ని ద పా || ప ద ప మ గ రి ప మ గ రి సా ||
య - న - - - - - - || వ - - - - - చ్చు - - - ను || ||ఇంత||

**అవతారిక :**

ఈ కీర్తనము నందు "పంచ భూతములకును, బ్రహ్మాదుల పుట్టుకలకును, సమస్త జీవుల యునికి మనుకులకును, వేదములకును, యజ్ఞయాగాదులకును, మునుల తపంబులకును, దేవతల యమృతత్వమునకును అన్నిటికి మూలంబగు వెన్నుడే శ్రీ వేంకటేశ్వరుడై యిచట వెంకటగిరి యందు వెలసి యున్నారు. ఈతని తత్వ మెరిగి సేవింపుడు. ఊర్ధ్వ లోకములకు నాదుడు యితడే సుమీ" అని అయ్యవారు తిరుపతి స్వామిని కీర్తించుచున్నారు.

ఈ కీర్తనమును చదువుచున్నప్పుడు పోతనగారి శ్రీమద్భాగవతము నందలి గజేంద్ర మోక్షము నందు గల కొన్ని పద్యములు మనకు గుర్తునకు వచ్చును.

**రామక్రియ — ఆది**

అన్నిటికి మూలం బతడు
వెన్నుని కంటెను వేల్పులు లేరు ! ॥పల్లవి॥

పంచ భూతముల ప్రపంచ మూలము
ముంచిన బ్రహ్మకు మూలము
పొంచిన జీవుల పుట్టుగు మూలము
యెంచగ దైవము యితడే కాడా ! ॥అన్ని॥

వెనుకొని పొగడెటి వేదాల మూలము
మునుల తపములకు మూలము
ఘన యజ్ఞాదుల కర్మపు మూలము
యెనలేని దైవమితడే కాడా ! ॥అన్ని॥

అగపడి సురలకు నమృత మూలము
ముగురు మూర్తులకు మూలము
నగు శ్రీ వెంకట నాథుడె మూలము
తెగువ లోకపతి యితడే కాడా ! ॥అన్ని॥

అ : 9—202

ప. - పా - ప మా గ మ ప మ గ రి | స రి స రి గా | గ రి గ మ పా ||
1. - అ - న్ని టి కి - మూ - లం - | బ - త - డు | - - - - - - ||

- ప దా ని సా స ని దా పా ప మ | పా ద ని ద ప ప మ |
- వె - న్ను ని కం - - ఔ ను - | వే - - ల్పు - లు - |

గ మ ప మ గ రి గ మ ||
తే - - - రు - - - || ||అన్ని||

2. - సా ని ద ప పా మ గ మ గ రి |
- అ న్ని టి కి మూ - - - లం - | - - - - - - -

చ. - ప ద పా ప మ గ రి గా | రి గ మ ప మ గ రి | ప మ గ రి స స ||
- పం చ భూ త - ము - లు | ప్ర పం చ - - - - | మూ - - - ల ము ||

- స ని ధ ధ గ రి గ గ | గ మ ప ద స ని దా | పా - - ||
- ముం - చి న బ్ర - హ్మ కు | మూ - - - - - - ల | ము - - ||

- ప దా స నీ స రీ స రి గ గ | గ రి స రి గా ప మ |
- పొం - చి న జీ - - - వు ల | పు - - - ట్టు గు - |

గ రి గ రి స స ||
మూ - - - ల ము ||

- స రీ ని సా ద ని ప ద | ప మ గా సా - ని | ద పా మ గ రి గ మ ||
- యెం - చ గ దై - వ ము | యి - త డే - - | కా - - డా - - - ||అన్ని||

**అవతారిక :**

ఈమె నాయకుడగు శ్రీ వేంకటేశ్వరునిపై అలిగి ముంగోపమున కాని వొట్టుపెట్టుకొన్నదట. అందుచే తానే యాతని కడకు పోజాలదట. నాయకుడు చెలులచే లేఖలనంపి నాకు తాను మ్రొక్కితినని కబురంపినాడు. తానే ఇచ్చటికి రావచ్చునుకదా ! నిజముగ వలపులు కలిగినచో ఏదిచేసినను చెల్లునుగదా యని, స్వామియందలి మోహమును చెప్పుకొను చున్నది.

**రాగ లక్షణము :**

బౌళి రామక్రియ అనునది ప్రాచీన రాగములలో నొకటిగా తోచుచున్నది. ఇందు ఇతర వాగ్గేయకారుల రచనలు కాన రాకుండుట వలన ఇది యిప్పుడు లుప్తమై పోయినట్లే భావించవచ్చును కాని బౌళిరామక్రియ అను పేరునందు సూచింప బడినట్లు ఆరోహణమున బౌళి, అవరోహణమున రామక్రియ వుంచి ప్రయత్నించినచో ఇవి యొక అందమైన రెండు రాగముల మేళవింపువలె స్ఫురించుచున్నది.

ఆరోహణ : స రి గ ప ద స

అవరోహణ : స ని స ద ప మ గ రి గ రి స

ఇది 51వ మేళమగు కామవర్ధని జన్యముగా తీసికొనుట జరిగినది.

**బౌళిరామక్రియ – రూపకం**

అన్నిటా ఘనుడు దాను అందుకేటిదే
వున్నటై చెప్పగదరే వూరకుండనేలా ! ॥పల్లవి॥

చెలుల దా నంపినాడు చెంత నే రాకుండగాను
అలిగి వుండాన దొల్లె అందుకేటిదే
కలగి ముంగోపమున కాని వొట్టువెట్టుకొంటి
పిలిపించరాదు నాకు పిన్నదాననేను ! ॥అన్నిటా॥

ముంచి లేక లంపినాడు మొక్కితి నే నన్నాడు
యొంచితే నెంతయిన గద్దు యేమందునే
పంచక యిందరిలోన బంతమెల్ల నాడుకొంటి
అంచల నాకు రారాదు ఆటదాననేను ! ॥అన్నిటా॥

సంగడి గూచున్నాడు చనవెల్ల నిచ్చినాడు
యెంగిలి మోవడిగిని యేమఁదునే
సంగతై శ్రీ వెంకటేశ్వరుడిట్టె నన్నుగూడె
చెంగట మెచ్చగరాదు సిగ్గుతోడి నేను ! ॥అన్నిటా॥

శృం : 17—232

ప - గ పా దా ॥ ప మ గ రి స రి ॥ - గ ప ద సా స ని దా ॥
- అ న్ని టా ॥ ఘ ను డు తా - ను ॥ - అం దు - - కే - - ॥

ద ని దా పా - - ॥
- - టి దే - - ॥

- ప ద సా సా ॥ స ని ప ద ప ప మ ॥ గా ప ద స ని ద ॥
- వు - న్న ట్టె ॥ చె - - ప్ప గ ద రే ॥ వూ ర కుం - - డ ॥

ప మ గ ప గ రి సా ॥
నే - - - - - లా ॥ ॥అన్ని॥

చ. - ప ద పా ద ప ద ప ద ప ॥ ప మ గా ప మ గ రి రి స ॥
- చె లు ల తా - - - - - ॥ నం - - - - నా - - డు ॥

- స రి స ని ధ ధ ॥ స రి గ రి గా గ ॥
- చెం త నే - రా - ॥ కుం - డ - గా ను ॥

- గ ప పా దా ॥ ప ద స స స ని ప ద ॥ - గ ప ద ని ద ద ॥ పా - - - - ॥
- అలి గి వుం ॥ దా- - న తో - - ల్లి ॥ - అం దు కే - - టి ॥ దే - - - - ॥

- ప ద సా స రి || గ రి స రి గా || - గ ప మ గ రి రి స ||
- క ల గి నుం - || గో - ప ము న || కా ని - వా - - ట్టు ||

స ని ప ద సా సా ||
వె - - ట్టు కొం టి ||

- స రి సా సా || స ని ప ద పా మ || - గ ప ద స ని ద ||
- పి లి పిం చ || రా - దు - నా థు || - పి న్న దా - - న ||

ప మ గ మ గ రి సా ||
నే - - - - - ను ||

||అని||

**అవతారిక :**

ఈ కీర్తనము నందు నరసింహ దేవుని కీర్తించుచు "భక్తులకు భవములు బాపెడి వాడవు పాపములను పోగొట్టెడి వాడవునగు ఓ దేవా! నీవే వెంకటగిరి యందు వెలసి శంఖ చక్రాయుధములను ధరించి యున్నవాడవు. నిన్ను శరణు జొచ్చిన ప్రాణులకు అభయ మిచ్చు చున్నావు." అని అయ్యవారు వినుతించు చున్నారు.

**బౌళి రామక్రియ – ఆది**

అభయ దాయకుడ వదె నీవే గతి
యిభ రక్షక నను నిపుదు గావవే! ॥పల్లవి॥

భయహర దైతేయ భంజన కేశవ
జయ జయ నృసింహ సర్వేశ్వరా
నియతము మాకిదె నీ పాదములె గతి
క్రియగా మమ్మేలి కింక లుడుపవే! ॥అభ॥

బంధ విమోచన పాప వినాశన
సింధుర వరదాశ్రితరక్షా
కంధర వర్ణుడ గతి నీ నామమె
అంధ కారముల నణచి మనుపవే! ॥అభ॥

దైవ శిఖామణి తత చక్రాయుధ
శ్రీ వెంకటగిరి శ్రీ రమణా
సావధాన నీ శరణ్యమే గతి
వేవేలకు నా విన్నప మిదియే! ॥అభ॥

ప. - స రీ గ పా ప ప మ గా | ప ద ప ద సా | స ని దా ద ప ||
- అ భ య దా య కు - డ | వ దె నీ - - | వే - - గ తి ||

- ప దా సా - స ని దా ద ప | ప మ గ గ ద ద | ప మ గ ర గ ర సా ||
1. - ఇ భ ర - ఘు - క న ను | ని - పు డు ల - | - - వ - వే - - ||అభ||

2. - ప దా స రి గ రి స స ని దా | ప ద స ర స స ద ప | మ గ ప మ గ ర సా ||
- ఇ భ ర - - ఘు క న - ను | ని - పు - డు - ల - | - - వ - వే - - ||
||అభ||

చ. - గ రీ స సా స ని ధా ధ ధ | సా - ర గ రి | గా గ గ ||
- భ వ హ ర దై - - తే య | భం - - జ న | కే శ వ ||

- గ పా ద సా స ని దా ప | పా ద ప ప మ గ ర | స ర గా సా ||
- జ య జ య నృ - సిం హ | స - - ర్వే - - - | శ్వ - - రా ||

- ప దా స సా స రి గా గ రి సా | స రి గ మ గ గ | రి రి స స ||
- ని య త ము మా - - కి - దె | నీ - - - పా ద | ము లె గ తి ||

- ప దా స ని స రి గ రి స | స ని ద రి స స ద ప | ప మ గ ర సా ||
- క్రి య గా - మ - న్మో - లి | కిం - - - క - లు - | డు - వ - వే ||

- స రీ గ పా ప ప మ గా |
- అ భ య దా య కు - డ |

**అవతారిక :**

ఇందు పూర్వకర్మములను మోపులుగా మోచుకొనుచు వచ్చినవాడైన జీవుడు ఈ దేహమును మోయుచు సంసారమను రొచ్చునందు పొరలాడుచు పాములపుట్టవంటి బ్రతుకుల యందు చిక్కుచు భవబంధములయందు కట్టువడి మసలుచునుండుటను అయ్యవారు వ్యంగ్యముగా చెప్పుచు శ్రీ వేంకటేశ్వరుని కృపాకటాక్షమును పొంది తరింపనిచో యిట్లే పుట్టుట గిట్టుటలు జరుగుచు జీవులు కష్టపడుచుందురుగదా ! గనుక మాయలయందు తగిలి వ్యథ చెందకుడని బోధించుచున్నారు.

**రాగ లక్షణము :**

సారంగ రాగము ప్రాచీనము, భాషాంగము.

ఆరోహణ : స రి మ ప ద ని స

అవరోహణ : స ని ద ప మ రి గ మ రి స।

ఇది యిప్పటి ౬౫వ మేళమగు కల్యాణి జన్యము. 'ప మ రి గ మ' అను నప్పుడు మొదట ప్రతి మధ్యమమును, కడపట శుద్ధ మధ్యమమును వచ్చుచున్నవి. వేంకటమఖి సంప్రదాయమున ఆరోహణావరోహణములు వేరు విధముగా నున్నను తక్కిన లక్షణములు ఇంచుమించు యిదే విధముగా నున్నవి.

## సారంగ (సాళంగం) — ఝంపె

తోలు బాప పుణ్యాలతోడ బుట్టితినట
బలువైన భవముల బడలేనా ! ॥పల్లవి॥

గాములయింటనే కాపనయితినట
పాము పుట్టనుండి యైన బతుకలేనా
గోమున పేయపుగుండ కూడు నించితినట
గామిడి నే గారే తిత్తిగా నోపనా ! ॥తోలు॥

కల్లైన గుణములచే కట్టువడితినట
చుట్టపు బంధాల రొచ్చుకు నోపనా
దట్టపు టాసలనే దాల్చితినట నా
వెట్టకాయము మోవ వెఱచేనా ! ॥తోలు॥

నిగిడిన లోపల నీవుండుదువట
పగవారికినే బగిలేనా
తగు వెంకటేశ నీ దయ వాడనట యీ
వగల నన్నిట గెలువగ లేనా ? ॥తోలు॥

అ : 5-111

ప. మ ప దపమ । రిగమ రిరి ॥ ని సరి స - । పపమపా ॥
తో లు పా - ప । పు - ణ్యా - ల ॥ తో - డ బు - । ట్టి తి న ట ॥

మ ప ద ప ప । ద ని స దా ॥ ప మ రి గ । మా రి స - ॥
బ లు వై - న । భ వ ము ల ॥ బ డ లే - । నా - - - ॥ ॥తోలు॥

చ. రి గ మ రీ । ని స రి సా ॥ ప మ రి గ మ । - రీ స స ॥
ని గి డి న । లో - ప ల ॥ నీ - వుం - దు । - వ ట - ॥

ని స రి స రి । ప మా పా ॥ ద ని స రి స । ని దా పా ॥
ప గ వా - - । కి నే - ॥ బ గి లే - - । - నా - ॥

మ ప ద ప ప । ప ద ని స సా ॥ స గ రి సా స ని । స ద నీ సా ॥
త గు వెం - క । టే - - శ నీ ॥ ద - య వా డ - । న ట యీ - ॥

ద ని స గ రి । స ని ద పా ॥ మ ప ద ని స ని దా - ప । ప మ రి గ మా రి సా ॥
వ గ ల ని న్ని । ట - గె లు ॥ వ - గ - లే - - - - । నా - - - - - - ॥
॥తోలు॥

**అవతారిక :**

ఈ కీర్తనము నందు "పురుషుల కెల్ల పురుషోత్తముడై సురేంద్రాది దేవతలకు హరుడు, అజుడు మొదలగు వారికిని, నవ్వల యుండెడి యా తొలి దేవుడగు ఈశ్వరుండు శ్రీ వేంకటేశ్వరుడై భక్తుల పాలిట కల్ప తరువుగా నిలిచి యున్నాడు. ఈతనిని కొలిచెడి త్రోవయే నిజమని వేద వేదాంగములు ఘోషించుచున్నవి, తెలుసు కొను" డని అయ్యవారు పరమ భక్తితో కీర్తించుచున్నారు.

సారంగ (సాళంగం) – ఆది

ఒక్కడే దైవం బున్నతు డితడు
తక్కిన తలపులు తప్పు దెరువులు ! ||పల్లవి||

పురుషుల కెల్లా బురుషోత్తముడు
సురేంద్రాదులకు సురేంద్రుడు
హరునికి నజునికి నవ్వలి మూరితి
హరి యితడే పర మాత్ముడు ! ||ఒక్క||

వేదాంతంబుల వేద్యుడీతడు
ఆదికి నాదియు నన నితడే
మేదిని నరులకు మేది నీశ్వరుడు
యేదెస జూచిన నీశ్వరు డితడే ! ||ఒక్క||

యెక్కువలకెల్ల నెక్కువ యీతడు
మక్కువ మరునికి మరుడీతడు
యిక్కడ శ్రీ వేంకటేశుడై మిగుల
పక్కన నిదివో ప్రత్యక్షమితడు ! ||ఒక్క||

ప. - స రి స పా పా | ప మ పా ప ద ని | స స సా ||
1. - ఒ క్క దే దై వం | బు - - న్న - తు | డి త డు ||

- ని రి సా స ని దా ద ప ప | పా ప మ రి గ | సా రి స ||
- త - క్కి న - త ల పు లు | త ప్పు - దె - | రు వు లు ||

2. - స రి స ద ద ప మ రి గ మ ప | ద ని స రి సా స ని | ద ద పా ||
- ఒ క్క దే దై - - - వం - - - | బు - - - న్న తు - | డి త డు ||ఒక్కదే||

చ. - ప దా ప ప మ రి గ మా రీ | స ని సా రి స | రి మ పా ||
- పు రు షు ల - కె - - ల్లా | పు - రు షో - | త్త ము డు ||

- మ పా - ద ప ప ద నీ స | స ని దా ప మ | పా - - ||
- సు రేం - ద్రా - దు - ల కు | సు - రేం ద్రు - | డు - - ||

- మ పా ద పా ప ద ని స స | ని స రి గ మా రి | సా స స ||
- హా రు ని కి న - జు ని కి | న - - - వ్వ లి | మూ రి తి ||

- నీ రి స స ని దా ప మ పా | ని ద ప మ రి గ మా | రీ సా ||
- హ రి యి - త దే ప - ర | మా - - - త్మ - - | డు - ||ఒక్కదే||

**అవతారిక :**

ఈ పదమునందలి నాయిక స్వీయ. ముగ్ధ. అలమేలుమంగాదేవియగు ఈమె చెలులు నాయకుడగు శ్రీ వేంకటేశ్వరునకు అమ్మవారి గుణగణములను వివరించుచు "నీ చిత్తమునకు నచ్చునటులు ఆమె సేవలు చేయగలదు. నీ పొత్తునుండి నిన్ను పొగడి ఆనందింప జేయగలదు. నీ యిచ్చవచ్చిన రీతిని మెలగుచు నీతో నవ్వులాడుచు నుండగల నేర్పరి మాచెలి. అలమేలు మంగాదేవి యింటికి వచ్చి ఆమెతో సుఖముగా నుండరాదా "అని చెప్పుచున్నారని అయ్యవారు పాడుచున్నారు.

**రాగ లక్షణము :**

మోహన అతిప్రాచీనమగు రాగము ఇది యిప్పటి ౬౫వ మేళమగు కల్యాణి జన్యము.

ఆరోహణ : స రి గ ప ద స

అవరోహణ : స ద ప గ రి స

వెంకటమఖి సంప్రదాయమున దీనిని భాషాంగమని చెప్పియున్నారు. నవీనులు 'దా' అనునప్పుడు కించిత్కాకలి నిషాదమును, 'పా గా' అనునప్పుడు కించిచ్ఛ్రుతి మధ్యమమును, 'గ ప దా' అనునప్పుడు ధైవతమును కంపింప జేయుచు కైశికి నిషాదచ్ఛాయలు పలుకునట్లును, 'స రి గా' అనునప్పుడు గాంధారమునందలి కంపనములలో శుద్ధమధ్యమపు ఛాయలు వినబడు చుండునట్లును పాడుచున్నారు. ఇది సంప్రదాయము కాదు.

**మోహన (అమరసింధు) – రూపకం**

విన్నపము సేయుమనె వేడుకతో నీకు మమ్మ
చెన్ను మీరి నట్టాయింతి చెలులము సుమ్మీ ! ॥పల్లవి॥

చిత్తమురా నీకు నాకె సేవలు సేయనేరుచు
మొత్తముగా బాదాలకు మొక్కనేరుచు
పొత్తుకు దీసి నిన్ను పొగడగ నేరుచు
ఇత్తలనేమి సేసేవు ఇంటికి రారాధా ! ॥విన్న॥

ఇచ్చకము సేసి నిన్ను నియ్యకొలుప నేరుచు
నచ్చుదీర నీతోను నవ్వ నేరుచు
వచ్చి సేతలను నిన్ను వనిగొన నేరుచు
ఇచ్చితివి చనవులు యింటికి రారాదా ! ॥విన్న॥

అలమేలు మంగ యీకె అంకె గూడగ నేరుచు
పొలతి శ్రీ వేంకటేశ భోగించ నేర్చు
అలరితి రింతలోనె ఆకె నీవు నిద్దరును
యెలమితో నిట్లానే యింటికి రారాదా ! ॥విన్న॥

శృం : 24_541

ప. ప ద స స సా ॥ ప ద సా ద ద దా ॥
1. వి – న్న వ ము ॥ సే – – యు మ నే ॥

గ రి స రి గ ప గ రి ॥ స రి గ రి స ధ సా స ॥
వే – డు – క – తో – ॥ నీ – – – కు – మ మ్మ ॥

2. ప ద స రి గా సా ॥ సా రి స స ద రి స ద ప ॥
వి – న్న – వ ము ॥ సే – – – – యు మ నే – ॥

ప గ ద ప స ద రి స ద ప ॥ గ రి స ద సా ద ప గ రి గా ॥
వే – – – డు – క – తో – ॥ నీ – – – కు మ – – – మ్మ ॥

ప ద స దా ప ॥ గ ప పా ద స ద ప గ రి ॥
1. చె – న్ను మీ రి ॥ న – ట్టా – – – – – యింతి ॥

స రి గా రి గ పా ॥ గ ప దా ప ద సా ॥
ఛె – లు ల – ము ॥ సు – – మ్మీ – – ॥

2. ప ద స రి గా రి గ రి స ద ప || ప గ ప ద సా పా ద స ద ప గ రి ||
చె - - - న్న మీ - - - - రి - || న - ట్టా - - యిం - - - - - తి - ||

స ధ గ రి గా ప గ ద ప దా || స ద గ రి గా రి స ద ప ||
చె - లు - - ల - ము - - || సు - - - - మ్మి - - - || ||విన్న||

చ. ప ద సా సా || ప ద సా సా రి స ద పా ||
చి త్త ము రా || నీ - కు నా - - - కె ||

ప ద సా ద స దా ప ద పా || గ ప గా రి గ రి స ప ||
సే - వ లు - - - - - || సే - య నే - - రు చు ||

పా స ధ గ రి గా || పా ప గ ద ప దా ||
మొ త్త - ము - గా || పా దా - - ల కు ||

స రి గా రి గ పా గ ప ద స || ద ద పా - - ||
మ్రొ - క్క నే - - - - - - - || - రు చు - - ||

ప ద స రి గా గ రి || గ ప పా రి రి సా ||
పొ త్తు కు - - - - || దీ - ని ని - న్న ||

స రి గా సా సా || రి ద సా - - ||
పొ గ డ గ నే || - రు చు - - ||

ప ద సా రి గ రి గ రి స || గా పా ద స ద స ద ప ||
ఇ త్త ల - - - - నే మి || సే సే - - - - - వు ||

ప ద స రి గ రి స ద పా || ద స ద ప గ రి స రి గా ||
ఇం - టి - కి - - - రా || రా - - - - - - - దా || ||విన్న||

**అవతారిక :**

ఈ కీర్తనమునందు ధూర్తుడగు నాయకునితో, ఖండిత, ప్రౌఢ, రూపగర్విత యగు నాయిక, రోషకషాయితయై "నేను, మునుపటివలె నిన్ననుసరించి వచ్చెద ననుకున్నావా ! నీ వెన్నియోసార్లు నన్ను వదలి అన్య భామినులపై మక్కువతో వెంబడించుటలు నే నెరుగుదును. ఒక్కొక్కసారి నిన్ను కఠినములగు మాటలతో మందలించుటయు కద్దు. చర్వితచర్వణములగు నామాటలవలన ఉపయోగమేమున్నది. నీవు స్థిరుడవైనను నీ స్వభావము చంచలము. ఇంక నీ ప్రలాపములను కట్టిపెట్టుము. నీపలుకులెట్లున్నవనగా ఇంటిగోడలు మాసినవని తిరిగి తిరిగి కడిగినవిధముగా నున్నది. ఓ శ్రీ వేంకటేశ్వరుడా ! నీ విట్టిలీలలను యెప్పుడును చేయుచునే యుందువు" అని కోపోద్రిక్తయై నాయికయగు అమ్మవారు నాయకుడగు శ్రీ వేంకటేశ్వరుని ధూర్తత్వమును మందలించుచున్నది.

అన్నమయ్య సంస్కృత రచనలు చేయలేదని, కొందరు తెలియక పలుకుట పరిపాటియైనది. ఈ పదమునందలి సాహిత్యమును గమనించినచో మృదుమధుర మగు కవితారీతి, భావసౌందర్యము గోచరించుచు, జయదేవుని "యాహి మాధవ, యాహి కేశవ, మావద కైతవ వాదం" అను అష్టపదిని జ్ఞాపకము చేయుచున్నది. అందలి నాయికయు ఖండితయే. ఈమెయు ఖండితయే! ఐనను వీరిరువురి ధోరణియు పలికెడి తీరులు భావములు ఒకటైనను భిన్నములై స్వతంత్రములుగా కనబడుచున్నవి. ఇట్టి సంస్కృతరచనలు ఇంతవరకు వెలువడిన సంపుటముల యందే దొరకుచున్నవి.

**మోహన (శుద్ధ వసంతం) – ఆది**

ప్రలపనవచనైః ఫలమిహాకిం
చల చల కుడ్య క్షాళనయాకిం ! ॥పల్లవి॥

ఇతర వధూమోహితం త్వాంప్రతి
హితవచనైరిహ ఫలమివాకిం
సతతం తవానుసరణ మిదం మమ
గతజల సేతుకరణ మిదానీం ! ॥ప్రల॥

వికల వినయ దుర్విటం త్వా ప్రతి
సుకుమారార్ద్రస్తుత్యాకిం
ప్రకట బహల కోపనం మమతే

శిరసానత సుస్థిరం త్వాం ప్రతి
విరసాలాపన విధి నాకిలం
తిరువేంకటగిరి దేవత్వదీయ
విరహా విలసనం వృధా చరణం ! ॥ప్రల॥

శృం : 8–39

ప. ప ద స ద ప ద ప గ | ప ద స ద | సా - - ||
ప్ర ల వ న వ చ నై ః - | ఫ ల మి హా | కిం - - ||

ద ద గ రి సా ద ప | గ రి స రి | గా పా ||
చ ల చ ల కు డ్య - | ఋా - శ న | యా కిం || ||ప్రల||

చ. గ గ దా ద ద ద స | ద పా - | ద ప గ రి ||
శి ర సా న త సు - | స్థి రం - | త్వాం - ప్ర తి ||

గ గ ద ప ద ప గ రి | స ధ గ రి | సా - - ||
వి ర సా - లా - ప న | వి ధి నా - | కిం - - ||

గ ప ద స స రి ద ద | ద ద గ రి | స రి ద ద ||
తి రు వేం - క ట గి రి | దే - - వ | త్వ దీ - య ||

ద ద గ రి స రి స ద | ప ద పా | గ గ పా ||
వి ర హా వి ల స నం - | వృ ధా - | చ ర ణం || ||ప్రల||

**అవతారిక :**

ఈ కీర్తనమునందు "పరమాత్ముడగు శ్రీ వేంకటనాథుని నామములను తలచుకొనుచు ఆ పరమేశ్వరుని లీలా విలాసములను కొనియాడుచు వేంకటగిరి శిఖరమున వెలసిన ఆ మహానుభావుని నాదస్వరూపుని గాను, భక్తవత్సలునిగాను, ధృవ పాంచాలీ స్తుతిపాత్రునిగాను అయ్యవారు కీర్తించుచున్నారు.

**రాగ లక్షణము :**

అసావేరి దక్షిణ భారతమున ఎనిమిదవ మేళమగు తోడిజన్యముగా పాడుట సంప్రదాయము. ఇది మేళకర్తల ఆవిర్భావమునకు పూర్వమే వాడుకయందున్న భాషాంగరాగము. కాని అసావేరి పేరుతో ఉత్తరభారతమున వేరొక రాగము కనబడుచున్నది. దానిని కర్నాటక సంగీత పద్ధతి ప్రకారము 20వ మేళమగు భైరవి జన్యముగా చెప్పుకొనవచ్చును.

ఆరోహణ : స రి మ ప ద స

అవరోహణ : స ని ద ప మ గ రి గ స

ఈ రాగము మనోజ్ఞములగు స్వరసందర్భములు కలిగి యుండుటవలన సుమారు 25 సంవత్సరముల క్రిందట యీకీర్తనమును ఇందు స్వరపరచి పాడించుట జరిగినది. నిజమునకు కొద్ది మార్పులతో, అనగా స రి మ ప ద ప స—స ని ద ప మ గ రి స అను ఆరోహణావరోహణములు గల జింగ్లా రాగమునకును, దీనికిని పెద్ద తేడా లేదు. జింగ్లారాగమున త్యాగరాజస్వామి వారి కీర్తనకలదు. గాయకుల మన్నన సులువుగా పొందగలదని ఇట్లు చేయుట జరిగినది. అయ్యవారు దీనిని భూపాళ రాగమున చెప్పియున్నారు.

**అసావేరి - ఆది**

నందకధర నంద గోపనందన
కందర్ప జనక కరుణాత్మక ! ॥పల్లవి॥

ముకుంద కేశవ మురహర
సకలాధిప పరమేశ్వర దేవేశ
శుకవరద సవితృ సుధాంశులోచన
ప్రకట విభవ నమో పరమాత్మన్ ! ॥నంద॥

ధృవపాంచాలీ స్తుతివత్సల మా
ధవ మధుసూదన ధరణీధరా
భువనత్రయ పరిపోషణ తత్పర
నవనీతప్రియ నాదాత్మన్ ! ॥నంద॥

శ్రీమన్ వేంకట శిఖరనివాస మ
హామహిమన్ నిఖిలాండపతే
కామిత ఫల భోగప్రదతే నమో
స్వామిః ఉ భూమన్ సర్వాత్మన్ ! ॥నంద॥

అ: 11 (2)–66

ప. మ ప ద స స స స రి | స రి ని స | స ని ద ప ||
నం - ద క ధ ర నం - | ద గో - ప | నం - ద న ||

మ రి మా మ ప ప మ | ప స ని ద | పా - - ||
కం - ద ర్ప జ న క | క రు ణా - | త్మా - - || ||నంద||

చ. స రి మ గ గ రి రి | మ మ ప ని | దా ప ప ||
ము కుం ద మా - ధ వ | ము ర హా ర | స క లా ||

ద మ ప మ గ రి గ స | రి రి మ మ | ప ప ద మ ||
ధి ప ప ర మే - శ్వ ర | దే - వే - | శా - - - ||

పా ద ద స స రి రి | స రి మ గ | రి రి స స ||
శు క వ ర ద స విత్రు | సు ధాం - శు | లో - చ న ||

ని ని స స రి ని స ని | ద ప ద మ | పా - - ||
ప్ర క ట వి భ వ న మొ | ప ర మా - | త్మా - - || ||నంద||

**అవతారిక :**

ఈ కీర్తనమునందు పరమ పురుషుడగు శ్రీహరి నామములను చేర్కొనుచు భగవంతుని దశావతారములను కొనియాడుచు అయ్యవారు స్తుతించుచున్నారు.

**రాగ లక్షణము :**

సాళంగరాగము లభ్యముకానందున దీనిని బైరాగీ భైరవ్ అను రాగమున స్వరపరచి పాడించుట జరిగినది. బైరాగీ భైరవ్ ఉత్తరాది సంగీతము నందలి రాగము. 16 వ మేళమగు చక్రవాకజన్యముగా దీనిని మనము గుర్తింప వచ్చును. స రి మ ప ని స । స ని ప మ రి స అనునవి ఆరోహణావరోహణములు. ఇందు గాంధారధైవతములు లేనందున దీనిని యింకను కొన్ని ఇతరమేళకర్తల జన్యముగా కూడ చెప్పుకొనవచ్చును ఇందుగల శుద్ధ ఋషభ, శుద్ధ మధ్యమ, కైశికి నిషాదములను వాటి వాటి స్థానములయందు పట్టుటయే ఉత్తరాది వారి సాంప్రదాయము. దీనికే రేవతి యని యొక నామమును, ఆధునికులు చెప్పుచున్నారు.

బైరాగీ భైరవ్ – ఝంపె

మాధవా భూధవ మదన జనక
సాధురక్షణ చతుర శరణు శరణు ! ॥పల్లవి॥

నారాయణాచ్యుతానంత గోవింద శ్రీ
నారసింహా కృష్ణ నాగశయన
వారాహా వామన వాసుదేవ మురారి
శౌరీ జయజయతు శరణు శరణు ! ॥మాధ॥

పుండరీకేక్షణ భువన పూర్ణగుణ
అండజగమన నిత్యహారి ముకుంద
పండరి రమణ రామ బలరామ పరమ పురుష
చండభార్గవ రామ శరణు శరణు ! ॥మాధ॥

దేవదేవోత్తమ దివ్యావతార నిజ
భావ భావనా తీత పద్మనాభ
శ్రీవేంకటాచల శృంగారమూర్తి నవ
సావయవ సారూప్య శరణు శరణు ! ॥మాధ॥

ప.  పా । ని సా ॥ రీ । ర సా ॥ ని స । ని ప ని ॥ సా । - - - ॥
మా । ధ వా ॥ భూ । ధ వా ॥ మ ద । న జ న ॥ కా । - - - ॥

నీ । స నీ ॥ ప ప । మ మ రి ॥ ని ని । స రి రి ॥ సా - రి । మా - ॥
సా । ధు ర ॥ గు ణ । చ తు ర ॥ శ ర । ణు శ ర ॥ ణు - - । - - ॥మాద॥

చ.  స రి । మా మ ॥ మా । మ మా ॥ మా । మ మా ॥
నా - । రా య ॥ ణా । చ్యు తా ॥ నం । త గో ॥

మ ప । ప నీ ॥ నీ । స రీ ॥ స రి స । నీ ప ॥ నీ । స రి రి ॥ సా । - - - ॥
విం - । ద (శ్రీ) ॥ నా । ర సిం ॥ హా - - । కృ ష్ణ ॥ నా । గ శ య ॥ నా । - - - ॥

నీ । స రి స ॥ నీ । స నీ ॥ పా । ని పా ॥ ప ప । మా మ ॥
వా । రా - హ ॥ వా । మ నా ॥ వా । సు దే ॥ వ ము । రా రి ॥

రీ । మ ప ని ॥ ప ప । మ రీ ॥ ని ని । స రి రి ॥ సా - రి । మా - ॥
శౌ । రి జ య ॥ తు జ । య తు ॥ శ ర । ణు శ ర ॥ ణు - - । - - ॥మాధ॥

**అవతారిక :**

ఈ కీర్తనమున శ్రీ వేంకటపతియగు నీదేవుడు వ్రేపల్లెయందు కృష్ణావతారుడై వెలసి నప్పుడు గోపికలు బృందావనము నందలి ఇతరులు యీతని లీలలను మధురములగు పాటలుగా శృతి గూర్చిన కంఠములతో పాలు పిదుకుచు, పెరుగు చిలుకుచు, వెన్నలను కాచుచు, ఆల మందలను మేపుచు పాడుచుండెడి వారని అయ్యవారు బాలకృష్ణుని చేతలను శ్రీ వేంకట రమణుని యందు తలచుచు పాడు కొనుచున్నారు.

బైరాగీ భైరవ్ (పాడి) – ఆది

ఘుమ్మనియెడి శ్రుతి గూడగను
కమ్మని నేతులు కాగగ జెలగె ! ॥పల్లవి॥

నీల వర్ణుడని నీరజాక్షుడని
బాలుని సతివలు పాడేరో
పాలు విదుకుచును బానల కాగుల
సోలి పెరుగు త్రచ్చుచు చెలరేగి ! ॥ఘుమ్మని॥

మందర ధరుడని మాధవుడని గో
విందుని బాడేరు వెలదు లిదె
నందవ్రజమున నలుగడ నావుల
మందల బేయల మంచి రవముల ! ॥ఘుమ్మని॥

వెంకటపతి యని వేద నిలయుడని
పంకజ నాభుని బాడేరో
అంకుల చేతను నలరు రవంబుల
బింకపు మాటల బృందావనమున ! ॥ఘుమ్మని॥

శృం: 4–81

ప. పని సరి సనిపమ | పానిని | సా - - ||
ఝు - మ్మని యెడిళ్ళ తి | గూడగ | ను - - ||

పనిస రిసనిపమ | రిరిసస | రిమపమ ||
క - మ్మని నే - తులు | కా - గగ | చెల గే - || ||ఘుమ్మని||

చ. మమపపనిప పమ | మమపప | నిపపమ ||
నీ - లవ - ర్ణుడని | నీ - రజా | - క్షుడని ||

నిపని నిససరి స | నిపనిని | సస - - ||
జా - లుని అతివలు | పా - డే - | రో - - - ||

సరిరిమరి రి స స | నినిపప | నినిస స ||
పా - లుపిదుకుచును | జా - నల | కా - గుచు ||

పనిస రిసని పా | మమరిస | రిమపా ||
పో - లి పెరుగు త్ర | చ్చుచుచెల | రే - గీ || ||ఘుమ్మని||

**అవతారిక :**

ఈ కీర్తనము నందు "ఆజాను బాహుడు, నీలాభ్ర శరీరుడు, రావణాసురవైరి, ధర్మ సంస్థాపకుడు, రవికుల సుధాకరుడు, శివధనుర్భంగము చేసినవాడు, బ్రహ్మాది దేవతలచే నుతింప బడినవాడు, విభీషణుని లాలించిన వాడగు శ్రీరామ చంద్రుడే వేంకటగిరి యందు వెలసిన శ్రీ వేంకటేశ్వరుడు దేవ దేవుడు. ఈతనిని భజించుచు, వీని దివ్య ప్రభావమును కీర్తించెదను" అని అయ్యవారు శ్రీ వేంకటేశ్వరుని రామావతారము నాటి ప్రతాపమును, సౌందర్యమును కొని యాడుచున్నారు.

సుమారు 25 ఏండ్లకు పూర్వము తాళ్లపాక వారి సంస్కృత రచనలు ఉత్తర దేశమున ప్రచారము చేయు సంకల్పముతో హిందుస్తానీ రాగములలో స్వర పరచి పాడించుట జరిగినది. అట్టి వాటిలో యీ కీర్తనమును భీంప్లాసి రాగమున స్వరపరచుట జరిగినది.

**రాగ లక్షణము :**

భీంప్లాసి అను నీ రాగము కర్నాటక సంప్రదాయము నందలి మేళకర్తలలో 22వది యగు ఖరహర ప్రియ జన్యము.

ఆరోహణ : స గ మ ప ని స

అవరోహణ : స ని ద ప మ గ రి స।

స్వరముల యందలి ఉత్తరాది యాసను మార్చి పాడినచో ఆభేరి యగుచున్నది. ఇట్లే దీనికి కర్నాటక దేవ గాంధారి యను ప్రాచీన నామమున్నట్లు తెలియుచున్నది. పేర్లు వేరు వేరుగా చెప్పుచున్నను ఇప్పటి వాడుక యందు రాగ స్వరూపమొక్కటి గానే కనబడుచున్నది. గమక వరికాదుల యందును రెండు సంగీత పద్ధతుల యందును విడబరచుటకు కూడ అంత తావులేదు. 'ని స మ' అను ప్రయోగ మొక్కటి మాత్రము సకృత్తుగా కనబడుచున్నది.

**భీంప్లాసి (ధన్యాసి) – ఝంపె**

దేవ దేవం భజే దివ్య ప్రభావం
రావణాసురవైరి రఘు పుంగవం ! ॥పల్లవి॥

రాజవర శేఖరం రవికుల సుధాకరం
ఆజాను బాహుం నీలాభ్ర కాయం
రాజారి కోదండ రాజదీక్షా గురుం
రాజీవ లోచనం రామచంద్రం ! ॥దేవ॥

నీల జీమూత సన్నిభ శరీరం ఘన వి
శాల వక్షసంవిమల జలజ నాభం
కాలాహి నగ హరం ధర్మ సంస్థాపనం
భూ లలనాధిపం భోగ శయనం ! ॥దేవ॥

పంకజాసన వినుత పరమ నారాయణం
శంకరార్జిత జనక చాప దళనం
లంకా విశోషణం లాలిత విభీషణం
వేంకటేశం సాధు విబుధ వినుతం ! ॥దేవ॥

అ : ౨-౨౯౪

ప. ని ప | ని సాం || సం ని సం ని | సం గం రిం || సాం | ని ద ప ||
దే - | వ దే || వం - - - | భ జే - || ది | వ్యా - ప్ర ||

నీ | సాం సం || సా | ప ప మ || ప ని ద | పా మ ||
బా | వం - || రా | వ ణా - || సు - ర | వై రి ||

గ మ | పా మ || గ రి | సా - ||
ర ఘు | పుం గ || వం - | - - || ||దేవ||

చ. పా | మ గ రి || సా | ని సా || ని ధ | ని స ని || స గ | రి సా ||
రా | జ వ ర || శే | ఖ రం || ర వి | కు ల సు || ధా - | క రం ||

స మ | మా గ || మ ప | ప ద ప మ || మ ప ని | సం ని ద ప || పా | - - - ||
ఆ - | జా ను || బా - | హు నీ - - || లా - - | భ్ర - కా - || యం | - - - ||

మా । ప ని ప ॥ ని సే । సా స ॥ ని ప । ని స ని ॥ స గ । రి సా ॥
రా । జా - రి ॥ కో - । దం డ ॥ రా - । జ దీ - ॥ జా - । గు రుం ॥

ప ని । సా ని ॥ ద ప । ద ప మ గ ॥
రా - । జీ వ ॥ లో - । చ - నం - ॥

గ మ ప । మ మ గ మ గ ॥ రి స । సా - ॥
రా - - । మ చం - - - ॥ ద్రం - । - - ॥ ॥దేవ॥

**అవతారిక :**

ఈ కీర్తనము నందు నరసింహదేవుని ప్రభావములు, పరాక్రమములు కొని యాడుచు "అతడే శ్రీ వేంకటగిరి యందు శాంతమూర్తియై, శ్రీ వేంకటేశ్వరుడై, భక్తుల పాలిట కల్పతరువై విరాజిల్లు చున్నాడు." అని అయ్యవారు అహోబల నారసింహస్వామిని తలమకొనుచు శ్రీ వేంకటేశ్వర స్వామికిని ఆ దేవునకును భేదము లేదని చెప్పు కొనుచున్నారు.

**రాగ లక్షణము :**

మాళవశ్రీ ఇప్పటి వాడుక ప్రకారము 22వ మేళమగు ఖరహర ప్రియ జన్యము. ప్రాచీన రాగము ఇందు ముద్దుస్వామి దీక్షితులవారు, త్యాగరాజ స్వామివారు చేసిన రచనలు ఒకటి రెండు కానవచ్చు చున్నవి. దీక్షితుల వారి రచనయందు గల రాగస్వరూపము నిశ్చితమై మనోజ్ఞముగా కనబడుచున్నది. దీనిని ఆధారముగా నుంచుకొని తాళ్ళపాక వారి రచనల నూహించుటకు ప్రయత్నము జరిగినది. ఇంత మనోజ్ఞమగు రాగమునందు ఇతరులెవ్వరును రచన లేల చెప్పలేదు? లేక చెప్పినను లభింపకుండుట ఆశ్చర్యమే !

ఆరోహణ : స గ గ మ ప ని ని స

ఆవరోహణ : ని ని ద ప మ ప ని ద మ మ గ స

ఐనను ఈ రాగమును మధ్యస్థాయి గాంధారము, తారస్థాయి పంచమము వరకు పాడుట పద్ధతి యని తోచు చున్నది. అనగా దీనిని కురంజి, పున్నాగ వరాళి మొదలగు రాగములవలె మధ్యమ శ్రుతియందు పాడుకొన వలసి యుండును.

**మాళవశ్రీ (సాళంగ నాట) — ఆది**

నమామ్యహం మానవ సింహం
ప్రమదాంక మహోబల నరసింహం ! ॥పల్లవి॥

దానవ దైత్య విదారణ సింహం
నానాయుధ కర నరసింహం
భూ నభోంత రాపూరిత సింహం
ఆనన వహ్ని లయాంతక సింహం ! ॥నమా॥

ప్రళయ నృసింహాం బహుముఖ సింహాం
సలలిత గరుడాచల సింహాం
కులిశ నఖర ముఖ ఘోషిత సింహాం
తిలకిత బహుగవి దీపిత సింహాం ! ॥నమా॥

శాంత నృసింహాం శౌర్య నృసింహాం
సంతత కరుణా జయ సింహాం
కాంత శ్రీ వేంకట గిరి సింహాం
చింతిత ఘన సంసిద్ధి నృసింహాం! ॥నమా॥

అ : 2–166

ప. స గా మ పా - - | మ గ స స | ని ధ ని ప ||
న మా మ్యా హాం - - | మా - న వ | సిం - హాం - ||

మ మ పా ని ధ నీ | స స గ గ | మ మ పా ||
ప్ర మ దాం క మ హో | బ ల న ర | సిం - హాం || ||నమా||

చ. స గ గ గ మ ప ప ప | మ గ మ గ | స ని ధా ||
దా - న వ దై - త్య వి | దా - ర ణ | సిం - హాం ||

ని ధ ని ప ధ మ ప ప | ప ని ధ ని | సా - - ||
నా - నా - యు ధ క ర | న ర సిం - | హాం - - ||

ని స స స గ గ గ మ | మ ప ప గ | మా పా ||
భూ - న భోం - త రా - | పూ - రి త | సిం హాం ||

పా మ గ మా గ స | గా స ని | ధ ని పా ||
ఆ న న వ హ్ని ల | యాం త క | సిం - హాం || ||నమా||

**అవతారిక :**

ఈ కీర్తనమునందు "ఇందీవరదళ శ్యాముడును, సీతా వల్లభుడును, కౌసల్యా సుపుత్రుడును, జగదేకవీరుడును, భీతమౌని జనరక్షకుడును, విభీషణ పాలకుడును, అగు శ్రీరామ చంద్రుడే కలియుగమున వేంకటగిరియందు శ్రీ వేంకటేశ్వరుడై వెలసియున్నాడు. సద్భక్తులైన వారందరును యీతని భజింపరండు'' అని అయ్యవారు బోధించుచున్నారు.

**రాగ లక్షణము :**

మణిరంగు యిప్పటి వాడుక ప్రకారము 22వ మేళమగు ఖరహరప్రియజన్యము.

ఆరోహణ : స రి మ ప ని స

అవరోహణ : స ని ప మ గ రి స

ఇందు త్యాగరాజస్వామి, దీక్షితులవారు, భద్రాచల రామదాసులవారు రచించినవి మాత్రము మూడు రచనలు కనబడుచున్నవి. మనోజ్ఞమైన స్వర సందర్భములుగల యీ రాగమునందు ఇతర వాగ్గేయకారులేల రచనలు చేయలేదో తెలియకున్నది. అన్నమయ్యవారి యీ రచన ఎంతో ఒప్పియుండుటవలన 25 సంవత్సరముల క్రిందట యీ రాగమున దీనిని స్వరపరచుట జరిగినది.

**మణిరంగు (బౌళి) – చాపు**

రామ మిందీవర శ్యామం పరాత్పర
ధామం సుర సార్వభౌమం భజే ! ॥పల్లవి॥

సీతావనితా సమేతం
పీత (స్ఫీత) వానర బలవ్రాతం
పూత కౌసల్యా సంజాతం
వీత భీత మౌని విద్యోతం ! ॥రామ॥

వీరం రణరంగ ధీరం
సారకులోద్ధారం
క్రూర దానవ సంహారం
శూరాధారాచార సుగుణోద్ధారం ! ॥రామ॥

పావనం భక్త సేవనం
దైవిక విహాగపధావనం
రావణానుజ సంజీవనం
(శ్రీ) వేంకట పరిచిత భావనం ! ॥రామ॥

అ : 11(1)–157

ప. రి ప మ | గ రి గ స || రి సా | ని ధ నీ || ని సా | రి మ గ రి ||
రా - మ | మిం - దీ - || వ ర | శ్యా - మం || ప రా | త్ప ర ధా - ||

గ పా | - - రి మ || ప ని ప | మా గ రి || రి సా | - - - - ||
మం - | - - సు ర || సా - ర్వ | భౌ - మం || భ జే | - - - - || ||రామ||

చ. నీ ని | పా ప మ || పా ని | సా సా || నీ స | రి మ గ రి ||
సీ - | తా వ ని || తా స | మే తం || స్ఫీ త | వా - న ర ||

గ సా | రి ని సా || సా స | సా సా || నీ స | నీ పా ||
బ లం | వ్రా - తం || పూ త | కౌ శ || ల్యా సం | జా తం ||

మా ప | ప ని ప ప || మా ప | ప మ గ రి || సా - | సా - - ||
పీ త | భీ - - త || మౌ ని | వి - ద్యో - || తం - | - - - || ||రామ||

**అవతారిక :**

ఈ కీర్తనము నందు సుఖములను, సంతోషమును, శాంతిని పొందుటకు తమకు అర్హతకలదా యనునది యోచించకే జీవులుత్రిప్పట పడుచున్నారను విషయమునుచెప్పుచున్నారు. "తాను ఏకాంత సౌఖ్యములను పొందుచున్నానని భ్రమపడెడి జీవునకు ఆ సుఖములను వెన్నంటి వచ్చెడి దుఃఖముల సంగతి తెలియదు గదా! తాము జన్మ జన్మల నుండి చేయుచున్న దురితముల యొక్క ఫలములు యీ జన్మమున ననుభవించుచు ఆ యనుభవముల రాశిని పెంచుకొనుచు తిరుగుచున్న జీవులకు పుణ్యములు గలుగుట కొంత యరుదు గదా! జీవునకు నిజమగు హితవు కలిగించెడిది యగు మమకారము పరమాత్మని యందు నిలిపినదే కదా! అది లేనినాడు అర్థ విహీనమగు విరహ తాపములతో చింతనొందక తప్పదు తనకు వేడుకలు కావలెనను చింత తప్ప పరమాత్మని కృపవలన కలిగిన వాటికి సంతసించెడి తత్వమును జీవుడెరుగడు గదా! కర్మబంధ ముల నుండి విడివడి దైవకృపను సంపాదించుటకు యత్నించినచో, జన్మాంతరములనుండి వెంట దగిలి వచ్చుచున్న బంధములు తప్పదైవకృప కలుగునా? వేదనలతో వెన్నంటి యున్న కూడు గాక మానవులకు వెదకి చూచినను సుఖములున్నవా? తిరువేంకటేశ్వరుని కృపను స్థిరముగా సంపాదించుకొనక యున్నచో భవబంధములనుండి జీవులు విముక్తిని పొందలేరుకదా! ఎచ్చట వెదకినను, ఎందుచూచినను యిదియే పరమసత్యమై తోచుచున్నది" అని అయ్యవారు తిరు వేంకటనాథుని కృపా కటాక్షములకు పాత్రులు గాక మానవులు కర్మబంధముల మధ్యకొట్టు మిట్టాడు చున్నారని చింతించు చున్నారు.

అయ్యవారి కీర్తనముల యందలి సాహిత్య భావములపై మక్కువచే వానిని పాడించి వినిపింపవలెనను నుత్సాహముతో 25 ఏండ్ల క్రిందట ఈ రచనను మణిరంగు రాగమునందు స్వరపరచి పాడించుట జరిగినది.

మణిరంగు — ఝంపె

ఏది చూచిన తమకు యిన్నియును నిటువలెనె
వేదు విడిచిన కూడు వెదకినను లేదు! ॥పల్లవి॥

ఏకాంత సౌఖ్యములు ఎక్కడివి ప్రాణులకు
పై కొన్న దుఃఖముల పాలుబడి గాక
ఏకమగు పుణ్యంబు లేడగల విందరికి
గై కొన్న దురితములు కలపాటి గాక! ॥ఏది॥

హితవైన మమకార మెందుగల దిందరికి
ప్రతిలేని విరహ తాపము కొలది గాకా
మతిలోని వేడుకలు మరియేవి మనుజులకు
జితమైన దైవ మిచ్చిన పాటిగాక ! ॥పది॥

యిరవైన దైవ కృప ఏల దొరకును తమకు
పరమైన కర్మంబు పరిపాటి గాక
ఎరవైన పెను బంధమేల వీడును నాత్మ
తిరు వేంకటేశు కృప తిరమైన గాక ! ॥పది॥

ప. పా । మ గ రి ॥ స స । ని॒ ని॒ ప ॥ ని॒ స । రి మ మ ॥
ఏ । ది చూ - ॥ చి న । త మ కు ॥ యి - । న్ని యు ను ॥

గ రి । స రి మ ॥ పా । మ గ రి ॥ స రి । మా ప ॥
ని టు । వ లె నె ॥ వే । డు వి డి ॥ చి న । కూ డు ॥

ని ని । ప మ గ ॥ రీ । సా - ॥
వె ద । కి న ను ॥ లే । దు - ॥ ॥పది॥

చ. ప ప । నీ సఁ ॥ రీఁ । గఁ రిఁ సఁ ॥ ని సఁ । రిఁ గఁ రిఁ ॥
యి ర । వై న ॥ దై । వ కృ ప ॥ ఏ - । ల దొ ర ॥

సఁ సఁ । సఁ ని ని ॥ ప ని । సా సఁ ॥ ని రిఁ । సఁ ని ప ॥
కు ను । త మ కు ॥ ప ర । మై న ॥ క - । ర్మం - బు ॥

ప మ । ప ప ని ॥ సా । సా - ॥ ప మ । ప ని ని ॥
ప రి । పా - టి ॥ గా । కా - ॥ ఎ ర । వై - న ॥

ప ప । పా మ ॥ పా । ని సఁ ని ॥ ప ప । మ మ మ ॥
పె ను । బం ధ ॥ మే । ల వీ - ॥ డు ను । నా - త్మ ॥

ప ప । మా గ ॥ రి రి । స స స ॥ ని॒ స । రి మ గ ॥ రీ । సా - ॥
తి రు । వేం క ॥ టే - । శు కృ ప ॥ తి ర । మై - న ॥ గా । క - ॥ ॥పది॥

**అవతారిక :**

ఈ కీర్తనము నందు జీవులకు కలుగుచున్న బాధలు ఎట్లు కలుగుచున్నవి, ఏలకల్గుచున్నవి, వీనినుండి ముక్తిని సాధించుట యెట్లు? అను విషయములను వివరించుచున్నారు "దేహము నదుగల జీవునికి తానున్నంతకాలము దేహమునందు గలిగెడి దైన్యములు, లంపటములు, కోపతాపములతో కూడిన చిత్తపు కారములు, హెచ్చు తగ్గులతో కూడిన దురవస్థలు ఆశలతో కూడిన దాహములు దేహమును అంటి పెట్టుకొని యున్నంతవరకు తప్పవు. చూపుల వలన గలుగు ఆకర్షణలు. వానిని పొందుటకై పడియెడి ఆరాటములు, అనుభవములకై ఆశించుచు చేసెడి తగవులు, నగవులు వానిని పొందిన వెనుక కలిగెడి సుఖములు చంచలములగు నవి తొలగిన వెనుక పొందెడి దుఃఖములు, అందలివే యగు పొలయలుకలు, చెలుములు, యెడబాట్లు, చనవులు తమ తమ ఘనతలు మొదలగున వన్నియు జీవునకు తప్పించు కొనరాని వలయములు. ప్రాణులు తమ బలమును, జ్ఞానమును. భావ పరంపరలను, తాము తెలిసికొనుటలు, దైవ శిఖామణి యగు తిరు వేంకటేశ్వరుని కృపయని తలంచి ఆతనికి సర్వస్వము నర్పించెడి యనుభవము నందు తలపు లగ్నము చేసి కడకు తానే యాతడుగా నగు వరకు తప్పవు మనసు వికారములు ప్రాణులకు తప్పదు కొంత దైవ కృతము, కొంత కర్మవశమునై త్రిప్పటలు పడుచుందురు జీవులు" అని అయ్యవారు నిశ్చలమైన మనసుతో సర్వోన్నతుడగు తిరు వేంకటనాధుని యందు లీనమగుటకు ప్రయత్నించెడి వారికి కలిగెడి మానసిక చాంచల్యములను ఇందు చిన్న చిన్న మాటలతో వివరించుచు శ్రీ వేంకటనాధునికి నివేదించు చున్నారు.

### మణిరంగు (కన్నడ గౌళ) — రూపకం

తన కర్మవశం బించుక దైవకృతం బొక యించుక
మనసు వికారం బించుక మానదు ప్రాణులకు ! ॥పల్లవి॥

ఈ దైన్యము లీ హైన్యము లీ చిత్తవికారంబులు
ఈ దురవస్థలు గతులును నీలంపటములును
ఈ దాహము లీ దేహము లీ యను బంధంబులు మఱి
ఈ దేహము గల కాలము నెడయవు ప్రాణులకు ! ॥తన॥

ఈ చూపులు నీ తీపులు నీ నగవులు నీ తగవులు
నీ చొక్కులు నీ పొక్కులు నీ వెడయలుకలును
ఈ చెలుములు నీ బలువులు నీ చనవులు నీ ఘనతలు
నీ చిత్తము గలకాలము నెడయవు ప్రాణులకు ! ॥తన॥

ఈ వెఱవులు నీ యెఱుకలు నీ తలపులు నీ తెలువులు
దైవ శిఖామణి తిరుమల దేవుని మన్ననలు
దైవికమున కిటువగవక తనతల పగ్గలమైనను
దైవము తానౌ తానే దైవంబవు గాన! ॥తన॥

అ : 5–65

ప. రి మ పా ప మ ॥ గ రి రి స ని స ॥ ని ధ ని ని సా ॥
త న క ర్మ వ ॥ శం - బిం - చు క ॥ దై - వ కృ తం ॥

రి రి గ రి స స ॥ రి మ ప ప నీ ॥ ని ప నీ స స ॥
లో క యిం - చు క ॥ మ న సు వి కా ॥ రం - బిం చు క ॥

స ని ప మ గ రి ॥ స ని సా - - ॥
మా - న దు ప్రా - ॥ ణు ల కు - - ॥ ॥తన॥

చ. స్నీ సా రి రి ॥ మా గ రి రి రి ॥ మా పా ప ప ॥
యీ దై న్య ము ॥ లీ హై - న్య ము ॥ లీ చి త్త వి ॥

నీ పా ప ప ॥ మా ప ప ని ప ॥ ని ని స స ని ని ॥
కా రం బు లు ॥ యీ దు ర వ - ॥ స్థ లు గ తు లు ను ॥

నీ సా రీ రీ ॥ గ రీ సా - - ॥ నీ సా గ రీ ॥ రీ స ని ని సా ॥
నీ లం ప ట ॥ ము లు ను - - ॥ యీ దా హా ము ॥ లీ - దే హా ము ॥

రీ స ని ని సా ॥ నీ ప ప ని ని ॥ సా స ని సా ॥
లీ - య ను బం ॥ ధం బు లు మ టి ॥ య న్ని యు ను ॥

ప ని సా స స ॥ ని ని స ని ప ప ॥ ప మ ప ని ప మ ॥ గ రి సా - - ॥
యీ - దే హ ము ॥ గ ల కా - ల ము ॥ నె డ య వు ప్రా - ॥ ణు ల కు - - ॥
॥తన॥

**అవతారిక :**

ఈ కీర్తనము నందు అహోబల క్షేత్రమున వెలసిన ప్రహ్లాద వరదుడగు శ్రీ నారసింహుని పరాక్రమాది గుణములను వర్ణించుచు "శాంతమూర్తివగు, ఓ నరసింహా ! నీవే వెంకటాద్రి యందు సర్వాభరణ భూషితుడవును, సకల కల్యాణ గుణసంపన్నుడవును, కరుణానిధివియును యగుచు వేంకటనాథుడువై వెలసి యున్నావు." అని అయ్యవారు కొనియాడుచున్నారు.

**రాగ లక్షణము :**

బాగేశ్వరి ఉత్తర భారతము నందు ప్రచారమున నున్నది. శ్రీరంజని యను రాగము నకు ప్రతిరూపము. కర్నాటక సంగీతము నందలి శ్రీరంజని యందు 'స రి గ మ ద ని స, స ని ద మ గ రి స' అనునవి ఆరోహణా వరోహణములు. ఇది 22వ మేళమగు ఖరహర ప్రియ జన్యము. బాగేశ్వరి యను ఉత్తరాది రాగమున 'స మ గ మ ద ని స। స ని ద మ గ రి స' అనునవి ఆరోహణా వరోహణములు కలిగి 22వ మేళమగు ఖరహార ప్రియ స్వరముతే కలిగి యున్నది. కాని యిందు 'ద ప ద ని' అను సందర్భమున కించిత్ పంచమమును స్పృశించుట కలదు. ఈ రచనయందు మాత్రము ఆ ప్రయోగమును తీసికొనలేదు.

నరసింహ దేవునిపై పాటలు అతి తక్కువ. అందునను దేవభాషయగు సంస్కృతమున మరియు నరుదు. కనుక సంస్కృతభాష తెలిసిన వారందరును పాడుకొనుటకు అనువుగా 25 సంవత్సరముల క్రిందట దీనిని బాగేశ్వరిలో స్వరపరచుట జరిగినది.

**బాగేశ్వరి (శంకరాభరణం) – ఝంపె**

నమిత దేవం భజే నారసింహం
సుముఖ కరుణేక్షణం సులభ నరసింహం !

విజయ నరసింహం వీర నరసింహం
భుజబల పరాక్రమ స్ఫుట నరసింహం
రజని చర విదళన విరాజిత నృసింహం
సుజన రక్షక మహోశూర నరసింహం ! ॥నమిత॥

దారుణ నృసింహం ప్రతాప నరసింహం
చారు కల్యాణ నిశ్చల నృసింహం
ధీర చిత్తా వాస దివ్య నరసింహం
సార యోగానంద చతుర నరసింహం ! ॥నమిత॥

విమల నరసింహం విక్రమ నృసింహం
కమనియ్య గుణ గణాకర నృసింహం
అమిత సుశ్రీ వెంకటాద్రి నరసింహం
రమణియ్య భూషాభిరామ నరసింహం ! ॥నమిత॥

అ : 9-225

ప. మ ద ని సా । నీ ద మా ॥ గ రి స గ రి । మా - - - ॥
న మి త దే । వం భ జె ॥ నా - ర సిం - । హం - - - ॥

ని ద మ ద ని । సా ని సా ॥ రి గ మ గ రి । స ని సా ॥
సు ము ఖ క రు । ణే క్ష ణం ॥ సు ల భ న ర । సిం - హం ॥ ॥నమిత॥

చ. ని స రి గ రి । మా గ రి గ ॥ మ ద ని స స । ని ద మ గ రి ॥
వి మ ల న ర । సిం హం - - ॥ వి - క్ర మ నృ । సిం - హం - - ॥

స ని ద ని ద । మా గ రి ॥ ని స రి గ రి । మా - - - ॥
క మ నీ - య । గుణగణా ॥ క ర నృ సిం - । హం - - - ॥

మ ద ని స స । రి గ రి ని స ॥ నీ ద మ ద । ని ద సా - ॥
అ మి త సు - । శ్రీ - వేం - క ॥ టా ద్రి న ర । సిం - హం - ॥

స మ గ గ రి । ని స ని ని ద ॥ మ ని ద ద మ । - గ రి సా - ॥
ర మ ణీ - య్య । భూ - షా - భి ॥ రా - మ న ర । - సిం - హం - ॥నమిత॥

